# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించుపుణ్యపురుషులు.

### కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, వి. పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.

,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. ఎల్.

,, కొత్తూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. ఎల్.

,, బి. పి. దేవరాజులునాయుడుగారు, బి. ఏ., బి. ఎల్.

,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.

,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, కస్తూరి సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.

,, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.

,, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు.

కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.

,, సుంకేసుల సుబ్బయ్యగారు.

,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.

,, కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు.

,, మ ముకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.

మ. రా. శ్రీ. మాలేపాటి చిన్న వెంగన్న శ్రేష్ఠిగారు.

,, అన్నలూరు శేషగిరిరావుగారు.

,, బి. శేషగిరిరావుగారు.

,, శ్రీకంఠము నరసింహరావుగారు.

,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్. టి.

,, పి. వీరభద్రరావుగారు.

,, పుష్పాల వేంకటస్వామినాయుడుగారు.

,, శాస్త్రపాటి చలపతిరావుగారు

,, బొందలకుంట వేంకటనారాయణరావుగారు

,, సకలా ంకటసుబ య్యగా

,, చిల్లా వేంకటకొండయ్యగారు

,, వీరబోయిన కొండయ్యగారు

,, బచ్చు వేంకటసుబ్బయ శ్రేష్ఠిగారు

,, పప్పు సీతారామయ్యగారు, ఎమ్. ఏ.

,, యాదాటి వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు

,, సగరం గురురావుగారు, బి. ఏ.

,, గడియారము కృష్ణస్వామయ్యగారు

,, గజరాంపల్లి రామచంద్రరావుగారు

,, గంగవరము వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారిపల్లె

,, మాకము జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట

,, మద్దిరాల చెంచయ్యశ్రేష్ఠిగారు, నందిమండలము

,, రంగారెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్., డి ట్రిక్టుబోర్డు
ప్రెసిడెంటు.

ఉప్పుల టసుబ్బమ్మగారు

## కా మ లా పు ర ము.

మ. రా. శ్రీ. బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు
,, జి. సుబ్బరావుగారు
,, రాణువ ఫణిరావుగారు
,, హనుమగుత్తి చెంచిరెడ్డిగారు, గ్రామమునిసీఫ్, హనుమగుత్తి

## వ ల్లూ రు.

,, సముద్రాల రామస్వామిగారు
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు
,, తంగటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు [శ్రేష్ఠిగారు
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుఁడు సుబ్బయ్య
,, పోలేపల్లి వెంగన్న శ్రేష్ఠిగారు, ఆరణిపోలేపల్లి సుబ్బయ్య"
శ్రేష్ఠిగారు

## ఎ ట్టి గు ంట్ల.

,, ఎట్టిగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము
,, ఎట్టిగుంట్ల వేంకటసుబ్బయ్యగారు
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సూరయ్యగారు
,, పేర్ల నాగిరెడ్డిగారు
,, ఏ. శ్రీనివాసులు నాయుండుగారు
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిడుజువ్వి

## పు లి వెం ద ల.

,, మద్దాల బోగాది గారు, వేములకొత్తపల్లి [పల్లి
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రే గారు, వేం
,, పుల్లసూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి

మ. రా శ్రీ, కావటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు
,, లింగిరెడ్డి గంగిరెడ్డిగారు, ఎద్దులాయగారికొత్తపల్లె
,, వడ్లగుంట అశ్వత్థమయ్యగారు, వేంపల్లి
,, వద్దిరెడ్డి కొండారెడ్డిగారు, లింగాల [గారు, చాగలేరు
,, ఘంటసాల చిన్నసుబ్బయ్యకుమారుఁడు వేంకటసుబ్బయ్య
,, సోముధర్మారెడ్డిగారు, పాపాయపల్లె, జమ్ములమడుగు తాలూకా

## ప్రొద్దుటూరు.

,, కొప్పరవు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు
,, నారాయణము సుబ్బరామయ్యశ్రే గారు
,, సి. నరసరామశాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు
,, రావులూరు సుబ్బరావుగారు, డిప్టీనాజరు
,, ఉప్పలూరు భద్రయ్యగారు
,, డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు
,, ఆర్ గోవిందరావుగారు బి. ఏ., తహసీల్‌దారు
,, సి. యన్. కృష్ణమాచార్యులుగారు

## రాజంపేట.

,, ఆర్కాటు పరశురామరావుగారు, యమ్. యల్. సి. సెంధ
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయ్యరాజుపేట[లూరు
,, పిడతల చిన్నవేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, టంగుటూరు
,, మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె
విచూరు. చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము
పుట్టా నాగసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చి వేలు

మ. రా. శ్రీ. గాలా వేంకటరెడ్డిగారు పాటూరు గ్రామమునిసిపు.
,, జి. సుందరరావుగారు, బి. ఏ., ప్లీడరు.

సిద్ధవటము.

చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి గ్రామమునిసిఫ్
,, గోపవరము గోపాలరెడ్డిగారు, గోపవరము గ్రామమునిసిఫ్
,, యాదాళ్ల వేంకటరామయ్య శ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లి

రాయచోటి.

,, కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.
,, రేవులూరు సిద్ధయ్యశ్రేష్ఠిగారు, కస్తూరివారిపల్లె
,, చిన్నబయ్యన్న గారిలక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె
,, కర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివేడు
,, పుల్లకూర బాలసుబ్బయ్యదత్తుకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

అనంతపురము మండలము, హిందూపురము.

,, కరణము కృష్ణరావుగారు, బేవినహళ్లి.
,, శ్రీరాములిమ్మయ్యశ్రేష్ఠిగారు, ,,
,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు, నక్కలహళ్లి
,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె
,, ఈడిగి అంజినప్పగారు, బేవినహళ్లి
,, బి. నారాయణరావుగారు, బ్యాడిగెర, మడకశిర తాలూకా.
,, దొంతి భీమయ్యగారు, హిందూపురము
,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు

మ. రా. శ్రీ. మాకము సీనయ్యాగారి నారాయణయ్య శ్రేష్ఠిగారు

" నేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు

" గోరంట్ల వెంకటేశయ్యశ్రేష్ఠిగారు

" ఆర్. వెంకటేశయ్యశ్రేష్ఠిగారు

" పొచ్చిశెట్టి ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు

" కట్టా శ్రీనివాసయ్యశ్రేష్ఠిగారు

## అనంతపురము.

" వెలమకూరు ఆత్మారామప్పగారు, పినాకినీముద్రాక్షరశాలాధికారులు

" హట్టి శివరావుగారు, ప్లీడరు

" పులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు.

" జి. భద్రయ్యశ్రేష్ఠిగారు

" జి. రామయ్యశ్రేష్ఠిగారు

" బి. వేంకటప్పగారు

" ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిఫ్

" వి. ఓబుశేశప్పగారు

" కొమారుపల్లె వేంకటరావుగారు, అనుంపల్లె

" రాచర్ల తిప్పయ్యగారు, బెళుగుప్ప

" రాధాకృ యొగారు "

" జి. రామేశ్వరరావుగారు, బి.ఏ., బి.ఎల్., అడ్వకేటు.

" టి. చెంగల్వారాయ గారు, ప్లీడరు.

కంబదూరు రామదాసరావుగారు,బి.ఏ.,బి.ఎల్.,అడ్వకేటు.

మాపెంపల్లె నారాయణరావుగారు, బి.ఏ., బి.ఎల్.

సమల శ్రీనివాసులుగారు, బి.ఏ., ప్లీడరు.

మ. రా. శ్రీ. హారేసముద్రము శేషగిరిరావుగారు, ప్లీడరు.

,, అంగదమాల్లి కృష్ణమూర్తిరావుగారు [తాలూకా

,, నాగరాజుఅశ్వత్థమయ్యగారు, రామలింగాయపల్లె, తాడిపత్రి

,, ఆళ్లగడ్డ రామచంద్రప్పశ్రేష్ఠిగారు

గుత్తి.

,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్.

,, వై. శేషప్పగారు, ప్లీడరు.

,, వై. కొండలరావుగారు

,, సి. సుందరరామయ్యగారు, మునిసిపుకోర్టు

,, ఆర్కాటు గుండురావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు.

,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., ప్లీడరు.

,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల

,, జంబులపాడు పెద్దవెంకటప్పగారు, ధర్మపురి

,, కాన్గోవి, కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్స్పెక్టరు
(ఇప్పటినివాసము అవుకు.)

,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు

బళ్లారి మండలము.

,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘకార్యదర్శులు.

,, రావుసాహేబు, జే. పాపయ్యశ్రేష్ఠిగారు

,, అయ్యగారిబుస్సెట్టిగారు

,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని.

కందనూలు మండలము.

,, ఖాదర్ బాదర్ అంబాజీరావుగారు, నంద్యాల.

మ. రా. శ్రీ. అవధానము వేంకటనరసయ్యగారు, ఉయ్యాలవాడ
,, గాడిచెర్ల వెంకోబరావుగారు, అవుకు

## గుంటూరు మండలము.

,, అక్కెన ప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి.ఏ., బి.ఇ.,
డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీయర్ గారు
,, మారుటూరు పుండరీకాక్షుడుగారు, పట్టిచెరుకూరు

## కృష్ణామండలము.

,, నందూరు వీరభద్రరాయశర్మగారు, నూజివీడు
,, గానుగపెంట హరినారాయణరావుగారు, మాజేరు
,, పోలవరపు శోభనాద్రిగారు, చోరగుడి [గన్నవరము
,, కందిమళ్ళ సీతారామరావు బహద్దర్ జమీందారుగారు,
,, చోరగుడి చిన్న వెంకటప్పయ్యగారు, గన్నవరము
,, సుంకర వెంకటరత్నముగారు, నూజివీడు
,, గానుగపాటి వేంకటరామయ్యగారు, నాగవరంపాడు
,, చిల్లరిగె వేంకటరమణయ్యగారు, అంగలూరు.
,, గోళ్ల గెరటాలుగారు, నూజివీడు

## గోదావరిమండలము.

పి. యం. శ్రీనివాసయ్యంగారు, బి. ఏ, ఎమ్. ఎల్.,
డిస్ట్రిక్టు మునిసిపు, కాకినాడ.
,, కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము
శ్రీ రాజామంత్రిప్రగడ భుజంగరావుబహద్దర్ జమీందారు
గారు, ఏలూరు.
బోడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు
,, గిరిగె మాణిక్యముగారు

మ. రా. శ్రీ. ఏ. యస్. స్వామిగారు

,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కరణము పెద్దపట్ట

,, పెద్దిరెడ్డి రామరావుగారు, కైకవరము [ణము

విశాఖపట్టణమండలము.

,, మాడుగుల వేంకటఅప్పారావుగారు జమీందారులు.

బొంతలకోడూరు

గంజాంమండలము.

,, పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము

నెల్లూరుమండలము.

,, వెలంపల్లి రామకృష్ణమ్మగారు, నెల్లూరు

,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యగారు

,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహస్వామిశ్రేష్ఠిగారు

,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు

,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె

,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కల్లూరు

,, పువ్వాడ సుబ్బరాయశ్రేష్ఠిగారు, పెన్నబద్వేలు

,, అన్నలూరు చిన్నచెన్నప్పనాయుండుగారు, ఎనమదలగ్రామ

మునిసిపు, తూర్పుకంభంపాడు

,, గట్టుపల్లి రామబ్రహ్మముగారు, వేంకటగిరి

చెన్నపురము.

,, వి. యస్. నరసింహాచార్యులుగారు, బి. ఏ, బి ఏల్,

,, కట్టా జోగయ్యగారు

,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీథి

## చిత్తూరుజిల్లా.

మ. రా. శ్రీ. జే. కృష్ణరావుపంతులుగారు, బి. ఏ., అడ్వకేట్, చిత్తూరు.

,, పి. వి. చెన్నరాయశ్రేష్ఠిగారు, వాయిల్ పాడు

,, అయ్యాదొర నాయుడుగారు, పుత్తూరు.

## నైజాము - కమ్మంమెట్టు.

,, జములాపురపు వేంకటేశ్వరరావుగారు, వకీలు.

# విషయసూచిక.

విషయము. | పుట.

OUM

# REVIEW ON

# SREE R S VA A I

OF

## Brahmasree J. SESHADRI SARMA GARU

BY

VIDVAN G. SOMANNA, M. A., L. T.,

The voluminous work of twelve volumes entitled SREE KRISHNAVATARATATVAMU is the result of over four years of close labour of the erudite scholar and earnest devotee, Brahmasree Janamanchi Seshadri Sarma Garu, who is well known to the Telugu literary world through his many previous productions such as the Brahmanda Puranam, Sree Valmiki Ramayanam and Halasya Mahatmyam.

This latest gift of his to the Telugu Literature furnishes in elaborate detail the history and teachings of SREE Krishna and forms more or less a compilation of the various authorities on these subjects, deriving, as it does, its contents from all available classics such as the Bhagavatam, Mahabharata, Harivamsa, Brahmapuranam, Brahma Vaivartam and Sree Krishna Janma Khandam. The thesis throughout abounds in explanations, elucidations and inferences, which it is that gives an individuality to the work. The author may be inclined to treat this work of his as his *magnum opus* in consideration of its

qualitative and quantitative merits. The other works of the author which are mostly translations do not disclose his views on the abiding interests of man. The present book—*Sree* Krishnavatara Tatvam—reveals in the most vividmanner the author's views on religion,philosophy and conduct of life—views which,though purely orthodox and hereditary, are attempted to be established by argume t. The assertions made in the course of exposition of his theme are based on faith and faith alone and doubt and sbelief are not allowed to mar the effect of the implicit th which inspires them.

There is no attempt to convince or convert the sceptic or the agnostic and it is only to the man of faith—of orthodox faith—that the appeal is constantly made. the beliefs expressed in this long discourse cannot therefore meet with universal acceptance. They will commend emselves only to those who are in agreement with him the ndamentals. The premises being decided e conclusions that follow will be easily grasped. uthor expresses himself with remarkable lucidi rvour o the different aspects of human exist wn and its destiny, its plan and its purpose s and means. These ws of his are in co nce the te s underlying the Sanathana a of the d.

his great work egins with a full account of e ances hat necessitated the Incarnation of Vish u shna. It then proceeds to depict in full detail aining and instructive history of this majestic ne birth and boyhood of Sree Krishna, his

campaigns against the evil forces that threatened his life, his consolidation of the Yadava Empire, his love affairs and family life and his services to the Pandavas are the main topics with which the first ten volumes of the work deal. The eleventh volume is the consummation and the crown of the whole scheme. It is in this that the Bhagavad-Gita is expounded and elucidated. It is here that the philosophy of life is set forth vividly and effectively.

The author is a votary of Bhakti and Gnana, faith and knowledge, and expatiates on the necessity of these for the uplift of the soul. He is thus meeting the point of Advaita and Visisht ādvaita advocated by Sankara and Ramanuja respectively. He emphasises the combination of these means, Bhakti and Gnana, as the way to emancipation.

With this brief sketch of the scope of this great work, we shall now proceed to consider its value intrinsically and relatively. Taking his stand on the Srutis, Smritis and the Puranas and trying to reconcile the differences presented by these, the learned author nowhere questions the veracity of these texts and nowhere impugns them. The boyish exuberance and the youthful extravagance of the hero are invested with a significance and solemnity worthy of his divine nature. Nothing trivial, nothing unrighteous is discernable in the character of this mighty protagonist of the age. The supernatural achievements in the life-drama of this phenomenal being are pronounced to be occurrences of undoubted possibility. To them that, like the author, believe in the authority of

the traditional lore, these assertions bring added strength and faith. Those who do not grant divine authority to the Veda and its consequent literature will find it difficult to subscribe to the conclusions of the author.

As the subject of this devotional work is the spiritual concern of man, it cannot fail to be of interest to every student of philosophy and religion. The Vedantha p i-losophy of which the Bhagavata—reputed to have been pired by Sree Krishna directly—is a systematic exposi- is derived from the Upanishads which are the fruition and perfection of the Vedas. This system of philosophy is therefore coeval with this lore. It was brought into prominence from time to time by thinkers like Gaudapada, Sankara and Vidyaranya. The Upanishads and the spiri- al teaching these afford are not the creation of any body self-existent.

.e term Upanishad means going near. This means advance of the heart to God. The subject of this spiritual lore which forms the glory of this ancient coun ae entire spiritual concern of man, his origin an and his conduct.

The fundamental teaching of the Upanis s the Immortality of the soul and kinship with the upreme ul. As the embodied so is not different in quality m the universal soul, it is ever pure and perfect. The joys and sorrows, the feelings and posings experienced during life are but the result— ephe ral result—of the soul's association with matter. ces which e really of the mind have no oul. The ence of the soul is bliss and

knowledge and eternity. It is un-affected, being divine, by the affection of the mind. The Advaita school of Philosophy looks upon all phenomena as unreal, the soul alone being eternal and infinite. The Dwaita philosophy believes in the double reality, namely, the reality of the soul and the reality of the phenomena which are its manifestations. The school of Visishta Advaita stands between these two.

In the definition of Mukti also these schools show differences. The Advaita Moksha for which Gnana is the means is the realization of the universality of the soul bereft of the illusion of phenomena through Maya. The Visishta Advaita's Moksha is dwelling in the Vishnu Loka which is possible only through Bhakti. The Dwaita Moksha is the perfection of each soul in its line. In this last system of philosophy the souls are considered to be intrinsically different from each other—different in sex, in tendencies and in behaviour while the other two systems are marked by a unitary conception of the soul.

THE BHAGAVADGEETHA:—

It is claimed that the Bhagavadgeetha is the best spiritual guide and that its teachings should meet with Universal acceptance. This Bhagavadgeetha—the song celestial—is fully dealt with in the eleventh volume of the series. It forms the climax of the great subject and naturally comes last. The Bhagavadgeetha is set in the Bhishma Parva of the Mahabharata of Veda Vyasa. Though the composition of the Bhagavadgeetha, which is in a metrical form, is due to Veda Vyasa, yet the inspirer of the work is believed to be Sree Krishna Himself.

Veda Vyasa did no more than string into verses the discourse which had taken place between Sree Krishna and Arjuna on the battlefield just before the great war. Th. sight of thousands of warriors-among whom were kinsmen and friends—assembled to fight and kill one another for the all too trivial and evanescent pleasure of a kingdom, unnerved and upset Arjuna and he, turning to Sree Krishna who condescended to be his charioteer in the colossal war, bade him retire from the battlefield. Then ..sued an enquiry and disquisition about the eternal ..s. The conversation that had taken place between Sree Kri na and Arjuna was being almost simultaneously reported to Dhrutarashtra, the blind father of the king Duryodhana. Veda Vyasa subsequently versified the dialogue to suit the requirements of the epic. Thus the substance of the Geeta was that of Sree Krishna while ..orm was due to Veda Vyasa. This is the orthodox ..s composition. It is believed by some critics ..hagavadgeetha has no organic connection with ..ahabharata but it is interpolated into the great epic ..urpose of effect. The back-ground thus afforded ..ilosophical scripture lends to it a charm and a ..e s.. not obainable otherwise; and the popular mind more easily instructed by this means than by any ..stract and impersonal presentation of the subject. The ..nous philosophica.. drama called the Prabodha Chandrod..yam, Bunyan's ..grim's Progress, Goethe's Fau.. ..ante' Divine Comedy suggest to us that ..e ..form of presenting great truths is more effective ..orms.

..e ..hagavadgitha is a book for all ages and for

countries. Its teaching is in essence the teaching of the Upanishads. It is happily spoken of as the milk from the kine which are the Upanishads, Sree Krishna milking them, for Arjuna at the first instance and for all thoughtful beings. The glorious philosophical drama Prabodha Chandrodaya depicts Geetha as the daughter of the Upanishads. The Geeta is held in veneration by the Hindus of all the sects. The three prominent schools of Indian Philosophy, Advaita,Visishta Adwaita and Dwaita are based on its teachings.

The immortality of the soul and the omniscience, omnipresence and omnipotence of God and the inviolability of the Law of Karma, a purgatory scheme and the final bliss of the soul, are the more important tenets of the faiths that are inspired by the Geeta. In the understanding of the nature of the final bliss, differences arise and certain portions of the texts are differently interpreted by different schools. But in mapping out the conduct of life there is practically no disagreement.

The beginnings of the Philosophical thoughts in India are discernable in the Veda, the earliest literature of the world. There are unmistakable texts in the Veda that present a synthetic and a universal conception of Godhead. The extensions of the Veda—which are the Upanishads—concern themselves with the consideration of Brahma, the soul, and lay stress on the ineffectiveness of rituals and the erroneousness of a broken conception of the pervading unity.

The Purva Mimamsa school of thought—represented by Kinnarila--is founded on the Veda without reference to the

Upanishads. Its creed is that the Vedic ritual affords the highest bliss at the proper time. The ritual produces an immediate effect called Apurva which is lodged in the individual and in due course works out his bliss. The happy state that accrues from the Vedic ritual through the operation of Apurva and Samskara which are predispositions is held to be not eternal. This bliss terminates when the merit of the ritual that has gained it spends itself. The Vedantin now steps forward to denounce the r ual unattended by knowledge of Brahma. The Upanishads are his guide and his authority. The Upanishads treat the rituals as purificatory at their best but deny them the power of saving, *i. e.* conferring salvation or Moksha. Bhakti and Gnana are laid down as the only two means for this supreme end. It is nothing strange that the orthodox Hindus revere the Bhaghavadgeeta as their spiri ual guide. What is the most remarkable thing bout this great work is its teaching of a universal character. This work enunciates the spiritual problems mankind and offers solutions. It regulates the conduct e. Such a comprehensive, complete and convincing m ot philosophical doctrine is not to be found in any other single book of this country or any other country. It is here that the superiority of the Bhagavadgeeta lies. The one hundred and eight Upanishads which are its source are inspirational rhapsodies. The heart is uplift d ese. But t e unitary point of view presented rhapsodies is not discernable on the surface. This s for the easy popularity of the well-arranged and Bhagavadgeeta and the reservation of the scholars. ddh m, which is religion

of revolt against the ritual Hinduism in vogue at the time of its birth, takes no cognizance of the soul. It throws no light on the two essential problems, the origin and the destiny of man. Christianity and Muhammadanism state that the sinner is sènt to reside eternally in hell. These have not considered the problem of initial inequalities in the stations of created beings. The later-day Brahma Samaj which takes its cue from Christianity has formed no ideas about the origin and destiny of the soul. Where am I come from? What of me will survive my death.? Why are some people born to be good and great and some born to inherit disease, poverty and distress? Is the sinner given a chance after his death to wash off his sins and become worthy of ever-lasting bliss? Or is the sinner to be doomed to eternal perdition? What is the necessity for prayer? Is it possible to think of God except through his creation? Such questions which are of immediate consequence to the inquirer are raised by no other religions than Hinduism. The great Italian poet Dante saw the grave defect of Christianity in this respect and wrote his famous Divine Comedy introducing a purgatory in it and by its means ensuring final bliss to every soul.

Hinduism raises these questions and offers soluttions. The souls emanate from the universal soul and are godly in their nature. The worldly affections are of the mind and of the intellect.. There is no doom like eternal damnation. The Advaita philosophy denies reality to the phenomenal world. The great German philosopher KANT declared that the world is constructed by the self and put the Self at the centre of the problems of philosophy. This is an echo of the doctrine of the

Universality of the soul of the great philosopher Sankara. Sree Krishna being the accredited inspirer of this great work—Bhagavadgeetha, which enunciates a philosophy worthy of Universal acceptance—is himself of Universal interest. The Orthodox conceptions of his divine nature cannot meet with universal acceptance, but the philosophy associated with his name is bound to be accepted and adopted by humanity, as un-prejudiced reason progresses in this world. It will be affirmed and re-affirmed that there is no other spiritual work which can guide mankind so well and so completely as the Bhagavadgeetha.

Brahmasri Kavya - Smruty - Thirtha Janamanchi Seshadri Sarma Garu who is the repository of all ancient learning has bestowed a benefaction on the Telugu world by compiling, explaining, expounding the life-story of this godly hero whose name is an inspiration and a charm, even to-day, to hundreds of millions of man-kind. The ..her aspects of Sree Krishna's life such as its supernatu- .. or in, its miracles and so forth may continue to move the hearts of the orthodox section. But his teachings conveyed through the Bhagavadgeetha are competent to afford solution to the spiritual and moral problems that face mankind. If the doctrine of the universality of the soul and the principle of equanimity are cherished by mankind, all strife will be at an end and there will soon .. heaven on earth. The sordid strife, political, social .. onomical, that is seen in the world of to-day can .. nated only by an understanding of the supreme .. of .. e Bhagavadgeetha. Its teachings fraternize a .. d establish peace and harmony permanently

## SREE KRISHNA

"Astride the closing and dawning age,
Stands a majestic personage,
The pledged scourge of evil on earth,
And saving rock of righteous worth,—
A radiance beaming to the ends
Of time and space, amidst which rends
The darksome mystery that wraps
Life's destiny and death-made gaps.'

## VEDA VYASA

"And Krishna's chosen chronicler,
Sage Veda Vyasa, was then astir,
Revising time's results, to trace
Sucessive plights of heaven's grace,
And flooding the land with holy writs
That spiritualize the wits
And hearts of Bharata varsha's sons,
As their sublunar ordinance runs."

.. .. ... .. .. ...
... ... ... .. ... ..

## VEDANTA

"Sage Veda Vyasa consummates the quest
For truth and vouches blissful rest
As the destined state of bodied soul,
Affirmed to have its start and goal
Within the kindred soul supreme,
But wrapt in self-oblivious dream."

*Pithapuram,*
1st July, 1930.

G. SOMANNA.

# ధన్యవాదము.

"నిందతు నందతు వా సన్నసూయురనసూయురత్ర కిం తేన,
య త్స్నానసగమనాయైవేదం మమ తు పాయమ్."

(రామకవి.)

"అగ్రే దీర్ఘతరోఽయమర్జునతరుస్తస్యాగ్రతో వర్త్మనీ
సాఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిందాత్మజా,
తస్యాస్తీరతమాలకాననతలే చక్రం గవాం చారయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పంథానమవ్యాహతమ్."

(శ్రీకృష్ణకర్ణామృతము.)

మహాశయులారా!

శ్రీకృష్ణావతారతత్త్వ మను పేరు విన్నంతనే గ్రంథోద్దేశము వెల్లడియగును. ఈవిషయ మిందుఁ బ్రధానముగా వ్రాయఁబడియుండుననియుఁ బొడకట్టును. భగవత్తత్త్వ మిద మిత్థ మని నిర్ణయింప శక్యమా యని యడుగరాదు.

"విబుధజనులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు."

అని మహాకవి పోతన వక్కాణించెను.

శ్లో. "త్వద్యాత్రయా సర్వగతాహతా తే
ధ్యానేన చేతఃపరతాహతా తే
స్తుత్యానయా వాక్పరతాహతా తే
క్షమస్వ శంభో త్రివిధాపరాధమ్."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులు నిర్వచించిరి.

శ్లో. "న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః,
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర.

భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప.
అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వామవష్టభ్య సంభవామ్యాత్మమాయయా."

అని గీతాశాస్త్రమునందు శ్రీకృష్ణపరమాత్మయే స్పష్టపఱచెను.

శ్రుతి. "న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనో న విద్మో
న విజానీమో యథై తదనుశిష్యాదన్య దేవ తద్విదితా
దథో అవిదితాదధి ఇతి శుశ్రుమ పూర్వేషాం
యేన స్తద్వ్యాచచక్షిరే. 3

యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే." ౪

(కేనోపనిషత్తు.)

"అనేజదేకం మనసో జవీయో
నైతద్దేవా ఆప్నువన్పూర్వమర్షత్,
తద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠత్
తస్మిన్నపో మాతరిశ్వా దధాతి." ౪

(ఈశావాస్యోపనిషత్తు)

"నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే" ౧.౨

(కఠోపనిషత్తు)

"న చక్షుషా గృహ్యతే నాపి వాచా
నాన్యైర్దేవైస్తపసా కర్మణా వా,
జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వస్తు తం
పశ్యతే నిష్కలం ధ్యాయమానః." ౮

(ముండకోపనిషత్తు)

అని యిట్లు శ్రుతి బహువిధములుగా సిద్ధాంతము చేయుచున్నది.

వీనింబట్టి చక్కఁగాఁబరికింప భగవత్తత్త్వమవాఙ్మానస గోచరమనియే స్పష్టమగును. కాని యది గోచరింపదని యూరకుండరాదుకదా. యథాశక్తి దాని నెఱింగి సేవించినఁగాని మానవులు కృతకృత్యులు కాఁజాలరు. కావున "ఉదుతభక్తి" యన్నట్లు తెలుపవలసియుండు ననుట సమంజస మగుమార్గము.

ఈగ్రంథమునందు శ్రీహరికథల నాయాయిపురాణముల నుండి సంగ్రహించి వ్రాయుటయే గ్రంథకర్త యాశయమని వెల్లడియగును. దానిచే గ్రంథనామమునఁ గలతత్త్వశబ్దము సార్థకము కాదు. ఆయాకథలయందుఁ గలసార మేమని చర్చించి యథామతి దానిని వ్రాసి యందులకు గీతాదిప్రమాణములు కనఁబఱుపవలయును అపుడు తత్త్వశబ్దము సార్థకమగును. తత్త్వమంతయు నిందుఁగలదా యని ప్రశ్నింపరాదని ముందే విన్నవించితినిగదా. ఇట్టివిషయము నీగ్రంథము బోధించునని దానిపేరే తెల్పుచున్నదని మనవిచేయువాఁడను.

ఈపరిశ్రమమువలన లోకమునకు మేలుకలదా, యను నదియు మంచిప్రశ్నమే. జనులందఱొక్కమనస్సు కలవారు కారు. ఒక్కవిధమగు కర్మ మాచరించినవారును గారు. కర్మము లనేకవిధములు. వానినిర్ణయించు టశక్యము.

శ్లో.“కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః”

అని గీతాశాస్త్రమే నిర్ణయించెను. ఆకర్మములననూలమున మనోగతులు తాఱుమాఱగుచుండును. ఒక్కనిచిత్తమునకు నచ్చినమార్గము వేఱొక డీసడించును. ఆతనిత్రోవ నింకొక్కఁ డాక్షేపించును ఇట్టులుండుటంబట్టి కర్మముల ననుసరించి దేవతాభక్తి యనునది యొక్కవిధముగా నుండఁజాలదని మన మూహింపవచ్చును. బహువిధదేవతల నుపాసించుమార్గములు పెద్ద లీకారణముననే తెల్పిరని పొడకట్టెడిని. ఆమార్గము లన్నియు సమానఫలములేకాని హెచ్చుతగ్గులుగలవి కావ నియుఁ జెప్పక తీఱదు.

“యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్త ౩౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః.” ౩౨
(గీతా. ౬. అధ్యా)

అను శ్రీమద్భగవదుక్తులు పై భావమునే తెల్పుచున్నవి. కాఁబట్టి భగవద్భక్తి దేవతానామభేదమున హెచ్చుతగ్గులుగా

ఫలము నీయదని మనము నమ్మవలయును. కర్మము లనేకవిధ
ములు కాఁబట్టియే యొక్కొక్క పురాణమునం దొక్కొక్క
దేవతయే ప్రధానముగాఁ జెప్పఁబడియెను. అం దేపురాణము
ననుసరించి యే దేవత నారాధించినను సర్వదేవతాస్వరూపునిగా
ధ్యానించువారల కెల్ల ఫలము సమానమని స్పష్టమగును.
ఇదియే సారము స్వమతావేశమునఁ జిత్తమున్మత్తము కాఁగా
నితరులారాధించుదేవతల దూషించువారి కధోగతియే యని
యుఁ దేటపడఁగలదు. శ్రుతితాత్పర్య మిదియే యని ముందే
వివరించితినిగదా. ఈవిషయమునే యీకృష్ణావతారతత్త్వము
బోధించును

## శ్రీకృష్ణచరిత్రము.

దీనింగూర్చి నాలుగుమాటలు వ్రాసెదను. శ్రీకృష్ణచరి
త్రము పరమపావనమైనది. వారియవతారముకూడ ననుపమా
నము. పామరులకును బుద్ధిని దుర్వినియోగము చేయఁ బూను
వారికిని శ్రీహరిచరిత్రము మంచిదిగాఁదోఁపక పోవుటాశ్చర్యము
కాదు. అట్టివారినిమంచిమార్గమునకుఁద్రిప్పఁదగము కాదు. దానికై
ప్రయత్నింపనురాదు, అది వ్యర్థప్రయత్నముకూడ నగునని
నాభావము ఏలయనః వారికర్మము తచ్చిత్తమును మార్చుచుండ
వారట్లూహించుట తప్పుగాదు. కర్మగతిని మార్పగలవాఁడొక్క
భగవంతుఁడే కాని యితరులు కారనుట నిశ్చయము. కావునఁ
గర్మము నాక్షేపింప వలనుపడదు. వారి నాక్షేపించియు
లాభము లేదు. వారిమనస్సు లీజన్మమున మార్పునొందఁజాలవని
తలంచుట శ్రేయము. శ్రీహరిచరిత్రమునుగొందరు నిందించినం
మాత్రమున నది స్తవ్యము కాకపోదు. అపవిత్ర చరిత్రము:

గొందఱు స్తుతించినంతనే యది స్తుత్యము కాఁజాలదు. కావున శ్రీకృష్ణచరిత్రము వేదాదివినుతిం గాంచెను. సజ్జనులు దానిని స్మరించుచు ముక్తికిం బోవుదురు. గోపికావస్త్రాపహరణాదులు నింద్యచరిత్రములు కావా యని ప్రశ్నించినచో నావిషయ మీ గ్రంథమున విమర్శింపఁబడియేయున్నది. ఆయాభాగములఁ బఠించినసది స్పష్టమగును. ఆసమాధానములు తృప్తినీయవేని తృప్తి నిచ్చునట్లు వ్రాయఁజాలకపోయెనని నన్నా పింపఁదగు అంతియ కాని తచ్చరిత్రమునాక్షేపింపఁగాదు. ఇచ్చట నేనావిషయమై పెంచివ్రాయఁ దలచుకొనలేదు. కృష్ణావతారము దశావతారములయందంతర్భూతమా కాదా యనువిషయము నుపోద్ఘాతమునందుఁ బెద్దలు వ్రాసియున్నారు. దానింజూడందగు.

## గ్రంథప్రారంభావశ్యకత.

ఈవిషయమును వ్రాయక తప్పినది కాదు. కాన నించుక విన్నవించెదను. ఆంధ్ర శ్రీమద్రామాయణము వ్రాసినపిదప శ్రీ [illegible]ష్ణావతారతత్త్వమును వ్రాయునూహ తనంతన కలిగెను. ఈ ఘనకార్యము చేసినాఁడనినకీర్తి సంపాదింపఁగోరి కాదు. సర్వము [illegible]వా[illegible]నముకదా! లోకులకుఁ బ్రతిష్ఠఁగోరి ప్రారంభించితినని తోఁచినచో నేనేమియుఁ జెప్పఁజాలను. శ్రీకృష్ణచరిత్రము పెక్కు పురాణములయందిమిడియున్నది. దాని నొక్కచోఁ జేర్చుటయే నాపని. అంతకంటె విశేషమిందేమియు లేదు. ఒక్కొక్కకథయు నొక్కొక్కనీతిని బోధించును. ఆ[illegible]తియు గ్రంథస్థమే. ఐన దాని నా [illegible] [illegible]ర్చుటయే నాయొనరించినపని. దీని నాలుగు [illegible] వుటయుఁ దోఁచినంతవఱకు దానియర్థమును [illegible] [illegible] వ్రాయఁజాలినంత వ్రాయుటయు ననునదియే

నాపరిశ్రమము ఇంతకంటె విశేషించి చేసిన గొప్పకార్య మేదియు
లేదని నేను జెప్పకయే యీగ్రంథము చెప్పుచున్నది. ఈపరిశ్రమ
మున నాకంటె నెక్కువపాండిత్యము లేనివారలకును, పామరుల
కును విదుషీమణులు కాని పురంధ్రులకును బాలురకు నుపకార
మించుకయేఁ గలిగినదియే మహాభాగ్యమని శ్రీపరమేశ్వరుకరుణ
యని భావించువాఁడను. శ్రుతిస్మృతిపురాణేతిహాసములయందుఁ
గల సారతరార్థమును గ్రహింపఁ జాలనినాకు నీయూహ గలు
గుట యసంగతము కాదు.

## అవతారము.

శ్రీకృష్ణపరబ్రహ్మము ధరపై నవతరించునంతయావశ్యక
మాకాలమునఁ గలిగినదాయనునది యింక నొక ప్రశ్నము భూమి
ప్రజాభారమున నలసి బ్రహ్మకడకుంబోయి విన్నవించుకొనెనా
యనునదియే ప్రశ్నమే. భూమియనఁగా మనమనుకొనునది కా
దు. భూగోళాధిష్ఠానదేవత యని తెలియందగు. వృక్షలతాదులకు
నిట్లే యధిష్ఠానదేవతలు కలరని యార్యమహాశయులయూహ.
పురాణములు నిట్లే బోధించెడిని. దేవతలే వేరన్నవారిద్దాని
నమ్మకయున్నఁ గొఱంతయేమి! అట్టివారిని నమ్మింప నాయీప్ర
యత్నము కాదు. ఆస్తికులకే యిది పనికివచ్చును. చక్షుష్మతు
నకేదీపంబుగాని జనుషాంధునకు గాదు. అట్లే ఆస్తికుల కిది
యించుక తోడ్పడఁగలదేమో యని నాయాశ. భూభారభూతు
లుగా నుండువారిని బోకార్ప లయకర్త ప్రయత్నించును.
వారికర్మ మేరూపముననో వారికి ఫలమును గలిగించును.

ద్వాపరాంతమున రక్కసులందఱు రాజరూపముల నవత
రించిరి. తదనురూపములగు కార్యములచే లోకమునకు భీతి

నాపాదించిరి. వారికిం బ్రతీకారము నొనర్ప దేవతలు సంకల్పించిరి. కాని భగవత్సహాయము లేనిది యధర్మప్రవర్తకుల నడంపఁజాలకపోయిరి. భగవంతునిం బ్రార్థించిరి. తదనుజ్ఞాతులై తత్సహాయము చేయఁబూని స్వాంశముల ధర నవతరింపఁజేసిరి. ఆయిరు దెఱంగులవారిమూలమున భూభారము తగ్గెను. అధర్మప్రవర్తకులమూలమునఁ జెడినవారిఁ జక్కఁ బెట్టుటకే యర్జునుకారణమున శ్రీహరి గీతాశాస్త్రము నుపదేశించెను అధర్మము నడంచుట, ధర్మమును స్థాపించుట, భావికాలమునకు నుపయోగించు ప తుల నుపదేశించుట, యనునవియే శ్రీకృష్ణవతారఫలములని మన మెఱింగి యాపరాత్పరు నారాధింపవలయును. ఇదియే యవతారఫలము.

## గోపికలు.

శ్రుతులు గోపికారూపములొంది శ్రీకృష్ణు నారాధించెనని పురాణము లుద్ఘోషించెడిని. శ్రీరామవతారమున నాపరమపురుషుని దివ్యమంగళవిగ్రహమును గాంచి మోహపరవశులై కృష్ణావతారమునగోపకన్యకలై పెండ్లియాడిరనునభియుక్తోక్తి వినఁబడియెడిని. పదాఱు వేలసంఖ్యగలగోపికలు శ్రీహరికి భార్య రి. ఇందేమిలోపము? గోపకులభార్యలు శ్రీహరిని వలచిరని యెందును గానరాదు అది లోకాచారము ననుసరించి చాల దూష్యమే యగును కాని బహుభార్యాత్వము దూష్యమని స్మృతులయందుఁ జెపఁబడ ని మహనీయులభావము. ఏక కాలము దాఱువేల. పికలగృహముల శ్రీకృష్ణుఁ డుండఁ హా దముని వీక్షించి వినుతించెనని యుండఁగా ...యుటకంటె నసత్కారము వేఱే

మున్నది? ఆకథ విశ్వాసార్హము కాదందురు. అది కాదను వారికి శ్రీకృష్ణుఁడే యవతరింపలేదను నాశయము. పొడకట్టక పోదు. అప్పుడీయాక్షేపమున కవకాశమే లేదు. పురాణకథల నంగీకరించినచో నీప్రశ్నమునకే సమయము లేదు.

"అనధీతే మహాభాష్యే వ్యర్థా సా పదమంజరీ,
అధీతే పి మహాభాష్యే వ్యర్థా సా పదమంజరీ."

అన్నట్టు లగునుగదా. శ్రీకృష్ణునిచరిత్రము నంగీకరించి నపుడు తన్మహిమమునంతయు నంగీకరింపవలయును. కొంత మాత్ర మంగీకరించి కొంత త్రోసివేయఁదగుననుట బుద్ధిమంతుల లక్షణము కాదు. అమానుషకృత్యములచేతనే శ్రీకృష్ణుఁడు పరమాత్మయని స్పష్టమగును. అట్టిభగవంతునికథలయం దాదరము లేనివార లాక్షేపించినను దద్భక్తులు పరితపింప నక్కఱలేదు. వారియాక్షేపములు నిరాధారము లగుటయే యందులకుంగల కారణము.

## పురాణములు.

శ్రీహరిచరిత్రము శ్రీభాగవతము, దేవీభాగవతము, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, నారద, కూర్మ, విష్ణుపురాణములు దెలుపుచున్నవి. మహాభారతహరివంశములును దెలుపుచున్నవి. పద్మపురాణమునందును శ్రీకృష్ణచరిత్రము కొంతకలదు. గర్గ సంహితయు ననేకవిషయములను హరినిగుఱించినవానిని దెలుపును. ఇంచుకగనో గొప్పగనో ప్రతిపురాణము భగవత్కథలఁ దెలుపుచునేయున్నది ఇన్నింటియందు నొక్కరీతిగాఁ దచ్చరిత్ర ము లేదు అనేకభేదములుగా నుండును. అదేల? అనునదియే యిటఁగల గొప్పప్రశ్నము. సమాధానము నాలకింపుఁడు.

శ్రోతల ననుసరించి యుపదేశకులు విషయమును దెలుపుదురు. ఎంతమాత్రము తెలిపిన వారు గ్రహింతురో వారెఱుంగుదురు. కొన్నిపురాణములు చరిత్రమునుమాత్రమే తెలుపును. మఱి కొన్ని కథను దానిమహాత్త్వమునుగూడఁ దెలుపును. ఇంకను గొన్ని కేవలమాహాత్మ్యమునే తెలుపును. మఱియుఁ గొన్ని కథా చమత్కారమునే బోధించును కొన్నిమాత్రము కథను మార్చి దానినుండి గ్రహింపందగుసారమును వెల్లడించును. ఇట్లు పురాణములు వివిధభేదములుగ భగవచ్చరిత్రమును దెలుపు చుండును. కథాభేదము ననుసరించి యొకదాని కొకటి విరుద్ధముగ నున్నదే యేలయని ప్రశ్నింపరాదు దాన లాభము లేదు. చరిత్రమును బఠించి తద్గతసారమును గ్రహించి తద్రీతి ననుసరించి భగవంతు నారాధించుటే ప్రధానము. అదియే తరణోపాయము.

## రాధాదేవి.

శ్రీకృష్ణచరిత్రమునందు విశేషించి రాధాంబికాప్రభావము కలదు. అదియే యీగ్రంథమున వ్రాయఁబడినది. రాధ శ్రీహరిపత్నియే కాదని కొందఱందురు. మఱికొందఱు రాధ కృష్ణునకు మేనత్త యగునందురు. ఈరెండువిషయములకును బ్రమాణ మాకాశమే. భగవంతునకు రుక్మిణియే ప్రధానపత్ని యనియుఁ గొందఱందురు. శ్రీభాగవతమునందును విష్ణుపురాణమునందును బ్రహ్మపురాణమునందు రాధాసంకీర్తనము లేదు. హరివంశమునందును గానరాదు. కావున రాధ యనునది కల్పితమని మఱికొందఱందురు. వీరికి సమాధానము చెప్పఁబూనుట వ్యర్థము. ఐన నాయెఱింగినంతలోఁ గొంత తెలుపుదును.

తొలుదొలుతఁ బురాణములయందుఁ బ్రధానము లేవి? అను నది విమర్శింపఁదగును. ఆచర్చ యొకమానవజీవితమునఁ బూర్తి యగునది కాదు కావున నించుక వ్రాసెదను.

బ్రహ్మపురాణము ప్రథమపురాణమని యన్నిపురాణము లంగీకరించెను.

"బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం భాగవతం తథా"

(అని విష్ణుపురాణము.)

భాగవత మనఁగా దేవీభాగవతమా శ్రీభాగవతమా! యను చర్చ చిరకాలసమాగతము. దానిసిద్ధాంత మిదు దెఱంగులుగనే యున్నది. ఈ రెండును బ్రమాణము లేయని నామతము. కాఁబట్టి యేయేపురాణములు రాధామహత్త్వమును బోధించునో యించుక యాలకింపుఁడు. పద్మపురాణమునందు సాత్త్విక రాజస తామసపురాణములని మూఁడువిధములుగ విభజింపఁబడినది. సాత్త్విక పురాణములు.

"వైష్ణవం నారదీయం చ తథా భాగవతం స్మృతమ్,
సాత్త్వికాని పురాణాని విజ్ఞేయాని శుభాని వై."

(ఉత్తరఖండము. ౪౩ అధ్యా.)

బృహన్నారదీయమునందు రాధామాహాత్మ్యము విశేషించియున్నది. దేవీభాగవతమునందు రాధాచరిత్రసారము కలదు.

## రాజసపురాణములు.

బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం మార్కండేయం తథైవచ,
భవిష్యం వామనం బ్రాహ్మం రాజసాని నిబోధ మే.

ఈ రాజసపురాణములందు బ్రహ్మాండ బ్రహ్మవైవర్తములు

బ్రహ్మపురాణములు చేరియున్నవి ఇందుఁదొలి రెండింటియందును రాధాచరిత్రము గలదు. బ్రహ్మవైవర్తమునందు విశేషించి కలదు. బ్రహ్మాండపురాణమునందుఁ గొంచెముగాఁ గలదు. గోలోకప్రస్తావము కలదు.

"శ్లో. సస్మార మనసా కృష్ణం ప్రణతక్లేశనాశనమ్,
గోలోకనాథం గోపీశం నానానునయకోవిదమ్. ౧౯
రాధయా సహితశ్శ్రీమాన్ శ్రీదామ్నా చాపరాజితః.౨౧
తదా రాధాబ్రవీద్దేవీం శివరూపా సనాతనీ. ౪౬
ప్రకృతిః పురుషశ్చోభావన్యోన్యాశ్రయవిగ్రహౌ,
ద్విధా భిన్నా ప్రకాశంతే ప్రపంచేఽస్మిన్ యథా తదా."౪౭
(ఉపోద్ఘాతపాదము ౪౨ అధ్యా.)

"యా రాధా జగదుద్భవస్థితిలయేష్వారాధ్యతే వా జనై
శ్శబ్దం బోధయతీశవక్త్రవిగళత్ప్రేమామృతాస్వాదనమ్,
రాసేశీ రసికేశ్వరీ రమణహృన్నిష్ఠా నిజానందినీ
నేత్రీ సా పరిపాతు మామవనతం రాధేతి యా కీర్త్యతే. ౮
యస్యా గర్భసముద్భవోఽత్యతి విరాడ్యస్యాంశభూతో విరా
డ్యన్నాభ్యంబురుహోద్భవేన విధినైకాంతోపదిష్టేన వై,
సృష్టం సర్వమిదం చరాచరమయం విశ్వం చ యద్రోమసు
బ్రహ్మాండాని విభాంతి తస్య జననీ శశ్వత్ప్రసన్నాస్తు సా ౯
అథ కృష్ణోప్యనుజ్ఞాప్య శివం చ నగనందినీం,
గోలోకం ప్రయయౌ యుక్తశ్శ్రీదామ్నా చాపి రాధయా."
(ఉపో ౪౩ అధ్యా.)

నారదీయపురాణమునందు నెనుబది రెండవయధ్యాయమునందు శ్రీరాధాకృష్ణ సహస్రనామస్తోత్రము. ఎను

బదిమూఁడవయధ్యాయమున మంత్రారాధనపూర్వకముగా రాధాంశభూతపంచప్రకృతి లక్షణనిరూపణము. ఎనుబదియొనిమిదవయధ్యాయమునందు రాధావతారషోడశ దేవతామంత్రాది నిరూపణము. ఉత్తరార్ధమునందు నేఁబదియొనిమిదవయధ్యాయమునందు గోలోకనివాసి రాధాకృష్ణ తత్త్వనిరూపణము. ఏఁబదితొమ్మిదవయధ్యాయమునందు రాధాకృష్ణపంచధారూపగ్రహణ నిరూపణము గలదు.

బ్రహ్మవైవర్త పురాణమునందు శ్రీకృష్ణజన్మమునందు సంపూర్ణముగ శ్రీరాధాచరిత్రము కలదు. పూర్వభాగమున బ్రహ్మఖండమునందును దచ్చరిత్రము గలదు. పద్మపురాణమునందు నాల్గవదగు పాతాళఖండమునందు నారదుఁడు రాధను దర్శించుట, స్త్రీయగుట, అర్జునుఁడు రాధాలోకదర్శనమున స్త్రీయగుట యనుగాథలు గలవు. రాధాజన్మాష్టమీ మాహాత్మ్యవర్ణనము కలదు ఇంక ననేకవిషయము లీరాధను గుఱించి చెప్పఁబడినవి యీపురాణమునఁ గలవు. ఇట్లు శ్రీకృష్ణమాహాత్మ్యము రాధామహిమము విశేషించి చెప్పఁబడినవి. భాగవతమునందుఁగాని విష్ణుపురాణమునందుఁగాని రుక్మిణీమహాత్త్వమిట్లు విశేషించి చెప్పఁబడినదియా. సాత్త్వికపురాణమునందు రాధామాహాత్మ్యమువిశేషించి చెప్పఁబడియుండఁగా రాధాంబ హరిపత్నియే కాదనుటెట్లు? భాగవతమునఁ బేర్కొనఁబడినంత మాత్రమున రాధికయే లేదనుటెట్లు? రాధాపూజాపద్ధతియుఁ గవచాదులు సహస్రనామములు చెప్పఁబడియుండఁగా నామె ప్రకృతి కాదనుటెట్లు? పురాణములయందుఁ గాక యితరాగమములయందు రాధాప్రస్తావము కలదు వానిం బరిశీలించుటుత్తమముకదా!

"గచ్ఛ గచ్ఛ మహాబాహో పద్మినీసంగమాచర,
పద్మినీ మమ దేవేశ వ్రజే రాధా భవిష్యతి.
అన్యాశ్చ మాతృకాదేవ్యస్సదా తస్యానుచారికాః."

వాసుదేవరహస్యమున రాధాతంత్రమునం దాఱవ పటలము.

యా రాధా మృగశాబాక్షీ! పద్మినీ విష్ణువల్లభా
మహామాయా జగద్ధాత్రీ త్రిపురాపరమేశ్వరీ.
(వాసు ౮ పటలము.)

నారద పంచరాత్రాగమమునందు రాధాసహస్రనామములు చెప్పఁబడినవి. వాసుదేవరహస్యమున ముప్పది రెండవ పటలము నందును రాధాసహస్రనామములు చెప్పఁబడినవి. నారద పంచరాత్రాగమమునందు జ్ఞానామృతసారమున సర్వరక్షాకర రాధాకవచము చెప్పఁబడినది. ఇందే రాధాస్తోత్రము చెప్పఁబడినది.

రాధ్నోతి సాధయతి కార్యాణీతి రాధా. అని వ్యుత్పత్తియు నిఘంటువులందుఁ జెప్పఁబడినది. రాసేశ్వరియనఁగా రాధాంబయనియు నాకరములయందుఁ గలదు. రాసక్రీడయనఁగా రాధఁగూడి చేసిననృత్యమే యని విధిగలదు. రాసోత్సవవిధానము విశేషించి చెప్పఁబడినది. ఇట్లు పురాణములేకాక ఆగమములును రాధామాహాత్మ్యమును వర్ణించుచున్నవి. ఇట్టులుండఁగా రాధయే లేదనుట నిరాధారమనక తప్పదు. ఈవిషయమే యీయాయితావుల వ్రాసియేయున్నాఁడను. రాధారుక్మిణులకుఁగాని, సత్యభామాదులకుఁగాని, తారతమ్యముగలద నత్కార్యము కాదని నాయాశయము. ఈభావముకలిగిననే

కాని భేదబుద్ధిపోదు. అది పోయినఁగాని భక్తి కుదురదు. అది కుదిరినఁగాని సమదర్శనుఁడు కాఁజాలఁడు. సమదర్శనుఁడైన గాని భగవంతుని దర్శింప సమర్థుఁడుకాఁడు. ఈవిషయ మిట్టు లుండఁగాఁ గొన్నిపురాణములు ప్రమాణములు కావనియుఁ గొన్నిమాత్రమే ప్రమాణములనియు వాదించువారు కలరు. సర్వపురాణములు ప్రమాణములే యనియు, నాపరతత్త్వ మునే యన్నియు బోధించుననియు, నుపదేశ్యునింబట్టి విష యభేదము కలుగుననియు, నెల్లవారు నొక్కవిధమగు కర్మము నాచరించువారు కారనియు, వారివారియోగ్యత ననుసరించి భగవదారాధనము రీతిభేదముగ నుపదేశింపఁబడు ననియు, నీసిద్ధాంతము ననుసరించినయెడల సర్వపురాణములు ప్రమాణ ములే యని తోఁచుననియుఁ, గొన్నిమాత్రమే ప్రమాణము నుట హ్రస్వదృష్టిలక్షణమనియు, నామతము ననుసరించువా రితరదేవతాదూషకు లగుదురనియు, నది భగవత్సమ్మతము గాదని నావిశ్వాసము. ఈవిశ్వాసము నాధారముచేసికొనియే శ్రీకృష్ణావతారతత్త్వమునఁ జరిత్రముక్రింద సారము వ్రాయఁ బడినది.

## ఉపదేశములు.

శ్రీకృష్ణమూర్తి లోకానుగ్రహార్థము సకలధర్మ ముల నుపదేశించెను. భగవద్గీతల ననుగీతల నర్జునునకు నుపదేశించెను. ఇందు భగవద్గీతలు లోకమందెల్ల వ్యాపిం చినవి. అనేకభాషలలోనికిఁ బరివర్తనము చేయఁబడినవి. మతత్రయస్థాపకులు భాష్యములు వ్రాసిరి. వాని కనేక వ్యాఖ్యలు కలవు. భాష్యమునఁ గలయర్థమును దేటపఱచు

టకే వ్యాఖ్యానములు వ్రాయఁబడినవి కాని భాష్యకర్త భావము సులభముగా గ్రహింపవచ్చునుగాని వ్యాఖ్యాతృ భావము నెఱుంగుట యంతసులభముకాదనవలయును. పారాయణప్రక్రియలచే గీతాశాస్త్ర ముపనిషత్తుల మించినదనవలయును. ఉపన్యాసకులలోఁ బెక్కండ్రకు గీతలు తెలియకున్న నొక్క శ్లోకమైన శ్రమంపడి నేర్చుకొని యుపన్యాసమునఁ జొప్పింపకయున్న సారములేదని తోఁచినది. అంతటిమర్యాద నాగీతాశాస్త్రము పొందినది. ఆగీతలకు నిందు నొకలఘుటీక వ్రాయఁబడినది. దానికి భగవద్గీతాహృదయ మనుపేరు. సందర్భము ననుసరించి శ్రీకృష్ణహృదయ మిదియైయుండునని వ్రాయఁబడినది శ్రీహరియాశయ మిదియే యని యెవ్వరుగాని సిద్ధాంతముచేయఁజాలరు. శబ్దనిష్ఠ మగునర్థము ననుసరించి తమమతమును సిద్ధాంతముచేయఁ జాలుదురు. మహాపండితులగుట వారట్లుచేయఁజాలిరి. అట్టిశక్తిలేని నేనునాయల్పమతికిఁ దోఁచిన విషయమును వ్రాసితిని. నాయాశయము వెలిఁబుచ్చునపుడు జంకుపడక వ్రాసితిననిమాత్రము చెప్పఁగలను. ఆవ్యాఖ్యను గీర్వాణభాష వ్రాయఁదలఁచితిని. ఈశ్వరు ననుగ్రహము నాపైనున్న నాకార్యము నెఱవేఱఁగలదు. తక్కినయుపదేశములను సంగ్రహించియే వ్రాసితిని.

## పరివర్తనములు.

పోతనాదులు మహాత్ములు, పరమభాగవతులు. వారు భాగవతాదుల నాంధ్రీకరించి కృతార్థులైరి. శ్రీభాగవతమునఁ గలకథను వ్రాయునపుడు తెలుఁగు కవిచంద్రుని బేర్కొంటిని. చరిత్రము పరమపావనమైయుండఁగా మూలమునలేని

భావము తెలుఁగునఁ జేర్చి నందున నితరు లాక్షేపింప నవకాశము
కలుగునేమో యనుసంశయమునన్నుఁ గుదియింపఁ గొన్ని తావుల
నిట్లు వ్రాయకయున్న బాగుండునేమో యని యంటిని. అంతియ
కాని మహాకవియందు భక్తిలేక కాదు దీన భాగవతాపచారము
నాకుఁగలుగకయుండుఁగాక యని భగవంతుని బ్రార్థించెదను.
మహాకవి ముక్కుతిమ్మన్న హరివంశమునఁ గలకథను జమత్కార
ముగా వ్రాసెను. కాని సత్యభామయం దొకదోషము నారో
పింప నవకాశముగలుగునట్లు వ్రాసెను. ఆచోట నట్లు వ్రాయ
కున్న నాతనియాశయమునకు భంగము రాదు. అట్లువ్రాయుటచే
బాధయేమన్న శ్రీకృష్ణపత్నులు మహాలక్ష్మ్యంశసంభూతలని
యుండఁగా నట్టి సాధ్వీమణి యకార్య మొనరించెననుట
సాధుసమ్మతము కాదని యభిప్రాయముగలవాఁడనైతిని. కాన
నించుక వ్రాసితిని. అంతియగాని భాషోద్ధారకులఁ బితృసమా
నులనుగా భావించు నేను వేఱుభావమున వ్రాయునని తలం
తురుగాక. వారెల్ల నాకుఁ బరమపూజ్యులు. వారిని సర్వదా
యుపాస్యదైవముంబలె ధ్యానించువాఁడను. వారి పాదార
విందధ్యానమే యభివృద్ధిమార్గమని నావిశ్వాసము.

## ఉపాఖ్యానములు.

శ్రీకృష్ణావతారతత్త్వమును వ్రాయునపుడు తులసీ
మాహాత్మ్యము, శంఖచూడునిచరిత్రము లోనగునవి వ్రాసితిని.
ఇవి శ్రీకృష్ణునిచరిత్రమునకు వీనికిసంబంధముకలదనియే వ్రాసి
తిని. కలిధర్మాదులు శ్రీహరిబోధములలో సంతర్భూతములగుట
వ్రాసితిని. ఇందుఁగల ప్రతిభాగము శ్రీకృష్ణచరిత్రమునకు సం
బంధము కాదు. ఇదియే నాభావమని పాఠకమహాశయు లూహిం

తురుగాక. భక్తినిగూర్చి పలుసారులు వ్రాసితిని. ఉపాసనవిష
యము వ్రాయఁదగు నవసరమున నాయెఱింగినంతదనుక శైవ
శాక్తవైష్ణవపద్ధతులను దంత్రానుసారముగనే వ్రాసితిని. ముఖ్య
ముగా దేవతాభేదము పాటింపరాదనియు, సర్వదేవతాస్వ
రూపుఁడాపరమేశ్వరుఁడనియు, నేరూపమున వారి నారాధించి
నను భక్తి చక్కఁగాఁ గుదిరిన ఫలముగలుగుననియు,నాఫలము
సమానమనియు నాయాశయమని తేటపఱచితిని. జాతిధర్మము
లనుశ్రేయములనియు, నాముష్మికఫలము ధర్మానుష్ఠానము విధి
విహితమైనచో సమానమనియు నావిశ్వాసమనియుఁ దెలిపి
తిని. పశుయజ్ఞము కలియుగమునఁ బనికిరాదని వ్రాసితిని. నా
వ్రాసిన యీవిషయములన్నియు సర్వజనాంగీకారములగు నన్న
మూఢవిశ్వాసము నాకు లేదు. సర్వజనాంగీకృతమగు ధర్మమే
కానరాదు. అట్లేయుండిన నిన్నిమతము లుదయింప నక్కఱయే
లేకపోవును. కావున నావ్రాసినవానిలో నేవో కొన్నియైన
మంచివిషయము లుండునని యాశించువాఁడను. నాభావమున
లోపములు లేవని నుడువఁజాలను. వానిని క్షమించి యొప్పు
లెందేనుండిన గ్రహించి తప్పులను నాకుందెల్పి నాచేతనే
దిద్దించి నన్ను రక్షింతురని మహాశయులఁ దలయొగ్గి వేఁడు
వాఁడను.

ఈగ్రంథము శివకేశవులకుఁ దారతమ్యము లేదని తెలు
పుటకే యారంభింపఁబడినదని కొందఱు వ్రాసిరి. కొంద ఱాషాఢ
భూతులు కొందఱఁబ్రోత్సహించి వ్రాయించిరి. వారికెల్ల నొక్క
సేవాంజలి సమర్పించువాఁడను. వారికి వేఱువేఱ సమాధా
నము వ్రాయఁబూనక యందందు సమయానుసారము వ్రాసితి.

పత్రికలయందు నన్నాక్షేపించి వ్రాయువారలకు బదులీయఁ దలంపను. దూషించువారికి నొక్కనమస్కారమే చేయువాఁడను. బదులు దూషింపను. మైత్రిఁ బాటించి నన్నడిగినవారికిఁ దోఁచినవిషయమును దెలిపి నాయోగ్యత యింతియే యని విన్నవించువాఁడను. వాదప్రతివాదములు మనస్సంక్షోభకరములు. కాన వానికి నాయంతరంగమునఁ జోటీయఁజాలను. నాకింతియే తెలియునని విన్నవించుకొన్న మంచిదని యెంచువాఁడను. ఎట్టి మహాత్ము లొక్కవిషయమున సార మిది యని వ్రాసినను గొందఱకు విరుద్ధముగాఁ దోఁపకమానదు. అట్టు లుండ నిఁక నావంటివానివ్రాఁత సర్వజనాంగీకృతమని నేనెట్లు నమ్మఁగలను! మోమోటమి లేక తోఁచినసద్విషయమును వ్రాయుట యుత్తమకార్యమని నామనోనిశ్చయము. ఒక్కవిషయమునే పెక్కుసారులు కథాంతరములందు వ్రాసితిని ఏభాగమిందుఁజదివినను భగవద్భక్తి కనఁబడవలయుననియే వ్రాసితిననియు విన్నవించువాఁడను.

## విషయభేదములు.

పురాణాదులనుండి హరికథలవ్రాయునపుడొకదాని కొకటి విరుద్ధముగా నుండినయెడల నందు బహుగ్రంథసమ్మతమగువిషయమును బ్రధానముగా వ్రాసితిని. తక్కినదానిని గూడ నించుక తెలిపితిని. భగవన్మహిమమును దెలుపునది యేదో యదియే ప్రధానమని గ్రహించితిననియు మహాశయు లూహింతురుగాక. భగవచ్ఛర్య లతిమానుషములనునీతి నేగ్రంథము తెలుపునో యద్దాని ముఖ్యముగా గ్రహించితిని. కావున నెందేనట్టితావుల లోపములు కనఁబడినయెడల క్షమిం

తురుగాక. భగవచ్చరిత్రమును వ్రాసి దానిసార మిది యని వ్రాయుతటి నాయభిప్రాయము సమ్మతముగాకున్న నాపైఁగల యీర్ష్యను సర్వేశ్వరునిచరిత్రముపైఁ గనఁబఱుపకుందురు గాక. నన్ను దూషించునెపమునఁ బరాత్పరుని నిందింపక యుందురుగాక. ఇఁక నీవిషయమున వ్రాయఁదగినవి శేషాంశ ములు లేవు.

## కృతజ్ఞత.

ఇఁకఁ గృతజ్ఞతను దెలుపఁ గుతూహల మొందు చున్నాఁడను. కృతజ్ఞతయే భగవత్సమారాధనమని నావిశ్వా సము. శ్రీకృష్ణావతారతత్త్వ మారంభింపఁదలంచితినని కడప నగరమహాశయులకుం దెలిపితిని వారెంతయు సంతసించి యట్లే కావింపుమనిరి. ఆసమయమున ద్వైతమతస్థాపకులగు మహాత్ముల పరంపరయందు మిగులఁ బ్రసిద్ధిఁగాంచి సర్వతో ముఖపాండిత్యమలరారఁబండితులపాలిటి కల్పతరువులై మత దములఁ బాటింపక విద్వాంసుల గౌరవించుచు నుత్తరాది పీఠస్వాములనం బిలువంబడుచు నుండు శ్రీమత్పరమహంసలగు శ్రీసత్యధ్యానతీర్థు లరుదెంచి యుండిరి. వారిని దర్శించు భాగ్యము లభించెను. మ. రా. శ్రీ కౌకూరు శ్రీనివాసరావు గారి గృహమున వారిదర్శించి నాప్రయత్నమును దెలిపితిని. వారి యాశిషంబులనే ప్రార్థించితిని. గ్రంథప్రణాళికను దెలిపి తిని. వారును యోజించి సత్కార్యమే కావునఁ గొనసాగుఁ గాక యని యాశీర్వదించిరి. నాఁడే మొదలిడితిని.

మఱు దినమొక సభచేయించి పౌరమహాశయులు నాభావము నెల్లరకుం దెలిపిరి. పెక్కండ్రు పోషకులగుట కంగీ

కరించిరి. మండలాంతర్భాగములనుండియుఁ బోషకులు చేరుదు
రని కొందఱు వాక్రుచ్చిరి. కాని యది నెఱవేఱదయ్యె. కావున
మండలాంతరములనుండి సాయ మపేక్షింపవలసివచ్చెను. చెన్న
నగరమున నివసించు యాశ్రితులపాలిటి మందారమని యశస్సు
గాంచిమించిన మ. రా. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారిని
దర్శించితిని వారు తమ యాంధ్రపత్రికారత్నమున నొక్క సంవ
త్సరము మూల్యమించుకయే గ్రహింపక ప్రకటింప వాగ్దాన
మొసంగి దానిని సార్థకము చేసిరి. దానిమూలమున నాంధ్రదేశ
మునఁగల పెక్కు మండలములనుండి పోషకులు కొందఱు చేరిరి.
కావున నాకృతజ్ఞతను శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి కేతన్ముఖ
మునఁ దెలుపుకొనుచున్నాఁడను. వారి సాయమపారమనియు
విన్నవించువాఁడను.

గ్రంథమారంభించినపుడే ద్రవ్యము సకాలమున నీఁజా
లక పోవుదునేమోయనియు గ్రంథముద్రణమునఁ ద్వరపడుదు
నేమోయనియు నేవిషయమున లోపములున్నను ముద్రణ
కార్యమున లోపములు కలుగరాదనియు నసిధారావ్రతన్యాయ
ముగా సంభాషింపఁ జెన్నపురి కరిగితిని. నాలోపములనించుకయుఁ
బాటింపక నా ప్రయత్నమే తమ ప్రయత్నముగా భావించి ద్రవ్య
మును లెక్కచేయక నా క్షేమమునే కోరినవారును, ఆంధ్ర
శ్రీమద్రామాయణమును వ్రాయ నన్నుం బోత్సహించి దానిని
ముద్రించినవారును, మూల మూలలఁబడియున్న యాంధ్ర
గ్రంథముల ముద్రించి వానిమహోన్నతదశకుఁ దెచ్చినవారును,
నేఁటికిని బాటుపడి గ్రంథరాజములసంపాదించుచున్నవారును,
విద్యార్థుల కెందఱకో ధనసహాయముచేయుచున్నవారును,

పుస్తకభాండాగారములకు నెన్నింటికో తమగ్రంథరత్నముల అమూల్యముసు గ్రహింపక యిచ్చుచుండువారును,ముఖ్యముగా నన్నొకసోదరునిగా సంభావించువారునగు మ. రా. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నాయభిప్రాయమును దెలిసినంతనే సంతసించియట్లేయొనరింతుమని యంగీకరించి యట్లుపనిసాగించిరి. కావున నట్టి మహనీయులకు నాశ్రేయోవృద్ధులకు మూలకారకులగు వారికి నాకృతజ్ఞత నేతన్ముఖమునఁ దెలుపుకొనుచున్నాఁడను. వారి కితోధికమహోన్నతిం గూర్ప నాపరమేశ్వరుంబ్రార్థించుచున్నాఁడను.

మొదటనుండి నాయీప్రయత్నమునకుం దోడ్పడి తమ పనులలో నిదియుఁబ్రధానమేయని భావించి పోషకులం బెక్కండ్రనుగూర్చి వారినుండి ద్రవ్యమునుగొని తెచ్చి గ్రంథము కొనసాగ నెంతోతోడ్పడుచునున్న మ. రా. శ్రీ కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారి కేతన్ముఖమున నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను వారియుపకారమునకుఁ బ్రత్యుపకారము చేయఁజాలననియు విన్నవించువాఁడను. ఈపద్ధతినే నాకుఁ దోడ్పడిన వారు మ. రా. శ్రీ. కురుడి గుండూరావు, బీ. ఏ, బీ. యల్. గారు. వీరు సహజ ధార్మికులు, పెక్కండ్రుపోషకులం గూర్చి నా ప్రయత్నమును సాగించిరి. నాప్రతిగ్రంథమునకు వీరిసహాయమపారము.వీరికేతన్ముఖమున నాకృతజ్ఞతను విన్నవించువాఁడను. అనంతపురమున న్యాయవాదులై నాకెన్నియోరీతులఁ దోడ్పడుచునీగ్రంథము పదునొకండవసంపుటముతో ధనములేమి ముగింలంచిన నాకుఁ జేయూఁత యొసంగి పోషకులంజేర్తుమని వ్రాసియు చేర్చి యీమహాకార్యమునకుఁ దోడ్పడిన మ. రా. శ్రీ.

గార్లదిన్నె రామేశ్వరరావు బి.ఏ.,బి.యల్. గారికి నేతస్మాల మున నాకృతజ్ఞతను విన్నవించువాఁడను. మఱియు వీరు పోషక ద్రవ్యమునకు మించిన ధనమొసంగిరి. పరమేశ్వరుఁడు వీరిని గాపాడుఁగాక.

అనంతపురమండలమునఁ గలహిందూపురమునకుఁ జేరువ నున్న చేవినహళ్లి యను గ్రామమున నివసించి ముద్దులుమూటఁ గట్టునట్లు కవిత్వము చెప్ప నేర్చి విహగేంద్రవిజయములోనగు పొత్తముల వ్రాసిపరసకవులనంబరఁగుచు నాయీగ్రంథమునకుఁ బోషకులం జేర్చి ధనసహాయముం జేయుటయే గాక నన్ను తమ గ్రామమునకు రప్పించి రజతపాత్రాదుల నొసంగిన మ. రా. శ్రీ కరణము కృష్ణరావుగారికి నా కృతజ్ఞతను విన్నవించుకొను చున్నాఁడను. అనంతపుర మండలముననున్న గుత్తినగరమున నున్నతపాఠశాలయందు సహోపాధ్యాయులైన మ.రా.శ్రీ. వై.కొండలరావుగారు నాకెంతో సాయమొనర్చిరి కావున వారి కిని నాకృతజ్ఞతం దెలుపుకొనుచున్నాఁడను. కడపనగరమున నింక నిర్వురు మహాత్ములు తోడ్పడిరి. వారు తమనామముల దె లుప వలదనినొక్కి చెప్పినందున నిటవ్రాయఁజాలక నాకృతజ్ఞతను వారలకుఁ దెలుపుచు వారివృద్ధింగోరి శ్రీపరమేశ్వరుని బ్రార్థించుచున్నాఁడను.

బళ్లారిమండలమునఁ గల కణేకల్లునందు నివసించి వైశ్య రత్నములై విద్యాభిమానులయి ధర్మనిర్వహణ తత్పరులగు అయ్యగారి బుస్సెట్టిగారు నిరువదైదు రజతముద్రికలనొసంగిరి. కడపపురమునుండి పరోపకారపరాయణులై విద్యాభిమాను లగు మ. రా. శ్రీ బి.పి. దేవరాజులునాయఁడు, బి.ఏ.,బియల్. గారు

పోషకద్రవ్యముగాక ముప్పదైదు రజతముద్రికల నిప్పించి యింకొక్కసారి గుప్తదానపద్ధతిఁ బదునైదు రూప్యముల నిప్పించిరి. బళ్లారిపురవాస్తవ్యులై సంస్కృతాంధ్రకర్ణాటక భాషాకోవిదులై సదాచారనిరతులై సత్పక్షపాతులై వైశ్యకులరత్నములై వెలయు మ. రా. శ్రీ విట్టా శేషప్పశ్రేష్ఠిగారు పోషకద్రవ్యముగాక యిరువదియైదు రజతముద్రికల నిప్పించిరి. ఆనగరముననే నివసించి వైశ్యకులోద్ధారకులై సత్కార్యాచరణపరాయణులునగు మ. రా. శ్రీ, రావుసాహేబు జే పాపయ్యశ్రేష్ఠిగారు గుప్తదానపద్ధతిఁ బోషకద్రవ్యముగాక సువర్ణముద్రిక నిప్పించిరి.

కృష్ణామండల వాస్తవ్యులై గన్నవర రాజ్యభాగాధిపప్రతినిధులై రాధామాధవ పాదారవిందభక్తులై యుండు మ. రా. శ్రీ నందూరు వీరభద్రరాయశర్మగా రిరువదైదు రజతముద్రికల నిప్పించుటయేగాక పదుగురఁ బోషకులం జేర్చి యీమహాకార్యమునకుఁ దోడ్పడిరి కడపనగరమున నివసించి న్యాయవాదులై నాకుఁ బెక్కురీతులఁ దోడ్పడుచు విద్యాభిమానమే యలంకారముగా వెలయు ధర్మనిరతులు మ. రా. శ్రీ, పిరూరు పిచ్చయ్య, బి. ఏ. గారు పోషకద్రవ్యముకాక పాదశతరూప్యము లిప్పించిరి. కడప మండలమునఁగల చిట్టివేలి గ్రామ వాస్తవ్యులై ధర్మనిరతులై వైశ్యకులాలంకారభూతులగు మ. రా. శ్రీ పుట్టా నాగసుబ్బరాయశ్రేష్ఠిగా రిరువదైదు రజతముద్రికలను బంపి సాయపడిరి. ఇట్టులీ పూజ్యచిత్తులు తోడ్పడి యీకార్యమును నామూలమున సాగింపఁజేసి కృతకృత్యులైరి. వీరినెల్లఁ రుఁడు కరుణానిధి రాధామాధవ పరబ్రహ్మము సర్వదా [illegible]డుఁగాక. పోషకమహాశయులు తోడ్పాటుసూపిరి. వారిని

దీర్ఘాయురైశ్వర్య ప్రదానమున శ్రీకృష్ణమూర్తి రక్షించుఁగాక.
సకాలమునకు గ్రంథముల నందింపఁ జాలకపోయినను విసుగు
చెందక నన్నుమన్నించిన పోషకప్రభృతిమహాశయుల కేతన్మూల
మున నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను.

పైనుదాహరించినవారుగాక మఱియుఁగొందఱు సాయ
పడినవారు కలరు. వారు తమనామధేయములఁ బ్రకటింపవలదని
కోరిరి. నాకంటె వయస్సున వారించుకచిన్నవారు. వారికెల్ల
దీర్ఘాయురారోగ్యైశ్వర్యములఁ బరమేశ్వరుఁ డనుగ్రహించుఁ
గాతనుని కోరుచున్నాఁడను. నాలోపముల మన్నింపుఁడని పండి
తాఖండలులఁ దలయొగ్గి వేఁడుచున్నాఁడను. నాప్రార్థన మంగీ
కరించి యోపికమై యీప్రకరణములం బఠించి నాపరిశ్రమమున
కానందించి యుపోద్ఘాతమును వ్రాసియిచ్చిన గురువర్యులకు గీ
ర్వాణాంధ్రకవితావిశారదులకుఁ గరుణాసాగరులకు మ.రా.శ్రీ
నాగపూడి రామకృష్ణాపరనామధేయులకు శ్రీకుప్పుస్వామయ్య,
బీ. ఏ., గారికిఁ గృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాఁ
డను. ఎప్పుడో నన్నుఁజూచియుండినను మఱువక నాయం
దవ్యాజప్రేమమునిచి నేఁగోరినంతనే యీప్రకరణములఁ బఠించి
యాంగ్లభాష బీఠిక వ్రాసియిచ్చిన మ.రా.శ్రీ., గరిమెళ్ల సోమన్న
పంతులు, ఎమ్.ఏ, గారికిఁ గృతజ్ఞతాపూర్వకవందనముల నర్పిం
చుచున్నాఁడను. వీరుద్యోగమున నున్నవారు. పెక్కువిధము
లగునాంగ్లభాషాపరీక్షలయం దుత్తీర్ణులైనవారు. మదరాసు సర్వ
కళాశాలవారి విద్వద్బిరుదపరీక్షయందును నుత్తీర్ణులైరి. విశ్రాంతి
యించుకంతయు లేకున్నను నాప్రార్థనను జెల్లించిన వీరిరువురను
శ్రీరాధామనోహరుఁడు కాపాడవలయునని భగవతుంబ్రార్థించు

చున్నాఁడను. నన్నన్నివిధములఁ బోషించుమహనీయులకు సకలసంపద లొసంగఁ బరమపురుషుని బ్రార్థించుపద్యముల వ్రాసినా యీధన్యవాదమును బూర్తినొందించుచున్నాఁడను.

ఉ. తామరసాక్షుఁ డార్తజనతాపరిరక్షకుఁ డీశ్వరుండు శ్రీ
భూమహిళామనోహరుఁడు భూసురదేవమునీంద్రపావనా
త్మామలపద్మపీఠసతతార్చితపాదుఁడు కృష్ణమూర్తి రా ళిక
ధామయమూర్తి సత్కరుణఁ దద్దయుఁ బ్రోవుత బోషకావళిన్.

మ. ఇదియేమో కనుఁగొంద మేవిషయ మెట్లీపాత్తమం దొప్పునో
మొద లేమో తుద యేమొ విత్త మిడుచుం బోషింప
నర్హంబొ కాదో దరిద్రుం డగుటన్ హరించునో మహో
ద్యోగంబు సాగించునో, తుదముట్టింపక మానునో యనక
తోడ్తో ద్రవ్య మిప్పించి ప్రీతి దగన్ జూపిన పోషకప్రవరు
లన్ దేవుండు కాపాడుతన్.

చ. ఇతరులఁ బ్రోత్సహించి పరమేశుచరిత్ర మిదొౌటసాయమున్
హితమతిఁ జేయ మేలనుచు నెంతయుఁ దెల్పుచువారినుండి స
మ్మతముగ విత్తముం గొని రమాపతిభక్తిని బంపినట్టి యా
శ్రితపరిరక్షణాదరుల శ్రీపతి ప్రోవుత సర్వకాలమున్.

సీ. ధన్యమౌ కృష్ణావతారతత్త్వంబును
వ్రాయఁగా నర్హుండె భక్తుఁ డగునె
బహుపురాణంబులఁ బరికింపఁ బ్రోడయే
తదుదీరితార్థముల్ తలఁపఁగలఁడె
బహుమతసమ్మతపద్ధతి వ్రాయు నే
యంతటిశక్తి యీయల్పమతికి

నున్నదే తెలిసిన దొగి నిర్భయమ్ముగ
వ్రాయఁగలాఁడె యెవ్వరిమనంబు
తే. నొచ్చునో యని జంకక యిచ్చదనరఁ
బలుకఁగలవాఁడె యని సుంత తలఁప కర్థి
ధన మొసంగినపుణ్యాత్ములను గృపాబ్ధి
రాధికేశుఁడు ప్రోచుతఁ బ్రమద మెసఁగ.

చ. సిరుల నొసంగి సంతతిని జేకుఱఁజేసి పరేశు సంస్మృపం
కరుహాము లాశ్రయించి బ్రదుకందగుబుద్ధి నొసంగి సద్యశ
స్స్ఫురణము మించఁగూర్చి పరిశుద్ధమనంబు నొసంగి పోషణో
త్కరమును గాచుఁగాత సతతంబును గంజదళాక్షుఁ డర్థిమై.

ఇట్లు విన్నవించు సాధుజనపాదసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# కృతిసమర్పణోత్సవము.

మహాశయులారా!

శ్రీ కృష్ణావతారతత్త్వము పండ్రెండవప్రకరణము ముద్రింపఁబడఁగనే కృతిసమర్పణోత్సవము సాగింప నంతరంగము త్వరపడసాగెను. ఈశ్వరానుగ్రహమునను బెద్దలయాశీఃప్రభావమునను గ్రంథము నేయంతరాయములులేక కొనసాగింపఁ గల్గితిని. నాయుత్సాహమును యథాపూర్వముగాఁ గడపనగర సభ్యులకుఁ దెలుపనోచితిని. అందును మ-రా-శ్రీ కురుడి గుండూరావుగారును, విరూరు పిచ్చయ్యగారును, కొమూరు శ్రీనివాసరావుగారును, బి. పి. దేవరాజులునాయఁడుగారును నావిజ్ఞప్తిని దోలుత నాలకించి యంగీకరించినవారని విన్నవించువాఁడను. వారును దక్కుంగలన్యాయవాదులను వైశ్యరత్నములను గొందఱిఁగూడి యాలోచించి కార్యనిర్వాహకసభ గావించిరి. మ-రా-శ్రీ, కే. లక్ష్మణరావుగారు (న్యాయవాదులు), ఆర్కాటుపరశురామరావుగారు (న్యాయవాదులు), పుల్లూర శేషయ్యశ్రేష్ఠిగారు (పురపాలకసంఘాధిపతులు), భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు నను నీతొమ్మండుగురు కార్యనిర్వాహకసభ్యులుగా నేర్పడిరి. వీరెల్లరాలోచించి యీసభ సాగుటకు శ్రీజయంతియే శుభదినమని (18-8-1930) నిర్ణయించిరి. ప్రారంభోత్సవ

మానాఁడే సాగియుండెను. ఆమహాసభకుఁ దిరుపతినగరవాసు
లును, సంస్కృతాంధ్రాంగ్లేయభాషావిశారదులును విశ్రాంతి
గొన్నన్యాయవాదులును సంస్కృతాంధ్రభాషాకవిత్వవిశారదు
లును బహుగ్రంథవిమర్శకులును ముక్కుతిమ్మనార్యునిముద్దు
కృతినిఁ బరిమళోల్లాసమవ్యాఖ్యచే సింగారించినవారునగు
మ-రా-శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య బీ. ఏ., గారు తగిన
వారని నిర్ణయించి వారికిం దెలుపఁగా వా రత్యంతాదరమ్మున
నంగీకరించిరి. అనారోగ్యవంతులుగనున్నను సుహృదయుల
యానతి యుల్లంఘింపరానిదిగాన నంగీకరించితిమని వారు లిఖిం
చిరఁట. కాలము సుఖదాయకముగాకున్నను ద్రవ్యము సేకరిం
చుట మహాకష్టకార్యమేయైనను లెక్కింపక నిజౌదార్యమునే
ప్రకటించుచు నుచితరీతి ద్రవ్యముంగూర్చిరి. కొందఱు పండి
తులు విజయము చేసిరి.

దేవునికడపలో వేంచేసియుండు శ్రీవేంకటేశ్వరస్వా
ములదివ్యసన్నిధి నందందు గ్రంథభాగము పఠింపఁబడియె.
సోమవార ముదయమే సభ యారంభమయ్యెను. మ-రా-శ్రీ
విరూరు పిచ్చయ్య, బి.ఏ., గారు స్వాగతోపన్యాస మొసంగిరి.
అగ్రాసనాధిపతిగారు మ-రా-శ్రీ, నాగపూడి కుప్పుసామయ్య,
బి. ఏ., గారు శ్రీకృష్ణావతారమునుగూర్చి చక్కఁగా నుపన్య
సించిరి. వేదాంతశిరోమణులు బళ్లారి మ్యునిసిపల్ హైస్కూలు
సంస్కృతపండితులు బ్రహ్మశ్రీ, కొరటమద్ది వేంకటరామ
శా లుగారు పురాణముల నాంధ్రభాషలోనికిం బరివర్తనము
చెయుటావశ్యకమనువిషయమును గుఱించియు, కావ్యతీర్థులు,

బళ్లారి యున్నతపాఠశాలయం దాంధ్రపండితులు బ్రహ్మశ్రీ రావాడ వేంకటరామశాస్త్రులుగారు శ్రీహరిభక్తింగుఱించియు మాటలాడిరి. బ్రహ్మపురాణసభ కధిపతులగు కవిసార్వభౌములు బ్రహ్మశ్రీ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు దుర్వ్యమర్శనములంగూర్చి కవులు జంకక మహాత్ములు రచించినగ్రంథముల సులభశైలిని సలక్షణభాషనాంధ్రీకరించిన లోకోపకారమగునని చక్కఁగాఁ దెలిపిరి. మఱికొందఱు విద్వత్కవులు శ్రీహరిచరితమునుగుఱించి మాటలాడిరి. సభాధిపతులు తమయభిప్రాయమును విశేషించి సభ్యులమనంబు లుల్లసిల్లఁ జక్కఁగా నుపన్యసించిరి పురసౌధమున నిండియుండుసభ్యు లానందపరవశులైరి. శ్రీకృష్ణచరిత్రము పరపావనమైనదనియు దానియందు నెఱసులను వెదకుట వ్యర్థమనియే వారియుపన్యాససారము. మహాకవులు కృతిని దీవించుపద్యములు చదివిరి. కోడూరునుండివచ్చినట్టియు గాండ్లకులమున జన్మించినట్టియుఁ గవిత్వము చక్కఁగా జెప్ప నభ్యసించినట్టియు శ్రీయుత నారు నాగన్నగా రనువిషయము విశేషానంద మొసంగునది. వీరు చక్కఁగా నాంధ్రగ్రంథములఁ బఠించి యందు సాహిత్య మలవఱచుకొనిరి. వీరు పద్యములు చదువునపుడు సభ్యులు కరతాళములమూలమునఁ దమసమ్మోదమును దెలిపిరి.

పండితులపద్యములన్నియు బ్రహ్మపురాణమున ముద్రింపఁబడును. ఇట్టు లీకృతిసమర్పణోత్సవము చక్కఁగా సాగించిన కడపనగరవాసులు భాషాభిమానులు, ఆశ్రితపక్షపాతులు భగ

వంతునికరుణకుంబాత్రులై యాచంద్రతారకములగు యశః కీర్తులంగాంచి వర్ధిల్లుదురుగాక. పరాత్పరుఁడు రాధామాధవుఁ డీకృతిసమర్పణోత్సవకార్యధురంధరుల కాయురారోగ్యభాగ్యములం బ్రసాదించుఁగాక.

ఇట్లు విన్నవించు సజ్జనభక్తుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

శ్రీపరమేశ్వరుని లీలావినోదంబగు నీప్రపంచంబున నాదికాలంబునుండి జీవకోటులు తదీయసంకల్పానురూపంబుగఁ గర్మప్రవాహంబునం జిక్కువడి జననమరణాదిరూపసంసృతిం బొరయుచుఁ బ్రవర్తించుచునికి యెల్లరు నెఱింగినయదియే. కర్మంబులు పుణ్యపాపమిశ్రంబులని ముత్తెఱంగులు. కేవల పుణ్యకర్మాచరణంబున దేవజన్మంబును, కేవలపాపకర్మాచరణంబున మృగపశ్వాదిజన్మంబును, మిశ్రకర్మాచరణంబున మనుష్యజన్మంబును జీవులు పొందుదురనియు వానిలోను బుణ్యకర్మబాహుళ్యంబున బ్రాహ్మణాద్యుత్తమ జన్మంబులు గలిగెడుననియు మనశాస్త్రంబులు నుడువుచున్నవి. ఈభూమండలంబున వసించు నిఖిలజంతుకోటులలో మనుష్యులే యుత్తములు. మనుజులజీవనమునకు ముఖ్యప్రయోజనములగు పురుషార్థములు ధర్మార్థకామమోక్షము లనునాలుగు. ఈపురుషార్థములను బడయుటకై మనుజులు ప్రయత్నింపవలయుఁ గాని యూరక జీవయాత్ర నడపుటయే పురుషార్థము గానేరదు. అది పశుపక్ష్యాదులకును సాధారణమగుటచే మనుష్యజన్మమున కయ్యది పురుషార్థములలోఁ జేరినదనుట భగవత్సంకల్పము కానోపదని తెల్లంబయ్యెడు. పైకనిన నాలుగుపురుషార్థములలో నర్థకామంబులకంటెను ధర్మమోక్షములే ప్రశస్తములు. ఈరెంటిలోను మోక్షమే యుత్తమోత్తమము. అదియే నిశ్శ్రేయస మనంబడు కావుననే మనుష్యజన్మము దుర్ల

భమనియు మోక్షప్రాప్తికై మానవులు ప్రయత్నింపవలయు ననియు శ్రీశంకరభగవత్పాదాచార్యులు.

> "జంతూనాం నరజన్మదుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా,
> తస్మాద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరం.
> స్వాత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనాసంస్థితిః,
> ముక్తిర్నో శతజన్మకోటి సుకృతైః పుణ్యైర్వినాలభ్యతే."

అని వివేకచూడామణియందుఁ జెప్పియున్నారు.

సత్కర్మములు సలుపుటవలనఁ బుణ్యము కలుగును. ధర్మాచరణము చిత్తశుద్ధి యొదవించి మోక్షమునకుఁ బరంపరా సాధనం బగును. అర్థకామంబులు ధర్మమున కవిరుద్ధముగ ననుకూలముగ నుండునటులు పాటింపవలయు. వేదములును మన్వాదిస్మృతులును రామాయణభారతాది పురాణేతిహాసంబులును నీపురుషార్థచతుష్టయంబును బడసి సుఖించుటకై మనుజులు కాలానుగుణంబుగాను వర్ణాశ్రమానురోధంబుగను ననుష్ఠింపవలయు విధులను విపులముగాఁ దెలుపును.

ఇటులున్నను మానవుల కీశ్వరుఁ డొసంగియున్న స్వేచ్ఛంబట్టి యపరిణతబుద్ధులగుటచేఁ బెక్కండ్రు ధర్మేతరంబులగు కర్మంబులు సలుపుచు నితరులకుఁ గష్టం బొదవించుచుఁ దామును దుఃఖంబులపాలగుచు నాకులంబంద లోకంబును జీకాకుపఱతురు. అమ్మెయి లోకోపద్రవముసేయువా రత్యంత బలిష్ఠులై యుత్కటంబులగు దారుణకృత్యంబులు సేయుచు జనాసాధ్యులై యుందురేని యుచితసమయంబులందు భగవండగు శ్రీహరి మానవాదిరూపంబుల నవతరించి

యూలోకకంటకులను సంహరించి ప్రజలకు క్షేమంబు గావిం చుచుండు పూర్వయుగంబులందు హిరణ్యాక్షహిరణ్యకశిపు లును రావణాదులును భీకరులై లోకంబునకుఁ గీడొనరించు చుండ భగవంతుఁడు వరాహనరసింహ రామాద్యవతారంబులు దాల్చి వారిని రూపుమాపి లోకభయంబుఁ బాపి సాధుజన రక్షణం బొనర్చెను. అట్టులే లోకంబున ధర్మములు లోపించి యధర్మములు ప్రబలినపుడును బరమేశ్వరుఁడు పుడమిపై నవ తరించి ధర్మమును స్థాపించును.

ఈయంశమునే శ్రీకృష్ణుఁడు భగవద్గీతలో.

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అని వచియించెను.

భగవంతుఁడు భూలోకంబున నవతరించుటకు దుష్టజన నిగ్రహంబును శిష్టజనరక్షణంబును ధర్మసంస్థాపంబును నను నివియే హేతువులు. సర్వశక్తిమంతుండగునీశ్వరుండు సంకల్ప మాత్రమున దుష్టశిక్షణ శిష్టరక్షణము లొనరించి ధర్మసంస్థాపన ముచేయరాదా పుడమిపై మనుష్యాదిరూపములనవతరింప నేల యని యడిగిన దానికుత్తరమీశ్వరుఁడే చెప్పనోపుఁగాని యిత రుల కలవిగాదు. నృపాలు రొకనాఁడు గజాధిరూఢులై వేఁట కుంబోవుదురు. ఒకనాఁడు తురగం బధిరోహించి వాహ్యాళి

వెడలుదురు. ఒండొకనాఁడు రథారోహణంబు గావించి సంచ రింతురు. ఒకనాఁడు చదరంగమాడుచుఁ బ్రొద్దుపుత్తురు ఒక్కొకనాఁ డొక్కొకరీతిని వస్త్రాభరణంబులఁ దము నలంకరించుకొందురు. ఒకనాఁ డుద్యానవనవిహారంబు సేయుదురు. వీనికిఁ గారణము లేమని చెప్పనగు. అవి మహీపతుల లీలావినోదములనియేకదా చెప్పవలయు. అప్పగిదినే భగవంతుఁడు సలుపు కృత్యములును లీలావినోదములనియే చెప్పవలయు.

భగవంతుఁడగు పరమేశ్వరుఁడెట్టివాఁడు? వేదాంతములును దదీయస్వరూపంబును దన్మహిమంబులును నిరూపింప నోపవనిన సామాన్యుల కెఱుంగఁదరమా? నిర్గుణంబగు బ్రహ్మ మొక్కటియే సత్యము. అది స్వకీయమాయాశక్తిచే సత్త్వరజస్తమోగుణవిశిష్టమగు సగుణమై జగత్సృష్టిస్థితిసంహారకార్యంబులు సలుపుచు బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనంబరఁగుచుండు. ఈత్రిమూర్తులలో దుష్టనిగ్రహాదికార్యంబులు సలుపుటకై కొన్నిసమయములలో శివుఁడు నుద్యమించుట కలదు. కాని మహీతలంబున మనుష్యాదిరూపంబున నవతరించునని పురాణాదులలోఁ జెప్పబడియున్నట్లు కానము. సముద్రమథనసమయంబునఁ బుట్టినహాలాహలంబు జగంబులను దహింపఁజొచ్చిన హరిహరబ్రహ్మాదులును భయంబంది తన్నుఁ బ్రార్థింప శంభుఁ డాగరళమును మ్రింగి లోకములను రక్షించెను. యముని రూపుమాపి మార్కండేయుని గాపాడెను. వేదములోఁ జెప్పఁబడిన చందంబున త్రిపురాసురులను సంహరించి దేవతలకు హితము గావించెను. ఇట్టి మహాత్తమదారుణకృత్యంబులు కొన్నింటిని దుసలిపెను. కానియమ్మహాదేవుఁడుభూతలంబున మానుషా

ద్యవతారంబులు చేయఁడయ్యె. విష్ణుం డట్లు కాక దుష్టనిగ్రహం బుసేయను ధర్మసంస్థాపనంబొనర్పను నవనితలంబున మానుషా ద్యవతారము లెత్తెను. అద్దేవుని యవతారము లిర్వదింటిని భాగవతము చెప్పుచున్నది. వానిలో మత్స్యకూర్మవరాహాది దశావతారములు సుప్రసిద్ధములు. వానిలో మొదటి యేనవ తారము లోకోపకారార్యమునకై కావింపఁబడినవి. సోమకా సురునిఁజంపి వేదముల నుద్ధరింపను మత్స్యావతారమును, సముద్రమథనకాలమున మంథరనగమున కాధారమై యుండు టకై కూర్మావతారమును హిరణ్యాక్షవధంబునకై వరాహావ తారంబును హిరణ్యకశిపుసంహారంబునకై నృసింహావతార మును బలిదానవేంద్రు నణంప వామనావతారంబును గావింపఁ బడినవి. క్షత్రియకులనాశనము సేయఁ బరశురామావతారం బును భ్రాతృపుత్రామాత్యయుతంబుగా రావణుని సంహరింప రామావతారంబును ప్రలంబాసురాదులను బరిమార్ప బల రామావతారంబును గావింపఁబడినవి.

ఇఁకఁ గృష్ణావతారముంగూర్చి చర్చింపవలసియున్నది. బలరామకృష్ణు లిరువురు నొకే యవతారమనియు బుద్ధుఁడే తొమ్మిదవయవతారమనియు నొకమతము గలదు. బలరామ కృష్ణులు భిన్నావతారములనియు బుద్ధుఁడవతారములలోఁ జేరినవాఁడు కాఁడనియు వేఱొకమతము గలదు. బుద్ధునినొక యవతారముగా లెక్కించినచో నాబుద్ధుఁడు మాయాదేవికిని శుద్ధోదనునకును బుట్టి బౌద్ధమతమును (Buddhisam) స్థాపిం చిన బుద్ధగౌతముఁడా? అటు కాకున్న వేఱొకఁడా యని యొక

వాదము గలదు. దానినంతయు విమర్శింపఁబూనుట యిచట నప్రసక్తము.

కృష్ణావతారమునకు హేతువు లనేకములు గన్పట్టు చున్నవి. పూతనారిష్ట కేశి చాణూర కంసాదిదైత్యు లసంఖ్యా యులు భూమియందుఁ బ్రబలి ప్రజాహింసచేయుచుండఁగా వారింజంపి భూభార ముడుపుట యొకటి. కౌరవు లధర్మపరులై పాండవులకుఁ గీడుచేసినఁ బాండవులకు సాహాయ్యముచేసి వారిని రక్షించుట యొకటి. ద్రౌపదీమానరక్షణ పరీక్షిత్ప్రాణ రక్షణాదు లొనరించి భగవంతుఁడు శరణాగతులగు ధర్మ పరులఁ గాచుచుండునని లోకంబున కెఱింగించుట యొండొ కటి. అర్జుననినిమిత్తముగాఁ గొని వానికి దత్త్వోపదేశము సేయునెపంబున లోకమునకు శాశ్వతముగాఁ దత్త్వోపదేశము సేయుట మఱియొకటి. తొల్లి నరనారాయణులు బదరికాశ్రమ మునందుఁ దపస్సుచేయుచుండఁగా దేవేంద్రప్రేరితలై రంభాది సురవారాంగనలువచ్చి నారాయణునిం జూచి మోహితలై రతి సుఖంబుఁగోరిన నారాయణుఁ డిప్పుడు దానికి సమయముకాదు ......(రెండవప్రకరణము 163-164) నేను గృష్ణావతార మెత్తునపుడు మీరారు ధాత్రీతలంబున నంగనలై జనియింపఁగల వారు. అప్పు డేను మీకోర్కి దీర్తునని యానతిచ్చినమాటను నెఱవేర్చుట యింకొకటి. బ్రాహ్మణమాహాత్మ్యమును స్వానుష్ఠా నంబుచే లోకులకుఁ దెలుపుటయొకటి. ఇట్లనేక కార్యములకై వి ఁడుభూమిపైఁ గృష్ణుడుగా నవతరించి తాను సంకల్పించిన కార ములు నన్నింటిని సలిపి కృతకృత్యుఁ డయ్యెను. ఇతరావ తారము లంశావతారములనియుఁ గృష్ణావతారము పూర్ణావ

తారమనియుఁ బురాణములు దెలిపెడు. "ఏతేం శాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాం త్స్వయమ్." అని భాగవతమునఁ జెప్పఁబడియున్నది. అటులున్నను విష్ణుపురాణమున నతఁడు తన యంశంబునఁ గృష్ణుఁడుగా నవతరించెనని యున్నది.

> "చకార యాని కర్మాణి భగవాక్ పురుషోత్తమః,
> అంశాంశేనావతీర్యోర్వ్యాం తత్ర తాని మునే వద." అని.

అట్టి కృష్ణావతారముయొక్క తత్త్వమును విపులముగా నాంధ్రలోకమునకుఁ దెలుపఁబూని కడపపురంబున నివసించు కావ్యస్మృతితీర్థ బిరుదాంచితులును, ఆంధ్ర శ్రీమద్రామాయణ బ్రహ్మాండపురాణలలితోపాఖ్యాన బ్రహ్మపురాణా ద్యనేకాంధ్ర గ్రంథనిబంధనధురీణులును నస్మన్మిత్రులును నగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు శ్రీకృష్ణావతార మనుపేర నీయుద్గ్రంథమును వ్రాసిరి. ఇది ద్వాదశప్రకరణములుగా విభక్తమై యున్నది. ఒక్కొక్క ప్రకరణ మొకసంపుటముగా ముద్రింపఁబడినది దీని కొక యవతారికను వ్రాసియిమ్మని శ్రీ శేషాద్రిశర్మగారు గ్రంథముద్రణప్రారంభసమయముననే నన్నభ్యర్థింప నేనియ్యకొని దీనిని వ్రాయఁదొడంగితి.

శ్రీకృష్ణునిలీలలును మాహాత్మ్యములను వివరించు నీ గొప్పగ్రంథమును వ్రాయుట కాధారములుగా బ్రహ్మపురాణము, బ్రహ్మాండపురాణము, బ్రహ్మవైవర్తము, విష్ణుపురాణము భాగవతము, దేవీభాగవతము, హరివంశము, మహాభారతము అనువీనిం బ్రధానములుగాఁ గైకొన్నట్లు గ్రంథకర్తగారు చెప్పియున్నారు. (ప్ర 1. పు. 50.) ఇన్నిపురాణములలోను

గ్రంథకర్తగారు బ్రహ్మవైవర్తపురాణములో నిరూపింపఁబడిన వానిం బ్రధానముగా స్వీకరించినట్లు తెలియవచ్చెడు. ఆపురాణములోని శ్రీకృష్ణజన్మఖండమునుండి యీ క్రిందవివరింపఁ బడు కథలను గైకొని వానికిఁ బ్రాశస్త్య మిచ్చియున్నారు.

"ద్వాపరయుగాంతమున భూమండలమున ధర్మము క్షీణించి యధర్మము ప్రబలమై దుష్టులసంఖ్యయధికమయ్యెను. దానిచే భూభార మధికముకాఁగా భూదేవి ఖిన్నయై పంకజాసనుపాలికిఁ జని తనదుఃఖములం జెప్పుకొనిన నతండు కైలాసమున కాదేవిని దోడ్కొనిపోయి యందుఁ బంచముఖంబుల శ్రీకృష్ణమంత్రంబు జపించుచున్న శంకరుంగాంచి తమువచ్చిన వృత్తాంతంబు విన్నవింప నతఁ డాదేవిని నూఱడించి పంపి తానును విరించియు ధర్మునిం దోడ్కొని వైకుంఠలోకమున కుంబోయి శ్రీమహావిష్ణువుం గాంచిన నతండు వానితో నిట్లనియె. "మీవచ్చినకార్యం బెరుంగుదు. మీరిపుడు గోలోకమున కరుగుఁడు. నేనును లక్ష్మీసహితుఁడనై యచ్చటి కరుదెంతు. శ్వేతద్వీపనివాసులగు నరనారాయణులు సరస్వతియు యోగమాయ యనంబరఁగు మదీయశక్తియు ననంతుఁడును గణేశ్వరకార్తికేయులును సకలవేదమాతయగు శ్రీసావిత్రియు నావెంట నరుదెంతురు. నేనే యాగోలోకంబున భుజద్వయవిరాజితుండనై రాధాగోపికాళింగూడి శ్రీకృష్ణుండనై యొప్పుచుందును. ఈవైకుంఠమున నాల్గుబాహువు లలరార లక్ష్మీయుతుండనై భక్తశ్రేణి సేవింప విష్ణునామంబున నుండుడు.

శ్వేతద్వీపంబున నారాయణాహ్వయంబున నరుంగూడియుం డుదు. ఈమూండుస్థానంబుల నుండువాండ నేనేకాని వేఱొ కరులేరని యెఱుంగందగు. నాయీయానతింగొని గోలోకం బున కరిగిన నట మీావాంఛితంబులు సిద్ధించును.”

అనిచెప్పిన ధర్మ విరించి శంకరులు మనోవేగంబున గోలోకంబునకుంబోయి యందలివిశేషములం గాంచి యబ్బురం బందుచు శ్రీకృష్ణుని దివ్యమందిరాంతరమున కరిగి యం దనేక కోటిసంఖ్యాకులగు గోపీగోపకులు పరివేష్టించియుండు నొక సింహాసనముపై నున్నయొక యద్భుతంబగు తేజోరాశిం గాం చిరి. అంత విధాత శ్రీకృష్ణుని ననేకవిధంబుల వినుతింప నద్దే వుండు నిజప్రాణవల్లభయగు రాధాదేవితోఁ బ్రత్యక్షుండై మీారు వచ్చినపని మున్నే యెఱుంగుదు. మేమిరువురమును మీా వెంట నరుదెంచి ధాత్రిపై నవతరింతుము. మీా రుద్వే గము మాని మీామీా నిలయంబులకుఁ బొండని యానతిచ్చి పంపి గోపీగోపకులం జూచి మీారెల్లరు భూలోకంబున నంద వ్రజంబునఁ బుట్టుండు. మేమును నవతరింతుమని చెప్పి రాధం జూచి నీవు ధరణిపై వృషభాను నింట నవతరింపుము నేనును బాలకృష్ణరూపంబున నందవ్రజంబునఁ బుట్టి నిన్నుం బరిగ్రహిం చెద. అచట మనము సుఖంబుండువార మనిన రాధ వల్లే యనియె. అంత నచ్చోటికి వైకుంఠవాసియగు నారాయ ణుండు వామభాగంబున సరస్వతీదేవియు దక్షిణభాగంబున లక్ష్మీదేవియుఁ దనరార వచ్చి యాశ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహంబున విలీనుండయ్యెను. వెనువెంటనే శ్వేతద్వీపనివాసి

యగు * శ్రీమహావిష్ణువు సను దెంచి శ్రీకృష్ణపరమాత్మ యందు నేకత్వముం బొందెను. పిదప యోగమాయ (మూలప్రకృతి యనంబడు పార్వతి) శ్రీకృష్ణుని చెంతకువచ్చిన నతం డామెను యశోదా దేవికిని నందునకును బుత్త్రికగా జన్మింప నియోగించి లక్ష్మిని విదర్భదేశపతియగు భీష్మకునకుఁ దనయగా జనింపఁ బంచి మఱియు స్కాంధాదులను భూతలంబున నవతరింప నియమించె.

అంత రాధాదేవి తనభర్తనెడఁబాయఁజాలక యుచ్చైర్ధ్వని నాదంబున రోదనముగావింప నద్దేవుఁ డాసతికి యోగము నుపదేశించి యూరార్చి తనకును రాధకును నూఱుసంవత్సరములు. వియోగము గలుగునట్లు శ్రీదాముఁడు శపించుట యెఱింగించి యావియోగమును సైరించియుండుము. ప్రతిదినను రాత్రియందు స్వప్నంబున నీకు దర్శనం బొసంగెద నని పలికె.

ఇచ్చట శ్రీదాముఁడు శపించుటకుఁ గారణము వివరింపఁబడును. శ్రీకృష్ణుఁ డొకనాఁడు రాధాదేవికిఁ దెలియకుండఁ దనప్రాణాధికురాలగు విరజ యను నొకగోపికమందిరంబునకుఁ బోయి యాచేడియతోడఁ గ్రీడించుచుండె. అది యెఱింగి. రాధాసతి క్రోధావిష్టయయ్యె. రాధక్రోధం బెఱింగి భీతుఁడై శ్రీకృష్ణుఁ డంతర్ధానముఁజెందెను. విరజ యపుడుఁ గడుభయంబున విగతజీవయై నదీరూపమునం బ్రవహించెను. రాధ వారిం.

* ఇట్లు పూర్వోక్తమునకు వ్యత్యస్తముగా నీగ్రంథములో నున్నది. ఆభేదమును సూచించుటకై యిట్లు గ్రంథకర్తగారు వ్రాసియుండవచ్చునని తోఁచెడి.

గానక తనయింటికిఁబోవ శ్రీకృష్ణుఁ డానదీతీరంబున నిలిపి విరహార్తుఁడై బిగ్గఱగా నేడ్చుచు నాప్రియతమా! నాయాశీఃప్రభావమున నీవు సురూపధారిణివై నాముందు రమ్మాయని పిలువ నచ్చెలువ నిజరూపంబునఁ బ్రత్యక్షమయ్యె. శ్రీకృష్ణుఁడు ప్రేమార్ద్రభావంబున నాయంగన నాలింగనమొనరించి ముద్దాడిన నమ్ముద్దియ గర్భంబుదాల్చి యేడ్వురుకొడుకులం గనియె. వారలు తల్లిశాపంబున సప్తసముద్రములైరి.

* ఇట్లు తనకాంతుఁ డన్యకాంతతోడిపొత్తునఁ జిత్తజాయత్తచిత్తుఁడై సుఖించుట కోర్వక రాధాసతి యసూయ చెంది కోపాగారంబున శయనించియుండ నతం డందుల కరుదెంచి యనునయింపఁబూనియు నల్లనయు నుపశమిల్లక పరుసములాడి చెలికత్తియలఁ గాంచి యతని నవలఁబంప నియమింప వారును సాంత్వనవచనంబులు పలుకుచుండ శ్రీదాముఁడు రాధాదేవితో నిట్లనియె. పరాత్పరుండగు శ్రీకృష్ణుని నిట్లు తూలనాడఁదగునే. హరిహరవిరించుల నతని వినుతించుచుండ నీ వజ్ఞానంబున నతని దూషించెదవు. అనిన రాధ యధికరోషపరవశయై నీ వసురుండవు గమ్మని శపించిన శ్రీదాముండు నీవు మనుజయోనిం బుట్టుము. నీకును నీభర్తకును శతవర్షంబులు వియోగము గలుగునుగాక యని రాధను శపించె. ఆశాపవశంబున శ్రీదాముఁడు మర్త్యలోకంబున శంఖచూడుండను పేరు వహించి తులసీపతి యయ్యెను. ఇచటఁ దులసీ

---

*ఈకథ పారిజాతపుష్పనిమిత్తమై సత్యభామకృష్ణులకు జరిగినకలహము పగిదిం గానంబడుచున్నది.

వృత్తాంత మతివిపులముగాఁ జెప్పఁబడినది ఇందుఁ బ్రసంగ వశంబున లక్ష్మీగంగాసరస్వతులకుఁ బరస్పరకలహంబు లోదవి వార లొండొరుల శపించుకొను గాథ వివరింపఁబడినది.

"శ్రీగోపాలకృష్ణమూర్తి భూలోకమునకు నవతరించు టకుముందే రాధాదేవి బృందావనమున నవతరించె." (3-78) ఆ దేవికి నందుఁడు శిశురూపుఁడగు శ్రీకృష్ణుని నొసంగుటయు (3-84) రాధ యతనిని వక్షమున నిడుకొని కౌఁగిటఁ జేర్చి ముద్దాడి రాసమండలమును స్మరింప (3-85) నది దృగ్గోచర మగుడు నందుఁ జొచ్చి యందు శ్యామసుందరుఁడగు బాలునిం గాంచుటయు నింతలోఁ దనయురమ్మునసుండిన శిశువు గాన రాక యాబాలకుఁడు నవయౌవనశోభితుఁ డగుటయు నతనిం గాంచి రాధాదేవి కామమోహితురాలయ్యెను. (3-87) ఆ సతితో నతఁడు నెయ్యపుమాటలు పలికి తామిరువురు బీజశక్తి స్వరూపులనియుఁ దమకిరువురికి భేదము లేదనియుఁ దెలిపి భేద ముగలదని తలఁచు "నరాధముఁడు కాలసూత్రమను నరక మందు రవిచంద్రు లుండుదాఁక నివసించుటయకాక తనకంటె ముందున్న కులజుల నేడ్వురను ముందుఁ బుట్టఁబోవువారి నేడ్వు రను బాపపంకమునఁ బడఁద్రోసి కోటిజన్మార్జితపుణ్యమును బోఁగొట్టు" ననియుఁ జెప్పెను. (3-89) వా రిట్లు సరససల్లాప ములు సేయుచుండఁగా బ్రహ్మ యచ్చటికివచ్చి రాధను వినుతించి (3-92-95) వారిరువురికిని హోమపురస్సరముగాఁ బెండ్లి కావించుటయు (3-98) నానూత్నదంపతులు యథేష్టముగాఁ సుమాస్త్రలీలలం దేలిరి (3-100-101) ఇట్లు క్రీడించిన పి - తరము శ్రీకృష్ణుఁడు తొంటియట్ల శిశురూపధారియై

రోదనముసేయ రాధ విరహార్తయై క్రిందఁబడి విలపింప (3-102) నామెను నశరీరవాణి యూరార్చె. (3-102) ఇట్టివిచిత్రములగు నుపాఖ్యానము లిందనేకములు గలవు. ఈగాథలు చదువువారి కాశ్చర్యములుగాఁ దోఁచును. వీనింజదువునపుడు జనులకు శంకలు గలుగనోపుననియు "శ్రీకృష్ణుడు పరాత్పరుఁడన్న మాటను మాత్రము మఱువకుండుమేని యన్ని శంకలు నశించు"ననియు గ్రంథకర్తగారు సమాధానము చెప్పి యున్నారు. (3-104, 108)

ఈగ్రంథమునందలి ముఖ్యసిద్ధాంతము లీక్రింద వివరింపబడుచున్నవి.

శ్రీకృష్ణుఁడే పరమాత్మ రాధాదేవియే పరదేవత (1-21) ఆమెయే మూలప్రకృతి శక్తిస్వరూపిణి. యోగమాయ. (1-72) శక్తియైన యోగమాయ యనఁ బరమాత్మయొక్క యిచ్ఛయే. ఆమెయే హరిహరవిరించులనిర్మించె లక్ష్మీపార్వతీసరస్వతు లామె యపరస్వరూపలే (1-106) రాధయే యానామమున నొప్పుచుండు. (1-124) బ్రహ్మశంకరానంతధర్మాదులు నామెయే (1-124,2-192) వారలే ప్రపంచధర్మములను నడుపుదురు. వైకుంఠవాసి యగువిష్ణుఁడును శ్వేతద్వీపనివాసియగు నారాయణుఁడును శ్రీకృష్ణునికంటె నన్యులుగాఁ గానంబడుచున్నను వాస్తవముగా వారు భిన్నులుగారు (1-73) భక్తులతని నేయే రూపముల ధ్యానించిన నాయారూపముల వారికి దర్శన మిచ్చును. (1-104) యోగమాయ మూలప్రకృతియే ఆమెయే పార్వతీరూపిణి. (1-105-106) రాధాసతితోఁ గూడియుండని

సమయమున నాపరమాత్మను గృష్ణుఁ డందురు. ఆదేవితోఁగూడి యుండుతఱి నతఁడు శ్రీకృష్ణుఁ డనంబడును. ఇట్లున్నను వారి ర్వురు నొకరే వారికి భేదములేదు. (3-89; 3-111) శక్త్యుపాసనము నరులకావశ్యకము అన్నిమతములవారును శక్తి నుపాసించువారలే శక్త్యుపాసనము చేయనివారు లేరు. (8-36) భగవంతుఁ డనేకనామరూపములతో విలసిల్లు. ఎట్లుపాసించినను నీశ్వరారాధనమే యగును.

వైకుంఠవాసియగు విష్ణువుకన్న వేఱుగా శ్రీకృష్ణపరమాత్మ గోలోకమున వేంచేసియున్నాఁడు. (1-29) ఆదేవదేవుఁడే విష్ణువుకంటె నధికుఁడు. (1-35) అయినను నతఁడును నారాయణమూర్తియు నొకఁడే. (1-35)

ఈసిద్ధాంతమువలన సామాన్యజనులకు సందేహము లధికములు కావచ్చును బ్రహ్మావిష్ణుమహేశ్వరులను త్రిమూర్తులనే తక్కినప్రసిద్ధపురాణములు పేర్కొనుచున్నవి. వానివలననే విష్ణుశంకరులలో నెవ్వఁ డధికుఁడని జనులు కలహించుకొనుచుండఁగా నిక్కడ విష్ణు వొకఁడు నారాయణుఁ డొకఁడు వీరికంటెఁ బరముఁడగు గోలోకవాసియగు రాధాదేవీయుతుండగు శ్రీకృష్ణుడొకఁడునుగా విష్ణువే త్రిమూర్తులలో నొప్పు ననుటచే జనుల కింకను శంక లుదయించి కలహములు ప్రబలుట కాకరమగునేమో యని తోఁచుచున్నది. అయినను దీనికిఁ బరిహారమును గ్రంథకర్తగారే తెలిపియున్నారు.

ఇట్లు గ్రంథకర్తగారు వ్రాసినవిషయములు బ్రహ్మవైవర్తపురాణమునుండి గైకొనఁబడినవని వారే వ్రాసియున్నారు.

కాని రాధాదేవియే పరదేవతయై యామె బృందావనమున నవతరించి బ్రహ్మచే శ్రీకృష్ణునకు వివాహము కావింపఁబడిన ముఖ్యవృత్తాంతము విష్ణుపురాణము భాగవతము, మహాభారతము, హరివంశము మొదలగు ప్రసిద్ధపురాణములలో దేని యందును నేల చెప్పఁబడియుండలేదో కారణము తెలియ రాకున్నది. ఈపురాణములలో రాధ యనుపేరే లేదు. గోలోక మొకటియున్నదని కాని యందు విష్ణునారాయణమూర్తుల కంటెను భిన్నమూర్తిధరుఁడగు శ్రీకృష్ణపరమాత్మ నివసించు చున్నాఁడనియు నాపురాణములలోఁ గానంబడదు. అన్నిపురాణములును వ్యాసుఁడే వ్రాసియుండఁగా నిట్లు భేదములుగా వ్రాయనేల యనుసందియము లదంతకును గలుగఁగలవు. వానికి గ్రంథకర్తగారు "మాటభేదమేగాని యభిప్రాయభేదములు లేవు. ఒక్కొక్కపురాణమున నొక్కొక్కరీతిగాఁ జెప్పఁబడును. స్వల్పసంశయములను బాటించినచోఁ గాలము వ్యర్థముచేసి నట్లగును గాన వానిని మానుకొనఁదగు" నని సమాధానము చెప్పియున్నాఁడు. (2-98)

ఈపట్టున నించుక విచారము సేయవలసియున్నది. బ్రహ్మవైవర్తపురాణమును నారదునకు సావర్ణి చెప్పినట్లును నందుఁ గృష్ణునిమాహాత్మ్యము రథంతరకల్పవృత్తాంతములును బ్రహ్మవరాహచరిత్రములును జెప్పఁబడియున్నట్లును, మత్స్యపురాణము నుడువుచున్నది.

> "రాథంతరస్య కల్పస్య వృత్తాంత మధికృత్యతు
> సావర్ణినా నారదాయ కృష్ణమాహాత్మ్య ముత్తమమ్

యత్ర బ్రహ్మవరాహస్యచరితం వర్ణ్యతేముహుః
తదష్టాదశసాహస్రం బ్రహ్మవైవర్త ముచ్యతే."
(మత్స్యపురాణము 53 వ అధ్యాయము.)

ఇపుడున్న బ్రహ్మవైవర్తపురాణములో రథంతరకల్ప వృత్తాంతములుగాని బ్రహ్మవరాహచరిత్రముగాని లేవు. అదియునుగాక యది సావర్ణిచే నారదునకు జెప్పబడినట్లును నీపురాణములోఁ గానఁబడదు. కావున నాదిబ్రహ్మవైవర్తపురాణమిదికాదనియు నది నశించిపోయియుండనోపుననియు నిటీవల నెవఁడో యొకకేవలవిష్ణుమతాభిమాని యగుపండితుఁడు శ్రీకృష్ణుని రాధాపతిని స్వకపోలకల్పితులఁ గావించి యతనిని రతిప్రియునిగా వర్ణించి యొక క్రొత్తబ్రహ్మవైవర్తమును వ్రాసెననుట స్పష్టమనియు ధీరేంద్రపాల్ అనుబంగాళాదేశపండితుఁడు "Sri Krishna, His Life and Teachings" అనునాంగ్లేయగ్రంథమునందుఁ బీఠికలో వ్రాసియున్నాఁడు. ఇంకను బురాణములంగూర్చి యతండు చర్చించియున్నాఁడుగాని వానినంతయు నిచ్చటవ్రాయుట యనవసరము. ఆతఁడు సిద్ధాంతము చేసిన ముఖ్యాంశము లేవనఁగా: కృష్ణునిచరిత్రమును విస్తరముగాఁ జెప్పునవి విష్ణుపురాణము, బ్రహ్మపురాణము, భాగవతము, బ్రహ్మవైవర్తము, భారతము, హరివంశము—అనునివి. వీనిలో వ్యాసుఁడు వ్రాసినబ్రహ్మవైవర్తపురాణము నశించినది. ఇప్పు డుండునది నూత్నకల్పితము. వ్యాసకృతము భాగవతమని కొందఱును దేవీభాగవతమని కొందఱును వాదించుచున్నారు. విష్ణుపురాణము పుట్టిన యనేకశతాబ్దములకుఁ బిమ్మట భాగవ

తము పుట్టినది బ్రహ్మపురాణమునందును విష్ణుపురాణమునందును గృష్ణునిచరిత్ర మొకేరీతిగాఁ జెప్పఁబడినది. ఆ రెంటిలోను 26 అధ్యాయము లక్షరభేదముఁ లేక యొక్కచందమున నున్నవి. విష్ణుపురాణము మహాభారతము హరివంశము అనునివియే కృష్ణునిచరిత్రమునకు ముఖ్యాధారములుగాఁ గైకొనఁదగినవి. భాగవతమును గొంతవఱ కాధారముగా స్వీకరింపవచ్చును. అని యావిద్వాంసుని యభిప్రాయము.

ఇట్లు పురాణములంగూర్చి పండితుల కభిప్రాయభేదము లున్నవని తెలిపితింగాని యావిషయమై యిటఁ జర్చింపఁబూనుకొనుట నాకనవసరము. చదువరుల కిష్టమున్నచో నితరగ్రంథములను బరిశీలించి నిర్ణయముచేసికొందురుగాక!

ఈగ్రంథ మింత గొప్పదియగుటకుఁ గారణములు కొన్ని తెలిపెద. ఇందు నానాపురాణవేత్తలగు గ్రంథకర్తగారిచేఁ బ్రసంగానుప్రసంగముగా ననేకము లవాంతరోపాఖ్యానములును గథలును వివరింపఁబడియున్నవి. అవి ముందు సూచింపఁబడును. రాధాకృష్ణులస్తుతులును నింకను బలుస్తోత్రములును నిందు మూలగ్రంథములగు సంస్కృతపురాణములనుండి యెత్తి పూర్ణముగా వ్రాయఁబడియున్నవి. పెక్కుచోటులలో భాగవతపురాణములోనుండి ప్రమాణశ్లోకము లుదహరించుటయేగాక గ్రంథకర్తగారు వానికి సరిగా బమ్మెరపోతనామాత్యుఁడువ్రాసిన యాంధ్రపద్యములను లిఖించి యంతటితో విడువక యాయాంధ్రపద్యములలోఁ గలసారస్యములను నందందు విపులముగాఁ జర్చించియున్నారు. కొన్ని పద్యములు నిర్మూలము

లనిరి. కొన్ని చమత్కారవిలసితములై కరము రసవంతములై యొప్పారెడునని పోతన మహాకవిం బొగడిరి. పారిజాతాపహారణవృత్తాంతమును వ్రాయుచో నందితిమ్మన విరచితమగు పారిజాతాపహరణమహాకావ్యమునుండియనేకపద్యముల నుదాహరించి కొన్నింటిని రసవంతములని శ్లాఘించి యొకకొన్నిపట్టులలో నమ్మహాకవి చేసిన చారిత్రవర్ణన లుచితములుగావని నిరాకరించిరి. ఇట్లు పలుకారణములచే నీగ్రంథము చాల గొప్పది యయ్యెను.

ఈగ్రంథమునం దవాంతరకథలును నుపాఖ్యానములును ననేకములు చెప్పఁబడియున్నవి. ఉదాహరణము లొకకొన్ని చూపెద. తులసీశంఖచూడులవృత్తాంతము (1-147-123) యదువంశచరిత్రము (2-75-100) తుర్వసువంశచరిత్రము (2-101-107) యయాతివంశకథనము (2-75-107) లీలాశుకుని వృత్తాంతము (3-75) ఏకాదశీవ్రతమహిమము (4-150); (5-139) స్వప్నఫలనిరూపణము (6-284) దుస్స్వప్నప్రాయశ్చిత్తములు (6-334) సత్పురుషధర్మములు, పతివ్రతాధర్మములు (6-350) గృహస్థగృహిణీశిష్యాదిధర్మములు (6-35) భక్ష్యాభక్ష్యవస్తునిర్ణయము (6-368) మొదలగునవి. ఈగ్రంథమునందుఁ జెప్పఁబడిన యొక్కొక్కకథనుండి లోకులు గ్రహింపవలసిన రహస్యసారాంశములను దెలియఁదగునీతులను సిద్ధాంతములను గ్రంథకర్తగారు విపులముగా వివరించియుండుట దీనియందలి గొప్పవిశేషము.

ఇం దనేకస్తుతులు పురాణములలో నున్నచందమున వ్రాయఁబడియున్నవి. ఇవి భక్తులు పారాయణము చేసికొనుట

కనుకూలము గానుండును. ఉదాహరణములు బ్రహ్మకృత శ్రీకృష్ణ స్తుతి (1-91-93) దేవకీకృత శ్రీకృష్ణస్తుతి (2-246-248) బ్రహ్మకృత రాధాస్తుతి (3-95,97) 4,239 మార్కండేయకృత హరిహరస్తుతి (10-137) మొదలగునవి.

ప్రథమ ప్రకరణమందుఁ గానంబడు గోలోకవర్ణనము (1-73-75) రాసమండలవర్ణనము (1-75-77) గోపికావర్ణనము (1-77-79) బృందావనవర్ణనము (1-79-80) రాధాదేవీమందిర వర్ణనము (1-84-85) శ్రీకృష్ణమందిరవర్ణనము (1-85-90) రాధాకృష్ణులవివాహము (3-92-101) మొదలగునవి సరసములై యపరిమితానందసంధాయకములై యలరారు.

ఇందలి కొన్ని విషయములు చదువరుల కాశ్చర్యమును గలిగింపకమానవు. విరజ యను గోపికయందుఁ గృష్ణుఁడు కామాసక్తుఁడై యామెతోఁ గ్రీడించు టెఱింగి రాధ వారిరువురిని సామాన్యవనితవలె దూషించుట. (1-133-134) "లక్ష్మియు గంగయు సరస్వతియు శ్రీహరికిఁ బత్ను"లనుట. (1-147) వారు ముగ్వురొండొరులతో సాపత్న్యవైరంబు చేఁ గలహించుచుఁ దిట్టుకొని శపించుకొనుట. (1-147-149) మొదలగునవి.

ఈ కాలమున ననేకు లాస్తికులయ్యును నేదియో యొక మతమునవలంబించి మతాభిమానగ్రస్తులై తమమతమే యితర మతములకంటె శ్రేష్ఠమనియుఁ దక్కినమతము లన్నియు నింద్యములనియుఁ దాము చెప్పెడు దేవతయే పరదైవంబనియు నితరదేవతలు మనపురాణాదులలోఁ జెప్పఁబడియున్నను నుపా

స్యులు కారనియు వారినుపాసించినచో ముక్తిలభింపదనియుఁ
బరిపరివిధముల వాదించుచు దూఱుచుండుట ప్రసిద్ధమే.
కొందఱు విష్ణుభక్తుల మనుకొనువారు విష్ణువే పరదైవ
మనియు, లక్ష్మియే పరదేవతయనియు వారిని సేవింపనియెడల
మనుజులకు సద్గతిలేదనియు శంకరాదులను గొలువరాదనియు
వారిని సేవించిన లాభములేదనియు లోకులకు బోధింతురు.
మఱికొందఱు శివుఁడే పరదైవమనియుఁ బార్వతీదేవియే పర
దేవతయనియు వారలే సకలజనోపాస్యులనియు భుక్తిముక్తి
దాయకులనియుఁ బలుకుచు వీనికిఁ బురాణప్రమాణము లుదా
హరించుచు సిద్ధాంతముసేయుదురు. కొందఱు శక్తియే జగ
త్కారణంబనియు బ్రహ్మ విష్ణు రుద్రులు శక్తికల్పితమూర్తు
లనియు శక్తియే యుపాసింప నర్హురాలనియు సకలాభీష్టము
లును జనులకు శక్తియే యొసంగనోపుననియు వీనికిఁ బురాణ
ప్రమాణోదాహరణములు సూపుచు వాదింతురు. మఱికొంద
ఱాదిత్యుఁడే యుపాస్యుఁడనియు నితరులు గణాధిపతియే
యనియు వచింతురు. ఇవ్విధంబున నాయామతమువారు తమ
తమమతములే యుత్తమములని పలుకుటయకాక యితరమత
ములను విచ్చలవిడి దూషించుచు లోకులను దమకు వశుల
నుగాఁజేయఁ బ్రయత్నింతురు. ఇట్లుచేయుట సరికాదనియు
నిట్టివారు వచించుమాటలు విశ్వాసార్హములు కావనియు
శివుఁడు విష్ణువు, శక్తి మొదలగు నన్నిమూర్తులును బరదే
వతాస్వరూపములే యనియు, నేమూర్తిని నుపాసించినను బర
మేశ్వరునిఁ గొల్చుటయే యగుననియు నీమూర్తులలో భేద
మెంచి పాటించుటయు నొకటి హెచ్చు మఱియొకటి తక్కువ

యని భావించుటయుఁ గేవల మజ్ఞానకల్పితమనియు నొక మూర్తిని నుపాసించువా రితరమూర్తులను ద్వేషించి నిందించుట పాపహేతువనియు నట్టివారు మతపాషండు లనఁబడుదురనియు నీగ్రంథమునందు గ్రంథకర్తగారు పలుమాఱు లుపన్యసించియున్నారు. ఇది సామాన్యజనులకుఁ గలసందేహములను నజ్ఞానములను దొలఁగింపఁ జాలునను టకు సందేహము లేదు. ఈవిషయమును వ్యక్తపఱచుటయు నీగ్రంథమును వ్రాయుటను గ్రంథకర్తగారి ప్రధానోద్దేశమని కానఁబడుచున్నది. కావుననే పునరుక్తిదోషమును లెక్కసేయక యీ విషయము జనులకు లెస్సగాఁ బట్టుపడవలయు నను తలంపున దీని ననేకపర్యాయములు గ్రంథకర్తగారు వ్రాసియున్నారు. ఇది జనులకు వారొనర్చిన పరమోపకారంబని తలంపవలసియున్నది. కాని యీవిషయములను జర్చించుచో మతాంతర ఖండనము సేయునపుడు గ్రంథకర్తగారు నుడివినపరుసములు పరుసములుగా నోపవని తలంతు.

శ్రీకృష్ణునియవతారంబువలనను నతనిదివ్యచరిత్రమువలనను మన మెఱుంగఁదగినముఖ్యాంశములు సంగ్రహముగా వివరింపఁబడుచున్నవి. భగవంతుఁడగు విష్ణువు దుష్టనిగ్రహశిష్టపాలనధర్మస్థాపనములు చేయుటకై శ్రీకృష్ణరూపంబున భూమిపై నవతరించెను.

అతఁడు కావించినయతిమానుష కార్యములవలన శ్రీకృష్ణుఁడు భగవంతుఁడనుటకు సందేహము లేదు. దేవకీదేవిగర్భంబునుండి యతఁ డావిర్భవించినపుడు చతుర్భుజుండును శంఖ

చక్రగదాద్యాయుధధరుండును శ్రీవత్సలాంఛనుండును గౌస్తుభమణివిలసితకంఠుండును బీతాంబరధారియును వైడూర్యకిరీటవిరాజమానుండును జలధరశ్యామసుందరుండును నై పుట్టెను. పసిబాలుఁడుగా నున్నప్పుడే పూతన యనురాక్షసిని జనుఁబ్రాలుద్రావు నెపంబునఁ జంపెను. శకటాసురతృణావర్తప్రముఖదైత్యులం బరిమార్చెను. మన్ను దినెనని యశోద యదలింప నేను దినలేదమ్మా చూడు మని నోరుదెఱచి చూపి సర్వప్రపంచంబులును దనయందున్నవని విశ్వరూపంబుఁ గాన్పించె. యమళార్జునభంజనము గావించె. వత్సాసురబకాఘాసురులం గొనియె. అప్పు డతని కైదేండ్లప్రాయము. *

పరీక్షార్థము బ్రహ్మ గోవత్సములను గోపకులను నంతర్ధానము చేసినఁ గృష్ణుఁడు తనమహిమచేఁ దానే గోవత్సగోపకులరూపు దాల్చి యొక్కయేఁడు క్రీడించిన విరించి నివ్వెఱపడి వాని విడిచిపుచ్చి యద్దేవుని సన్నుతించెననియె. యమునానదిమడువున నివసించు జనులకు మహాభయంకరుండగు కాళియసర్పంబును మర్దించెను. గోగోపకులను గార్చిచ్చుక్రమ్ము

* ఏతత్కౌమారకం కర్మ హరేరాత్మాహిమోక్షణం, మృత్యోః పౌగండకే బాలాదృష్ట్వోచుర్విస్మితా వ్రజే. అయిదుసంవత్సరములవఱకుఁ గౌమారమనియుం, నది మొదలు పదియేండ్లవఱకుఁ బౌగండమనియు నావలఁ బదియేనుసంవత్సరములవఱకుఁ గైశోరమనియు దానికిఁ బిదప యౌవనమనియుఁ జెప్పఁబడును.

దీనికిఁ బ్రమాణము:—కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావధి, కైశోరమాపంచదశాద్యౌవనంతు తతః పరం. అని యీవిషయము పాఠకుల మనమునం దుంచఁదగినది.

కొనిన నా దావాగ్నిని మ్రింగి వారలను రక్షించెను. కృష్ణుఁ డింద్రునకుఁ గ్రతువులు సేయవలదని గోపాలురను నివారింప నింద్రుఁడు వారిపైఁ గాలాంబుదంబులు పఱపి పెనువర్షంబుఁ గురియించిన గోవర్ధనగిరిం దనచేతనెత్తిపట్టుకొని యేడుదినంబులు దానిక్రింద గోపాలురను గోవులను నుండఁబంచి వారిం గాపాడెను. అప్పు డతనికేడేండ్లవయస్సు. * ఆవెంబడిగానే శరద్రాత్రియందుఁ గృష్ణుఁడు గానముచేయ నతనిచెంతకు గోపికలు రాఁగా వారితో గానక్రీడలు గావించె. (దీనింగూర్చి ముందు కొంత చర్చింపఁబడును.) పిదప శంఖచూడారిష్టకేశివ్యోమ చాణూరముష్టికులను జంపి లోకంబు నిష్కంటకంబు గావించి తజ్జనకుండగు నుగ్రసేనుని రాజ్యపదస్థుం జేసె. పిదప నుపనయనముచేసికొని కాశికిఁ జని సాందీపనుఁ డనుబ్రాహ్మణోత్తముని యొద్ద శిష్యత్వంబు వహించి యతనిని భక్తిమైఁ గొలుచుచు నతనివలన నఱువదినాలుగుదినములలోపలనే వేదవేదాంగములను నుపనిషత్తులను ధనుర్వేదంబును ధర్మంబులను నన్వీక్షికీరాజనీతులును నన్నింటిని నేర్చెను.

* "క్వస ప్తహాయనో బాలః క్వమహాద్రివిధారణమ్, తతో నో జాయతే శంకా వ్రజనాథతవాత్మజే." అని భాగవతము స్కంధము 10 అధ్యాయము 26.

* అప్పుడును గృష్ణబలరాములు బాలురే. కృష్ణున కపుడు ద్వాదశ హాయనములు. "బాలావయం తుల్యబలైః క్రీడిష్యామో యథోచితమ్.

క్వవజ్రసారసర్వాంగౌ మల్లౌ శైలేంద్రసమ్మతౌ, క్వచాతి సుకుమారాంగౌ కిశోరౌ నాప్తయౌవనౌ." స్కంధము 10 అధ్యాయము 43.

ఇంతవఱకును కౌమారపౌగండకైశోరచర్యలు వివరింపఁబడియె. ఇఁకఁ గృష్ణునియౌవనచరిత్రము చెప్పంబడు. ఇవి విష్ణుపురాణహరివంశభాగవతములలోఁ జెప్పఁబడినవి.

సంప్రాప్తయౌవనుండై కృష్ణుఁడు జరాసంధునితో యుద్ధముచేసి యోడించి కాలయవనునితో నెదిరి పోరి ముచుకుందునిచే వానిని భస్మముగావింపించి ముచుకుందునకు సద్గతి యొసంగె. ద్వారకాపురి నిర్మించి దానికిఁ బ్రభువయ్యె. పిదప రుక్మితోఁబోరాడి జయించి రుక్మిణీదేవిం బరిణయమయ్యె. సత్రాజిత్తునిదైన శ్యమంతకమణిని నతనిసోదరుం డగు ప్రసేనుఁడు ధరించి కాననంబున వేఁటకుఁబోవ నొకసింహము వానింజంపిన జాంబవంతుఁడామణింగొనిపోయి తనగుహాలోనున్న తనకొమరిత జాంబవతి యనుకన్నియకుఁ గ్రీడార్థ మొసంగఁ గృష్ణుఁడామణి నపహరించెనని లోకాపవాదంబువచ్చిన నతండు జాంబవంతునితోముష్టియుద్ధముచేసి జయించి యతనివలన శ్యమంతకమణిని దత్తనయయగు నాసీమంతినీమణిని గైకొనివచ్చి యమ్మణినిసత్రాజిత్తునకిచ్చెను అతఁడునిజపుత్త్రియగుసత్యభామను నామణిని గృష్ణున కిచ్చిన నతఁడు క్రమ్మఱ నమ్మణిని నతనికే యొసఁగె. మఱియుఁ గృష్ణుఁడు కాళింది మిత్రవింద, సుదంత, భద్ర, లక్షణ యనునారీరత్నములం బరిణయమయ్యె. సత్యభామాసమేతుండై నరకాసురుని వధించె. బలదర్పితుండగు బాణాసురుని నిర్జించె. పౌండ్రకవాసుదేవుని యమపురంబున కనిచె. నృగుమహారాజు శాపంబుమాన్చె. తనసహాధ్యాయుఁడును బరమదరిద్రుఁడును నగుకుచేలుని దారిద్ర్యంబును సంకల్పమాత్రమునఁ దొలఁగించి యతని కభిమతసంపదలనిచ్చె.

ఇఁకను గృష్ణుని ప్రౌఢవయశ్చారిత్రములు వివరింపఁబడు చున్నవి. ఈచరిత్రములను మహాభారతము వివరించుచున్నది. తనమేనత్తకొడుకులగు పాండవులతోఁ గలిసి వారి కనేకవిధములఁ దోడ్పాటుగావించెను. ధర్మరాజు చేసిన రాజసూయ యాగమునకుఁ దోడ్పాటుకావింపఁ బూని భీమునిచే జరాసంధుని వధింపఁజేసి యతఁడు చెఱఁబెట్టిన రాజుల నందఱిని విడిపించి యమ్మహాయాగంబు జరగుచున్న సమయంబునఁ దన్నధిక్షేపించిన శిశుపాలుంజంపి యా క్రతువు సాంతంబుగా నిర్వర్తింప జేసె. సాళ్వదంతవక్త్రుల నంతకు పురికిం బంపె. ద్రౌపదిని దుశ్శాసనాదులు మానభంగముగావింపఁబూనిన నమ్మానవతి మానంబును రక్షించె.

పాండవకౌరవులకు సంధికావింపఁ బూనినపుడు దుర్యోధనాదు లతనిం జెఱపట్టఁ బ్రయత్నింప విశ్వరూపంబుఁజూపి తాను సర్వేశ్వరుఁడగుట వారికిఁ దెల్పె. పాండవకౌరవులకు జరగినభారతరణమునందు ధర్మపరులగు పాండవులకుఁ గృష్ణుఁడు సహాయుఁడై యర్జునునకు సారథ్యంబునేసి వానికి విజయం బొనగూర్చె. గర్భస్థుండగు పరీక్షితుని నశ్వత్థామ ప్రయుక్తాస్త్రంబు దహింపఁజొచ్చినవాని నయ్యాపదకుఁ బాపి కాపాడి భరతకులంబును భూమిపై నిలిపెను.

ఇవన్నియు నిటులుండ రణరంగంబున నర్జునుండు నిజ బంధుమిత్రజనంబులఁ జంప శంకించి నిర్వేదంబు నొందినఁ గృష్ణుం డతనికిఁ దత్త్వోపదేశంబుచేసి యతని మనఃకాలుష్యముఁ బాపె. అమ్మహోపదేశమే భగవద్గీత. గీతలనంబడి

సుప్రసిద్ధమై సకలజనోపాదేయమై యొప్పారెడు. భగవద్గీత సకలోపనిషత్సారమై సకలతత్త్వార్థబోధకమై తనరారు. దానిఁ జదివి యందుఁ జెప్పఁబడినధర్మముల నాచరించునరు లిహపర సౌఖ్యములఁ జెందుదురనుటకు సందియము లేదు. దానింబోలిన పరమోపదేశ మతనికిఁ బిదప నింతవఱకు మఱొకటి పుట్టి లేదు. దాని గ్రంథకర్తగారే వివరించుటచే నేనిచ్చటఁ దెలుపుట యవసరముకాదని విరమించితి. అందుఁ గర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము, అను నీమూఁడుయోగముల చందము విస్తరముగా వివరింపఁబడినది. అందుఁ దెలుపఁబడని ధర్మములును దత్త్వములును నెందును లేవు. మనదేశము నందలి యితరగ్రంథములన్నియు నశించినను భగవద్గీతాశాస్త్ర మొకటియున్నంజాలు. దీనిని మనదేశప్రజను లేకాక యూరోపు అమెరికా-చైనా మొదలగు సకలదేశములజనులును నత్యాదరముతోఁ బఠింతురు. లోకమున భగవద్గీత కున్నంతటిగౌరవము మఱియేగ్రంథమునకును లేదు. ఇది సాధారణముగా లోకమునందలి యన్ని భాషలలోను బరివర్తనము కావింపఁ బడినది. దీనికి వ్రాయఁబడియుండు వ్యాఖ్యానము లనేకములు. దీనింగూర్చి పండితులుచేసిన యుపన్యాసము లనంతములు. ఇట్టి మహనీయోపదేశమును శాశ్వతముగా జనులకుఁ గావించిన శ్రీకృష్ణుని పరమకారుణ్యమును గొనియాడఁదరమే.

పైకనిన యతనిచర్య లతిమానుషములని తెల్లము కాఁగలవు ఈశ్వరుఁడు కాకున్నచోఁ బసిబాలుఁ డట్టికార్యములఁ జేయఁజాలునా? ఈసంగ్రహచారిత్రమే కృష్ణునిమాహాత్మ్యమున్ను నతఁడు భగవంతుఁడే యగుటను దేటపడ నేఱిం

గింపనోపు. ఇంకను సద్దేవునిమాహాత్మ్యంబు సాకల్యంబుగాఁ దెలియఁగోరువా రీగ్రంథమును సాంతముగాఁ జదువఁదగును. ఆభగవంతునిమహిమం బప్రమేయంబనియు నతఁడు సర్వజనోపాస్యుఁడనియు భక్తులకు భుక్తిముక్తిప్రదుండనియు నెల్ల వారు నెఱింగి యతనిం గొలుచుచు మతవైషమ్యంబుమాని సకలదేవతామూర్తులును భిన్నములుగాఁ గానంబడుచున్నను బరమార్థదృష్టిని నొక్కటే యని భావించి దేవతాదూషణంబు సేయక యంతటియెడల సోదరభావంబుఁబూని ప్రేమించుచు లోకసేవయు లోకహితంబును గావించుచు సత్యాహింసా వ్రతపరాయణులై కామక్రోధాసూయాలోభాదులను వర్జించి సాధువర్తనులై నిజవర్ణాశ్రమధర్మంబులను ఫలాపేక్షను విడిచి యీశ్వరార్పణబుద్ధితోఁ జేయుచు నిహపరసౌఖ్యములఁ బొందవలయుననుటయే మనగ్రంథకర్తగా రింత గొప్పగ్రంథమును వ్రాయుటకు ముఖ్యోద్దేశముగాఁ దెలియఁదగు.

శ్రీకృష్ణుని యొకటి రెండు కార్యములంగూర్చి యించుక ప్రస్తావింపవలసియున్నది. అతఁడు యమునానదీజలంబుల స్నానమాడుచుండిన గోపికలవస్త్రంబుల నపహరించి వారి సిగ్గులు విడిపించుట యొకటి. శరద్రాత్రులందు గోపికలతో రాసక్రీడ మున్నగునవి సలుపుట యొకటి.

వస్త్రాపహరణముంగూర్చి=ఇది గోవర్ధనగిరి నెత్తుటకు మునుపే జరగినవృత్తాంతము. గోవర్ధనగిరి నెత్తినపుడు కృష్ణుఁడేడేండ్లబాలుఁడని మున్నే తెలుపఁబడియెఁగదా? అంతకంటెఁ జిన్నవయసుననే వస్త్రాపహరణము జరగినది. అంతటి పసిబాలు..

నికిఁ గామవికారము లుండుననుట యసంగతముగదా వస్త్రములులేక దిగంబరలై గోపికలు స్నానముచేయుచుండిరి. అది దుష్టకార్యము. పాపహేతువు. ఆపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగా వారిచే భగవంతుండగు తనకు హస్తయుగళంబుల శిరంబులపైఁ దాల్చి మ్రొక్కఁజేసె. ఇది దోషమనఁజెల్లునే?

రాసక్రీడంగూర్చి= రాసక్రీడ యనఁగా హల్లీసకము. హల్లీసకమున కర్థము మున్నె తెలుపంబడియె. హరివంశము నందు హల్లీసక మనియే చెప్పఁబడియున్నది. కృష్ణుఁ డొక గోపికహస్తమును బట్టుకొని వేఱొకయంగనామణి చేతిని దాను బట్టి యాచేతిలోఁ దొలియంగనహస్తమును బట్టియిచ్చి యిట్టులొక్కొక్కరిచేతిని వొల్లిటివనితకరంబునఁ బట్టియిచ్చుచు వలయాకారముగా నర్తనముచేయుట. అందఱు సుందరులును నరవిందనయనకరంబుఁ బట్టినట్లు సుఖంబందిరి. ఇద్దఱు ముద్దియలనడుమ నొక్కొక్కకృష్ణుఁ డుండునట్లు వనిత లెందఱు గలరో యన్నిరూపులు తానుధరించి యన్యోన్యకరంబులు పట్టుకొని వలయాకారము నృత్యముసేయుట యని మఱియొకపక్షము ఇట్లు నృత్యముచేయుచుఁ గృష్ణుఁడు కైశోరవయస్సును మన్నించుచు గోపరమణులతో రమించె నని విష్ణుపురాణము నుడువుచున్నది.

"తావార్యమాణాః పతిభిః పితృభిర్భ్రాతృభిస్తథా,
కృష్ణం గోపాంగనా రాత్రౌ రమయంతిరతిప్రియాః.

సోఽపి కైశోర కవయో మానయన్మధు సూదనః,
రేమేతాభిరమేయా త్మా క్షపాసుక్షపితాహితః
తద్భర్తృషుతథాతాసు సర్వభూతేషు చేశ్వరః,
ఆత్మస్వరూపరూపో సౌవ్యాపీవాయు రివస్థితః.'' అని.

(విష్ణుపురాణము. అంశము 5 అధ్యాయము 14.)

ఇచటఁ 'కైశోరకం' అనఁగాఁ "కౌమార్యం వయో మానయన్, తదవస్థోచితచాపలమనుకుర్వన్నేవ" అని శ్రీధర స్వామి వ్యాఖ్యానము చేసియున్నాఁడు. కృష్ణుని కప్పుడు పదు నొకండుసంవత్సరములు. అట్లు బాలుఁడగుకృష్ణుఁడు గోప కాంతలతోఁ గ్రీడించుట వాయువువలె సర్వవ్యాపియై సర్వ భూతములయందును నాభగవంతుండు నివసించుటచేతను సకలపాపక్షయకరుం డగుటచేతను దోషముకాదని పరా శరుఁడు మైత్రేయునికిఁ జెప్పెను.

ఈయర్థమునే భాగవతము నుడువుచున్నది.

''గోపీనాం తత్పతీనాంచ సర్వేషాంచాపి దేహినాం,
యోంతశ్చరతి సోధ్యక్ష ఏషక్రీడన దేహభాక్.''

(భాగవతము-స్కంధము 10 అధ్యాయము 31.)

సామాన్య మానవుఁడగునేని పసిబాలుఁ డగువాఁ డందఱు గోపకాంతలతో రతిక్రీడలు సలుప సాధ్యమా! అందఱును నానందపరవశలైరని పురాణము వక్కాణించు చున్నది. కృష్ణుఁడు భగవంతుఁడును సర్వాంతర్యామియు నగు

టచే నందఱు యువతులతోడను రతిక్రీడలు సలిపినట్లును వారల నానందపరవశలఁ గావించినట్లును వారికిఁ దోఁపఁజేసి వారిని దృప్తిపఱచెనని తెలియవలయు. అజ్ఞులిది యెఱుంగక కృష్ణుఁడు జారుఁడని నిందింతురు కాని యది సరికాదు.

కృత్వాతావంత మాత్మానం యావతీ ర్గోపయోషితః,
రరామ భగవాంస్తాభి రాత్మారామోపి లీలయా.

(అని భాగవతము స్కంధము 10 అధ్యాయము 33)

అనఁగా నాత్మారాముఁడైనను గృష్ణుఁడు గోపకాంతలతో లీలచేఁ గ్రీడించెనని యర్థము. దీనిచేఁ గృష్ణుని రతిక్రీడలు వాస్తవములు కావనియు లీలలే యనియుఁ దెలియవలయు. తొల్లి యాగోపికలందఱు నందగోపసుతుం డగు కృష్ణుఁడు తమకుఁ బతినిగాఁ జేయుము తల్లీ యని పార్వతీదేవిని బ్రార్థించుటచే నద్దేవివరంబున వారికిఁ గృష్ణుఁడు పతియైనట్లు లీల కావించెను.

"కాత్యాయని మహాదేవి మహాయోగిన్య ధీశ్వరి,
నందగోప సుతందేవి పతింమే కురు తేనమః."

అని యొక్కొక్కగోపికయుఁ బ్రార్థించెను.

పైకనినరీతిని గృష్ణుఁడు దుష్టశిక్షణశిష్టరక్షణధర్మసంస్థాపనము లొనర్చి నిజావతారకార్యంబులను సమగ్రముగా నెఱవేర్చి మనుష్యశరీరంబును విడిచి కృతకృత్యుఁ డయ్యెను.

శ్రీకృష్ణునిదివ్యచరిత్రములను నప్రమేయమహిమములను ననేకోపాఖ్యానయుతములుగా వివరించి యాంధ్రులకు

మేలు కావించిన శ్రీజనమంచి శేషాద్రిశర్మగారి యీగ్రంథ నిర్మాణకార్యము శ్లాఘాపాత్రమై యలరారెడు. దీని నందఱుం బఠించుచుం దత్త్వం బెఱుంగుచు నానందింతురుగాక!

తిరుపతి
1930-వ సం.
ఏప్రిలునెల.

నాగపూడి కుప్పుస్వామయ్య,

శ్రీః.

# శ్రీకృష్ణావతారతత్త్వము.

...

## పంద్రెండవ ప్రకరణము.

శ్లో. చాపల్యసీమ చపలానుభవైకసీమ
చాతుర్యసీమ చతురాననశిల్పసీమ
సౌరభ్యసీమ సకలాద్భుతకేళిసీమ
సౌభాగ్యసీమ తదిదం వ్రజభాగ్యసీమ. ౭౩

మృదుక్వణన్నూపురమంథరేణ
బాలేన పాదాంబుజపల్లవేన
అనుక్వణన్మంజులవేణుగీత
మాయాతి మే జీవితమాత్తకేళి. ౭౪

సోఽయం విలాసమురళీనినదామృతేన
సించన్నుదంచితమిదం మమ కర్ణయుగ్మమ్
ఆయాతి మే నయనబంధు రనన్యబంధు
రానందకందలితకేళికటాక్షలక్షః. ౭౫

దూరాద్విలోకయతి వారణఖేలగామీ
ధారాకటాక్షభరితేన విలోచనేన
ఆరాదుపైతి హృదయంగమవేణునాద
వేణీదుఘేన దశనావరణేన దేవః. ౭౬

కృష్ణానమేతత్పునరుక్తశోభ
ముష్ణేతరాంశోరుదయం ముఖేందోః
తృష్ణాంబురాశిం ద్విగుణీకరోతి
కృష్ణాహ్వయం కించన జీవితం మే. ౮౩

అచిన్వానమహన్యహన్యహని సాకారాణి విహారక్రమా
నారుంధానమరుంధతీహృదయమప్యార్ద్రస్మితాస్యశ్రియా
ఆతన్వానమనన్యజన్మనయనశ్లాఘ్యామనర్ఘ్యాం దశా
మానందం వ్రజసుందరీ స్తనతటీసామ్రాజ్యముజ్జృంభతే.

మధురం మధురం వపురస్య విభో
ర్మధురం మధురం వదనం మధురం
మధుగంధి మృదుస్మితమేతదహో
మధురం మధురం మధురం మధురమ్. ౯౧

మందారమూలే మదనాభిరామం
బింబాధరాపూరితవేణునాదం
గోగోపగోపీజనమధ్యసంస్థం
గోపం భజే గోకులపూర్ణచంద్రమ్. ౧౦౦

(శ్రీకృష్ణకర్ణామృతము. ౧. ఆ.)

అనవరతవనజనయనమృదుపంకజమరందాస్వాదనేందింది రాయమాణహృదయులారా! నిర్మలచిత్తులారా! శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బదునొకండవ దగుప్రకరణమును బఠించితిరి. దానియందు శ్రీకృష్ణపరమాత్మ భక్తుఁడగు నర్జునున కుపదేశించిన గీతోపనిషత్తులు లోనగువిషయములఁ జదివియుండుటం జేసి యపరిమితానందసంతృప్తుల నొంది యేయుందురు. భగవదుపదేశము లనుపమానములు. అందుఁ గొన్నింటికి వేదము

లని పేరు. కొన్నింటి కుపనిషత్తులని పేరు. వాని భక్తిమీఁదఁ బఠించినఁ గలుగునానందము మఱి దేనినుండి కలుగును? కలుగునన్నచో నది పరిహాసాస్పదమే యగును. పరమార్థోపదేశ మను నామధేయమీ ప్రకరణమునకు మిక్కిలితగియే యున్నది. ఒక్కగీతోపదేశము చాలదా. సకల వేదసారమని దానిం జెప్పనొప్పునుగదా. శ్రీకృష్ణావతారఫలమనఁగా గీతోపదేశమే. కలియుగమున విశేషించి యాయుపదేశానుసారము ప్రవర్తింపవలసియుండును. తక్కంగలయుగములయందు వేదసారమును గ్రహింపఁగలవారు పెక్కండ్రుందురు. కలియుగమున నట్టివారరుదు. కావుననే భగవంతుఁ డీకాలపుమానవులకుఁ దరణోపాయము చూపఁబూని గీతాశాస్త్రము నుపదేశించెను. అందుఁ బ్రధానముగా నాలుగువర్ణములవారికిం దగినకర్మముల నుపదేశించెను. కర్మమార్గమే ప్రధానమని గీతాశాస్త్రము బోధించెడిని. కర్మభ్రష్టులకు జ్ఞాన మలవడుట యన శశవిషాణమే. శుకాదులు జన్మతః జ్ఞాను లగుటకుం గారణమేమని కొందఱు ప్రశ్నింతురు. జన్మాంతరములఁ జక్కనికర్మముల భగవదర్పణముగ నొనరించి దానిఫల మీజన్మమున సులభముగాఁ గాంచిరనియే చెప్పవలయును. ఈసిద్ధాంతము

"అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్."

అను ప్రమాణమునకు ఫలమే. జన్మములే లేవను వారుకలరు. వారికిఁ బుణ్యపాపములే లేవని చెప్పవలయును. వారికర్మ మట్టి దనవలసియుండును. అట్టిమాన్యులకు సమాధానము చెప్పఁబూనక యూరకుండుటయే సముచితమార్గము.

గీతోపదేశానంతర మర్జునుఁడు సమరము చేయఁబూనెను. ఒక్క దెప్పరమాతనికిం గలుగ శ్రీకృష్ణుఁ డర్జునుం దోడ్కొని స్వప్నమునఁ గైలాసమున కరిగి శంకరునిచేఁ బాశుపతాస్త్రము నిప్పించెను. ఈకథం గాంచి శ్రీహరికంటె శంకరుం డుత్కృష్టుఁ డందురు. వారికి దేవతాసమత్వజ్ఞాన మింక నలవడుట లేదనుట కంటె మఱొకమాట చెప్పనక్కఱలేదు. అశ్వత్థామ సంరంభము మదికిఁ దోఁచఁగా శ్రీకృష్ణుఁడు పాండవులం దోడుకొని వేఱొక తావునకుం బోయినకథ యతివిచిత్రము. అది యొక్కటియే యామహాత్మునకుఁ గలసర్వజ్ఞత్వమును బోధించెడిని. వేఱొక్క యుదాహరణ మేమికావలయును? ధర్మరాజు నభిషిక్తుం జేసిన పిదప భీష్ముండు తన్ను వినుతించుచుండఁ దా నాతనియెదుట నుండెను: అనఁగా మన స్సందు లగ్నమగునట్టు లొనరించెను. ఇదియే భగవంతుని భక్తపరాధీనతను వెల్లడించును. ఈమొద లగుకథ లాప్రకరణమునం గలవు. దానిం జక్కఁగా బఠించిన మీకాపరాత్పరునందు దృఢభక్తి కలిగియుండక మానదని నమ్మెదను.

మహాశయులారా! ఈపండ్రెండవప్రకరణమున బహుళ విచిత్రవిషయరత్నములుగల శ్రీకృష్ణకథలఁ బఠింపఁగలరు. శాప కారణమున నూఱువత్సరములు రాధామాధవులకుఁ గలిగిన వియోగము పూర్ణముకాఁగా మరల వారిద్దఱు కలిసికొందురు. ఈలోకమునఁ దాఁ జేయందగుకార్యములు నితరులమూలమున జేయింపఁదగినకార - ములు పూర్తిచేయును. అశ్వమేధమహాధ్వ రము ధర్మరాజుచేఁ జేయించును. ఇట్టి వెన్నియో చరిత్రము కరణమున నలరారును. గోలోకమున భగవంతునకు

శ్రీరాధాదేవికిని బట్టాభిషేకమును సాగును. కావున నీప్రకరణమును జక్కఁ బఠింపవలయును.

భగవంతునికథలు పఠించినంతమాత్రమున, విన్నంతమాత్రమున నెక్కుడు లాభము కలుగ దనవచ్చును. ఆరీతిగా భగవంతు నారాధింపవలయును భగవదుక్తప్రకారము చేయవలయును. అట్లు గావింపక కేవల శ్రవణపఠనములు చేసిన నెక్కువ లాభము లేదనవచ్చును. శ్రవణపఠనములను గూడ జేయనివారలకంటె వీ రుత్తము లనుట నిర్వివాదాంశము. ఈకృషి జన్మాంతరమునకైనఁ బనికిరాదా యన్నఁ బనికిరా దనరాదు. ఏది యెట్లున్నను దాఁ బఠించినవిషయము సద్విషయమేయైన నాచరణమునకుఁ దెచ్చుకొన్న వాఁడే కృతార్థుఁ డగును. కావున భగవద్గాథలం బఠించి యెవ్వరేఁ బఠించుచుండఁగా విని యందు గ్రహించినంతలో వలనుపడినంతదనుక నాచరించుట మేలని యిందలిసారము. ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మ

శ్లో. "చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే,
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః.
ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్,
ఆస్థితస్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిం.
బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః." ౧౯
(గీతా ౭ అధ్యా.)

అని యర్జునున కుపదేశించెను. జ్ఞాని నిత్యయుక్తుఁ డగును. కానఁ దక్కుఁగలవారలకంటె నా కత్యంతప్రియుఁ డనియేఁ గదా. శ్రవణసంకీర్తనాదులను బహుజన్మములందుఁ జేసి క్రమ క్రమముగా భక్తుఁడై వాసుదేవునికంటె వేఱగునది యేదియు దని తలంచుచు నన్నఁగా నెల్లతావుల నన్నే కనుఁగొనుచు నుండుజ్ఞాని నన్నుఁ జేరుననికదా పైయుపదేశతాత్పర్యము. అట్టిమహాత్ముఁడు దుర్లభుఁ డనియు హరి చెప్పెను. ఈయుప దేశము పైన వ్రాసిననాభావమును దృఢపఱచుచున్నది. కావున భగవదారాధనము ముఖ్యమని తేలెడిని. యజ్ఞములు లోనగు వానికంటె భగవద్గుణకీర్తనము, తత్కథాశ్రవణము, సర్వభూత సమత్వము, సర్వత్ర శ్రీకృష్ణమూర్తినే కనుఁగొనుట, పరమత సహిష్ణుత, సర్వదేవతాసమత అను నీమొదలగునవి భగవదా రాధనరూపములే. ఇవన్నియు జ్ఞానికి సులభములు. ఏదేవతను బూజించినను శ్రీపరాత్పరునే పూజించినట్లు భావింపవలయును. ఆపూజయే ఫలము నీఁజాలును. భగవద్గీతాపారాయణఫల మనఁగా నదియే. గీతానుసారము ప్రవర్తించిన భేదబుద్ధి నశించును. సర్వకర్మఫల మదియే యని మన మెఱుంగవలయును. సత్కర్మానుష్ఠానము మనోమాలిన్యము నడఁచి భగవద్విషయక జ్ఞానము నిచ్చును. దాన ముక్తి కలుగును. అట్టిభగవత్కథల నింకఁ జదువుదము.

ఈప్రకరణమున శ్రీకృష్ణపరమాత్మ భూలోకమునఁ దాఁజేయఁదగుపనులం గావించి యితరులమూలమునఁ జేయింపఁ దగుకార్యములఁ జేయించి శాపవిముక్తినొందిన రాధికంగూడి కాల ముండితనపరివారముంగూడిగోలోకమున కరుగును.

అట్టి యపూర్వగాథల మనము చక్కఁగాఁ బఠింపవలయును. సావధానులరై యాకార్యమునకుం గడంగుఁడు. అందుఁ దొలుత శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు భక్తాగ్రేసరుఁడగు భీష్ముని మూలమున సకలధర్మముల నుపదేశింపఁజేసి ద్వారవతి కరుగును. ఆభాగము ముందుగాఁ జదువవలయును. ఆవలివృత్తాంత మరయుదము.

## శ్రీకృష్ణునాజ్ఞచే భీష్ముఁడు ధర్మజున కుపదేశించిన సకలధర్మసంగ్రహము.

శ్రీకృష్ణమూర్తి ధర్మజునకు ధర్మము లుపదేశింపుమని యాజ్ఞాపించి భీష్మునకు శరతాపాదులు లేకయుండ ననుగ్రహించెను. భగవంతునానతిం గైకొని నాతెలియుధర్మములుపదేశింతు నని గాంగేయుఁ డంగీకరించెను. నాఁడస్తమయసమయ మైనం దున మఱుదినము వత్తుమని యెల్లరుఁబోయిరి. ధర్మరాజు సపరి వారుఁడై శ్రీకృష్ణుని బ్రార్థించి తోడుకొని గాంగేయునంతికము నకుం బోయెను. మహర్షులెల్ల నరుదెంచిరి. నారదాదులు భగవ ద్దర్శనము భక్తవర్యదర్శనముకై యరుదెంచిరి. ధర్మముల వినఁ గుతూహలులై యుండిరి. నారదముని యెల్లరు వినుచుండఁగా గాంగేయుఁడు మహాత్ముఁడగుట లోకాంతరగతుఁ డగుటకు ముందే సకలధర్మములు వినవలయును. సకలసంశయములను దీర్చుకొనవలయును. అని హెచ్చరింప గాంగేయు నేమని ప్రశ్నింపవలయునో యని యొండొరులమొగంబులు చూచు చుండధర్మనందనుఁడు భగవంతున కిట్లువిన్నవించెను. మహాత్మా! నీవుదక్క గాంగేయునితో సల్లాపముచేయ నర్హు లెవరుగలరు? ధర్మవేత్తలకు గురుఁడవు నీవేకదా. కావునఁ బ్రశ్నింపనంగీకరిం

పుము. అనఁగా శ్రీకృష్ణుఁడు శారీరమానసకుశల ప్రశ్నంబు చేయఁగాఁగాంగేయుండుమహాత్మా! పరమేశ్వరుఁడవగు నీప్రసాదమున శరీరబాధలన్నియుఁ దీఱినవి. అవయవములు పాటవము నొందినవి. వేదవిద్యావిభవము నాఁకు గల్గినది. పరతత్త్వవిషయకజ్ఞానము ప్రస్ఫుటముగ నున్నది. మనస్సు పరిపక్వ మైనది. మహానుభావుఁడవగు నీవు నన్ను స్మరించినందునఁ గృతార్థుఁడనైతిని. నీయెదుట నేమాత్రపువాఁడను గాకపోయినను నీయాజ్ఞాబద్ధుఁడనుగాన నాయెఱింగినంతవఱకు నీధర్మరాజున కెఱింగించెదను. ఐన నొకసందియము డెందమునఁ బొడమెడిని. దాఁపక విన్నవించెద. పాండవులు నీకుఁ బ్రాణసమానులు. అట్టి వారికిభావిశుభకరములగుధర్మముల నీవేలయుపదేశింపకున్నాఁడవో తెలుపుము. నీతలంపేమి? కరుణింపుమాయని ప్రశ్నించిన శ్రీహరి సాదరంబున గంగానందనా! శ్రేయస్సు యశము ననువానికి నేను మూలకందమ నగుదును. చంద్రుఁడు చల్లనివాఁడనుట యెట్లు విచిత్రముకాదో నేను ధర్మోపదేశకుఁడననుట గొప్పదికాదు. యశస్సు నార్జించినందున నాకుఁ గ్రొత్తగావచ్చు ప్రఖ్యాతియేది? నాతలంపేమని యడిగితివి? వినుమునిరుపమాన యశస్సు నీ కీభూలోకమున గల్గించుతాత్పర్యమున నాబుద్ధిని నీమనసునఁ జొప్పించితిని. ఈభూమి యెంతకాల ముండునో యంతవాఁక నీకీర్తి యక్షయమాకృతిం దాల్చియుండును. నీపలుకులు వేదసారములై వెలయుచుండును. ధర్మరాజునకు నీ వుపదేశించు నీతివాక్యములు భక్తితాత్పర్యములతో నెవరు కొనియాడుదురో వా రుభయలోకకీర్తనీయు లగుదురు. కావున [illegible] మునని న్నాజ్ఞాపించితిని. నీమనుమలగుపాండవులుతక్కుం

గలరాజులందఱును నీయుపదేశించుధర్మములను విని కృతార్థ జన్ములు కాఁగలరు. సకలధర్మప్రకారబోధకములగు వాక్యంబు లుపదేశింపుమనుటయు శాంతనవుండు మహాత్మా! నీ యాజ్ఞా ప్రకారము చేసెదను. కరుణింపుము. అనిపలికి యానందభరా క్రాంత మానసుండై యిట్లు పలికెను.

ఎవ్వాఁడు జన్మించినంతనే సకలమునీంద్రులు మిక్కిలి సంప్రమోదాత్ములైరో, పరమధార్మికులగు నీభరతవంశోద్భవు లేవిషయమునందు నెవ్వానికి సమానులు కాలేరో, సత్యము మనోనిగ్రహము, సదాచారము శాంతియు నెవ్వనికి నైజగుణ ములో, పాత్రాపాత్రవివేకము, దానము, యజ్ఞకరణాసక్తి బంధుపాలనాదృతి మొదలగుధర్మము లెవ్వాని కుగ్గుతోఁ బెట్టఁబడెనో, కామముననైనను, విపులార్థకారణముననైనను, భయముననైనను దుష్పథమునఁ బ్రవర్తించుమాహ యెవ్వా నికి లేదో యట్టి యుధిష్ఠిరుఁడు నన్నేమి యడుగఁ దలఁచెనో వానినెల్లఁ బ్రశ్నించుఁగాక అని పలికెను. ఆమాటలు విన్నవా రెల్ల నద్భుతానందసాగరనిమగ్నులైరి.

శ్రీకృష్ణుండు శంతనునందనునుం గాంచి గాంగేయా! గురువులను బంధువులను మిత్రులను గ్రూరాస్త్రములం బ్రయో గించి కాఠిన్యమువహించి చంపెను మానవులఁ బెక్కుకోటుల రణరంగమునకు బలిచేసెను. కావున నీధర్మరాజు నీచెంతకువచ్చి ప్రశ్నింప సంకోచించెడు. కరుణాలేశవిరహితకార్యతత్పరుఁడని నీ వనుదువేమో యని యనుమానించుచున్నవాఁడు. ఆసంది యమే యీతఁ డింతదనుక నూరకుండఁ గారణము అనుమాట చెవుల సోఁకినంతనే దేవవ్రతుండు మహానుభావా! భూసురుల

కధ్యయనాధ్యాపనయజనయాజనదానప్రతిగ్రహములను నాఱు కర్మము లెట్లు విధివిహితములో రాజులకు సంగర మట్టిది. అందు గురువులు తండ్రులు పుత్త్రపౌత్త్రులు పాపపరు లైనచో వధించుట విహితము. అది రాజులకు ధర్మమే యగును. ధర్మము సమయమునను వానిని వదలి లోభమున నన్యాయపథమున వర్తించువారి నెవ్వారినేని యుద్ధమున వధింపఁ గలిగినచో నది పుణ్యకార్యమే యగును. అంతియగాక సంగరభూమియందు రక్తము జలముగను, కేశములు నాచుదీఁగెలుగను బరఁగు నదుల నేరాజు కల్పించునో యాభూమిపాలకుఁడు ధర్మవిదుఁడే యగునని పెద్దలు పలుకుదురు.

అని గాంగేయుఁడు పలికినంతనే ధర్మరాజు దోసిలొగ్గి చెంతకుంబోయి కరముల నాతనిపాదములను బట్టుకొని శిరము పాదములపై నమర్చి నమస్కరించెను. శంతనుసుతుం డాతనిం జేరంబిలిచి ప్రశంసించి తనమోము నాతనిశిరమున నిడి మూర్కొని మహాదరమున నాతనిం గూరుచుండంజేసి యుధిష్ఠిరా! యనుమానింపక నన్నే మైన నడుగుము. నా విని యాతండు మాధవునకు నమస్కరించి వ్యాసమహర్షి ప్రముఖులకుఁ బ్రణమిల్లి సర్వకౌరవుల ననుమతి వేఁడి యప్పితామహున కభిముఖుండై గాంగేయా! భాస్కరోదయమున సాంద్రతమస్సులు నశించునట్లు నీవాక్యములనాసంశయములు తొలంగును. కావునఁ దొలుదొలుత రాజధర్మముల నానతీయవే యని ప్రశ్నించి య యని యాపగానందనుఁడు తెలుప నవ్వేల ...శాలకు వలయుసకలవిధధర్మంబులం బ్రశ్నించుచుండెను. నాతఁడు సమాధాన మొసంగుచుండెను. సాయంకా

లము కాఁగా నగరంబున కరుగుచు నుదయమున మరల నరు
దెంచుచు నిట్లు సకలధర్మములఁ దెలిసికొనుచుండెను.

### విష్ణుమాహాత్మ్యము.

ఒక్కనాఁడు ధర్మముల వినుచుండి గాంగేయా! సకల
లోకముల కొక్కరుఁ డగుదేవుఁ డెవ్వఁడు? అర్చింపఁదగువాఁ
డెవ్వఁడు? వినుతింపఁదగువాఁ డెవ్వఁడు? ఎవ్వాని సేవించిన
సకలశుభములు గలుగు? ఎవ్వానిమంత్రజపంబు మేలునిచ్చును?
సకలధర్మములలో ముఖ్యమని యేది నీకుం దోఁచును? జప
ములలో నుత్తమజపం బెయ్యది? తన్ను జపించుప్రాణికింగల
పాపతాపములం బోఁదోలి మేలుచేకూర్చుదైవ మేది? తెలు
పుమా యని ప్రశ్నించెను. గంగానందనుఁ డాధర్మనందను
సంప్రశ్నమునకు మిగుల హర్షించి యిట్లు బదులు చెప్పెను.
*కౌంతేయాగ్రణీ! జగముల కధిపతియై దేవాదిదేవుఁడై
యుండువాఁడు శ్రీమహావిష్ణువు. ఆమహానీయుఁ డనంతుఁడు.
పురుషోత్తముఁ డనుపే రాయనకు విఖ్యాతము. ఆమధుసూద
ననినామసహస్రకంబున సంస్తుతించుచు సర్వదా తదేకాయత్త
మనస్కుఁడై ధ్యానించుచు నమస్కరించుచు నుండవలయును.
దాన సర్వదుఃఖములు శాంతించును. పుండరీకాక్షుని బరమ
భక్తిం దలంచి పూజించుటయే యత్యుత్తమంబని నామతము.
సర్వధర్మములయం దిది యుత్తమోత్తమము. దీనిని మించిన
ధర్మము వేఱొండు లేదని యెఱుంగుము. ఇదియే నిరుపమాన
తపస్సు. దీనికంటె నధికతపస్సు వేఱొకటి లేదు. పరమతేజంబయి,

* ఇది మహాభారతానుశాసనపర్వము నూటనలుబదితొమ్మిదవ
యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

పరమపదంబయి, పరబ్రహ్మమయి, పరమపరాయణమయి, పవిత్రములలోఁ బవిత్రమయి, మంగళములలో మంగళమయి, భూతములకు నవ్యయుండగు జనకుండయి యలరు పరమేశ్వరుఁడే వాసుదేవుఁ డనఁబరఁగు. ఆతనినుండియే సృష్ట్యాదియందు భూతజాలంబు పొడమెను. ఆమహనీయునియందే ప్రళయకాలమున విలీనమగును. అట్టి మహావిష్ణువును భవ్యతమములగు సహస్రనామముల నుతింపవలయును. ఆనామములు పాపహరములు. భయనివారణములు. భూరిగుణయోగవిఖ్యాతములు. మహర్షులవ్వానినే సదా వినుతింతురు వాని నెఱింగించెద. ఆనామసహస్రకంబునకు వేదవ్యాసుఁడు ఋషియగు అనుష్టుప్ఛందస్సని తలంపుము. అధిదైవతము భగవంతుఁడగు దేవకీతనయుఁడు. అమృతాంశూద్భవము బీజమగు. దేవకీనందనుఁడు శక్తియగు. త్రిసామాహృదయము శాంతిప్రయోగమున నుపయోగింపవలయును. ఇట్లుగా సంవిధానముచేసి సమాహితచిత్తుఁడై "విశ్వంబు, విష్ణువు, వషట్కారుండు" లోనగునామములఁ బారాయణముచేయవలయును. ఈనామపారాయణమున విమలయశస్సు కలుగును. జ్ఞాతులలోఁ బ్రధానత్వ మలవడును. శాశ్వతలక్ష్మియుఁ జేకూరును. ఉత్తమోత్తమ శ్రేయస్సు గలుగును. భయ మేవిషయమున నేవేళ నాతనికిం గలుగదు. వీర్యతేజస్సులు కలుగును. ఆపురుషుఁడు రోగహీనుఁడై ద్యుతిమంతుఁడై బలరూపగుణములు గలిగియుండును. రోగార్తుఁ డీనామపారాయణముచేసిన రోగవిముక్తుం డగును. కారాగారబద్ధుఁడు బంధవిముక్తిం గాంచును. భీతుఁడు భయవిముక్తుం . ఈస్తుతివరము భక్తియుక్తుఁడై పఠింపవలయును.

మానవుఁడు వాసుదేవు నాశ్రయించియే యుండవలయును. వాసుదేవుఁడే దిక్కని నమ్మవలయును. సర్వపాపనిర్ముక్తుఁడై సనాతనబ్రహ్మపదము నొందును. ఇంద్రియములు మనోబుద్ధులు సత్త్వతేజోబలధృతులు వాసుదేవాత్మకములగు క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు వాసుదేవాత్మకుండే యగును.

సర్వవేదములలో నాచారము ప్రథమమని నిర్ణయింపఁబడినది. ఆచారమునుండి పుట్టినదే ధర్మము. ఆధర్మమునకుఁ బ్రభు వచ్యుతుఁడే. ఋషులు, పితరులు, దేవతలు, మహాభూతములు, సకలధాతువులు, చరస్థిరరూపమగు జగంబంతయు నారాయణోద్భవము. యోగము, జ్ఞానము, సాంఖ్యము, విద్యలు, శిల్పములు, వేదములు, శాస్త్రములు మొదలగునవియన్నియు జనార్ధనునుండియే కలిగెను. ఒక్కవిష్ణువే మహాభూతము. పృథగ్భూతము లనేకములు గలవు. మూఁడులోకములను వ్యాపించి సర్వభూతాత్మకుఁడై యావాసుదేవుఁ డుండు. అట్టి పుండరీకాక్షుని నిశ్చలభక్తి పరవశులై యెవ్వారు కీర్తింతురో వారికిఁ బరాభవ మేవిషయమునను లేదు. అనిన ధర్మనందనుఁడు పరమప్రమోదమంది వాసుదేవునకు సమస్కరించెను.

మహాశయులారా! ఈవిషయమున రెండుమాటలు వ్రాయఁదగియుండును ఈగాథవిష్ణునామసహస్రమహిమమును దెలుపును. ఇందు భీష్ముఁడు ధర్మజునకు దీనిఫలము నుపదేశించుచు

శ్లో. "సర్వాగమానా మాచారః ప్రథమః పరికల్ప్యతే,
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః. ౧౩౭

అని యుపదేశించెను. సర్వాగమములలో నాచారము ప్రథమముగా నిర్ణయింపఁబడినది. ధర్మమనఁగా నాచారప్రభవమే. ఆధర్మమునకుఁ బ్రభువే యచ్యుతుఁడు. అని కదాభావము. ఇట నాచారమనఁగా నర్థమేమి? ఆచారశబ్దమున కనేకార్థములు గలవు. ఇందుపయోగింపఁదగినది సత్పురుషులయలవాటు అనునదియే. శీలమనఁగా నిదియే. స్మృతు లీపదమున కేమియర్థమును నిర్ణయించినవో యించుక విమర్శింతును.

"చతుర్ణామపి వర్ణానామాచారో ధర్మపాలకః,
ఆచారభ్రష్టదేహానాం భవేద్ధర్మః పరాఙ్ముఖః."

(పరాశరస్మృతి ఆచారకాండ 32)

"ఆచారస్యాన్వయవ్యతిరేకాభ్యాం ఐహికాముష్మికశ్రేయోహేతుత్వం." అని మాధవాచార్యులు.

ఇహలోకమునను బరలోకలోకమునను శ్రేయస్సు గలుగుట కేది హేతువో యదియే యాచార మనఁబడునది. కావున సత్పురుషుల ప్రవర్తనమని వ్రాసితిని. ఈయాచారమహిమము శ్రీమహాభారతమున ననుశాసనపర్వమున నిట్లు చెప్పఁబడినది.

"ఆచారాల్లభతే చాయురాచారాల్లభతే శ్రియం,
ఆచారాత్కీర్తిమాప్నోతి పురుషః ప్రేత్య చేహ చ.
దురాచారోహి పురుషో నేహాయుర్విందతే మహత్,
త్రసంతి చాస భూతాని తథా పరిభవంతి చ.
తస్మాత్కుర్యాదిహాచారం యదీచ్ఛేద్భూతిమాత్మనః,
అపి పాపశరీరస్య చాచారో హంత్యలక్షణమ్.
ఆచారలక్షణో ధర్మస్సంతశ్చాచారలక్షణాః,

సాధూనాం చ యథావృత్తమేతదాచారలక్షణమ్."

అని. సదాచార మనుశబ్దమునకు

"సాధవః క్షీణదోషాస్స్యుస్సచ్ఛబ్దస్సాధు వాచకః,
తేషామాచరణం యత్తు సదాచారస్స ఉచ్యతే."

మనుస్మృతియందును,

"తస్మిన్ దేశే య ఆచారః పారంపర్య క్రమాగతః,
వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే."
(౨ అ. ౧౮. ౧)

శిష్ట స్వరూపమును బోధాయను లిట్లు చెప్పిరి.

"శిష్టాః ఖలువిగతమత్సరాఃనిరహంకారాః కుంభీధాన్యాః
అలోలుపాః దంభదర్పలోభమోహక్రోధవర్జితాః."

మహాభారతారణ్యపర్వమునందు

శ్లో. "అక్రుధ్యంతోఽనసూయంతో నిరహంకారమత్సరాః,
ఋజవశ్శమసంపన్నాశ్శిష్టాచారా భవంతి తే.
త్రైవిద్యవృద్ధాశ్శుచయో వృత్తవంతో యశస్వినః,
గురుశుశ్రూషవో దాంతాశ్శిష్టాచారా భవంతి తే."

ఈ ప్రమాణములను బట్టిచూడఁగా శిష్టలక్షణములం గూడినజను లాయాదేశముల కుచితమగురీతిఁ జిరకాలము నుండి దేని నాచరించుచుందురో యది యాచారమని సారము తేలును. అట్టియాచారమునుండి ధర్మము కలిగెను. అనఁగా సజ్జనులయాచారము ధర్మవిరుద్ధము కాదనియు, నాయాచార మునుబట్టియే యెల్లరు నిది ధర్మమని గ్రహించి తమరు నట్లే యనుష్ఠింతురనియు, నాధర్మమున కధిపతి శ్రీమహావిష్ణువని

యెఱుంగవలయు ననుటచే ననాచారముగఁ బ్రవర్తించు వారికి భగవదనుగ్రహము కలుగదనియు, సదాచారము ధర్మజనకము గాన దానిప్రకారము ప్రవర్తించు వారికి ధర్మమయుండగు భగవంతుఁడు ప్రసన్నుఁ డగుననియు సారాంశము. కావున సదాచారమును మఱువరాదు మఱచినచో నైహికాల్పఫల మున్నయట్లు తోఁచునేమోకాని యాముష్మికఫలము శూన్యమగును. ఆముష్మికఫలము వలదనుమహాత్ములుగూడ నారోగ్యార్థమైనను సదాచారము నాశ్రయించు టుత్తమము. ఆయారోగ్యము కూడ వలదనువా రెట్టివారో యెఱుంగఁదరంబుగాదు. ఇఁక దరువాతివిషయమును బఠింతము.

దుర్వాసుఁడు శ్రీకృష్ణుని బరీక్షించుట.

*ఒక్కనాఁడు ధర్మోపదేశకాలమునఁ గౌంతేయాగ్రజుండు గాంగేయా విప్రప్రభావము నానతిమ్మా యని ప్రార్థించెను. భీష్ముఁడు ధర్మనందనా! నాకు నింద్రియపాటవంబు తగ్గుచున్నయది. వాఙ్మానసములు పరవశములగుచున్నవి. సూర్యుఁడు దక్షిణాయనముతుదికి వచ్చుచున్నవాఁడు దేహత్యాగము చేయఁదగుతఱి యరుదెంచెడిని. చిహ్నములద్దానినే సూచించుచున్నవి. శ్రీకృష్ణమూర్తి నీకు విప్రప్రభావంబును దెలుపఁగలఁడు. ఆమహాత్ముని బ్రశ్నింపుమనుటయు నాతం డచ్యుతుదిక్కు మొగంబై మహాత్మా! విప్రమాహాత్మ్యము చెప్పుమా యని ప్రార్థించెను. కరుణావలోకనము లాతనిపైఁ బొలయించి

* ఈవిషయము శ్రీమహాభారతము ననుశాసనపర్వమున నూటయేఁబదితొమ్మిదవయధ్యాయము మొదలుగాఁగలయధ్యాయములనుండి గ్రహింపఁబడినది.

యానంద ముప్పొంగుచుండ ని ట్లుపదేశించెను రాజా! మున్ను నన్నుఁ బ్రద్యుమ్నుఁ డిట్లే ప్రశ్నించెను. ఆతనికిం దెల్పిన విషయమునే నీకుం దెల్పెదను. వినుము. వర్ణములు మూఁడును మోక్షము సాధించుటకు, నమరపితృప్రీతికరములగు కర్మము లాచరించుటకు, నైహికసుఖము లార్జించుటకుఁ బూనువారలకు బ్రాహ్మణులేయాధారభూతులు. ఈకార్యముల యందు విప్రులు పూజార్హులు. వారి నవమానింపరాదు. దేవతలకుంగూడ నాయుశ్శ్రీకీర్తులు కలుగుట యన వారిప్రసాదమున నేకదా. * ఆగ్రహించి భస్మము చేయఁజాలుదురు అనుగ్రహించి వృద్ధిచేయ శక్తులగుదురు. కావున వారికిఁ గోపము కలుగకయుండఁ బ్రియంబు చేయవలయును. విశేషించి యానందము వారికిం గూర్చుచుండవలయును. అట్టివా రిహపరములయందు మేలుగాంతురు. దీనికి దృష్టాంతమగు నాయనుభవము నొక్కదానిం దెల్పెద ఆలకింపుము.

దుర్వాసుఁ డనుముని స్వతంత్రప్రవర్తనముకలవాఁడు. ఒకనాఁడు నాగృహమునకు వచ్చెను. మందహాస మొనర్చును. కోపగించును. సుముఖుఁడుగాఁ దోఁచును. విముఖుఁడుగాఁ గనంబడును. నేను భుజింప నగును. పెక్కుంద్రకుగాఁ జేసిన యన్నము మొదలగువాని నేనొక్కండన భుజింతు నగును. శయ్యపైఁ బరుండును. భూమిపైఁ బవ్వళించును. ఎక్కడకేని పోవును. మరలివచ్చును. ఇంట్లుండియుండి తటాలునఁ గృష్ణా! నాకుఁ బాయసంబు భుజింప వాంఛగల్గెను. పెట్టింపుమా యని యడిగెను. వారినోటనుండి యామాట వచ్చియు రాకముందే

* భస్మ కుర్యుర్జగదిదం క్రుద్ధాః ప్రత్యక్షదర్శనః. అని మూలము.

యట్లేయని పాయసము సిద్ధముచేయించి పెట్టించితిని. *ఆముని కొంత భుజించి మిగిలినదాని నాయంగమునకుఁ బూయుమని యెను. అట్లే యొనరించితిని. సమీపమున రుక్మిణి తిరుగుచుండ నాముని తటాలునంబోయి యామె దేహమునిండఁ దానే పాయసమును బూసెను. అంతియకాక రథమున కాదేవింగట్టి తాను రథమునెక్కి నాగృహమునుండి పయనముసాగించి త్వరగాఁ బొమ్మని నేను జూచుచుండఁగనే మునికోలచే రుక్మిణిం గొట్టెను. ఆయనముఖము మహాగ్నివలెఁ బ్రజ్వరిల్లుచుండెను. నాకత్తరుణమునఁ గోపముగాని యీర్ష్యగాని కలుగకయుండెను. నేనును వారితోడనే పోవుచుంటిని. ఈకృత్యమును గాంచి యాదవులాగ్రహవ్యగ్రమనస్కులై యనేకవిధములుగాఁ దమలోఁదమరు మాటలాడుకొనుచు నేమియుఁ జేయనేరక ప్రక్కల నడుచుచుండిరి.

అరదము లాగుచులాగుచుడస్సి రుక్మిణి తట్టుకొనఁజాలక పడిపోయెను. దుర్వాసుఁడుతటాలున రథముదిగి రుక్మిణిపై నింత ధూళిఁజల్లి కాలినడకన దక్షిణదిక్కునకు వేవేగపోయెను. ముని వెంటనేనును బరుగిడుచు మహాత్మా! యనుగ్రహింపుమా యని ప్రార్థించుచు నాయపరాధమున్న సహింపుమా యని వేఁడుచుఁ బోవుచుండఁ బ్రసన్నహృదయుఁడై యాముని మిమ్ముఁ జాల కష్టపెట్టితిఁగదా. అయ్యో! యనుచు నన్నుంజూచి కృష్ణా!

* శీఘ్రముంగాని లింపస్వ పాయసేనేతి సస్మ హ. అవిమృశ్యైవ చ తతః కృతవానస్మి తత్తథా, తేనోచ్ఛిష్టేన గాత్రాణి శిరశ్చైవాభ్యమ్ర్పాహమ్. ౨౬. స దదర్శ తదాభ్యాశే మాతరం తే శుభాననామ్, తామపి యమానస్స పాయసేనాభ్యలేపయత్. ౨౭. అని మూలము.

నీవు క్రోధంబు జయించితివి. స్వభావముననే మహాభుజుఁడవు. నీయందుఁ గరుణించితిని. వరంబు వేఁడుము. సర్వజనులు నిన్నే సంభావింతురు. సర్వలోకవంద్యుఁడవై సకలలోకవ్యాప్త యశోవిరాజితుఁడవై యుందువుగాక. కృష్ణా! *ఈపాయసమును నాదేహమునం దెల్లతావులం బూసి పాదతలమునఁ బూయవైతివి. కాన నీకు నటకాల మృత్యువు ప్రాపించు. అది మీఁజరానిది. అదియుఁ బరమపదప్రాప్తి కనురూపమగుటం జేసి నీకుఁ బరమశోభనం బనంజనుంగాని యశుభంబు కాదు. నాయందునునిచిన భక్తిభావమే బ్రాహ్మణులయెడ నునుపుము. అని నాకుపదేశించి రథము నీడ్చి మిగుల నలసియున్న రుక్మిణిం గాంచి సాధ్వీ! సౌందర్యమునను సౌభాగ్యమునను సాటిలేక కృష్ణుని పదాఱువేలయంతఃపురకాంతలయందు మాననీయురాలవై యుండుమని యాశీర్వదించి యంతర్హితుఁడయ్యె. రుక్మిణియు నేనును నవీనకాంతుల వహించియుండునంగములం జూచుకొనుచు నపరిమితానందము ననుభవించితిమి. గృహమునకుం బోయితిమి. ఇంటఁగల పదార్థములెల్ల విశేషించి మనోజ్ఞములుగ నుండెను. వానిం గాంచి యద్భుతానందముల ననుభవించితిమి. ధర్మనందనా! బ్రాహ్మణులన నిట్టివారు. కావున నీవనవరతము వారియెడ భక్తియుక్తుఁడవై యుండుము. అని యుపదేశించిన యుధిష్ఠిరుండు ప్రమోదపరిపూర్ణమానసుండయ్యెను.

---

* న తు పాదతలే లిప్తే కస్మాత్తే పుత్రకాద్య వై, నైతన్మే ప్రియమిత్యేవ స మాం ప్రీతోఽభవత్తదా. అని మూ.

మహామతులారా! ఇప్పట్టున నించుక వ్రాయఁదగును. ఆలకింపుఁడు. ధర్మరాజు గాంగేయుని విప్రమహత్త్వము నెఱిఁగింపుమని ప్రశ్నించెను. సకలధర్మముల నెఱింగిన కురుపితామహుఁడు శ్రీహరిని బ్రశ్నింపుమని హెచ్చరించెను ఆప్రశ్నమునకు బదులాశ్రీహరియే తెల్పిన బాగుండుననియేకదా భీష్మునియూహ. ధర్మజుఁ డట్లే కృష్ణపరమాత్మ నడిగెను. ఈ ప్రశ్నమునే మున్ను ప్రద్యుమ్నుఁడు నన్నడిగెను. ఆతనికిఁ జెప్పినసమాధానమునే యిపుడు తెల్పెదనని దుర్వాసునికథను జెప్పెను. దుర్వాసుఁడు తన్నుఁ బరీక్షింపఁగోరివచ్చి చేసినకార్యమంతయు నిందుఁ గలదుకదా. శ్రీహరి భగవంతుఁడని మునియెఱుంగును. ఏల పరీక్షించెను? లోకానుగ్రహార్థమే. ఏమది? ఐశ్వర్యగర్వమూనక మహాత్ములకు భక్తిభావనమున సేవచేయవలయుననియు, నట్లుచేయక విఱ్ఱవీఁగిననయ్యది త్వరగ నశించుననియు, నట్లుచేసిన శాశ్వతయశస్సు నిలుచుటయేగాక లోకమునఁ గలపామరులకు దృష్టాంతముఁకూడ నగుననియు దీనఁగల సారము. పాప మారుక్మిణీదేవిని రథమునకుఁగట్టి తాను రథముపైఁ గూరుచుండి వడివడి నడుపుమని తోలుటయు నామె పోవుచుఁ బడుటయు నంతమాత్రపుఁ బరీక్షచాలక కశాఘాతమున నామె నలయించుటయు ననునివి యచ్చెరువును గల్గించుటయేగాక యీకథ యసత్యము ననియుఁ దోఁచును. కథ జరగనే లేదనుట పొరపాటు. భగవంతుఁడు భక్తులను బరీక్షించును. దారపుత్త్రాదులవలన శోకమును గల్గించును. ద్రవ్యమును బోఁగొట్టును. ఎన్నియో యిక్కట్టులను గల్గించును. ఇన్నింటికి నోర్పుకొనినవానినే ముక్తునిం జేయును. లోకమున

సేవకుని సామాన్యమానవులు మంచివాఁడా కాఁడా యని పరీక్షింతురు. రాజు గొప్పపదవి నీయఁగోరినచో నాతని నెన్నియోవిధములఁ బరికించును. వీరిచ్చుఫల మత్యల్పము. భగవంతుఁ డిచ్చునది శాశ్వతముక్తి. అట్టిపదమున కర్హుఁడా కాఁడా యని సర్వజ్ఞుఁ డెఱుంగఁడా యనరాదు. లోకుల కెఱుంగఁ జేయుటకే యీపరీక్ష యని యెఱుంగుఁడు. మునులు చేయు పరీక్ష శాశ్వతయశస్సును గల్పించును. రుక్మిణివంటిదేవినే ముని కొట్టెను. దాని కామె యోర్చుకొనెను. దాన సనాతనయశస్సును సంపాదింపఁగల్గెను. అనుమానము లోకులకుఁ గలిగించుటకే యీపరీక్ష యని మన మూహింపవలయుఁగాని చప్పరింపరాదు. భగవద్భక్తిగలవా రిట్టికథలనే యోపికమెయిం జదువుదురు. సారమును గ్రహింతురు. ఆరీతిగాఁ బ్రవర్తింప నభ్యసింతురు. కృతార్థులగుదురు. కావున నీవిషయమునఁగల తేలఁగలనీతు లేవనఁగాఁ బెద్దలఁ గన్నపుడు వినయము గలిగియుండవలయుననియు, వారియాజ్ఞల మెలఁగవలయుననియు, నవి యన్నియుఁ దనకు శుభమును గల్గించుననియు నను నీమొదలగునవి. కలికాలమున మహర్షులు కనఁబడనందున బ్రాహ్మణప్రభావము గగనకుసుమమగుచున్నది. శాపానుగ్రహసామర్థ్యముగలవా రుండిన నిట్టి దురూహలు పుట్టకయుండునుగదా. ఇన్నింటికి భగవద్భక్తి ప్రధానమనుటే సారము. అది శమదమాదుల మూలమునఁగాని కుదురదు. అవి కలుగఁ బ్రయత్నింపవలయును. ఇఁకఁ దరువాతికథ నవధరింపుఁడు.

### శ్రీకృష్ణమూర్తి శివునిమహిమను జెప్పుట.

* ధర్మరాజు ప్రాంజలియై మహానుభావా! దుర్వాసుఁడు శంకరాంశసంభవుండని విందు. ఆశంకరుమాహాత్మ్యము నెఱింగింపుమా వినవలతు. అన హరి యిట్లనియె. రాజా! చక్కనిప్రశ్నను చేసితివి. ఏయది యడుగఁదగునో దానినే యడిగితివి. నాకెంతో తృప్తికలుగుచున్నది. శ్రద్ధగా నాలకింపుము. తొలుత శంకరునకు నమస్కరించి చెప్పఁబూనెదను. నేను బ్రాతఃకాలమున నిత్యకృత్యములందీర్చి శతరుద్రీయమును బారాయణము చేయుదును. దాని కధిపతి యాశివుఁడే. ఆమహాదేవునకు మించినవా రెవ్వరును లేరు. త్రిమూర్తుల కధీశుఁ డతఁడే. ఆతనియెదుట నేవారు నిలువఁజాలరు. ఆమహాదేవుఁడు రవంత కోపమూనిన నెల్లను భస్మమగును. ఒకప్పుడాశంకరునికోపాగ్నికీల ధర్మవిరుద్ధప్రవర్తకుల నాశమొనరించునుజుమీ. మహామునులు దేవతలు కలిసి శంకరుని మఱచి దక్షునిచే యాగము చేయించిరి. అది ధ్వంసము చేయఁబడెను గాదా. ఆయాగమున నెవ్వరెవ్వ రెట్టియెట్టిభంగము నొందిరో వింటివికదా. శరణు వేఁడినంతనే కరుణాపరతంత్రుఁడై కాపాడును.

పూర్వము త్రిపురాసురు లుక్కుమిగిలి పరమేష్ఠివలన వరములొంది గర్వించి యెల్లర బాధింపసాగిరి దేవత లామహాదేవునిం బ్రార్థించిరి. మేమెల్లఁ బశువులము. నీవు పశుపతివి. మమ్ముఁ గాపాడుట నీకు ధర్మమని మొఱ్ఱపెట్టికొనిరి కరుణాళు వగు నప్పార్వతీపతి యాపురములను మూఁడింటి నొక్కసారియే

* ఈవిషయము శ్రీమహాభారతానుశాసనపర్వమునఁగల నూటయెఱు డాధ్యాయములవరుసనుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

యొక్క బాణమున భస్మముచేసెను. ఆబాణమును దొడపైనిడి కొనఁగా నొకబాలుఁ డయ్యెను. ఈతఁ డెవ్వఁడని వెఱఁగంది దేవత లామహాత్ముని వేఁడఁగా నితఁడు దుర్వాసుఁ డనుపేరు గలవాఁ డనియెను. ఆబాలుఁడే మాయింటికిఁ జనుదెంచినముని యని యెఱుంగుము.

అనుటయు ధర్మరాజు శివుని ముఖ్యనామములు ప్రస్తుతించిన భోగమోక్షము లొనఁగూడునని వింటిని. వాని నెఱిఁగింపుమన హరి యిట్లు పలికెను. రాజా! ఈశ్వరునిగుణగణముల నుతియింప శతసహస్రజన్మములకైనఁ దరంబుగాదు. ఈప్రశ్నమునకు బదులుచెప్పుటయు మహాభాగ్యము. వినుము. అగ్నివాయువాసవామూర్త్యరూపుఁడగు మహాదేవుని వినుతించుటకంటె వేఱొండు పుణ్యకార్య ముండునే. శివునకు రెండు దేహములు కలవని మహర్షు లెఱుంగుదురు. ఒక్కటి ఘోరరూపము. వేఱొకటి శాంతరూపము. అగ్ని విద్యుత్సూర్యాత్మకమే యుగ్రరూపము. ధర్మచంద్రాద్యాత్మకమే సౌమ్యరూపము. ఘోరరూపము జగత్సంహారముచేయును. శాంతరూపము బ్రహ్మచర్యాదితపోనియమరూపమున నుండును. ఏయది యుగ్రత్వమునఁ బ్రతాపోన్నతి మెఱయునోయది రుద్రనామమును ధరించెను. దేవతలలో మహత్తరుఁడగుట మహాదేవుఁ డనునామధేయము కల్గెను. ధూమ్రరూపజటలే ధూర్జటి యనుపేరఁ బరగఁజేసెను సకలసత్కర్మరూపశుభములు గల్గించునుగాన శివుఁడను నామాయము చెల్లును. సుస్థిరతేజోవిరాజితుఁ డగుటంబట్టి స్థాణునామము ప్రఖ్యాతమయ్యెను స్థావరజంగమాత్మకములగు సకలభూతరూపబహుత్వమున వెలయుటం

జేసి బహునామము లాయనకు విఖ్యాతము లయ్యెను. బహు నేత్రము లుండుటసర్వతశ్చక్షువను పేరువచ్చెను. భూతములు పశువులగుటcదానుదానికిcబతి యగుటc బశుపతినామముకల్గెను. రాజేంద్రా! ఇట్టినామము లనేకములుగల యీశ్వరుని భజించు వారు ముక్తులగుదురు. ప్రపంచమున నెల్లయెడల వ్యాపించి భూతజ్యేష్ఠుc డనంబడుచు భక్తులకు సకలవాంఛల నొసంగుచు నున్నమహాదేవుని సేవింపవలయును. శివలింగము నర్చించుట యందు ముఖ్యము. ఆపూజవలననే శంకరుcడు భక్తులకు వశం వదుc డగును. విశేషించి పలుకనేల? రాజా! సర్వధర్మకార్య ములయందు శ్రీమహాదేవుని భజించుటయే శ్రేష్ఠమని నమ్మి నిరంతరము నావలెనే నీవు నట్లు లొనరింపుము. అని పలికిన విని ధర్మరాజు పరమామోద మందెను.

**శ్రీహరి గాంగేయున కూర్ధ్వలోకమున కరుగ ననుజ్ఞ నొసంగుట.**

* ఈరీతిగా ననేకధర్మముల నుపదేశించి మహర్షులెల్ల రానందింప ధర్మరాజు మనోదుఃఖమును దొలcగించి గాంగే యుcడు కాలమాసన్నమగుటంజేసి యతనిం గరినగరమునకుc బంపెను. సూర్యుం డుత్తరాయణగతుం డయ్యెను. ఆదినమే ధర్మరాజు ధృతరాష్ట్రప్రభృతులందోడుకొని శ్రీహరిం బ్రార్థిం చి పిలుచుకొని గాంధారప్రభృతికాంతామణు లరుదేర గంగా పుత్రునికడ కరిగెను. దూరమున రథము డిగి యడcకువమీరcc జని నమస్కరించెను. అనఘా! గంగానందనా! వచ్చినాcడను,

*ఇయ్యది యనుశాసనపర్వము నూటయఱువదియేడవయధ్యాయము ఢి సంగృహీతము.

ధర్మ జూఁడను. వలయుసంభారములం దెచ్చితిని. అగ్నులను, ఋత్విజులను దోడి తెచ్చితిని. వీరినెల్లం జూడుమని ప్రార్థించెను. ఆమాటలు శ్రుతిపుటములంజొరఁగా నాపగానందనుఁ డందఱం గనుంగొని ధర్మజుని గరముంబట్టుకొని మేలుగావించితివి. నీవు వచ్చుట నాయదృష్టముకదా. ఇది మాఘమాసము, శుక్లపక్షము నా కెంతో యానంద మిపుడు కల్గెను. అని పలికి ధృతరాష్ట్రు నుద్దేశించి మహారాజా! వేదశాస్త్రమర్మజ్ఞులగు వృద్ధుల సేవించితివి. సకలధర్మరహస్యముల నెఱింగితివి. వ్యాసమహర్షి దేవరహస్యముల నెన్నియో నీకుం దెల్పెను. నిష్కళంకమనీషుఁడవు. కావునఁ గాఁగలకార్యములకు నీవు సంతాపింపకుండుము. నీ కీపాండుపుత్త్రులు పుత్త్రులేకదా. వీరిం బరిపాలింపుము. వీరు చేయుశుశ్రూషలచేఁ జిత్త మూఱడనొందును. ధర్మజునకు ధర్మముల నెఱింగిన నీవు చేయఁదగినకార్యములం బనుపుము. నీయం దీతనికిఁ గలభక్తి నే నెఱుంగుదును. అధర్మజ్ఞులవినీతులు క్రూరస్వభావులగు నీకొడుకులం దలంచుకొనుచు వగవకుము. అని హితముపదేశించి శ్రీకృష్ణుని గాంచి దేవాది దేవా! సురాసురనమస్కృతపాదారవిందా! ముకుందా! త్రివిక్రమా! ఇదె నీకు నమస్కరింతును. శంఖచక్రగదాధరా! నీవే కదా సకలలోకాధీశుఁడవు. విరాట్టువు. త్రిమూర్తిస్వరూపుఁడవు. అట్టి నీవు నీకు మిగులభక్తుఁడనై త్వద్గతస్వాంతుఁడనై, యవివాహితుఁడనై, యపరిగ్రహుఁడనై యున్న నన్ను గాపాడుము. పుండరీకాక్షా! పురుషోత్తమా! నిత్యము నిన్నే నమ్మి యున్నవాఁడను. ఆలుబిడ్డలు లేనివాఁడను. కావున నన్నధిక కారుణ్యమునఁ గాపాడుము. దేహత్యాగమున కనుజ్ఞ దయ

చేయును ఈపాండుకుమారవర్గమును బాలింపుము దుర్మతి యగు దుర్యోధనుఁడు నాపంపుచేయ నొల్లఁడయ్యెను. ఎందుఁ బుండరీకాక్షుఁ డుండునో అందే ధర్మ ముండును. జయమందే యుండునని నొక్కి చెప్పితిని. కాని నామాటలు వాఁడు పెడ చెవింబెట్టి తమవారినెల్లఁ జంపించి తాను జచ్చెను. నరనారాయణులమహత్త్వ మే నెఱుంగుదును. జగముల రక్షింప నారాయణమునులు లీలావతార మెత్తుదురు. పరాశరాత్మజుఁడు, నారదుఁడు నాకుఁ బూర్వమే తెల్పిరి అట్టిమహాత్ముఁడవగు నీ వనుజ్ఞనిచ్చినఁ బరమగతి కరుగుదు. అని ప్రార్థింపఁగా శ్రీకృష్ణమూర్తి దేవవ్రతునివదన మాలోకించి *సత్యనిరతా! నీపయనమున కనుమతించితిని. నీవు యథాపూర్వకముగా వసువులను జేరుము. నీ కీలోకమున నించుకేని పాపము గలుగదు. మహాతేజశ్శాలివి. పితృభక్తుఁడవు. రెండవమార్కండేయుఁడ వనఁ దగుదువు. ఏభక్తివలన నీవశమున మృత్యువు భృత్యునిచందమున నిలిచెనో యాభక్తియే నీకుఁ దోడునీడ యగును. ఇఁకఁ దడవు లేదు. దేవలోకమునకుం బొమ్మని యాజ్ఞ దయచేయఁగా నాగాంగేయుఁడు మహాప్రసాదమని పాండురాజకుమారులను ధృతరాష్ట్రుని దక్కుంగలవారిని దిలకించి ప్రాణముల వదలఁ గోరెద. అనుమతియేకదా. అని వారినందఱం గౌఁగిలించుకొని యానృశంస్యంబును సత్యంబును నిత్యములుగాఁ దలంచి వాని నవలంబించి బ్రదుకుండని నచ్చఁజెప్పి † మరల ధర్మనందనుం

* అనుజానామి భీష్మ త్వాం వసూన్ ప్రాప్నుహి పార్థివ, న తేఽస్తి వృజినం కించిదిహ లోకే మహాద్యుతే. అని మూలము. † బ్రాహ్మణాశ్చైవ నిత్యం ప్రాజ్ఞాశ్చైవ విశేషతః, ఆచార్యా ఋత్విజశ్చైవ పూజనీయా జనాధిప. అని మూలము.

గాంచి, యార్యా! బ్రాహ్మణులెల్లం బూజ్యులు. ఋత్విజులును, నాచార్యులును విశేషించి పూజనీయులు. మఱువకుము. అని పలికి యూరకుండి ధారణాక్రమమున సమాహితచిత్తుం డయ్యెను. యోగాభ్యాసబలంబున నిరోధింపఁగ వాయువు లూర్ధ్వగమనంబు నంగీకరించెను. అంత నామహనీయమూర్తి శ్రీహరిప్రసాదపాత్రుండు కావున నాయాయవయవంబులనుండి ప్రాణముల బాపికొనుచుండ నవి వదలిన యింద్రియములు శల్యరహితము లగుచుండెను. ఆవిధమును గాంచి వాసుదేవాదు లచ్చెరువందుచుండిరి. విశేషించి యాగాంగేయుని యోగనిరూఢింగొనియాడిరి. భీష్ముఁడునిరోధింపఁగా నాతనియాత్మ శిరస్సును ఛేదించుకొని మహోల్కవలె నంతరిక్షమున కెగసి కొంత దూర మరిగి క్షణకాలమున నదృశ్యమయ్యెను. దేవదుందుభులు మ్రోసెను. పుష్పవృష్టి గురిసెను. సిద్ధసాధ్యాదులు పొగడిరి. ఇట్లు దేవవ్రతుండుభూతలంబునువదలి దివంబునధిరోహించెను.

భీష్ముఁడు తనయోగబలమున దివమ్మున కరుగ నాకళేబరమును ధృతరాష్ట్రధర్మపుత్రనకులసహదేవులు వహించి యథామర్యాదముగా సంస్కారవంతము గావించి చేయందగుకృత్యముల నొనరించిరి. అత్తఱి గంగాదేవి తనతనయున కుదకప్రదానము చేయు వెటింగి జలములనుండి వెడలివచ్చి వివర్ణవదన యగుచుఁ గౌరవులయెదుట నిలిచి కన్నీరు ధారగాఁ బ్రవహించుచుండఁగా నేడ్చుచు నిట్లు పలికెను. నిర్దోషులారా! గాంగేయునివృత్తమును మీరు నెఱుంగుదురు ఐనను దెలిపెదను. ప్రజ్ఞచేతను సత్కులముచేతను రాజవృత్తముచేతను నిస్సమానుఁడు. ఆతనిగొప్పతనము వర్ణనాతీత మనందగును. పరశు

రాముఁడు గెలువఁజాలక చనియెఁగదా. అని పలుకుచు బోరున విలపించెను. మఱియుఁ బ్రీతి నిలుపుకొనఁజాలక యింతవాఁ డొకశిఖండిచే నిట్లగుటఁ గనియు నాహృదయము తిలప్రమాణ శకలములు గాకయున్నది. ఆలోచింపఁగా నిది వజ్రమయ మేమో అని యన్నలారా యని సంబోధించి వగచుచుండు నాగంగానదిం గాంచి శ్రీకృష్ణుఁడు దేవీ! ఊఱడిల్లు మూఱ డిల్లుము. నీవు శోకింప నవసరము లేదు. దేవవ్రతుండు పరమగతి నొందినవాఁడు. శాపకారణమున వసువు మర్త్యలోకంబున వర్తించెను. ఆతనికై వగవకుము. ఒక్కశిఖండి యననేల? ఇం ద్రాదులయిన నాతనిం జెనకంజాలరు. స్వేచ్ఛచేతనే యంపశ య్యపైఁ బరుండియుండి సురపదమునకు వలసినప్పు డరిగెను. ఆమహనీయుంగూర్చి విషాదంపడనేల? అని యాశ్వాసించెను. పరాశరాత్మజుండును హితవచనంబుల నాసురనది నాశ్వాసిం చెను. ఆమెయుఁ దననెలవున కరుగ నెల్ల రామెవెంట నరిగి యామెః యనుమతి నొసంగ మరలిరి.

మహామతులారా! ఈవిషయమునం దొక్కవిశేషము గలదు. శివునిమహిమమును శ్రీకృష్ణుఁడు కీర్తించుతావులు పెక్కులుగలవు. వానింగూర్చి మరల వ్రాయనేల? శివకేశవుల కభేదమనుటయే దానినుండి తేలెడుసిద్ధాంతము. రెండవది గాంగేయప్రవృత్తిని గుఱించినయది. గాంగేయునకు స్వచ్ఛంద మరణము గలదు. తనయిచ్ఛవచ్చినపుడు దేహమువదలుటకు శక్తి యాతనికిఁ గలదని భావము. అట్టిదిగుండఁ గలదా యని ంద ఆచ్చెరువుపడుదురు. వారికి యోగవిద్యామహత్త్వము తెలియదనుటతప్ప వేఱొక్కసమాధానము లేదు. యోగము

నభ్యసించువారలు వాయునిరోధ మొనరించి దానిని లోపలనే సంచరించునట్టు లొనరింపఁగల్గుదురు. ఆస్థితియందా దేహము న కేబాధ లంటవు. ఆయోగమునకే ప్రాణాయామమని పేరు.

"విషం న దేహే క్రమతే తదీయే
దష్టే సుఘోరైరపి పన్నగేంద్రైః"

(త్రిపురాసారసముచ్చయము.)

భయంకరభుజంగములు తమవిషము నందెక్కించిన నది యాదేహమున వ్యాపింపదు. ఏల? వాయువు తదంతర్భాగ మును బూరించియుండును. అంతియగాక బాహ్యవాయువులు లోనికిం జొరఁజాలవు. రక్తము ప్రసరింప వీలుండును. నీటిలో నున్న నా దేహము చెడదు ఇంతయేల? అగ్ని దహింపఁజాలదు. ఈవిషయమును గురించియే

సూ. "తతః క్షీయతే ప్రకాశావరణమ్. ౫౨
ధారణాసు యోగ్యతా మనసః. ౫౩
స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార
ఇవేంద్రియాణాం ప్రత్యాహారః." ౫౪

అని పాతంజలియోగసూత్రము లనువదించెడిని. అట్టి స్థితియందుండువా రాహారము కోరరు.

శ్రుతిః "లోకస్య ద్వారమర్చిమత్పవిత్రం
జ్యోతిష్మద్భ్రాజమానం మహస్వత్,
అమృతస్య ధారా బహుధా దోహమానం
చరణం నో లోకేసుధితాం దధాతు."

అమృతధారలను ద్విసప్తతిసహస్రనాడీమార్గముల యందు వెదఁజల్లుచుఁజంద్రమండలసుధాగతసుధారసప్రవాహ

ములను వర్షించుచుండునని సారము. ఉపాస్యదేవతాపా దారవిందమరందముం గ్రోలుచు తద్ధ్యానాసక్తులై ప్రపంచ మును మానియుందురు.

సూ. "సోపక్రమం నిరుపక్రమంచకర్మ, తత్సంయమాదపరాంత జ్ఞానమరిష్టేభ్యో వా." ౨౨

"తత్ర సోపక్రమకర్మసాక్షాత్కారే తద్విపాకస్య ఝటితి భోగార్థబహుశరీరాణి గృహీత్వా యోగీ స్వేచ్ఛయా మ్రియతే" అని యోగసూత్రవృత్తి. యోగి స్వేచ్ఛగా మృతి నొందఁగలఁడని దీనిసారము. కావుననే,

"కర్మభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున"

అని శ్రీకృష్ణమూర్తి యర్జునున కుపదేశించెను. స్వచ్ఛంద మృతి యోగులకెల్లఁ గలుగ నవకాశ ముండునపుడు గాంగే యునివంటి మహాత్మునకుఁ గలుగు టొకయబ్బురమా? సామా న్యుల కీవిషయమున నిశ్చయము కలుగఁజాలదు. కాని పండి తుల కిందు సంశయింపఁదగిన విషయమే లేదు. భీష్ముని శ్రద్ధయు, సూనృతవ్రతపరాయణత్వము, సర్వమానవులకు నుదాహరణ ములు. భగవద్భక్తులలో నుత్తమోత్తముఁడగు నీతనిచరిత్రము పరమపావనమైనది. సత్ప్రవృత్తికి నీతని నుదాహరణముగఁ గైకొనవలయును. ఇఁకఁ దరువాతి శ్రీకృష్ణచరిత్రమును బఠిం తము.

గాంగేయుఁడు భూలోకమును వదలి దివి కరుగఁగా విహితసంస్కారము లొనరించి ధర్మరాజు తదేకచింత నుండెను. ×జనిమనోదౌర్బల్యమును బోఁగొట్టందలంచి శ్రీకృష్ణుఁ భంగుల రాజనీతులం దెలిపి భీష్మునికై పరితపింపకు ను

హెచ్చరించెను. శ్రీహరిమాటలకూఱడిల్లియాతండు ప్రశాంత చిత్తుఁడై రాజ్యము పాలించుచుండెను. వ్యాసాదులు ధర్మజుని మనస్సు నిశ్చితంబయ్యెనని యెఱింగి తమతమనెలవుల కరిగిరి. శ్రీకృష్ణుఁడు తనయవతారఫలమగు భూభారహరణ మనుకార్యము సాగుటయు నిఁక ద్వారకకుంబోయి యందుఁ జేయందగుకార్యము లెవ్వియేనుండిన నొనరింప మనస్సుగొనెను. అర్జునుఁడు శ్రీహరియుఁ గొంచెకాలము స్వేచ్ఛగాఁ దిరుగుచు ముచ్చటలాడుచు నుండిరి. నిష్కంటకమగు రాజ్యమున నరునకు విచారమును గల్గించుకార్య మేదియు లేకుండెను. నిరంతరము శ్రీకృష్ణపరమాత్మసంగతి కలుగుటయే మహాదృష్టమని తలంచుచుండెను.

ఒక్కనాఁడు కృష్ణార్జునులు సల్లాపములు చేయుచుండిరి. కర్మ మేయేకాలముల నేయేకార్యము లెవ్వరెవ్వరిచేత నెట్లెట్లు చేయింపవలయునో యాయాకార్యములను జేయించునుగదా. ఆసిద్ధాంత మక్షయము. కావున నర్జునునిసత్కర్మము శ్రీహరిని బ్రశ్నింపఁజేసెను. అంతకుముం దాబుద్ధి కలుగక యప్పుడే కలిగెను. కాలానుసార మాకర్మము బుద్ధిని బుట్టించెను. కావున నిట్లు ప్రశ్నించెను.

## శ్రీకృష్ణుఁ డర్జునునకు మరలఁ దత్త్వజ్ఞానోపదేశము చేయుట.

* శ్రీకృష్ణా! ఆనాఁడు యుద్ధసమయమున నాయాత్మ

* శ్రీమహాభారతాశ్వమేధపర్వము నాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడియెను. ఈయధ్యాయము మొదలుకొని తొంబదియవయధ్యాయముదనుకఁ గలవిషయసార మిందుఁగలదని యెఱుంగవలయును. ఆయాయిశాఖలయందుఁ బ్రమాణము లుదహరించునపు డధ్యాయములసంఖ్య తెలుపండును.

కలఁతనొందఁగాఁ దత్త్వము తెలుపు మహనీయవాక్యముల ననుగ్రహించితివి. కాని యావాక్యములమహత్తరార్థమును మది నిల్పుకొనఁజాలనైతిని. కృపాజలనిధివి కావున మరల వాని నుపదేశించి నాకోరికం దీర్పుమా యని ప్రార్థించెను. ఆప్రశ్నము నాలకించి శ్రీహరి యాతనిం జేరఁదీసికొని యాలింగన మొనరించి పార్థా! ఆనాఁడు రహస్యార్థము నుపదేశించితిని. సనాతనాచారపద్ధతిని దెలిపితిని. బుద్ధివిహీనుఁడవై శ్రద్ధావిరహితుఁడవై వానినెల్ల మది నిలుపుకొనఁజాలవైతివి. అది నాకెంతయు నప్రియమును గల్గించెను. మరల వానిని సమగ్రముగాఁ దెలుప శక్యము కాదు. దుర్బుద్ధివైతివే. బ్రహ్మపదము నెఱుంగుటకు మిక్కిలి సాధనభూతములగు నాఁటివాక్కులను మరలఁ దెలుపఁదరమా. ఐన నీప్రశ్నమునకు బదులిడక యూరకుండ వలనుపడదు. వాత్సల్యము పెంపునఁ దెలిపెదను. చక్కఁగా విని యిఁకనైన మది ధరింపుము. ఈవిషయము నొక్కయితిహాసరూపమునఁ దెలుపనెంచితిని. అది కల్పితమని యూహింపకుమా: జరిగినదియే యని నమ్ముము.

పూర్వ మొక్కపరి నన్నుఁ జూడ నొక్కవిప్రోత్తముఁడరుగుదెంచెను. ఉచితమర్యాదల నామహాత్ము నలరించి జ్ఞానధనా! తత్త్వజ్ఞానం బుపదేశింపుమా యని ప్రార్థించితిని. నాప్రశ్నమును విని యోగీంద్రుఁడు సిద్ధకాశ్యపసంవాదరూపముగ నున్న విషయమును దెలిపెను. అదియే నీప్రశ్నమునకు నుత్తరంబగును. తపశ్శాలియగు కాశ్యపుఁడు మహీసురవర్యుఁ డొక్కనాఁ డొకసిద్ధునికడ కరిగెను. ఆసిద్ధుఁడు విజితేంద్రియుఁడు గతానపారంగతుఁడు. సంత్యక్తసంసారపరిగ్రహుఁడు. లోక

తత్త్వార్థకుశలుఁడు. సుఖదుఃఖాదిద్వంద్వలక్షణవేత్త. పుణ్య-పాపపరిజ్ఞానకోవిదుఁడు. కర్మములచే దేహధారులకుంగలుగు నుచ్చనీచగతుల నెఱింగినవిద్వాంసుఁడు. ప్రశాంతచిత్తుఁడు. బ్రహ్మతేజోవిరాజితుఁడు. అంతర్ధానగతివేత్త. కావున నే యాకాశ్యపుఁ డాతనిచెంత కరిగి వినయవినమితకంధరుఁడై శిష్యభావంబు మెఱయ నాశ్రయించెను. ఆసిద్ధుని తేజ మపారముగ నుండెను. నాలుగు దెసల వెలిఁగించుచుండెను. కృష్ణా! ఆయిరువురసంభాషణము నే నీకుం దెలుపుదును. అవధరింపు మనియెను. అర్జునా! ఆవిషయమే నేను నీకుఁ దెలుపుచున్నాఁడను.

ఆసిద్ధుఁ డావిప్రునిం గాంచి యిట్లు వక్కాణించెను. బ్రాహ్మణోత్తమా! లోకమునఁ బుణ్యకర్మములను సర్వదా చేయుచు మానవు లైహికసుఖంబులం బడసి స్వర్గమునొంది యందు గొంత కాలము నివసించి యందుండి మరల మర్త్య లోకమునకు వచ్చును. అంతియ కాని యెందుఁగాని ప్రాణి శాశ్వతముగ నుండఁజాలఁడు. కామక్రోధముఖము లగుచిత్తమలవిషములచేతఁ బలుమాఱు జన్మమును మరణమును గలుగుచుండును. ఈజన్మములయందుఁ బెక్కువిధము లగునాహారముల భుజించితిని. పెక్కండ్రస్తన్యములను బీల్చితిని. తల్లులను దండ్రుల నెందఱినో యెన్నితెగలవారినో కంటిని. సోదరులను గుమారులను బెక్కుజాతులను జూచితిని. అనేకసుఖములను దుఃఖముల ననుభవించితిని. మిత్త్రులవియోగమును శత్త్రువులతో సంగతిని గాంచితిని. ధనములఁ బోఁగొట్టుకొంటిని అతిశ్రమము లొంది యెన్నియో ధనముల సేకరించితిని అవమానములను గష్టముల ననుభవించితిని. ఎన్నియో వచింపరానికష్టముల నను

భవించితిని. మానసశారీరనానావేదనలకుం జిక్కితిని. పెక్కు నరకములం గంటిని. వానికష్టముల ననుభవించితిని జరారోగములు, భూరివ్యసనములు నన్ను బాధించెను. లోకు లనుభవించుసుఖదుఃఖాదిద్వంద్వముల ననుభవించితిని.

కొంతకాలమునకు విసుగుదోఁచెను. వెంటనే లోకతంత్రంబును వదలితిని లోకసుఖదుఃఖముల ననుభవించినవాఁడఁ గావున నిఁక వానిజోలికిం బోఁగూడదని యీమార్గము ననుసరించితిని. ఇట్టిసిద్ధిని బడయఁగల్గితిని. ఇది యాత్మప్రసాదఫలము. ఇంక నీలోకంబుల నాలోకింప నా కీసృష్టి యుండునంతదనుక బుద్ధిపుట్టదు శుభములే కలుగుచుండును దుఃఖములు కలుగఁజాలవు బ్రాహ్మణోత్తమా! ఇప్పు డేసిద్ధి నాకుఁ గలిగినదో యిఁక ముం దింతకుమించిన శుభగతులే నాకు గలుగుచుండును. అవ్యక్తంబగు బ్రహ్మపదము సులభంబే యగును. మరల నీమర్త్యలోకమునకు రాను. నీదెస సంప్రీతుఁడనైతిని. నీవు కడుం బ్రాజ్ఞుఁడవు. నీకేమి యుపకార మొనరింపవలయునో నాకుం దెలుపుము. దాని నొనరింతును. నావలన నీ వేసిద్ధిని బడయఁ గోరివచ్చితివో యదిగల్గుటకు మంచికాల మిదిగో వచ్చెడిని. ఆసిద్ధిని కలుగఁజేయుదును. తప్పను నన్నుఁ దెలిసికొని వెదకుచు వచ్చితివి నిన్నుంజూడ నామనస్సు తృప్తినొందినది. కావున నిన్నుఁ జేపట్టితిని. మనస్సునఁగలవిషయమును దెల్పుమా అని తిమ్మైఁ బ్రశ్నించెను. కాశ్యపుఁ డాహర్షసంయుతవాగ్జాలమునకుఁ బరమప్రమోదము నొందెను. మహాత్మా! నన్నుంగే తత్త్వప్రబోధనమునఁ గృతార్థాత్మునిగా నొనరించి జన్మమరణరూపదుఃఖము కలుగకుండఁ జేయుము.

సిద్ధవర్యా! శరీర మెట్లు నశించును? ఎట్లది మరలఁ గలుగును? అతికష్టమగుసంసారమునఁ బరిభ్రమించుచుఁ బరిముక్తుం డగును? ఆత్మయుఁ బ్రకృతినివదలి యాశరీరమును వదలును? ఆశరీరమునుండియు ముక్తిపొంది వేఱొండుశరీరము నొందును? మానవుఁడు శుభాశుభకర్మముల నొనరించి తత్ఫలముల నొందును? విదేహునకుఁ గర్మ మెందుండును? అను నీప్రశ్నములను విని యాసిద్ధుఁ డాదరంబున నిట్లు బదులు చెప్పెను. కాశ్యపా! నీప్రశ్నములకు సంగ్రహముగ నుత్తరము పలుకుదు. ఆలకింపుము. ఆయుఃకీర్తికరములగుకర్మముల నెవ్వానిని శరీరగ్రహణకాలమునఁ జేయునో వానిఫలముల ననుభవించును. అవి క్షీణింప నదియు నశించును. దుష్కర్మముల నాచరించువాఁ డాయుఃక్షయపరీతాత్ముఁడై విపరీతఫలముల ననుభవించును. వినాశము దాపునకు రాఁగా వానిబుద్ధి వికృతిం బొరయును. అవివేకి యగుమానవుఁడు తనసత్త్వము బలమును దనకయ్యెడుకాలంబును జక్కఁగా బరికింపక హద్దుమీఱి యాహారములఁ గొనును. అవి తనకు విరుద్ధములైనను మానఁడు. ఇవి తనకు మంచివని యివి మంచివిగావని యాలోచింపఁడు. ఒక్కసారి యమితముగ భుజించును. ఇంకొక్కసారి దుర్భిక్షము నుపవసించును. కాలముగడచినదియు, నపక్వమును, గురుతరము, దుష్టము, విషమము, విరుద్ధము, విపులరసము నగునన్నమును దా నరయక భుజించును. ఆహారముపై నాహారమును దినును తిని నిద్రఁ బొందును. సురతకేళికిం దొడంగు. విశేషించి యాయాసపడును. అట్టివి మూఢునిదోషత్రయము బాధించును. పగటినిద్రయం దాదృతిం గాంచును. అపక్వాన్న సేవనమువలన

దోషములు ప్రకోపించును. స్వదోషములు ప్రకోపించుటవలన మరణాంతికరోగము కలుగును. అర్హకర్మముల మానుటయే రోగహేతువు. కామరోషములచేఁ గాయము నశించును. ఇదియే శరీరచ్యుతికి హేతువని యెఱుంగుము.

## రోగవికారములు.

మిగుల బలవంతము లగుపిత్తవికారములు చెలరేఁగి తీవ్రవాయువు ప్రేరేపింపఁగా దేహమునఁ నెల్లయెడల వ్యాపించి ప్రాణములకు శీఘ్రంబె నాశనమును గల్గించును. ఉండ దేహమునఁ జోటులేకుండఁ జేయును. *బలవంతములగు నావికారములు వ్యాపించి యెందెందు భిన్నముచేయునో యయ్యెడలు మర్మములను పేరులుగలవియై మర్మభిన్నత్వ మేల చేయకయుండును? దాన జీవమునకుఁ బరిచ్యుతి కల్గకుండునా? ఆవేదనలకుం దాళఁజాలక జీవుఁ డప్పుడే ప్రచ్యుతిం గాంచును. మర్మములు శిథిలతం గాంచఁగా నం దెట్లుండఁగలదు? విప్ర ప్రవరా! శ్లేష్మమనుపేరం బరఁగుదోషము వ్యాపించి యవయవములను జడత నొందఁజేయుటేకాక లోపల వెలుపల నాచ్ఛాదించును. అంతటితో నూరకుండదుసుమీ. కంఠమున కడ్డపడును. ఊర్ధ్వశ్వాసమును గల్గించును. అట్టి స్థితియందా దేహమున నుండఁజాలక జీవుఁడు ప్రయాణముచేయును. జీవుఁడు వెడలుచుండుతఱి నవయవభాగములు చల్లఁబడుచుండును. స్రోతోమార్గములను గషము నిరోధింపఁగాఁ

---

* అత్యర్థం బలవానూష్మా శరీరే పరికోపితః, భినత్తి జీవస్థానాని ర్మాణి తత్త్వతః. ౧౬. తతస్సవేదనోజీవ స్సద్యః ప్రచ్యవతేక్షరాత్, [illegible] త్యజతేజంతుశ్ఛిద్యమానేషు మర్మసు. ౧౭. అని మూ. ౧౭. అధ్యాయము.

జెడును. దాన నింద్రియశక్తులు చేష్టితములు నశించును. వాయు వంగములయందు దుర్వ్యాప్తిచే బాధగలిగించును. రోగములఁ బుట్టించును.గర్వమడంచును.సంధుల సడలించును. క్రమముగా దేహమును వ్రానుగ నొనరించి జీవునిఁ బ్రయాణము చేయును. అత్తరుణమున నాలుక యాడదు. చేతులు కాళ్లు కదలింప వలనుపడదు. వాయుగతుల ననుసరించియే యివియుండునని యెఱుంగవలయును. ఒక్కొక్క కాలమున నిట్టివి రెండుమూఁడు కలిసియుండును ఆస్థితికే సన్నిపాతమని పేరు. అయ్యదియే తనువునుండి జీవు నెడఁబాపును.

వాయుగతులు దేహమున నుండనీక తన్ను వెడలింపఁగా జీవుఁడు తనకర్మములగతుల ననుసరించిపోవును. కర్మముల కనురూపములగు సుఖదుఃఖముల నాయాయితనువులం దాల్చి యనుభవించుచుండును. తనకర్మఫలమును జక్కఁగా ననుభవించి తగినజన్మము నెత్తును. ఈరీతిగనే జీవుఁడు గతాగతముల ననుభవించుచుండును.పాపాత్ములు నరకము నొందుదురు. పుణ్యాత్ములు స్వర్గము నొందుదురు. ఇది విధివశమున నొందునదియే కాని స్వతంత్రమార్గమునఁ గాదు. అంతియగాని నిర్లేపమగు మోక్షము నొందఁజాలరు. ఏమానవు లూర్ధ్వగతికిఁ బోవఁజాలుదురో అట్టి యుపాయము లివ్వి యని మహాత్ములు నిర్వచించిరి. ఆనిర్వచనమును వినిపింతు. సోమమండలమునందు, నక్షత్రమండలమునందు, సూర్యమండలమునందు ధర్మాత్ములుందురు. పుణ్యము క్షయింపఁగా నందుండి తొలఁగింపఁబడుదురు. అట్టిలోకము సుఖప్రదమగునా. శాశ్వతసుఖదము మోక్షముకదా. అట్టిదానికిఁ బ్రయత్నింపవలయును.

అనిపలికి గర్భావాసప్రకారం బెఱిఁగింపం దలంచి సిద్ధుఁ డిట్లులనిరి. ఓబ్రాహ్మణోత్తమా ! శుభాశుభకర్మములకు ఫల మనుభవింపక తప్పదు. ఆత్మమనుష్యవశగతము కావున నదియే జన్మకారణమని యెఱుంగుము శుక్లశోణితములు కలిసి వనితా గర్భాశయమునఁ జొచ్చి బ్రహ్మశక్తి బీజత్వనిరూఢింపజేసి పిండంబగు ఆబీజము పిండము దేహమునఁ జైతన్యరూపత్వ మున వ్యాపించి శిరస్సు మొదలగునవయవముల నేర్పఱచును. జననకాల మాసన్నముకాఁగా నందుండివెడలి తనపూర్వకర్మ ములకు ననురూపములగు ననేకభేదవర్తనములఁ బొందును. అవి నశింపఁగా మరల జన్మము కలుగును. దీనికిం గారణము కర్మపరంపరయే యని యెఱుంగవలయును. ద్విజవర్యా ! * ఎంతకాలము పునరావృత్తి యనునదిలేని నిరుపమానముక్తి నొందకుండునో యంతకాలము వరుసగా జననమరణములు విడువక కలుగుచునే యుండును. కావున నట్టిపునరావృత్తిలేని మోక్షకారణమును దెలిపెద ఆలకింపుము.

దానము, వ్రతము, బ్రహ్మచర్యము, యథోక్తబ్రహ్మ ధారణము, దయ, పరధనదారవర్జనము, దమము, శమము, సంయమము, నానృశంస్యము, నియమము, యమము, నింద్రి యనిగ్రహము, జననీజనకగురుజనపూజనము, దేవతలను, బిత రుల, నతిథులను బూజించుట, సత్యము, సదాచారము, శుభ వర్తనము, ధైర్యము, క్రౌర్యమునిరసించుట యనునివి పుణ్యా

* యచ్ఛ కురుతే కర్మ శుభం వా యది వాఽశుభం, పూర్వదేహ సర్వస్తే మవశ్యముపభుజ్యతే. తతస్తు క్షీయతే చైవ పునశ్చాన్యత్ప్ర , యావత్తన్మోక్షయోగస్థం ధర్మం నైవావబుధ్యతే అనిమూలము.

వృత్తములు. ఇవిగలవాఁడు పుణ్యాత్ముఁ డనంబడు. వీని నాధారముగాఁ గైకొని మోక్షమునకుఁ బోవ సర్హుఁ డగును. వీని ననుష్ఠించుచుండిన ధర్మము పొడసూపు. దానిసూక్ష్మమార్గములనుబండితులకడనుండి తెలిసికొనవలయును. అధర్మసూక్ష్మములు వారిశీలవృత్తములే బోధించుచుండును. పెద్ద లుపదేశించు శాంతగంభీరార్థవాక్యములు శ్రద్ధగా వినఁగా వానియందుఁగల విశేషము లంతఃకరణారూఢము లగును. ఆవల నాపదలు కలుగవు. సర్వదా సుఖముగలవాఁడగు వ్రతాచరణమున నిష్ఠగలిగియుండి యింద్రియజయము శాంతియుఁ దోడుపడఁగాఁ బరబ్రహ్మానుసంధానము చేయుచుండువానికి ముక్తిలభించుట సులభంబై యుండు. అట్టివానికి హర్షశోకములవలని బాధలు గలుగవు. తీవ్రమోహాంధకారమునఁ జిక్కుపడఁడు. సంసారతాపములను వరుసగా వీడి మహానందము నొందును.

## తత్త్వజ్ఞానవిశేషము.

సృష్టి చేయఁబూనినకాలమునందు బ్రహ్మ ప్రధానమను పేరుగల తత్త్వంబును గల్పించెను. చేతనముగలదానినిగా నొనర్చెను. అదియే క్షర మనఁబడును. దానికంటెఁ బరమగు తత్త్వ మక్షరమనియు నమృతయనియుఁ జెప్పంబడు అమిథునమునుండి యుత్పన్నములయినవియే సకలభూతములని యెఱుంగుము. అద్వంద్వమేసకలజీవబీజమని శ్రుతివాక్యసంభృతార్థము. భూతములు గమనాగమనములను బ్రహ్మ కల్పించెను. కావున నవి పరిభ్రమించుచుండును. పుణ్యాతిశయమున జీవాత్ముఁ డొక్కఁడు తన్నుఁజూడఁగా సుఖము ననుభవించుజన్మముం గాంచును. విపరీతమైన దుఃఖము ననుభవించుజన్మమును గాం

చును. సుఖదుఃఖములనిత్యములనియు, దేహమపరిశుద్ధమనియు, సకలపదార్థములు నశ్వరములనియుఁ, గర్మనిరూఢత్వము జాడ్యమనియు నెప్పు డూహించునో యప్పుడు తన్ను నావరించి యుండు మోహాతిశయమును దొలఁగంద్రోచి మోక్షము నొందవలయునని కోరును. సంసారసాగరమున మునుంగఁడు. ఆస్థితియందుండువానికిఁ గల్మషము లుండవు. జన్మము రోగము జరామరణములు ననువానిం గాంచి ప్రకృతికార్యమును జక్కఁగా నెఱింగి దానివలనఁ గలుగుక్లేశమునకు విసుఁగు నొందుమానవులు పరమపదమునొందఁ బ్రయత్నింతురు.

ఆస్థితియందుండువాఁడు నిర్మానుష్యప్రదేశమునఁ గూరుచుండి మనస్సున నేచింతయును లేక యూఱటంగాంచియుండక తోఁచువానినెల్లఁ దొలగించుకొనుచు నిరాలంబనుండై యుండు. అట్టివాఁడే సర్వమిత్రుండగు, సర్వసహుండగు, నిర్జితేంద్రియుఁడగు నిర్భయుండునగు. కామక్రోధహీనుఁడు, శమప్రధానుఁడు, మానాభిమానవిహీనుఁడగు. సర్వభూతాత్మకత్వదర్శనముగలవాఁడగు. ఈచెప్పినసుగుణములయం దేదియుండినను ముక్తి నొందఁజాలును. అన్నియు నుండిన నిఁకఁ జెప్పవలసినదేమి !

లాభాలాభములు, ప్రియద్వేషములు, సుఖదుఃఖములు నెవనికి సమములుగ నుండునో ఆశపడుట అవజ్ఞత యెందును లేక సర్వధర్మములయం దాశ. ధర్మశీలత యనునవి లేకయుండునో మిత్రుఁ డొకఁడు శత్రు వొకఁడు నట్టివాని కుండరు. ధర్మార్థకామములయం దిచ్ఛ నాతని కుండదు. ఎవ్వని కకర్మభావము, తాపత్రయాపగమనము వైరాగ్యసుస్థిరత్వము నెవ్వ గల్గునో వారెల్ల నవ్యయపదంబన బ్రసిద్ధమగు ముక్తిని

గాంతురు. అసమాలంబనము, అశబ్దరసగంధస్పర్శము, అగుణము, నుల్లసితగుణము నగునాత్మను అభ్యాసనియతిపరుఁ డోకఁడే పొందును. సర్వసంకల్పముల విసర్జించి, మనస్సునందుఁ బరమ శాంతి నెలకొలిపిన యాపుణ్యపూరుషుఁడు కట్టెలు లేని యగ్నివలె మెల్లగ వికారశూన్యమగు నిర్వాణమును బొందును. అని తెలిపి యోగి జనానుభావ్య మగుస్థానము నెఱింగించెద. దాని చేత యోగు లాత్మదర్శనానందంబు నొందుదురు. కాన దానిని శ్రద్ధమై నాలకింపుమని సిద్ధుం డిట్లనియె.

## యోగమార్గములు.

ద్విజోత్తమా! యోగమార్గము లనేకములు వానియం దేమార్గమైనను భగవంతుని జేర్పంగలదు. *ముంజము శరీరము. ఆత్మ దానినుండి వెడలించిన యిషీకముగాఁగఁ గనుఁగొనవలయును. ఇదియే యోగవేత్తయుపాయము. తనువునుండి వెడలించి జీవాత్మునిఁ గాంచును. ఆయుపాయ మెవ్వఁడెఱుంగునో ఆతరుణమున యోగి జననమరణాదుల నొందఁడు. అంతియగాక భక్తులగు వారికి నాపరమపద మీయఁగలఁడు. పరబ్రహ్మానుసంధానమే యిందులకుం గారణంబని యెఱుంగుము. దేహము స్థిరమని యూహించి యాత్మయం దధికనిష్ఠకలవాఁడు భూతముల వేనివలనఁగాని భయము నొందఁడు రాగాది దుఃఖములకు లోఁబడఁడు [1]యోగనిష్ఠుని శస్త్రములు

*ఇషీకాంచ యథా ముంజా త్కశ్చిన్నిష్కృష్యదర్శయేత్, యోగాన్నిష్కృష్య చాత్మానం తథా పశ్యతి దేహతః. ౨౨. ముంజం శరీరమిత్యాహు రిషీకామాత్మని శ్రితాం, ఏతన్నిదర్శనం ప్రోక్తం యోగవిద్భిరనుత్తమం. ౨౩. అశ్వమేధపర్వము ౧౯ అధ్యా. 1 నైనం శస్త్రాణి వధ్యంతే నమృత్యుశ్చాస్య విద్యతే, నాతస్సుఖతరం కశ్చిల్లోకే క్వచనదృశ్యతే. ౨౯ అని మూలము.

వధింపఁజాలవు. జలములవలన మృతి యతనికిఁ గలుగదు. యగ్ని బాధయు నుండదు. ఏవికారము లాతనికిం బొడసూపవు. ఆతఁ డెట్టిపదమును గోరఁడు. తనయందే తన్నుం జక్కఁగా గనుచుం డును. కావున నాతని కద్దానిమించినసుఖ మేవిషయమున నున్నయ ట్లగపడదు. శాస్త్రీయమగుయోగానుష్ఠానమున నాత నికి విసుకుదోఁపకుండుటయే యిందులకుం గారణంబని యెఱుం గుము. అట్టి యనుష్ఠాన మెట్టిదో తెలిపెద వినుము.

తా నేమార్గము నెఱుంగునో యాత్రోవను విడనాడక మనస్సు నంతర్వర్తిగా నొసరించి బాహ్యగతి దానికిం గలుగక యుండంజేసి యెందు నిశ్చలతఁ గాంచునో యందు నిలుపవల యును. ఆమార్గ మెట్లందువో దంతములు, నాలుక, కంఠము, దవు డలు, గళనాళము, హృదయమును జింతింపవలయును. లోపల మన స్సెచ్చట మెలగునో తాను దానినుండి మరలింపక యందె నిలుపవలయును. అని తెలిపి కొండొకనవ్వుచు నావిప్రుండు నామోమునుగాంచి శ్రీహరీ! యాసిద్ధుండను నేనేకదా. నేనె ఱుంగనిదికలదా! అనిపలికి మఱియు నాకార్యపుం డడిగినదానికి నుత్తరంబుగా నే చెప్పిన మార్గంబు వినుమని మఱియు నిట్లు పలికెను.

లోపల నునిచినమనసు నేమఱక యాత్మ వెదకుటెఱుఁగు సర్వోత్తమము. ప్రయత్నపూర్వకముగా మనస్సు స్థిరతఁ గాం చఁజేసి వివేకమున దానిస్వాధీనపఱచుకొని నిరంతరము ప్రకా శపరబ్రహ్మమును నేర్పఱియగుయోగి కాంచఁగలఁడు.

*ఆతత్త్వ మనాది. చక్షురాదీంద్రియములకు గ్రాహ్యముకాదు. సకలమలములవదలి ప్రసన్నమగుమనోదీప మాతత్త్వమును గనఁబఱచును. సర్వదిక్కులఁ బాణిపాదములు గలది. శిరస్సులు కన్నులెల్లయెడలఁ గలది. ఆతత్త్వము మహత్తరతేజోరాశి యయియుండఁగా యోగి దాని నభ్యాసబలమునఁ గాంచఁజాలును ఇది బ్రహ్మవిద్యారహస్యము. దీనినంతయు నీకు నెఱింగించితిని. సుఖవిగమ్ము. పొమ్ము. నేనుం జనువాఁడ. అని సాగనంపిన సర్వసంశయవిరహితాత్ముఁడై యాశిష్యుఁ డరిగెను. నేను నిన్ను దర్శింపవచ్చితిని అని యాబ్రాహ్మణోత్తముండదృశ్యుండయ్యె. అర్జునా! పరమహితమగు నీవాక్యము నాలకించితివికదా. ఆనాఁడు రథస్థుండవగు నీకు నీయర్థవిశేషంబు తెలిపితిని. మఱచితివి. అని మఱియు వాసుదేవుం డాతని కిట్లనియె. [1]పార్థా! ఈతత్త్వము సంశయగ్రస్తచిత్తునకుఁగాని, సంస్కారరహితునకుఁగాని, శ్రద్ధలేనివానికిఁగాని యుపదేశింపరాదని యెఱుఁగుము. మున్ను నే నీవిషయమును దేవతలకు నుపదేశించితిని.మానవులయందు నిన్నువదలిన నుపదేశింప నర్హుఁడు నాకిపుడు గానరాఁడు. ఇది పరమరహస్యము. ఈ నాయుపదేశమున దీని నెఱింగి యమృతవస్తు విదికదా యని తెలిసికొని సకలదుఃఖములవదలి మానవుఁడు నిత్యముక్తుఁడై ప్రకాశించును. [2]వైశ్యులును, స్త్రీలును, శూద్రులునుగూడ

*న త్వసౌ చక్షుషాగ్రాహ్యో న చ సర్వైరపీంద్రియైః, మనసైవ ప్రదీపేన మహానాత్మా ప్రదృశ్యతే. ౪౦. అని మూలము 1 నైతత్పార్థసువిజ్ఞేయం వ్యామిశ్రేణేతి మే మతిః, నరేణాకృతసంజ్ఞేన విశుద్ధేనాంతరాత్మనా. ౫౬. అనిమూలము 2 ఇమం ధర్మం సమాస్థాయయేపిస్యుః పాపయోనయః, స్త్రియో వైశ్యా స్తథా శూద్రాస్తేపియాంతి పరాంగతిం. కిం పునర్బ్రాహ్మణా

౦విషయము నెఱింగిన ముక్తులగుదురు. ఇఁక బ్రాహ్మణులు క్షత్రి
యులును ముక్తులు కారని యనుమానింపనేల ? ధర్మము
తెలియు నుపాయమును దెలిపితిని. ఫలసిద్ధిని బోధించితిని.
మోక్షసౌఖ్యము ననుభవించుపద్ధతింగూడ నెఱిఁగించితిని.
౦నినిమానిన సుఖపడుమార్గ మింకొకటి లేదని యెఱుంగుము.
లోకమున నేమానవుఁడు శ్రద్ధావంతుఁడై లోకసంగమును
మాని దానిచెంతకైనం బోవక యీయుపాయముల నెఱింగి
ప్రవర్తించునో యాతఁడు మోక్షసామ్రాజ్యమున కధిపతి
యగును. ఇంచుకంతయు సంశయము లేదు. ధనంజయా! తెలుపఁ
వగినదెల్లఁ దెలిపితిని. ఇంతకు విశేషించి తెలుపఁదగినది లేదు.
*ఈయుపాయము నాశ్రయించి నిత్యము యోగమును
సాధించిన నాఱునెలలకు నది సిద్ధించును. అని శ్రీకృష్ణమూర్తి
యర్జునున కధ్యాత్మవిషయములు తెలిపి మఱియు నాతనిచిత్త
మురియాడకుండఁ జేయుతలంపునుగొని యిట్లు మాటలాడెను.

## బ్రాహ్మణగీతలు.

[1]విజయా ! నీవలని ప్రీతిచే నింకను గొన్నిరహస్య
ముల నెఱింగింతు. అవధానమున వినుము. భార్యాభర్తలసం
వాదమున నావిషయము గలదు. దానం దెలిసిన నీ కీవిషయము
బోధపడును. జ్ఞానవిజ్ఞానపారగుఁడగు బ్రాహ్మణుఁడొకఁడుండెను.
నియతాత్ముఁడగు నాభూసురుఁడు విజనప్రదేశమున నుండఁగోరు

పార్థ క్షత్రియావా బహుశ్రుతాః స్వధర్మరతయోనిత్యం బ్రహ్మలోకపరాయణాః. ఉ.౨. అని మూలము.

* షణ్మాసం నిత్యయుక్తస్య యోగః పార్థ ప్రవర్తతే అని మూలము.
[1] ఇది అనుగీతలయం దిరువదవయధ్యాయమునుండి కలదని యెఱుంగునది.

డు. ఆతనిచెంతకుఁబోయి భార్య వినయము భక్తియు
ప్పారఁగా నమస్కరించి మహాత్మా! నాయజ్ఞానమును దొలఁ
చి యథార్థాత్మవిద్యాభరితచిత్తనుగా నొనరించి కృతకృత్యను
ఁ జేయుమాయని వేఁడెను. దయచే నావిప్రునిచిత్తమును
ఁగించెను. భార్య యిట్లువిచిత్రరీతిఁ బ్రశ్నించుట కానందించి
దహాసము ముఖారవిందమునఁ దోఁపఁ బల్కింగాంచి సతీ!
నే లోకమును నిన్నుఁగూడిపొందఁగలను? భార్య భర్తృసం
దితలోకములను బొందఁగలదని విన్నదానను. కావున నీవం
మహాత్ముని భర్తనుబడసిన నేనేగతికిం బోవుదును? అన్నవిష
మును బ్రశ్నమున నిమిడియున్నవి. ఆనందించితిని. నిర్దోషు
లా! ఈప్రశ్నమున కసూయపడను. కావున నీప్రశ్నమునకు
లుచెప్పెదను. ఓపికతో నాలకింపుము. నేను బెద్దలవలన విని
హించినదాని నీ కుపదేశింతును. అనిపలికి వ్రతపారాయణుం
నాబ్రాహ్మణుం డిట్లు చెప్పఁబూనెను. వినుటకుఁ జేయుటకు
వాంచుటకుఁ దగిన కర్మములనియు వానివలన సమస్తఫల
లు సిద్ధించునని యజ్ఞానులగువారు పలుకుదురు. వారలే
థులని కొందఱూహింతురు. వారు జ్ఞానరహితులని యెఱుం
ము. నైష్కర్మ్య మీజగమునలేదు. ఎంతోగలిగినమూర్ఖులై
న దానినెల్లరు నిందింతురు. కాని యానైష్కర్మ్యముకర్మము
నను, మనస్సుచేతను, వాక్కుచేతను ముహూర్తకాలమైన
ంచిననతిశయఫలదంబగు. సాధ్వీ! ఆనైష్కర్మ్యము శాంతికిఁ
థానస్థలము. దాని నాశ్రయించి సర్వదా ఆత్మను జూచుచుం
ను. పరబ్రహ్మము నిష్కళంకముగఁ గనంబడు. అందు నగ్నిం
సిసోముండు ప్రకాశించును. మిథునధర్మమును నడపి భూతి

ముల నాపరబ్రహ్మమే తెల్పును. బ్రహ్మాదులందఱు నందు నక్ష రోపాసనము చేయుదురు. దాన శాంతియు నింద్రియవశీకరణ శక్తియుఁగలుగును. చారుశీలా! ఇఁక నక్షరతత్త్వము నెఱింగిం చెదను.

ఆయక్షరము స్పర్శరసరూపశబ్దగంధములుగాదు. చర్మ ముచేతనేని, నాలుకచేతనేని, నేత్రశ్రోత్రములచేతనేని నాసిక చేతనేని పరిగ్రహావిధానము నాచరింప నాయక్షరము శక్యము గానిది. నిర్మలమనస్సుచేతనే గ్రహింపఁదగినది ఆయక్షరమునుం డియే ప్రాణాదిపంచవాయువులును బ్రవర్తిల్లును. దానియందే లయించును. ప్రాణాపానసమానవ్యానోదానము లనుపేరులు గల పంచవాయువులలోఁ బ్రాణాపానము లనునవి రెండును సమానవ్యానవాయువుల యంతర్భాగమునఁ బ్రవర్తిల్లుచుండు. ప్రాణాపానములకు నడిమిదెసను దాన వాయువు ప్రవర్తిల్లు. సద్గుణాఢ్యా! పురుషుఁడు శయనించినఁ బ్రాణాపానములు వదల వని యెఱుంగుము. వానియందు సమానవ్యానములు విలీన ములై యుండును. ఈవిషయము యోగులకు ననుభవసిద్ధము. ఉదానమునఁ బురుషుఁడు నిద్రించినచోఁ బ్రాణాపానములు విడువవు. ఇది యోగులు జ్ఞానదృష్టిం గాంచి పలుకుదురు. ఇఁక నంతర్యాగమన నెట్టిదో తెలిపెద. సావధానవై యాకర్ణింపుము.

## అంతర్యాగవిధానము.

సుశీలా! ఇపుడు చెప్పినపంచవాయువులును మనోబుద్ధు లు గలిసి యీయేడును అగ్నిహోత్రునకు జిహ్వ లనంబడు. వైశ్వానరుం డనఁగా నెవ్వఁడో యని సందియమందకుము. ప్రాణులశరీరమందుండి వెలుంగుచున్న యాత్మతత్త్వమే యని

యెఱుంగుము. *ఈయాత్మ రూపవైశ్వానరునకు ఘ్రేయము, దృశ్యము, పేయము, స్పృశ్యము, శ్రావ్యము, మంతవ్యము, అవబోద్ధవ్యము నను నీయేడును సమిధలగును వరుసగా ఘ్రాతయు, భక్షయితయు, ద్రష్టయు, స్ప్రష్టయు, శ్రోతయు, మంతయు, బోద్ధయు నగు నీయేడుగురు ఘ్రేయము మొదలగుహవిస్సుల (హోమద్రవ్యములను) అగ్నియందు హోమముచేయుఋత్విక్కులగుదురు. ఇది సప్తహోతృవిధానపద్ధతి. ఆయగ్నిముఖములు పదియగు. అవి దిక్కులు, వాయువులు, సూర్యుఁడు, చంద్రుఁడు, పృథ్వియు, నగ్నియు, నింద్రుఁడు, విష్ణువు, ప్రజాపతియు, మిత్త్రుఁడు నను నవియే యని యెఱుంగుము. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, వక్తవ్యము, కర్తవ్యము, గంతవ్యము, విసర్గము, ఆనందము నను నివి హవిస్సులగు నీపదింటిని వరుసగా గ్రహించి యాహుతులు చేయు హోతలు. శ్రోత్రము, చర్మము, నేత్రములు, నాలుక, నాసిక వాక్కు, హస్తము, చరణములు, పాయూపస్థ లగుదశేంద్రియంబులు. ఈరీతిగా దశహోతృవిధి ఈరెండింటిని జక్కఁగాఁ దెలిసికొని యిందేపద్ధతినేని జీవాత్ముఁ డుపద్రష్టగా నంతర్యాగమును యోగులు నడపుచుందురు అట్టివారు జననమరణవిముక్తిం గాంచి యవ్యయానందము ననుభవింతురు.

బహిర్యాగము (లౌకికము) చేయువారు గమనాగమన భ్రమణంబులను (మృతిజననసంసారప్రవృత్తులను) బొందుచుందురు. ఇదియే అంతర్యాగపరులకు బహిర్యాగపరులకును గల

---

*ఘ్రేయం దృశ్యంచ పేయంచ స్పృశ్యం శ్రావ్యం [illegible]చ, మంతవ్యమవబోద్ధవ్యం తా స్సప్త సమిధో మమ. అని మూలము.

భేదము. ప్రణవాదిరూపత్వనిరూఢిచే వాక్కు జనించును. దానిని మనస్సనుసరించుచుండును పురుషార్థబుద్ధి నాశ్రయించి మనస్సు ప్రవర్తించుననియు నెఱుంగుము. అని భర్త బోధింపఁగా నాబ్రాహ్మణి యిట్లు ప్రశ్నించెను. మహానుభావా! తొలుత వాక్కుగలుగు నంటిరి. దానిని మనస్సనుసరించు నంటిరి. మనస్సు పురికొలుపఁగా వాక్కు వెడలునుగదా. అట్టివాక్కు పూర్వ మావిర్భవించుటెట్లు? దానిననుసరించి మనస్సు ప్రవర్తించుటెట్లు? తెలుపవే యని వేఁడెను ఆప్రార్థనము నాలించి బ్రాహ్మణుం డిట్లుత్తరము చెప్పెను. మనస్సును దాన వాయువును గూడి వాక్కును వెడలించుచుండును. ఈరీతిగా వెడలించుట ఆత్మసహాయమున నని తెలియవలయును. నీప్రశ్నము జనసామాన్యానుభవసిద్ధమే. కార్యమునుగూర్చి వాగనువర్తనము చేయవలసినయవసరము మనస్సునకుం గలిగెను. కావున వాక్కును మన స్సనుసరించునని తెల్పితిని. దానివిధము వివరించెద వినుము.

మనస్సు వాక్కు ననునివి రెండును బ్రహ్మకడకుంబోయి

అంతర్యాగశ్రుతిః

తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానశ్శ్రద్ధాపత్నీ శరీర మిధ్మ మురో వేదిర్లోమాని బర్హి ర్వేదశ్శిఖాహృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశు స్తపోఽగ్ని ర్దమశ్శమయితా దక్షిణావాగ్ఘోతా ప్రాణఉద్గాతా చక్షురధ్వర్యుర్మనో బ్రహ్మశ్రోత్ర మగ్నిద్యావద్ధ్రియతే. సాదీక్షా యదశ్నాతి తద్ధవిర్యత్పిబతి తదస్యసోమపానం యద్రమతే తదుపసదో యథ్సంచరత్యుపవిశత్యుత్తిష్ఠతే చ సప్రవర్గ్యోయన్ముఖం తదాహవనీయోవ్యాహృతి రాహుర్యదస్యవిజ్ఞానం తజ్జుహోతి. యత్సాయం ప్రాతరత్తితత్సమిధం... శాంతిః శాంతిః శాంతిః. అని.

సృష్టికర్తవగు నో పరమేష్ఠీ ! మాయిరువురిలో నెవరధికులు,
తెలుపుమని ప్రశ్నించెను. బ్రహ్మయు నాలోచించి మాయిరు
వురిలో మనస్సే శ్రేష్ఠమని బదులిడెను. వాక్కు బ్రహ్మ పక్షపా
తమునఁ దెలిపెనని తలంచి మరల నిట్టు లడిగెను పరమేష్ఠీ!
నేను నీకు సకలకామముల నొడఁగూర్చుదానను. ఇట్టి నన్ను
మనస్సునకంటెఁ దక్కువ యని నిర్ణయించితివే. ఏల? అనఁగా
బ్రహ్మ వాణితో నోవాగ్దేవీ! నాకు రెండువిధములగు మన
స్సులు కలవు స్థావరమని జంగమమని వానిపేరులు *ఆరెం
డింటిలో స్థావరము నాచెంత నుండును. జంగమమనస్సు నీకడ
నుండును. నీవలన గోచరించునట్లు నెగడువర్ణము మంత్రము
స్వరము నను నీమూఁడును జంగమమనస్సుగా నుండును. ఆ
జంగమమనస్సునకంటె నీవే యధికురాలవు. అట్టి నీకంటె నాకడ
నుండు స్థావరసంజ్ఞికమనస్సు శ్రేష్ఠము. కావున నట్లు బదులు
చెప్పితిని. నీవిట్లు ప్రశ్నింపఁబూనుట న్యాయము కాదు అనఁ
గా నా వాగ్దేవి చింతాకులయై మూర్ఛమునింగినట్లు పలుకక
యూరకుండెను. కొంతసే పట్లుండి మరల వినీతయై మహాత్మా!
ప్రసన్నుఁడవుకమ్మా యని భగవంతుని బ్రార్థించెను అని బ్రాహ్మ
ణుఁడు తెలుపఁగా నాయింతి యిట్టు లడిగెను. మహాత్మా! ఈ
విధముగాఁ గుందువొందినవాక్కు మరల దేనిచే సంతుష్టయ
య్యెను. తెలుపుమని ప్రార్థింపఁగా బ్రాహ్మణుం డిట్లని బదులిచ్చెను.
ప్రాణాపానములకడ వాణి నిలుచును. కావునఁ బ్రాణవాయువు
కలిగి యామెచింత మాన్పెను. అట్లగుట బ్రహ్మప్రభావమునసే
యని యెఱుంగుము. ఇవ్విషయ మెఱుంగుటయే [illegible] ద

* స్థావరం మత్సకాశే వై జగమం విషయే తవ. అని మూలము.

ప్రాప్తిహేతువు. అనిపలికి మఱియు నిట్లు తెలిపెను. ఘోషిణి యనియు, నఘోషిణియనియు రెండువిధములుగ వాగ్దేవి యలరుచుండు. అందున ఘోషిణి యుత్తమురాలు. అయ్యది యమృతమును గామధేనువువలెఁ గురియుచుండును. రూపము దివ్యప్రభానములు నవ్యయములుకాఁగా నాబ్రహ్మవాదిని వఱలుచుండు. ఇట్టి బ్రాహ్మి తెఱంగెఱుంగుట మహానందకరమని తెలియందగు.

ఘ్రాణచక్షుర్జిహ్వాత్వక్ఛ్రోత్రములను నింద్రియములైదును, మనోబుద్ధులు నొకయధిష్ఠానముననుండియు నొండొంటి నెఱుంగకయుండు. ఒక్కదానివిషయము వేఱొక్కటి తెలియకయుండు. అనుటయు నావిప్రపత్ని యావిషయ మెఱింగింపుమని ప్రశ్నించుటయు నావిప్రుఁ డిట్లు పలికెను. గంధమును నాసిక యెఱుంగును. తక్కినయారును దాని నెఱుంగవు. నాలుక రసమును గ్రహించును. తక్కిన వాపనికిఁ బనికిరావు. చక్షుస్సు రూపము నెఱుంగఁజాలు. ఇతరము లద్దానిం బరికింపఁజాలవు. చర్మము సంస్పర్శము నెఱుంగు. తక్కుంగల వందులకుఁ బనికిరావు. శ్రోత్రము శబ్దము నెఱుంగు. తక్కిన వాపనికిఁ జాలవు మనస్సుయొక్క కృత్యము సంశయితసంవేదనము. ఈవిషయమునఁ దక్కినయింద్రియములు తగవు. నిష్ఠ బుద్ధిదగు. ఈకార్యమున కితరములు శక్తములుగావు.

### ఇంద్రియమనస్సులకు సంవాదము.

ఈవిషయమునఁ బురాతనేతిహాసము కలదు. దానిం దెలిపెద. అంత నీసంశయము తొలఁగును. ఆయితిహాసము మనస్సునకు నింద్రియములకు జరగినసంవాదరూపమే యగు.

ఒక్కసారి యింద్రియములు మనస్సుతో మనమెల్ల సమాను
లమే ఏవిషయమునను భేదములేదని ప్రస్తావించెను. మనస్సు
బదు లిట్లుచెప్పెను. ఇంద్రియములారా! నాకును మీకును గల
భేదమును దెలిపెద వినుఁడు. మనమెల్ల సమానులమనుటన్యా
యము కాదు. *నాసికనాసాయము లేకయున్న వాసన నెఱుంగఁ
జాలదు. నాలుకయు నన్నుఁ దొఱంగి రుచి గ్రహింపలేదు.
నేత్రము రూపము నక్లే గుఱుతింపఁజాలదు. చర్మము స్పర్శ
మును గ్రహించుశక్తి గలది గాకపోవును. చెవి నన్ను వదలిన
శబ్దమును వినలేకపోవును. సత్యము వచింతును. ఆలకింపుఁడు.
నేను విడనాడినచో నింద్రియములేవియు మీలో శక్తిగలవి
గావు. అప్రయోజనము లయియేయుండును. చల్లారిననిప్పువలె
నిర్మనుష్యగృహములవలె మీయాకృతులు గానఁబడును.
కావున మనలో నేనే యధికుఁడను. ఇది యథార్థము. అని
నొక్కిచెప్పుటయు నింద్రియము లిట్లు పలికెను.

మనస్సా! నీవు చెప్పినదంతయు నిజమే. ఇంతమాత్రమును
ననే యధికత్వము నీయందుఁ బొసంగునా? మమ్ము వదలినయెడల
నీ వొక్కవిషయమునైన ననుభవింపఁజాలుదువేని నీవుత్కృష్ట
తను జెప్పుకొనవచ్చును. మాలో నొకయింద్రియమునిన్ను వదలిన
నాయింద్రియానుభవమునీవొందుము చూతుము. ఈపరీక్షలో
నీవాఱితేఱితివేని మాకంటె నధికుఁడవని యొప్పుదుము ఘ్రాణ

* న ఘ్రాతిమామృతే ఘ్రాణం రసం జిహ్వా నవేత్తిచ రూపం చక్షు
ర్న గృహ్ణాతి త్వక్స్పర్శం నావబుధ్యతే. ౧౮. న శ్రోత్రం బుధ్యతే శబ్దం
మయాహీనం కథంచన, ప్రవరం సర్వభూతానా మహ మస్మి సనాతనః.
౧౯. అని మూలము.

మున గంధమును,జిహ్వచే రసమును,శ్రోత్రమున శబ్దమును,నేత్రమున రూపమును,చర్మమున సంస్పర్శశక్తిని గ్రహింపఁజాలుదువు. అంతియ కాని వేఱొకదానిచేఁ దద్వ్యతిరిక్తపదార్థమును గ్రహింపఁజాలవు. ఇట్టి నీ వేకారణమున నాధిక్యము నొంద నాసపడి యెదవు? అంతియ కాదు. ముందు మేమవలంబించినఁ బిదపఁగదా వాని నీవనుభవింతువు. కావున నీవే యూహించి నిజము చెప్పుము. అపు డెక్కుడనువిషయము నిర్ధారణమగు. నీవడఁగినను బ్రాణమును గాపాడుటకు మాయందే బోధకమగు పదార్థమును గలిగించుటకు శక్తిగలదు. ఆవిషయమును గూడ నీవే యాలోచించి తెలిసికొనుము. ఇది యిట్లుగా దట్లని నిర్ధారణముచేయ సమర్థులగు శిష్యులకడకుఁబోయి తెలుపఁగా నావిషయమునఁ గలసారమును ఆశిష్యు లుగ్గడింపఁగా వినుచున్నయుపాధ్యాయుఁడువలె మమ్ముఁ జేపట్టి (సాయము గొని) విషయసుఖముల ననుభవింతువు. నీవు కలలుగాంచినపుడు మాసాయము లేనందున నావిషయములు బొంకు కాఁగా ద్వారములేనియింటికింబోయి మరలినట్లు నీవూరకుందువు. కాని సత్యముగా నావిషయము ననుభవింపఁజాలుదువా? ఇంతదనుక నిజముకదా. * కావున మేము నీవును గలిసిన సుఖానుభవము కలుగు.

ఈరీతిగా నింద్రియములు మనస్సు సంవాదముచేసెను. అని తనభార్యకుఁ దెలిపి మఱియు నొక్కయపూర్వవిషయము నెఱిఁగింపఁబూని యావిద్వాంసుఁ డిట్లనియె. పతివ్రతా! ఒకా

* అస్మాన్ వినా నాస్తి తవోపలబ్ధిస్తావద్వినా త్వాం న భజే త్వ హర్షః. అని మూలము.

నొక కాలమునందుఁ బ్రాణాదులగు వాయువులు బ్రహ్మనుదర్శింపఁ బోయి మహాత్మా! మాయేవ్వరిలో నెవ్వఁ డధికుఁడు? తెలుపు మని బతిమాలిరి. ఆబ్రహ్మయు వారిప్రశ్న మాలకించి వాయు వులారా! మీలో నెవ్వఁడడగినఁ దక్కినవార లడఁగుదురో ఎవ్వఁడువర్తించిన నందఱు ప్రవర్తింతురో వాఁడధికుఁడగును. ఇఁకఁ బొండు అనియె. వాయువు లప్పటికిని బోవక నిలు వంబడి ప్రాణవాయువు మొదలయిదును దమవలన నాకార్య ములు సాగునని తెలుపుకొనియె. బ్రహ్మయు నా కావిధము తెలియదా? మీమీవిశేషవృత్తినెఱుంగుదును. ఏసమయమున నేవాయువువలన నాకార్యమగునో యప్పు డది యధిక మనం బడు. కావున నొక్కొక్కకాలమందొక్కొక్కరుగా నెల్ల రధి కులే యగుదురు. అన్యోన్యమైత్రి గలిగియుండుఁడు. పరస్పర భావనాపరులుగనుండుఁడు. అట్లుండుటవలనమీకు మేలుగలుగు. ఇఁకఁ బొండని హెచ్చరించెను ఆయుపదేశమును విని వాయువు లన్యోన్యద్వేషము మానియుండెను. సాధ్వీ! వాయువిషయమైన మఱియొకవృత్తాంతము కలదు. అది నార దమునికి, దేవమతుఁ డనుమునికి జరగినసంవాద మనంబడు. దానిం దెలిపెద. దాన మఱికొన్నిసంశయములు తొలఁగు. చక్కఁగా నాలకింపుమని బ్రాహ్మణుం డిట్లు తెలిపెను.

మున్నొకసారి దేవమతుఁ డనుబ్రాహ్మణుఁడు ముని వతంసుఁ డగునారదముని నొక్కపవిత్రభూభాగమున దర్శించి ప్రణతుఁడై యాతనిఁ బ్రసన్నుంజేసి భక్తివెలయఁగా నాతని దాపునఁ గూరుచుండి చేతులుముకుళించి కరుణానీరనిధీ! పుట్టు చున్నజంతువునకు వాయువు లేనింటియందును దొలుదొలుతఁ

ప్రవర్తించునదేది ? తెలుపుమా యని ప్రశ్నించెను. విప్ర ప్రవరా! గర్భసంవాసమునకుఁ దొలుతనే వాయువు జంతువును ప్రవేశపెట్టునో యాజంతువు పుట్టుతఱి నావాయువునకుఁ దర్వాతివాయువు ప్రవర్తించును మఱియొకవిశేషంబు గలదు. పురుషునియందు సమాననామముగలవాయువు, స్త్రీలయందు వ్యానమనువాయువు శుక్లశోణితములఁ గల్గించును.ఆరెండును విధివశమున నొకచోటఁగూడఁగా గర్భము నిలుచును. శోణిత సంసృష్టమగు శోణితమువలనఁ బ్రాణవాయువు తొలుతఁ బ్రవర్తించును. ప్రాణమున వికృతినొందినశుక్లమున నపానవాయువు ప్రవర్తించును. ప్రాణవాయు వధోగతిగను, అపానవాయు వూర్ధ్వగతిగను బ్రవర్తించును. ఈరెండింటిచేతను బ్రాణమయములగును దాన వ్యానసమానవాయువులు ప్రవర్తించును. పావకుఁడు సర్వదేవతాస్వరూపుఁడు కావునఁ బ్రాణాపాన వాయువులకు నడుమ ప్రవర్తించును.ఆభవ్యమూర్తిని నస్తనులు తత్త్వవేత్తలు గావున నుదానరూప మనుదురు.

అహోరాత్రములు శుభాశుభములు సత్యాసత్యములు సదసత్తులు నీమొదలగుద్వంద్వములు ప్రాణాపానములను వాయువులకు మఱియొకపేరులు.ఆవాయువులకు నడుమనుండు నగ్నియు నుదానవాయువు, దాని నిర్ద్వంద్వభావము నను వాని నంతర్యాగవిద్యాప్రవీణులు గనఁజాలుదురు పరమశాంతిబ్రహ్మ మను వాని కెట్లు భేదమనునది లేదో యట్టులున్న యామహా వస్తువు ననఁగా నుదానమే యని చక్కఁగాఁ బెద్దలు పలుకు దురు. మేమును బ్రహ్మనుండి వింటిమి. ఇంద్రియమనోవాయు వులపద్ధతులు కనుఁగొనుట వీనికిఁ బరమంబగుతత్త్వంబును

గనుఁగొనుటకుఁ గారణమైయుండును. అని యాసంవాదమును దెలిపి యాబ్రాహ్మణుం డాకళత్రమును దయాపూర్వకముగాఁ బరికించి సాధ్వీ! నీకొకరహస్యవిషయమును దెలిపెదను. అది యత్యుత్తమము. వినవలయు. అని యిట్లు తెలిపెను.

## జీవాత్మస్వరూపనిరూపణము.

కరణము కర్మము కర్త యను నీమూఁడు కారకముల చేతను సమస్తవిశ్వము వ్యాప్తమైయున్నయది. మోక్షము నాల్గవది. ఈనాలుగు హేతలను పేరుగలవి. వీనిచే జగం బావృతమయియుండును. ఈనాలుగు హేతువులకు సాధన మును విశదీకరింతును. వినుము * నాసిక లోనగు నయిదింద్రి యములు మనోబుద్ధులు నను నీయేడును గుణహేతువులు. వీనినే కరణహేతువులనియుఁ జెప్పుదురు గంధరసరూపశబ్ద స్పర్శములు మంతవ్యము బోద్ధవ్యము నను నీయేడును గర్మ హేతువులు. ఘ్రాతయు, భక్షయితయు, ద్రష్టయు, వక్తయు, శ్రోతయు, మంతయు, బోద్ధయు, నను నీయేడును గర్తృహేతు వులు. వానివిషయానుభూతి నాజీవాత్ముఁడు తో ఁగునిష్టలు మోక్షహేతువులు. కరణకర్మకర్తృకారకాత్మకుఁడు జీవుఁడు. ఆతఁడు భోక్తయే కావునఁ దక్కిన యనేకవిషయములగు హవిస్సుల నుదాసీనత్వమను స్రుక్కునం దునిచి వేల్చునిష్ఠ చేత నాత్మస్వరూపంబగువహ్ని ప్రజ్వలితంబయి యుండు ధూమరహితంబగుచుఁ బ్రకాశించునని మోక్షప్రకారము. ఆపద్ధతి విడనాడి భోక్తయగునెడల నదియే బంధకారణంబగు.

---

* ఘ్రాణం జిహ్వా చ చక్షుశ్చ త్వక్చ శ్రోత్రం చ పంచమం, మనోబుద్ధిశ్చ సప్తైతే విజ్ఞేయా గుణహేతవః. అని మూలము.

అని నిర్ణయించి ముక్తభావమునకు మూలంబగు యోగయజ్ఞ మునందు నేను బ్రవృత్తుండనై యున్నాఁడను. దానికి సర్వ పరిత్యాగము దక్షిణయగు. దానిచే సకలభూతాత్మకుండగు నారాయణుండు ప్రీతుండై స్వీకరించును. ఆయవస్థనే మహాత్ములు ముక్తియని పలుకుదురు. అని బోధించి బ్రాహ్మణుండు మఱియు నిట్లు తెల్పెను.

సాధ్వీ! చక్కఁగా నాలకింపుము. శాస్త యొక్కండే. కాని రెండవవాఁడు లేఁడు. ఆతనిశాసనంబుననే యేనుజరించు చున్నాఁడను గురు వొక్కఁడే. రెండవవాఁడు లేఁడు ఆగురువు బోధించినయర్థమును జిత్తములోఁ బదిలపఱతును. శ్రోత యొక్కఁడే రెండవవాఁడు లేఁడు. ఆతనియాజ్ఞానుసారము వర్తింతును. విద్వేష్ట యొక్కఁడే. ఆతని యిష్టముచొప్పున వ్రాలి యెడరుగడపుదును. ఆయాపదలఁ దొలంగునుపాయము పెద్దలనుండి విన్నాఁడను. ఈవిషయమున నొకయితిహాసము కలదు. అది సర్పదేవర్షులకు బ్రహ్మను నైనది. దేవాదు లొక్క సారి బ్రహ్మకడకుంబోయి మాకు నేది హితమో తెలుపుమని ప్రార్థించిరి పరమేష్ఠియు నక్షరోపాసమే హితమని తెలిపెను. దానిని విని వారెల్ల నలుదెసలకుం బరుగెత్తిరి. సర్పములకుఁ గఱచుట పూర్వమే యలవడి యుండెను. అసురులకు దంభ భావము స్వభావమయ్యెను. దేవతలకు దాన మఖ్మే యలవడి యెను మహర్షులకు నంతరింద్రియనిగ్రహము(దమము) వాడుక యయ్యెను. శాస్త నొక్కనినే పొంది యొక్కశబ్దముచేతనే సంస్కరింపఁబడినను నానావిధవ్యవసాయములు గలవారలైరి. శాస్త గురు వొక్కఁడే కాని రెండవవాఁడు లేఁడు. పాపనిష్ఠఁ

ప్రవర్తించినజీవుఁడు పాపచారియగును. శుభకర్మమునఁ బ్రవర్తించిన శుభచారి యగును కామప్రవర్తకుండైన నింద్రియవశుం డగును. ఇంద్రియములజయించిన బ్రహ్మచారి యగును. అపేతవ్రతకర్ముఁడై కేవల బ్రహ్మనిష్ఠుఁడగువాఁడు బ్రహ్మచారి యనంబడును బ్రహ్మమే సమిధలు. బ్రహ్మమే హుతవహుఁడు ఆపస్సులు బ్రహ్మమగు. గురువు బ్రహ్మమే. ఇదియే బ్రహ్మచర్యసూక్ష్మవిషయమని యెఱుంగవలయును.

పంకజలోచనా! ఆయుక్తరోపాసనమున దుర్గమును దాఁటుదు. మున్నే దాఁటితిని దానింగడచి క్రోధతిమిరమ్మును, లోభవ్యాళబహుళంబును, కామతస్కరదూషితమును నగు దుర్గమును గడచి యొకమహావనమును బ్రవేశించితిని. అని తెలిపిన నాబ్రాహ్మణి మహాత్మా! యావనం బెట్టిదని ప్రశ్నించిన నాబ్రాహ్మణుం డిట్లు పల్కెను.

సుశీలా! దానఁ బృథగ్భావము కానరాదు. దానికంటె సుఖ మెందును లేదు. అపృథగ్భావము లేదు. దుఃఖ మంతకంటె నెందును లేదు. దానికంటె సూక్ష్మ మెందును లేదు. దానికంటె మహత్తర మెందును లేదు సూక్ష్మతరమైనదియు లేదు. తత్సమసుఖ మెందును లేదు. అందుఁబ్రవేశించినవారు శోకింపరు. సంతోషింపరు దేనికినిభయంపడరు. ఎవ్వరినిభయపెట్టరు నిశ్చింతముగా నవ్వనంబుం బ్రవేశించిన నిర్వృతి లభించును. ఆమహావనమున నేడు మహాద్రుమములు గలవు. ఏడుఫలములు గలవు. ఏడుగురతిథులు గలరు. ఏడాశ్రమములు గలవు. ఏడు సమాధులు గలవు. ఏడుదీక్షలు గలవు ఇదియే యాయరణ్యరూపమని తెలియందగును. అందుఁ గొన్నింటికిఁ బంచవర్ణములు గలకుసు

ములు ఫలములు గలవు. కొన్నింటి కేకవర్ణఫలపుష్పములు. కొన్నింటికి ద్వివర్ణ ఫలకుసుమములు గలవు. కొన్నింటి కవ్యక్త వర్ణఫలప్రసవములు గలవు. అన్నియుఁ బరిమళవంతములు. మధురతరఫలములు గలవియే యగు.

ఆయరణ్యమునందుఁ గలవృక్షములకు దీక్షాగుణము కలదు అతిథి తృప్తిచేయుస్వభావము కలదు. సాధ్వీ! అతిథులనఁగా బ్రహ్మసమానులని యెఱుంగుము. ఆమహర్షులు సర్వదా మహానందసుఖ మనుభవించు వారలని నమ్ముము. దిక్కులకు నాకాశమునకు(పైభాగమునకు) హద్దు లివి యని నిర్ణయింపరాదు. మఱియు నావనమున వేఱొక వెలుఁగు ప్రవేశింపఁజాలదు. క్షేత్రజ్ఞుఁడే సూర్యుఁడు. ఆసూర్యు నారాధించిన సంసారభయమును బోలఁగించును. అందు బ్రహ్మసంభవమగుజలము పాఱుచుండును. నదు లాజలము నిండియుండ వెలుంగుచుండును. నగము లుండును. తపస్వులందఱు నవ్యయమగుపదమును గాంచఁగల్గుదురు. ఆనదీజలపాన మట్టిదని తెలిసికొనుము. ఆయరణ్య మిట్టిలక్షణములు కలవి సాధ్వీమణీ! ఆవిపినమునందు శాస్త్రసిద్ధ నియతింబూని సత్తపోధనముగలవార లగుచు మహర్షులు శాంతియు నంతరింద్రియనిగ్రహము నిస్పృహత్వము తమకు భూషణములుగాఁ బ్రకాశింపఁగా సమాహితచిత్తులై నివసింతురు. వాసనచూడఁగోరక చవిగొనఁ దలంపక దర్శనము స్పర్శనము ననువాని నాచరింపక విననొల్లక సంకల్పము మనస్సులఁజేర్పక నిష్టార్థములనుగోరుటయు ననిష్టాముల మానుటయు ననువాని నొల్లక యందుందురు. నేను యందుండువాఁడను. మేలు కలుగవలయుననియుఁ గీడుఁ.

రాఁగూడదనియుఁ గోరను. ఇది మంచిమార్గమని యెఱింగియే నేను స్వభావవిషయమునఁ గమలపత్త్రమునందలి నీటిబిందువు వలె మది నుంచితిని. అని తెలియంబలికి మఱియు నామె మన స్సంశయములఁ దొలఁగించువాఁడై యిట్లు తెలుపఁబూనెను.

సాధుమతీ! ఈవిషయముననే యొకపురాతనీతిహాసము కలదు. అది యతికి నధ్వర్యునకును సాగినది. దానిం దెలిపెద. ఆకర్ణింపుము. ఒకానొకకాలమున నధ్వర్యుఁడు పశువును బ్రోక్షించుచుండెను. యజ్ఞకార్యమున నిట్లు బద్ధాదరుఁడై యతఁడుండం గాంచి యొకయతి నియతుఁడు కావున. * నార్యా! ఇది హింసకాదా యని ప్రశ్నించెను. అందులకాయధ్వర్యుఁడు సమాధాన మాయతి కిట్లు చెప్పెను. యతీంద్రా! ఈభాగము నశింపదు. ఊర్ధ్వలోకముల నొందును. శ్రుతివాక్యములు సూనృతములని నీవు నమ్మిన నిట్లు ప్రశ్నించియుండవు. ఈప్రశ్న ముచితమైనదికాదు. అనిపలికి యాభాగము నుద్దేశించి పంచభూతమయమగు నీభాగము మృతినొందు టెట్లు? ఆయాయి భూతములభాగము లాయాభూతములఁ (పృథ్వి మొదలగు వానిలో) గలియును. పిండేతరుఁడగు జీవుఁడు నిరతిశయ సుఖము నొందునట్లు యజ్ఞకృత్య మిది చేయ హాయినొందును. ఆయధ్వర్యుఁ డిట్లు పలుకఁగా విని యతి మరల నిట్లు ప్రశ్నించెను. ఆర్యా! ఈభాగము పుణ్యలోకమునకే పోవుననుకొం

---

* యతిరధ్వర్యుమాసీనో హింసేయమితి కుత్సయన్, తమధ్వర్యుః ప్రత్యువాచ నాయం భాగో వినశ్యతి. శ్రేయసా యోక్ష్యతే జంతుర్యది శ్రుతిరియం తథా. ర యోహ్యస్య పార్థివో భాగః పృథివీం స గమిష్యతి. యదస్య వారిజం కించిదపస్తత్సంప్రవిశ్యతి. ఞ. అని మూలము.

దము ఈకార్యము నొనర్చుటవలన నీకే ప్రయోజనము సిద్ధిం
చును? చక్కఁగా వివరింపుము. అని హింసాస్వరూపమును
నిరూపించి తెలుపఁగా నధ్వర్యుఁ డిట్లు పలికెను. యతివర్యా!
భూమిగంధము ననుభవించుచున్నాఁడవు. ఆపోమయరసము
లను బీల్చుచున్నావు. తేజోరూపములను జూచుచున్నావు.
వాయుగుణములను స్పృశించుచున్నావు. ఆకాశమువలనఁ
గలిగినశబ్దముల వినుచున్నావు మనస్సుచే నూహించుచున్నావు.
ఈమహాభూతములను బ్రాణములనుగా నీవు తలంచుచున్న
వాఁడవు. ప్రాణాదానముననివృత్తుఁడవైతివి. హింసావిషయము
నాక్షేపించుచున్నాఁడవు. హింసలేక కదలమెదల వలనుపడదు.
ఇందుల కేమనియెదవు?ఆగమము వశుహింసచే యాగమొన
రించినయెడల స్వర్గాదిపుణ్యలోకానుభవము సిద్ధించునని తెల్పు
చున్నది. అయ్యది యసత్యమా. ఆగమముల నెఱింగిన నీవే
యాలోచించి పలుకుము. అను నీసమాధానమును విని యతి
యిట్లు పలికెను.

హింస పాపమని యాగమములయందుఁ గాంచియే నేను
బ్రశ్నించితిని. కావున నందులకే సమాధానము పల్కుము.
అనుటయు నధ్వర్యుఁడు యతీంద్రా! నీవు సమాధియందుఁ
బ్రాణనిరోధము మనోలయము నను నీరెండింటిని బుణ్యకార్య
ములుగా నొనరించుచు యోగనిరతుఁడ వగుచున్నాఁడవు.
ఇయ్యది హింసకాదా. అన యతి యిట్లు పలికెను. అక్షరమని
క్షరమనియు ద్వైధీభావ మాత్మకుఁ గలదు అందు నక్షరము
సద్భావము. క్షరము స్వభావము. అగునని యెఱుంగుము.
ప్రాణములు జిహ్వయు మనస్తత్త్వములు రజస్సుతోటి సద్భావ

మగు. ఈభావములను వదలి నిర్ద్వంద్వుఁడై సర్వభూతసముఁడై నిర్మముఁడై జితేంద్రియుఁడై సకలవిషయవిముఖుఁడై యుండు వానికి నెందును భయము లేదు. కావున తపఃపరిపాకము ముక్తి సాధనమగునని తెలిసికొనవలయును. అనఁగా నావచనామృతము నాలకించి మహాత్మా! పెద్దలగు మీబోంట్లయుపదేశమును గ్రహించినవాఁడు కీడును మేలును గనుఁగొనఁగలఁడు. నేను బహుకార్యమున మీరనుగ్రహించినచొప్పునఁ జూడనేర్తును. చిదచిద్ద్రవ్యమును విభజించి దానిచే హింస యించుకంతయుఁ గలుగకయుండ జన్నముచేసి మేలుగాంతును. అనఁగా యతి బ్రాహ్మణా! పశుయజ్ఞముకంటెఁ దపోయజ్ఞ ముత్తమము. ఈ విషయము నెఱిఁగింపఁబూనియే యీమాట ప్రస్తావించితిని. అని తెలుపఁగా నాయధ్వర్యుఁడందుల కంగీకరించి నిర్మోహుఁడై తపోయజ్ఞమునఁ బ్రవర్తించెను.

అని యజ్ఞస్వరూపము నీరీతిగా బోధించి యావిప్రుఁడు తనభార్యతో మరల నిట్లు తెలిపెను. ఈవిషయమున నొకపురాతనమగు నితిహాసము కలదు. అది కార్తవీర్యునకు సముద్రమునకు జరిగినయది. వేయిబాహువులుగల కార్తవీర్యార్జునుఁడు భూపాలురనెల్ల జయించి యొకనాఁడు సముద్రతీరమునఁ దిరుగుచు నాతనిజయింపఁ దలంపుగొని భయంకరబాణముల వర్షించెను. సాగరుఁడు భీతుఁడై వచ్చి చేతులొగ్గి రాజేంద్రా! బాణముల వర్షింపకుము. నేనేమి చేయవలయునో ఆదేశింపుము. నాయందుఁ బెక్కుజంతువు లున్నవి. నీబాణములనవి మృతినొందుచున్నవి. రాజేంద్రా! వాని కభయమిమ్ము. అనపరాధములగు వానిం జంపుట న్యాయమా అన సముద్రుం డిట్లుపలికెను. రత్నా

కరా! లోకమున ధనుర్ధారులలో నెవ్వఁడేఁ గలిగినఁ దెల్పుము. యుద్ధమున నన్ను మార్కొనఁజాలు వీరునింగానక వెదకుచున్నాఁడను. అనుటయు సాగరుఁడు రాజేంద్రా! జమదగ్ని ముని యుండు టెఱుంగుదువుకదా. ఆతనిపుత్త్రుఁడు నీకు యుద్ధమున నాతిథ్య మియ్యఁగలఁడు. పొమ్ము. అనుమాట చెవుల సోఁకగనే మహత్తరక్రోధమునఁ బయనము సాగించి యాజమదగ్ని యాశ్రమమునకుం బోయెను. సేనాసమేతముగా నాయాశ్రమమునకు బాధ గల్గించెను. అంతఁ బరశురాముఁడు దుర్వారతేజమునఁ బ్రజ్వలించుచుఁ గుఠారధారచేఁ గార్తవీర్యుని బాహుసహస్రముల ఖండించి వధించెను. తద్బంధువులెల్లఁ బరశురాముని జుట్టుముట్టి దివము నలంకరించిరి. హతశేషులు కానలపాలైరి. *రాజు లిట్లు హతులగుటయు నున్నవా రడవులపాలగుటయుఁ గారణములుగా ధర్మరక్షణము లేమిఁ బ్రజలు వృషలత్వము నొందవలసినవారైరి. రాజులు పరశురామభయమునఁ దమధర్మము ననుసరింపక పోవుటయు బ్రాహ్మణులు వారలకుఁ దోడ్పడకుండుటయుఁ గారణములుగా వృషలతనొంది ద్రవిడులు,నాభీరులు, పుండ్రశబరు లనఁబరఁగిరి. ఈజాతులవారు వృషలనామధేయులు పరశురాముఁ డంతట నూరకయుండక కోపావేశమున నిరువదొక్కసారులు తిరిగి రాజులవంశము లేకయుండఁజేసెను. అత్తఱిఁ బరశురామున కొక్కమనోహ

* తేషాం స్వవిహితం కర్మ తద్భయాన్నానుతిష్ఠతాం, ప్రజా వృషలతాం ప్రాప్తా బ్రాహ్మణానామదర్శనాత్. ౧౫. ఏవం తే ద్రవిడాభీరాః డ్రాశ్చ శబరైస్సహ, వృషలత్వం పరిగతా వ్యుత్థానాత్ క్షత్రధర్మిణః. ౧౬. - ని మూలము.

రాకాశవాక్కొకటి వినఁబడెను రామా! రామా! ఈగుణ
మును వదలుము. క్షత్రబంధువుల నిఁక వధింపకుము. పలు
మారు లిట్లుచేసితివి. ఇంకనైన మానుము. ఆవాక్కు వినఁబడఁ
గానే ఋచీకప్రముఖులగుమహర్షులు నట్లే తెలిపిరి. పరశు
రాముఁడు వారితోఁ దనతండ్రిని బొలియించినకోపమును
మరల స్మరించుచు నిట్లు పలికెను. మునివరులారా! ఈయుద్య
మమునుండి నన్ను మరలింపఁ బూను టుచితము కాదు. అనఁ
గానే వారు పరశురామా! ఇఁక క్షత్రబంధువుల వధింప సాహ
సింపకుము. సద్బ్రాహ్మణుఁడవుకదా! అనిపలికి రామా! ఈవిష
యమున నొకపురాతనేతిహాసము కలదు వినుము.

పూర్వ మలర్కుఁ డను రాజర్షి సముద్రముద్రితభూవల
యమును బాలించుచు నతులం జెందుచు నొక్కనాఁడు వృక్ష
మూలమునఁ గూరుచుండి యిట్లు చింతించెను. మనస్సు శ .
తెలిసినది. దానిని జయింపకపోయిన జయము కానే కాదు. కావున
మనస్సును జయింపవలయును. ఇక దీనిపై నిశాతశరములు
ప్రయోగింతును. అనుకొనఁగా మన స్సిట్లనియెను అలర్కా!
నన్ను బాణములతో జయింపఁజాలవు. ఎంత ప్రయాసపడినను
సార్థకము కానేరదు. ఆబాణములు మర్మముల నలయించును.
దాన మృతినొందఁగలవు. ఈబాణములుగాక వేఱొకబాణము
లను జూడుము. వేనితో నేను లోఁబడుదునో యోజించు
కొమ్ము. అనఁగానే చక్కఁగా నాలోచింపఁబూని యతఁ డి[illegible]
హించెను. పరిమళములఁబీల్చిపీల్చి వానినే యింకనుమూర్కొనఁ
గోరుదును. కాన ఘ్రాణమును (ముక్కును) బాణములతోఁ
గలంచెదను. అనఁగానే నాసిక యిట్లు పలికెను. అలర్కా!

నన్ను బాణములతో నోడింపఁజాలవు. అవి యవయవమును బాధించును దాన మృతినొందఁగలవు. మఱికొన్ని బాణములఁ బరిశీలింపుము. ఏవి నన్ను జయించునో అనఁగానే యతఁడాలోచించి రుచివంతములగు పదార్థములం దినియు నింకను దినఁ గోరుచుందును. కావున నాలుకను జయించెదను. అనఁగానదియు నై విధముగనే పలికెను. అట్లే త్వక్చక్షుశ్శ్రోత్రములు బుద్ధియుఁ బలికెను. అలర్కుఁ డాపలుకులవిని విచారించి విచారించి యీ బాణములతో లాభములేదనియు మనోనిగ్రహము యోగమునఁగాక వేఱొకమార్గమున సాధ్యముకాదనియు నూహించెను. అంత నింద్రియములను యోగబాణమున నొంచెను. అత్తఱి నాయలర్కుఁ డిట్లు పలికెను; అక్కటా! తెలివిమాలి సర్వము బాహ్యకర్మము నాచరించితిని. భోగతృష్ణాపరాయణత్వమున రాజ్యము నుపాసించితిని. పిదప నిపుడు యోగమునకంటెఁ బరమసుఖము లేదని యెఱింగితిని. అనిపలికి యాతఁడు కృతకృత్యుఁ డయ్యెనుగాన నోపరశురామా! క్షత్రియులవధింపకుము. తపోయజ్ఞమున నాసక్తుఁడవుకమ్ము. దాననే శ్రేయస్సు నొందఁగలవు. బాహ్యశత్రుజయము విజయముకాదు. అంతశ్శత్రుజయమే విజయము. అనువారిమాట నాలకించి మనశ్శాంతినొంది తపోయజ్ఞమున శ్రేయస్సునొందెను.

అనిపలికి బ్రాహ్మణుఁడు భార్యతో మఱియునిట్లు పలికెను. సాధ్వీ! తొమ్మిదిగుణములు కలవు. ప్రహర్షము, ప్రీతియు, నానందము. నను నీమూఁడును సాత్వికగుణములు, తృష్ణయుఁ, క్రోధము, సంరంభమునను నీమూఁడును రాజసములు శ్రమము, తంద్రయు, మోహము నీమూఁడును దామసగుణములు. ఈ

శత్రువులను ఛేదింప నేయస్త్రములును బనికిరావు. వీనిజయింప నే
యస్త్రములు పనికివచ్చునో వానిచే నాయాంతరశత్రువులను
జయించి పంచేంద్రియములనోర్చి మనస్సు వశపఱచుకొని
శ్రేయస్సు నొందవలయునే కాని వేఱుమార్గమున నంత శ్శత్రు
విజయముకాని శ్రేయస్సుగాని కలుగదు. అని తెలిపి మఱియు
నాబ్రాహ్మణుండు తనకళత్రము మదిఁగలశంకలు తీర్ప నెంచి
యిట్లు బోధించెను.

## యమజనకమహారాజసంవాదము.

అంతశ్శత్రువిజయమునుగూర్చి యంబరీషగీతలు గలవు.
వానిం దెలిపెద ఆలకింపుము. అంబరీషుఁ డను రాజు రాజనీతి
పరాయణుండై శత్రువులఁ గాందిశీకులంజేసి పూజ్యపద్ధతి
రాజ్యంబుం బాలించుచుండెను. ఒక్కనాఁడు విద్వద్గోష్ఠినుండి
యిట్లు ప్రశ్నించెను. కోవిదులారా! శత్రువులనెల్ల నోడించియు
నది యొకజయముగా భావింపకున్న వాఁడ ; * ఒక్కదోషము
గలదు. అది యత్యంతశ్రేష్ఠము. దానికిమించిన దోషము లేదు.
దానినేనడంపలేదు. అది నశింపకున్న వితృష్ణత నొంద నవ
కాశము లేదు. లోభగుణాభిభూతుఁడు నీచకార్యప్రవృత్తుఁ
డయ్యుఁ దెలియఁజాలఁడు. లోభమునుండియే చింతలుగలుగు.
దాన రాజసగుణము లెన్నియోః బ్రవర్తిల్లును. అని ప్రశ్నించి
వారలది యట్టిదే యనఁగా దానిని జయించి శాంతినొందెను.

* ఏకోదోషోవశిష్టశ్చ వధ్యస్సనహతోమయా, యత్ప్రయుక్తోజంతు
రయం వైతృష్ణ్యం నాధిగచ్ఛతి. తృష్ణార్తఇహనిమ్నాని ధావమానోనబుధ్యతే.
౮. అకార్యమపి యేనేహ ప్రయుక్తస్సేవతే నరః, తం లోభమసిభిస్తీక్ష్ణై
ర్నికృంతతనికృంతతి. ౯. లోభాద్ధి జాయతే తృష్ణా తతశ్చింతా ప్రవర్తతే,
సలిప్సమానోలభతే భూయిష్ఠం రాజసాన్ గుణాన్. ౧౦. అని మూలము.

అని భార్గవునకుఁ దెలిపి మఱియు నాబ్రాహ్మణుం డిట్లు తెలిపెను సాధుమతీ! జనకచక్రవర్తికి నొకవిప్రునకుసాగిన యొకసంవాదమును వినిపించెద. దాని నాలకింపుము. సంశయములు తొలంగును. ఒకానొకకాలమునందు జనకమహారాజు సద్బ్రాహ్మణుఁ డొకండు తన్నవమతిచేయఁగా నాతనితో నీవు నా రాజ్యమున నివసింపకుము. పొమ్మని యాజ్ఞాపించెను. ఆ మాటల నాలకించి యాబ్రాహ్మణుఁడు రాజా! నీరాజ్య మెంత వఱకుఁగలదు? దానిం దెలిపిన దాని నెఱింగి నీరాజ్యమునువదలి పరరాజ్యమునకుఁ బోయెదను. దయచే నెఱింగింపుమా యని వేఁడెను. ఆమాటలయందుఁ గలగంభీరతరార్థము నెఱింగి రాజు నిట్టూర్పులుపుచ్చుచు నూరకుండెను. ఇంచుక విస్మృతిం గాంచెను మూర్ఛంబొసి యిట్టుపలికెను. పితృపితామహాదులు పాలించినరాజ్యము నావశముననుండినను నాకు మమతగలుగదు వెదకివెదకి యీమిథిలానగరంబున వసియించితిని. ఇదియు నాదియే యని యంగీకరింపఁజాలను. కావున నిది నారాజ్యమని నిర్ణయింపఁజాలనుగాన నింతకుమున్ను నీతోఁ బల్కినమాట నాకుఁ బరితాపంబును గలిగించెను. దాన మూర్ఛవ్యాపించెను. అనిపలికి యూరక యుండెను. ఆభూసురుఁ డాభూవరుం గాంచి యార్యా! పూర్వపరిపాలితమగు రాజ్యముననుండియు మమత్వముఁ విడనాడుటకుం గలహేతువు నెఱింగింపుము. వినఁగోరెద అని ప్రశ్నించెను. జనకరా జిట్లు బదులుచెప్పెను.

* మహాద్విజా ఇవన్నియు నశించునవియే కావున నిది

* అంతవత్యఇహావస్థావిదితాస్సర్వకర్మసు, నాధ్యగచ్ఛమహంతస్మా న మేదమితియద్భవేత్. కస్యేదమితికస్య స్వమితి వేదవచస్తథా, నాధ్యగచ్ఛహంబుధ్యామమేదమితియద్భవేత్. ౧౬. అనిమూలము.

సాధనమని చెప్ప నిష్టపడను. ఇంకొకదానియందు సంగీకారబుద్ధి నాకుఁగలుగదు. సకలభూములు నావనియే భావింతు ననరాదు. ఎట్లనఁగాఁ దెలిపెదను. నాసికాదులకు గోచరములైనను గంధాదులనశింపఁగలవు. కాన నాయవి యన వలనుపడలేదు. భూమ్యాదిభూతములు నాచే విసర్జింపఁబడియు నావశమున నేయుండును అనుటయు న్నా బ్రాహ్మణుండు నవ్వుచు రాజేంద్రా! చిఱునవ్వున నిన్నుఁ బరీక్షింపఁగోరి వేడుకమై నడిగితిని. అందులకయి యేవచ్చితిని నేను ధర్ముఁడను. ఈవివేకపరిపాకము గాఢనిరూఢభావము. నీమది స్థిరతంగాంచుఁగాక. శాంతము నీకు లభించుఁగాక. అని వర మనుగ్రహించి యదృశ్యుండయ్యెను. అని పత్నికి బోధించి మఱియు నిట్లు పలికెను.

సాధ్వీ! హిత ముపదేశించెద. అవహితవుగమ్ము. నేను సంసారమును ద్యజించి యేకాంతమున నుంటిని. అట్టితఱి. నీవు నావైరాగ్యము నపహరింపఁదలంచివచ్చి నాకథ్యాత్మవిషయములు బోధింపుమని ప్రశ్నించితివి. నీయభిప్రాయ మెఱింగితిని. అట్లయ్యు నెఱుంగనిచందమున నున్నవాఁడను. నీకుఁదగినట్లు బదులుపల్కితిని ఇఁక నే నీలోకమునఁ గలిసియుండువాఁడఁగాను. సత్యముగ బ్రాహ్మణుండనే నైతిని. బ్రహ్మచారినైతిని. జీవన్ముక్తుఁడనైతిని. నాస్వరూపం బెఱుంగక మీావలెనన్ను భావించితివి. సర్వప్రపంచమును వ్యాపించియున్నవాఁడను. నా యీాయూహకు సకలరాజ్యంబును తుదకు స్వర్గాధిపత్యంబును సరిగావని భావించుచున్నాఁడను. నా కీబుద్ధియే ధనము ఇంధనములయం దగ్ని యడంగియున్నయట్లు సకలప్రాణులయం దంతర్గతమై సిద్ధియున్నయది. గురుగృహావా

సులు గృహవాసులు వనవాసులునగు బ్రాహ్మణులకెల్ల శ్రేయస్సుగలుగుటకు మార్గ మొక్కటియే కలదు. వీరెల్లరు నదులు సముద్రమునఁ గలియునట్లు పరతత్త్వమునే ప్రాపింతురు. బుద్ధి నీమార్గమునఁబోవఁజేయందగును గాని శరీరముతోడఁ బోవఁజేయరాదు. అది శక్యమగునదియుఁగాదు. *కర్మము లాద్యంతములు గలవియగు. శరీర మియ్యది కర్మబంధనకరము. ఇది యెఱుంగుదును. అట్టులౌట నాహృదయమునఁ బరలోకభయము చొప్పడదు. కావున నోసాధ్వీ! నాయుపదేశించిన యధ్యాత్మవిషయకవాక్యములం గలసారమును జిత్తంబున నిలిపి తద్భావభావనిరతవుగమ్ము, నన్నే పొందుదువు.

అని యుపదేశించుటయు నామె సాష్టాంగనమస్కృతుఁ లాచరించి కేలుమోడ్చి మహాత్మా! నీ యీహితబోధము మిగుల దురూహము. అశిక్షితాత్ములకు గ్రహింపఁదగినవి కావు. ఆవాక్యముల గలగూఢార్థము శిక్షితులకును గ్రహింపఁదగినవియా? అందలియర్థమును గ్రహింపఁదగుశక్తి గల్గునుపాయము నాదరమున నాకనుగ్రహింపుమా అని ప్రార్థించెను. బ్రాహ్మణుం డిట్లు పలికెను. అరణి బ్రాహ్మణుఁడు. ఉత్తరారణిగురువు. శ్రుతము తపస్సు. నిర్మథన మొనరింపఁగా జ్ఞానమనునగ్ని యుదయించును. అనఁగా బ్రాహ్మణి యిట్లు పలికెను. బ్రాహ్మణుఁ డనఁగా క్షేత్రజ్ఞుడగుట నతని నరణిగాఁ గొనుటను దాని నెఱింగికొనుపద్ధతిని ముం దెఱింగినఁగదా దానిం దెలుపుమని మరలఁ బ్రశ్నించెను. వనితామణీ! ఆతనిఁ దోఁచునట్లు చేయుసాధనము లేదని

* ఆద్యంతవంతి కర్మాణి శరీరం కర్మబంధనమ్, తస్మాత్తేసుభగే నాస్తి లోకకృతం భయమ్. తద్భావభావనిరతా మమైవాత్మానమేష్యసి. అనిమా.

యెఱుంగుము. ఆతఁ డింద్రియములకు గోచరుఁడు కాఁడు. గుఱుతు లేమియు లేవు. నిర్గుణత్వమే యాతనిలక్షణము. ఆతని నొందువాఁ డొక్కఁడు లేఁడు. ఈవిషయముమాత్రము తోఁచును. యోజించుకొనుము. అని నిర్ణయించుటయు క్షేత్రజ్ఞునివిషయమునఁ గలయనుమానము వదలి యాయింతి శాంతి నొందెను.

అని శ్రీకృష్ణుఁ డుపదేశింప నర్జునుఁడు స్వామీ! ఆబ్రాహ్మణీబ్రాహ్మణు లిట్టివారలగుదురేని వారెచ్చటివారో నాకెఱిగింపుమని ప్రశ్నించెను. భగవంతుఁ డాతనిముఖముచూచి [1]శిష్యా! నామనస్సే బ్రాహ్మణుండని నాబుద్ధియే బ్రాహ్మణి యనియు, క్షేత్రజ్ఞుఁడని నేఁదెలిపినవాఁడు నేనే యనియు నెఱుంగుము. అని పలుకఁగనే యర్జునుఁడు భగవంతా తమ యనుగ్రహమున నామతి నిర్మలమై సూక్ష్మవిషయముల గ్రహింపఁజాలియున్నది. కావున నుత్కృష్టమై తెలిసికొనఁదగిన బ్రహ్మము నెఱింగింపుము అని ప్రార్థింపఁగా శ్రీకృష్ణుఁ డర్జునుం దిలకించి గురుశిష్యసంవాదరూపమగు నితిహాస మొకఁడు కలదు. దానిం దెలిపెద. అది నీవడిగిన ప్రశ్నమునకు నుత్తరమగు. వినుము.

## గురుశిష్యసంవాదము శ్రీహరి నరునకు నెఱింగించుట.

మేధావంతుఁడగు నొకశిష్యుఁడు శాస్త్రరహస్యవేది యగు నొకగురువుకడకుంబోయి మహాత్మా! పరమశ్రేయస్సాధనభూతమగు బ్రహ్మము నెఱింగింపవే యని ప్రశ్నించెను. ఆ

1 మనో మే బ్రాహ్మణం విద్ధి బుద్ధిం మే విద్ధి బ్రాహ్మణీం, క్షేత్రజ్ఞ ఇతియశ్చోక్తస్సోఽహమేవధనంజయ అని మూలము.

గురుండు ప్రజాపతి ప్రముఖమహర్షులాంగిరసుం బురస్కరించు కొని బ్రహ్మదేవునికడకుంబోయి నమస్కరించి మహాత్మా! హిత మేది? దాని నొందుమార్గ మేది? చక్కగా వివరింపుమా యని వేఁడిరి. అనలువ వారి కత్యంతకరుణతోఁ దెలిపిన విషయమును నీకుం దెల్పెద. అదియే నీప్రశ్నమునకు సమాధానమై యుండ జాలు. వినుమనశిష్యుఁడిట్లనియె. గురువర్యా! నే నెందుండివచ్చి తిని. నీ వెందుండివచ్చితివి? ఈభూతములు స్థావరములు చరము లు నెందుండికలిగినవి? ఎట్లు జీవించుచున్నవి. వానికాయుష్య మెంత? సత్యమన నేమి? తపస్సన నేమి? ఏగుణములుసజ్జనసమ్మతము లగు? ఏమార్గములుశుభములు? సుఖమన నేమి? దుష్కృతమన నేమి?ఇవియే నాప్రశ్నసారములు. అనుటయు నాగురు వీప్రశ్న మున కాసంవాదమే సదుత్తరంబగు. వినుము. అని కరుణతో నిట్లు పలికెను.

*సత్యముననే భూతములు సంభవించును. దానిచే జీవిం చును. దానియందే లయించును. ఇది గుణత్రయాత్మకమగు సత చరిత్రము. శ్రుతి యని తపమని ప్రజాపతి యని సత్యము నకు వేఱువేరులు గలవు. అన్నియు సత్యమునే తెలుపును. కావున సత్యమనునది తెలియందగుపదార్థము. దాని నెఱుంగు టయే ముఖ్యము. కామక్రోధాదులవదలి సర్వకాలము పెద్ద లాసత్యమునే సేవింతురు. సత్యమును దృఢభావాకలనమున యోగులుపాసింతురు. అదియే హితము. దాని నెఱుంగుతెఱం గు వినుఁడు. ఆమార్గమునఁదప్ప దాని నెఱుంగఁదరముకాదు.

* సత్యాద్భూతాని జాతాని స్థావరాణి చరాణిచ, తపసాతాని జీవంతి ఇతి తద్విత్త సువ్రతాః. అని మూలము

[1]నాలుగాశ్రమములు, నాలుగుజాతులు, నాల్గుపాదములు గాఁదగు ధర్మము. నిస్సమానము. శుభప్రదము. నాలుగాశ్రమములకుంగూడ నామార్గము సామాన్యము అధ్యాత్మతత్త్వము తెలియనిచోఁ బరతత్త్వమును బొందశక్యముకాదు. ఇంద్రాదులకుఁగూడ నధ్యాత్మజ్ఞానంబులేక తత్త్వప్రాప్తికలుగదు. కావున దత్త్వములను విశదీకరింతును. ఆలకింపుము.

పృథివ్యాదిభూతము లైదు, గంధాదిగుణము లైదు, నింద్రియములు పదియు, మనస్సు, అహంకారము, బుద్ధియుఁ, బ్రకృతియు ననునివి యిరువదినాలుగుతత్త్వములు. వీని జననలయములతోడ నెఱింగినధీరుఁడు సకలకల్మషనిర్ముక్తుఁడై పరతత్త్వము నొందును. అని తెలిపి బ్రహ్మ మఱియు నిట్లు తెలిపెను. అవ్యక్త మనిర్వాచ్యము. స్థిరము, ధ్రువము, సర్వవ్యాపిత్వకలితము, గుణత్రయశక్తిసంయుతము నవద్వారపురము కనుఁగొని చక్కఁగా దెలిసికొన శక్యముకాదు. దానిని సాధించుటకుఁ బెక్కుమార్గములు లేవు. తద్గతమగు చిత్సులభత్వప్రసిద్ధిచేఁ గలుగు త్రిగుణసంపదలు గలదిగావున గుణవంతులై సువ్రతులగువారిచే నదిసాధ్యమగును. అదియొక్కటియే మార్గము. మహాత్ములారా! *సత్త్వరజస్తమోగుణములు మూఁడును నాధములు. అవి యన్యోన్యమిధునత్వము,అన్యోన్యాశ్రయత్వ

1 చాతుర్వర్ణ్యం తథా వర్ణం చాతురాశ్రమికాః పృథక్, ధర్మమేవం చతుష్పాదం నిత్యమాహుర్మనీషిణః. ౩౦. శ్లో. ౩౫. అధ్యాయము.

* అన్యోన్యమిథునా స్సర్వే తథాన్యోన్యానుజీవినః, అన్యోన్యాపాశ్రయాశ్చాపి తథాన్యోన్యానువర్తినః. అన్యోన్యవ్యతిషక్తాశ్చ త్రిగుణాః పంచధాతవః. అని మూలము.

ము,పరస్పరసంకలితానువృత్తభావము, ఇతరేతరాపజీవనాచరణ
ముగలిగి దుర్బోధకములై యుండును. తమోగుణము నియ
మింపఁబడినచో రజస్సు దానింగలియు. రజోగుణము నియమింపఁ
బడిన సత్త్వమందు ప్రవేశించును. సత్త్వము తగ్గియుండినచోఁ
దమఃప్రవృత్తి యధికంబగును. లోకమోహశోకనిద్రాభయ
ములు లోనగుగుణములు తమోలక్షణములు. పాపములు లోన
గుజన్మములు తత్స్వభావములని యెఱుంగవలయు. ఇవితామస
గుణప్రధానములని యెఱింగి వానిని నిరసించుటకుఁ దగు
హేతువుల నెఱుంగువివేకము గల్గువాఁ డధోగతిపాలుగాక
కడతేఱును. బలశౌర్యమదాదులు రజోగుణసంభవములు.
వానితత్త్వ మెఱింగి యవిలేకయుండఁ బ్రవర్తించువాఁడు
కృతార్థుఁడగును. ఆనందప్రీతిప్రముఖములు సత్త్వగుణములు.
ఇవి పూర్వజన్మసంకలితములని యెఱింగి తన్నిష్ఠగలవాఁడు లబ్ధ
సంతోషుఁ డగును. అట్టివాఁ డహంకారమమత్త్వము లోనగు
వాని మాని యూర్ధ్వలోకమునఁ కేగఁజాలు. ఈమూఁడుగుణ
ముల నెఱింగి వానిత్రిప్పులకులోఁబడకయుండువాఁడు వానిని
జయించును. అట్టివాఁడే కృతకృత్యుఁ డనంబరఁగు.

మునులారా! చక్కఁగా నాలకింపుఁడు. ఆత్రిగుణములు
వేఱువేఱుగా నుండఁజాలవు కలిసియే యుండును. సమ్మిళిత
ములయియే సంసారయాత్రాప్రవర్తనమును గొనసాగించును.
ఇందేది ప్రధానమగునో దానిగుణములు పెంపొందును.
ఒక్కొక్కసారి యవి తొలఁగును. సత్వగుణప్రధాను లూర్ధ్వ
గతిని, రజోగుణప్రధానులు మధ్యసరణిని,దమోగుణప్రధాను
లధోగతిని బొందుదురు. ఈగతికే స్రోతస్సని పేరు. జీవగమన

హేతువగు దశావిశేష మీగుణమునం దానీమార్గము నొందు చునని యెఱుంగు టుత్తమము. గుణత్రయమును ద్రోసి పుచ్చుట మేలు. సాత్త్వికులకు స్వర్గము రజోగుణప్రధానులు మధ్యభువనము. తామసులకు నీచత్వమును దెలుపునధోలోకము ప్రాప్తించును ధర్మార్థకామగోచరములగుకర్మములకు సాత్త్వికాదిగుణవికరతరంగములు హేతువులు. నిష్కర్మతకు వీనివిభూతియే కారణమగును. * ప్రాణము సత్త్వము, అపానము రజస్సు, ఉదానము తమస్సు అని శ్రుతిహితము. సత్త్వ గుణము నాశ్రయించు టుత్తమము. తపోదానయజ్ఞాదులు దానివలనం గలుగును. కాన నది యత్యుత్తమము, దానియాశ్రయమునం బరతత్త్వ మెఱుకపడును. దాని నెఱుంగుటయే ప్రధానము. దాని నెఱింగినవాం డదీనుండై ముక్తినొందును. దానికంటెం గోరందగిన దేదియుండును లేనేలేదు. అని బ్రహ్మ మునులకు నుపదేశించి బ్రహ్మ మఱియు నిట్లు పలికెను.

### మనోబుద్ధ్యహంకారాదితత్త్వనిర్ణయము.

అవ్యక్తమునుండి మహత్తత్త్వముదయించును. అదియే సర్వగుణసృష్టికిం దొలుతటిదని యెఱుంగందగు. అదియే బుద్ధియని మతియని ధృతియని ఖ్యాతియని సంవిత్తని యింక నెన్నియోనామములొంది వ్యాపించును. ప్రభుత్వమునుగాంచును. అదియే యహంకారతత్త్వమునకు నుత్పత్తికారణమగు దానినుండి పంచమహాభూతము లుత్పత్తిల్లెను. వానినుండి సర్వముదయించెను. వర్ణత్రయమున జనించువార లధ్యయనమును వ్రతమును యజ్ఞమును దపమును మఱియుం బెక్కుసత్కర్ముల

* ప్రాణాపానావుదానశ్చా ప్యేతపేవ త్రయోగుణాః అనిమూలము.

నాచరింతురు. ఆతత్త్వమునుండి పృథివ్యాది పంచమహాభూతములు పంచతన్మాత్రలు పరఁగును. వానికి లోఁబడిన మనస్సుగల జంతువులు మోహాంధకారావృతములయియుండును. ఆర్యులగువారు మోహాదిగుణవికారములకు లోఁబడరు. విషయములస్థిరములు. విషసమానములు. వికారము లొదవించునవి. బుద్ధిగుణములను గలుషములుగాఁ జేయును. మాంసమురక్తము అస్థులు వీనింగూడి యేర్పడిన శరీరములు తనువుగానే భావించునట్టిమూర్ఖులు వానివలనఁగలుగు నపకారము నెఱుంగఁజాలక వానికిలోఁబడి చెడిపోవుదురు. ఇది నిశ్చితము. పండితులు వీనికిలోఁబడరు. కానఁ జెడరు. అంతరాత్మ యనఁగాఁ బ్రాణాది పంచవాయువులు వాఙ్మనోబుద్ధులుగాని రూఢము. ఈయష్టకము లోకమున కెల్ల నుపాదానకారణ మగును. ఈరీతి నెఱుంగుట జ్ఞానమునకుఁ బ్రధానము.

అహంకారమునుండి పుట్టినచక్షుః ప్రభృతి బుద్ధీంద్రియములు, పాయువు మొదలగు కర్మేంద్రియములు మనస్సు ననునీపదునొకండింద్రియములు. బుద్ధి పండ్రెండవయింద్రియము. అది పై వానినెల్లఁ దన ప్రక్క కాకర్షింపఁజాలును. ఈవిషయ మెఱింగిన పరిశుద్ధాత్ముఁడు పరతత్త్వమును దెలిసికొనఁగలఁడు. స్వేదము, ఉద్భేదము, అండము అను వానినుండి యధమమధ్యమోత్తమదశలుగల భూతరాసులు పుట్టును. అందు జరాయుజము లత్యుత్తమములు. భూతతారతమ్యజ్ఞానము ప్రధానము. కావునఁ దెలిపితిని అధ్యాత్మవిషయము నెఱింగించెద. వాని నెఱుంగుటకువిద్య మూలకారణంబై యుండు. ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమియు వరుసఁగాఁ బైనుండి

ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ పంచమకక్ష్యలని యొఱుంగం దగు. అధ్యాత్మాదులు భూతాధిష్ఠానములు కాఁబట్టి భూతములవరుసం దెల్పితిని.

ఆకాశము ప్రథమభూతము. శ్రోత్ర మధ్యాత్మము. శబ్ద మధిభూతము. దిక్కు లధిదైవతము. మారుతము రెండవ భూతము. చర్మ మధ్యాత్మము. సంస్పర్శ మధిభూతము. విద్యుత్తు అధిదైవతము. జ్యోతిస్సు తృతీయభూతము. చక్షు స్సధ్యాత్మము. రూప మధిభూతము. సూర్యుఁ డధిదైవతము జలము చతుర్థభూతము. జిహ్వ యధ్యాత్మము. చంద్రుఁ డధి భూతము. రస మధిదైవతము భూమి పంచమభూతము నాసిక యధ్యాత్మము. గంధ మధిభూతము. మారుత మధిదైవతము. ఇది బుద్ధీంద్రియప్రపంచము.

పాదపాయూపస్థ పాణివాగ్వర్గము కర్మేంద్రియములు. అధ్యాత్మములు దానియధిభూతములు.గంతవ్యవిసర్గప్రభృతుల నాలకింపుఁడు. బభ్రుమిత్రప్రజాపతిశక్రాగ్నులుఅధిదైవతములు. అహంకారము మనోబుద్ధులు. ఆధ్యాత్మకములు. అభిమానమంతవ్యములు. అధిభూతములు. రుద్రుఁడు అమృతకరుఁడు. బ్రహ్మము అధిదైవతము. ఈనిర్ణయము శ్రుతిసమ్మతము. ఈ విషయము నెఱింగి యింద్రియముల నింద్రియార్థముల భూతవ్రాతమును గనిపెట్టి విరుద్ధముగాకుండ మనసున నడఁగియుండ నొనరించుటయే సంసారనివృత్త్యుపాయము.

అనిపలికి బ్రహ్మదేవుఁడు మహర్షులతో నతిసూక్ష్మభావతత్వప్రకాశినియు మంగళప్రదయు నగునివృత్తిమార్గ మింక నెఱింగించెద. వినుండని యిట్లు పలికెను తాఁబేలు తనయవయవ

ముల ముడుచుకొనునట్లు విద్వాంసుఁడు తన్నలయించుకామ
ముల మరల్పఁజాలును. అట్టిజ్ఞాని రజోవేశములేక ముక్తిపథ
మును గాంచును. దశేంద్రియములను వశపఱచుకొనుట
మిక్కిలి చక్కనియుపాయము. అదియే దారువ్యూహముగా
నాత్మాగ్ని వెలుఁగఁజేయువారు. ఆత్మఁగాంచిన సూక్ష్మతత్త్వ
దర్శనము గలుగును. రోగాతిశోకములఁ గూడినభోగలవముల
కాశ్రయమగు భూతపంచకసాగర మతిదుస్తరమగును. కామ
క్రోధముల జయింపఁగలశక్తి గలిగినపుడు దానినిదాఁట ననువు
పడును. *మనస్సును మనస్సునందే యనుసంధించి యాత్మనాత్మ
యందే కనునట్టి సర్వవేత్త సర్వభూతముల యందును దన్నే
చూచుచు నిర్వికారవృత్తి నుండును. దీపము పెక్కుదీపములఁ
గలిగించునటులు ఆత్మతత్త్వమొక్కండయ్యు రూపాంతరముల
యం దావహించియుండును. ఆవిధ మెఱింగిపండితుఁడు భ్రమ
నొందక యొక్కరీతి నుండును. [1]ఆపరంజ్యోతినామములే విష్ణు
వని, మిత్రుఁడని, వరుణుఁడని, అగ్ని యని, ప్రజాపతియని, ధాత
యని, విధాతయని తెలియవలయును అదియే ప్రభువు సర్వతో
ముఖము. ఆపరమాత్మనే విప్రప్రవరులు సురాసురులు యక్షపి
శాచపితృవరులు. పక్షులు రక్షోభూతగణములు. మహర్షులు
సర్వదా ప్రణతులై భజింతురు. అని యుపదేశించి బ్రహ్మ
మఱియు వారల కిట్లు తెల్పెను.

* మనో మనసి సంధాయ పశ్యన్నాత్మానమాత్మని, సర్వవిత్సర్వభూ
తేషు విందత్యాత్మానమాత్మని. అని మూలము. 1 స వై విష్ణుశ్చ మిత్రశ్చ
వరుణోఽగ్నిః ప్రజాపతిః, సహిధాతా విధాతా చ స ప్రభు స్సర్వతోముఖః,
హృదయం సర్వభూతానాం మహానాత్మా ప్రకాశతే. అని మూలము.

మనుష్యులకు రాజు లధిపులు. వాహనములోఁ గుంజరము, ఆరణ్యకములలో సింహము, సర్వపశువులలో గొఱ్ఱియయు, బలవపతులలో సర్పమును, గోవులలో వృష భము, స్త్రీలలోఁ బురుషుఁడు, వృక్షములలో వటజంబు కాశ్వత్థశాల్మలిశింశుకాదులును శ్రేష్ఠము లనంబడును. హిమ వంతము, పారియాత్రము, సహ్యము వింధ్యము, త్రికూ టము. శ్వేతనీలములు, భాసము, కోష్ఠము, స్కంధమ హేంద్ర మాల్యవంతములు ననునివి పర్వతరాజములు. గ్రహములలో సూర్యుఁడు, నక్షత్రములలో జంద్రుఁడు, పితృదేవతలలో యముఁడు, నదులలో సాగరము, జలము లలో వరుణుఁడు, మరుత్తులలో నింద్రుఁడు, ఉష్ణవస్తువులలో నర్కుఁడు, జ్యోతిస్సులలో నింద్రుఁడు, భూతములలోనగ్నియు, బ్రాహ్మణులలో బృహస్పతియు శ్రేష్ఠులు. ఓషధులకుఁ బతిసో ముఁడు, బలవంతులకు విష్ణువధిపతి, రూపముల కధిపతి త్వష్ట, పశువుల కీశ్వరుఁ డధిపతి, దీక్షితులకు విభుఁడు యజ్ఞము, దిక్కుల కుత్తరదిక్కధిపతి, విప్రులకు సోముఁ డధిపతి, సర్వ రత్నములకుఁ గుబేరుఁడు నాథుఁడు, దేవతలకుఁ బురందరుఁడు నాయకుఁడు, సకలభూతములకు స్వష్టికర్త యగు ప్రజాపతి విభుఁడు సర్వవిధభూతములకు బ్రహ్మదేవుఁడను ప్రసిద్ధిగల నేనే యధిపతిని. ఎల్లవిభులకు విష్ణువు ప్రభువు. దేవదానవాదుల కాతఁడే యీశ్వరుఁడునగు. సర్వశక్తులకు మాహేశ్వరి యని పిలువఁబడు పార్వతి ప్రభుత గాంచును. నారీగణములలో నుమాదేవి నుత్తమురాలినిగా నెఱుంగుఁడు. రతులలో వసు మతియు స్త్రీల కప్సరసయు నధిపతులని యెఱుంగవలయును.

బ్రాహ్మణులు ధర్మసేతువులు, రాజులు ధర్మకాములు, కావున రాజు ప్రయత్నపూర్వకముగ బ్రాహ్మణులరక్షింపవలయును. ఏరాజులదేశములయందు సాధువులు సుఖపడక దుఃఖపడ్డు దురో యారాజులు గుణహీనులని యెఱుంగవలయును. వారు మృతినొంది సన్మార్గవంశములయందు జన్మింపరు. ఏదేశము సాధువులు రక్షింపఁబడుదురో యారాజీలోకమున సుఖించుచు మృతినొంది స్వర్గసుఖమును గాంచును. ఇఁక ధర్మలక్షణమును వినుఁడు.

* ధర్మమునకు నహింసయే లక్షణము. అధర్మమునకు హింసయేలక్షణము. దేవతలకుఁ బ్రకాశత్వము, మానవులకుఁ గర్మము, నాకాశమునకు శబ్దము, వాయువునకు స్పర్శము, జ్యోతిస్సునకు రూపము, జలమునకు రసము, పృథివికిగంధము, సర్వవ్యంజనసంస్కార యగుభారతికి శబ్దము, మనస్సునకుఁ జింతయు, బుద్ధికి వ్యవసాయము, దానిమహత్తత్త్వస్వరూప మునకు ధ్యానము,అవ్యక్తమునకు సాధుత్వము,యోగమునకుఁ

*అహింసాపరమోధర్మో హింసాచాధర్మలక్షణా, ప్రకాశలక్షణాదేవా మనుష్యాః కర్మలక్షణాః, శబ్దలక్షణమాకాశంవాయుస్తు స్పర్శలక్షణః, జ్యోతిషాం లక్షణం రూపమాపశ్చరసలక్షణా. ౨౨. ధారిణీ సర్వభూతానాం పృథివీగంధలక్షణా, సర్వవ్యంజనసంస్కారా భారతీ శబ్దలక్షణా. ౨3. మనసో లక్షణం చింతాచింతోక్తాబుద్ధిలక్షణా, మనసా చింతితానర్థాన్ బుద్ధ్యా చేహ వ్యవస్యతి. ౨౪. బుద్ధిర్హి వ్యవసాయేన లక్షణేనాత్ర సంశయః, లక్షణం మనసోధ్యానం మవ్యక్త సాధులక్షణం. ౨౫. ప్రవృత్తిలక్షణోయోగో జ్ఞానంసన్న్యాసలక్షణమ్,తస్మాత్ జ్ఞానం పురస్కృత్యసన్న్యసేదిహాబుద్ధిమాన్ ౨౬ అధ్యా. ౪౪.

ప్రవృత్తియు,జ్ఞానమునకు సర్వవస్తుత్యాగము ననునివిలక్షణము
లు. లక్షణజ్ఞానము పరతత్త్వపరిజ్ఞానమునకు హేతుభూతమని
తెలియవలయు. జ్ఞానపురస్కారమగు సన్న్యాసము పరమగతిని
గల్పించు. నిర్ద్వంద్వుఁడై జరామరణనిస్తరణకరణమగుధర్మ
మును బొందును. అని బోధించి వారల కవ్యక్తతత్త్వము
నిరూపింప దలంపుగొని బ్రహ్మ యిట్లుపలికెను.

## అవ్యక్తతత్త్వనిర్ణయము.

* మునులారా! అవ్యక్త మనఁబడుతత్త్వము పరీక్షిం
పఁగా నలింగము. పురుషుఁ డలింగుఁడు.ఆపురుషుఁడు క్షేత్రము
నెఱింగినవాఁడు. కావున క్షేత్రజ్ఞుఁ డనఁబడును. క్షేత్రమనియు
ప్రకృతియనియు నవ్యక్తమునకు నామములు కలవు. గుణాచి
హ్నితమగు నాతత్త్వ మాపరమాత్మగుణముల నెఱుఁగఁ
జాలదు.చేతనారహితమగుటయే దానికిఁ గారణము. పరమాత్మ
యన్ననో తత్క్రియావిశేషముల నెఱుంగు. ఈవిషయముల
నెఱింగి గుణమ్ములవదలి ధ్యాననిష్ఠఁ బూని తత్త్వవేత్తయగు
వాఁడు అచలము నిరామయము నవ్యయము నగుపదము
నొందఁగలఁడు. ద్వంద్వము లనఁబడుశీతోష్ణసుఖదుఃఖముల నతి
క్రమించినవాఁడే యాయవ్యయపదంబునొంద యోగ్యుఁడు.
వేఱుమార్గమునఁ గాఁజాలఁడనుట సత్యము. అతత్త్వలక్ష
ణము నింకను విస్తరించి వచించెద. ఆలకింపుఁడు.

---

* ఆలింగగ్రహణో నిత్యః క్షేత్రజ్ఞోనిర్గుణాత్మకః, తస్మాదలింగః
క్షేత్రజ్ఞః కేవలం జ్ఞానలక్షణః. ౩౬. అవ్యక్తం క్షేత్రలింగస్థం గుణానాం
ప్రభవాప్యయం, సదా పశ్యామ్యహం లీనం విజానామి శృణోమిచ. ౩౭.
అని మూలము.

పగలు రాత్రియు మాసములు పక్షములు శ్రవణాది
నక్షత్రములు శిశిరాదికములగుఋతువు లుత్తరోత్తర ముత్కృ
ష్టములగు. గంధములందుభూమియు, రసములయందు జలము,
జ్యోతిస్సులందు నాదిత్యుఁడు, స్పర్శములందు వాయువు, శబ్ద
ములయం దాకాశ ముత్తమములు. ఇవిభూతములవిషయము.
ఇఁక భూతములయం దుత్తమము లనాదిభూతులను జెప్పుచు
న్నాఁడను. జ్యోతిస్సులయందు నాదిత్యుఁడాదిభూతుఁడు భూత
ములయం దగ్నియు, సర్వవిద్యలయందు సావిత్రియు, దేవతల
యందుఁ బ్రజాపతియు, వేదంబులయందుఁ నోంకారము,
వాయువులయందుఁ బ్రాణవాయువు, చందస్సులందు గాయ
త్రియుఁ, జతుష్పాజ్జంతువులయందు గోవు, మనుష్యులయందు
ద్విజాతులు, పక్షులయందు డేగయు, యజ్ఞములయందు హా
తము, సరీసృపములయందు సర్పము, యుగములయందుఁ గృత
యుగము, సర్వరత్నములయందు హిరణ్యము, ఓషధులయందు
యవలు, సకలభక్ష్యభోజ్యములయందు నన్నము, పేయముల
యందు జలము, క్షేత్రములయందు బ్రహ్మక్షేత్రము వృక్షము
లయందు నశ్వత్థము, సర్వప్రజాపతులలో నేను (బ్రహ్మను)సృ
కర్తలమగుమాయందు విష్ణువు పర్వతములయందు మహామే
రువు, దిగ్విక్కులయందు నూర్ధ్వభాగము నదులయందు గంగా
నదియు, సరస్సులయందుసాగరము, దేవదానవాదిగణములయం
దీశ్వరుఁడు, ఆశ్రమములయందు గార్హస్థ్యము నుత్తమములు.
విష్ణువు బ్రహ్మ శివుఁడు ననఁబడునామములు మూఁడు నొక్క
తత్త్వమే లోకములకాదియవ్యక్తతత్త్వమే. అంతము దా
యందే పగళు లస్తమయాంతములు. శర్వరియుదయాంతము.

దుఃఖము సుఖాంతము. సుఖము దుఃఖాంతము. సర్వము క్షయాంతము. ఉచ్ఛ్రయములు పతనాంతములు. సంయోగములు వియోగాంతములు. జీవితము మరణాంతము. సృష్టియంతయు వినాశాంతము. పుట్టినదానికి మరణము సత్యముగఁ గలుగును. స్థావరజంగమాత్మకప్రపంచమంతయు నశాశ్వతము, ఇష్టాపూర్తాదులు నాశముగలవియే, జ్ఞానము నాశనము లేనిది. కావునఁ బరిశుద్ధజ్ఞానముచే జితేంద్రియులై నిర్మములై నిరహంకారులై ముక్తి నొందుదురు

ఇఁకఁ గాలచక్రస్వరూపమును దెలిపెద. వినుఁడు. బుద్ధియే సారము. మనస్సు దానికి స్తంభము. ఇంద్రియగ్రామము బంధనము. మహాభూతములు పరిస్కందము. నివేశపరివేశనము. జరారోగసంయుతము. అది వ్యాధివ్యసనసంభవము. దేశకాలవిచారము గలది. శ్రమవ్యాయామనిస్వనముగలది. అహోరాత్రములు పరిక్షేపములుగాఁగలది. శీతోష్ణములు పరిమండలముగలది. మఱియు సుఖదుఃఖాంతసంశ్లేషము. క్షుత్పిపాసావకీలకము. ఛాయాతపవిలేఖము. నిమేషోన్మేషవిహ్వలము. ఘోరమోహజలాకీర్ణము. అచేతనము. మాసార్ధమాసగణితము. విషమసంచారయుతము. తమోనియమపంకము. రజోవేగప్రవర్తకము. మహాహంకారదీప్తము. గుణసంజాతవర్తనము. అరతిగ్రహణానీకము. శోకసంఘాతవర్తనము. క్రియాకారణసంయుక్తము. రాగవిస్తారము. లోభేప్సాపరివిక్షోభము. విచింతాజ్ఞానసంభవము. భయమోహపరీవారము. భూతసంమోహకారకము. ఆనందప్రీతిచారము. కామక్రోధపరిగ్రహము. మహదాదివిశేషాంతము. అశక్తిప్రభవాప్యయము. మనోజవము. మనఃకాంతము. ఇట్టిలక్షణ

ములుగల కాలచక్రము ప్రవర్తించుచున్నది. కాలచక్రప్రవృత్తినివృత్తుల నెఱుంగువారు భూతములయందు మోహము నొందరు సర్వసంస్కారవిముక్తులై ద్వంద్వాతీతులై సర్వపాపవినిర్ముక్తులై పరమగతి నొందుదురు.

ఇఁక నాశ్రమపద్ధతుల నాలకింపుఁడు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అని నాలుగాశ్రమములు. ఇవి గార్హస్థ్యము నాశ్రయించియుండునవి. గురువునకు హితమగు కార్యము నేచేయుచు వేదము నభ్యసించుచు భిక్షాన్నమునుభుజించుచు బిల్వపలాశములలో నొక్కదానిని ధరించి స్నానవిధినెఱపుచు బ్రహ్మచర్యనిరతుఁడు, నియమితేంద్రియజాలుఁడు, నిత్యశుచియు, యజ్ఞోపవీతియు, మితభాషియు, మేఖలాచిహ్నితుఁడు, శయనాసనప్రచారవిధులయందు నియమము గలవాఁడును, సత్యధర్మనిరూఢుఁడు నై శాంతమూని యిరుప్రొద్దు లగ్నికార్యమున దీర్చుచుఁ బాపకార్యములకుఁ దొలఁగియుండి వర్తించువాఁడు బ్రహ్మచారి యనంబడు. ఈనియమములు బ్రహ్మచర్యాశ్రమమునకు విధివిహితములు. శాస్త్రోక్తపద్ధతి నతిక్రమింపక సమావర్తనకర్మము నడపి నిజదారయందాసక్తుఁడై నిర్మలప్రవర్తనముగలిగి పంచమహాయజ్ఞపరుండై యతిథుల కన్నమిడి శిష్టాన్నమును భుజించుచు శుక్లవస్త్రములనే ధరించి శక్తికిందగినట్లు దానమిచ్చుచు నింద్రియచాపల్యవర్జితుఁడు నగుచుఁ బరిశుద్ధాంతఃకరణుఁడై సర్వభూతమైత్రిగలిగి స్వాధ్యాయశీలుఁడై సద్వ్రతనిష్ఠుఁడై యజ్ఞములఁజేయించు వేదమును జెప్పుచు క్షమగలిగి సత్ప్రతిగ్రహ మొనరించుచు మిత్రులు కొందఱని శత్రువులు కొందఱని భావింపక

మధ్యస్థుఁడై గృహస్థువు ప్రవర్తింపవలయును. ఆతనిం గాంచి
పాపములు తొలఁగిపోవును.

గ్రామమును వదలి యడవులలోఁ బర్ణశాలనిర్మించుకొని
యందు నివసించి యిరువేళల స్నానము చేయుచు బ్రహ్మచర్య
నియమముగలిగి నీవారములు(గడ్డిగింజలు)పండ్లు, మూలములు,
శాకములు భుజించుచు, నజినములు వల్కలములు వస్త్ర
ములుగా ధరించుచు, భూమిపై శయనించుచు, నతిథుల
నాదరించి యాహారములను భక్తిచేఁ దనకున్న వానిలోఁ బంచి
యిచ్చి, యధ్యయనహోమకృత్యముల నడపుచు, నింద్రియముల
జయించి వానప్రస్థుఁ డుండవలయు. ఇవి వానప్రస్థాశ్రమ
ధర్మములు. ఈమూఁడాశ్రమములలో దేనియందుండువాఁడై
నను ముక్తిని గోరినచో విద్యామూలాచారమై తగుసన్న్యా
సాశ్రమమును బరిగ్రహింపవచ్చును. దానిలక్షణముల నాల
కింపుఁడు. సర్వభూతముల కభయమిచ్చుచు, నతీతపదార్థములకుఁ
జింతపూనక రాఁగలవస్తువుల నాసఁగొని కోరక దొరకిన
వానితోఁ దృప్తిపడుచు వానియందు నుపేక్షగలిగి కూర్మము
తనయవయవముల లోఁగొనునట్లు వానివశమున నుండున ట్ల
భ్యసించుచు నుచితకాలభిక్షాచర్యచేఁ జిక్కినయంతతోఁ
దృప్తిపడి దేహయాత్ర సాగించుచు నశనము వస్త్రముగాక
మఱి దేని నెవ్వఁ డిచ్చినను గొనక యొక్కపూట భుజించుచు
నమస్కారమునందు స్తుతియందు దూషణమునందు సమబుద్ధి
గలిగి సన్న్యాసి వర్తింపవలయును. అనసూయయు, నక్రోధము,
దమము, బ్రహ్మచర్యము, ఋజుత్వము, సత్యము, పిశునతా
భావము నహింసయు ననునివి యతికి ముఖ్యములు. వృ

మూలములు నదీతీరములు విజనస్థలములు విపినములు గిరి
గుహలు లోనగువివిక్తభాగములు నివాసముగాఁ గౌటిల్య
సాధ్యవస్తువుల వదలి యతి సంచరింపవలయును తనవలనఁ
గలుగుమేలును గనఁబడఁజేయక తన్నుఁజూచి యెల్ల రుదా
సీను లగునట్లు వర్తించుచు భిక్షువు ముక్తుఁడు కావలయును.

సంసారవృక్షమును జ్ఞానశస్త్రముచే నఱికి యభిమానా
హంకారదూరుఁ డగుపురుషుండు ముక్తిపదమును గాంచును.
ప్రతినిమేషమందు నాత్మ నాత్మయందు సమ్మిళితముగావించి బోధ
మహితులగు మునులసహవాసముచేత నవ్యయగతిని బొందఁ
దగియుండును. ప్రకృతి చర్యలమానుటయే ముక్తిని గను
త్రోవయని యెఱుంగవలయును. పరమనియతి యనఁగాఁ
బ్రాణసంయమనంబె. అయ్యది వరుసగ నభివృద్ధి నొందించినచోఁ
బ్రసాదసిద్ధి గలుగు. అయ్యదియే పరమపురుషార్థమునకుఁ
జేర్చును. అవ్యక్తతత్త్వమునఁగలిగి భవ్యమగుసత్త్వము దురిత
పంకహరము. అది వ్యయరహితము నమృతము, ఇంద్రియాతీత
మునగు తత్త్వమునొంద నాధారమగును కావున సత్త్వ
భావనకంటెఁ బ్రశస్తమగుకృత్యము వెదకినను లేదు. శాశ్వత
వస్తుప్రాప్తిసిద్ధికిఁ బ్రధానము. సత్త్వస్థుఁ డగుపురుషుఁ డీతఁడని
యనుమానింపవలయునే కాని వేఱుకారణమునఁ గనుఁగొన
శక్యముకాదని యెఱుంగుఁడు. సత్త్వస్థుఁ డగు టెట్లందు రేని
వినుఁడు. సత్యము సంతోషము నహింసయు ధృతియు క్షమయు
నార్జవము సన్న్యాసము పరిత్యాగము విజ్ఞానయోగదశయు
త్త్వికములు. వాని నాశ్రయించినవారిని సత్త్వస్థులని
యెఱుంగవలయును. సత్త్వమును బురుషుని నొక్కటియే

యని కొందఱు వచింతురు. అది పొసఁగనిమాట. మేడిపండు నందుఁ బురువు లుండినట్లు జలముల మీఁద నుండునట్లు సత్త్వమునం దంతరాత్మ యుండుననియెడివారును బెక్కండ్రు గలరు.

అని బ్రహ్మదేవుఁడు బోధించుటయు నామహర్షులెల్ల ధర్మను లనేకవిధములుగ నుండు. వీనిలో నేది యనుష్ఠానార్హము? ఎవ్వఁడు దేని ననుష్ఠించునో దాని వాఁడు మేలని పలుకును. మే మన్నింటియందుఁ బ్రీతినుంతుము. అనిశ్చయదర్శనుల మై యున్నవారము. ఇది ప్రధానానుష్ఠేయంబని నిర్ణయించి మా కుపదేశింపవే యని ప్రార్థించిరి. అందును సత్త్వ పురుషసంబంధప్రకారము విశేషించి యెఱిఁగింపుమని వేఁడిరి. బ్రహ్మ యిట్లు పలికెను.

## సత్త్వంబవశ్యానుష్ఠేయమని నిరూపించుట.

ధర్మము లసంఖ్యాకములు గలవు. వానిలో నెల్ల సర్వ భూతాహింస యత్యుత్తమము. అహింసాధర్మము నాచరించు వానికి నత్యుత్తమజ్ఞానము తనంతన కల్గును. అదియే మోక్షమును బొందించును. కర్మములను విధివిహితములుగ నాచరించువాఁడు ఫలముల నాశింపకయుండినయెడల ముక్తి తనంతన లభించును. పురుషుఁడు విషయి యనంబడు. సత్త్వము విషయమనంజను. భోక్తృభోజ్యత్వసంబంధము ననుసరించి యుండును. పద్మపత్త్రమున జలబిందువువలెఁ బురుషునకు సత్త్వమునకు సంబంధమని యూహింపుఁడు. పురుషుఁడు తత్సంగముగల్గినట్లుండియు దానిం బొరయకయే యుండును. పరతత్త్వమును జూచుటకు సత్త్వము దీపమువంటిది. కావున

సాధనభూతమగుతత్త్వమును వదలరాదు. దానియాశ్రయమునఁ జిత్తసుఖత్వాకలితమగుస్థానమును జూడ శక్యమగును. అట్టిదానిని గృతాత్ము లాశ్రయింతురు. అదియే మంచి యుపాయము. చక్కనియుపాయ సామగ్రి లేక యభ్యుదయహేతువగు దూరమార్గమును జేరఁదరంబుగాదు. వాహనము నెక్కిన వాఁడు దూరమందున్న తావును జేరఁగలఁడు. నౌక నెక్కిన వాఁడు నదినుత్తరించి యవలితటమును జేరును. సాధనరహితుఁడగుమూర్ఖుఁడు ముక్తిపదంబు నెట్లు పొందఁగలఁడు? స్థలమార్గమున నావయు జలమార్గమున వాహన ముపయోగింపనట్లు తగినదగుసత్త్వమును వదలిన ముక్తిమార్గమును బొందఁజాలఁడు. దురితనివృత్తియుఁ గాదు. నదిని దాఁటునంతదనుక నౌక నాశ్రయించి పిదప వదలునట్లు సత్త్వమును బురుషదర్శనము లభించునంతదనుక నాశ్రయించి తత్ఫలము లభింపఁగాఁ దత్సంబంధమును వదలవలయును. అని పలికి మఱియుఁ జతుర్ముఖుం డిట్లు పలికెను.

ఇరువదినాలుగుతత్త్వముల మున్నెఱింగించితిఁగదా. మహదహంకారాదులయుత్పత్తిని దెలిపితినిగదా. భూమి మొదలగు నాల్గుమహాభూతములకంటె నాకాశము. దానికంటె నహంకారతత్త్వము, దానికంటే బుద్ధి, దానికంటెఁ బ్రకృతియు నెక్కుడగు. అన్నింటికంటెఁ బురుషుఁ డధికుఁడు. భూతములతారతమ్యము చక్కఁగా మనస్సునఁ బదిలపడినశిష్టులు పరంజ్యోతిస్స్వరూపుఁ డగుపురుషుని గాంచి శాశ్వతపదము నొందఁజాలుదురు. పృథివ్యాదిపంచమహాభూతములను వ్యాపింపఁ యుటకుఁ జిక్కఁబట్టుటకు దక్షత వానినేలు ప్రభుత్వమునఁ

దగుమనస్సు వాహనముల సారథి యెట్లో యట్లే యింద్రియ ముల నడపును. అట్టి శక్తి యామనస్సునకే కలదు. భూతాత్మ కమై బుద్ధిసన్నాహమై మనస్సారథికమై యింద్రియాశ్వమైన యీశరీరరథమునం దభీష్టగమనమున నంతరాత్ముఁ డెంద్రైనను బ్రయాణముచేయును. ఈపద్ధతిని బండితుఁడే యెఱుంగఁ గలఁడు. అట్టికోవిదుఁడు భయంకరములగు సంసారపాశములకుఁ జిక్కక నిర్గుణమార్గమునఁ బ్రవర్తించి నిరామయము శాశ్వ తము నగుస్థానమును గాంచును.

సాగరమునఁ దరంగములు పుట్టి యడంగునట్టు లవ్యక్త మునుండి చరాచరప్రపంచమంతయుఁ బుట్టును. అందే యడం గును. అవ్యక్తాదికమగు సమస్తము శాశ్వతుఁడగుపురుషు నాశ్రయముననే వ్యాపించును. ఈవిషయమును జక్కనెఱింగిన వారు బంధవిముక్తిని గాంతురు. ఆతత్త్వమునుగనుటకు మార్గము తపస్సే వేఱుమార్గము లేదు. కావున నధికనిష్ఠ మెయి సత్తపము నార్జింపవలయును. మహాత్ములారా! ఆతపోవిభూతి చేతనే ప్రజాపతులు బహువిధసృష్టినిర్వహణదక్షు లైరి. వన భవము లగుపదార్థములఁదినుచు దపస్సాదరమున నిష్ఠగలిగి తపం బొనరించికదా మునులు కాలత్రయంబును లోకత్రయంబును జూతురు దానిచేతనే విద్యాగౌరవము గలుగును. తపోమహా త్త్వమును బొందరానిపదములు లేవు బ్రహ్మహత్యాదిమహా పాపములు దానఁ దొలంగును. సర్వభూతములు సంతృప్తి నొందును. మమత్త్వము, అహంకారము గలమానసమును దపోనిష్ఠనునిచిన నాతపస్సునకుఫలము ప్రజాపతిత్త్వమే యగు. మమత్వాహంకారములవదలి చేయుతపస్సునకు ఫలము శాశ్వత

పదమగును.రజస్తమోగుణములవదలిసత్త్వగుణమునాశ్రయించి నిర్గుణతత్త్వమును గాంచి సత్త్వమునుగూడ వదలి వైరాగ్య సంపదల నొందును. పరతత్త్వమనఁగా క్షేత్రజ్ఞుఁడే యని యెఱుంగవలయు. అల్లెఱింగినవాఁడు సర్వమెఱింగినవాఁడే యగును. అవ్యక్తము తుదగాఁ గలిగినవియెల్ల నవిద్యాజనితములు. అవ్యక్తమును నిర్మమత్వము గల్గినఁ గాంచఁజాలును. *కర్మతత్పరులు కర్మములు (యజ్ఞాదిరూపములు) కర్తవ్యములనుదురు. జ్ఞానులు అధ్యాత్మవిద్యను శ్రేష్ఠమని చెప్పుదురు. కర్మములు పదాఱువికారములు గలమూర్తిని గల్పించును. అధ్యాత్మవిద్యయో శాశ్వతుఁడై యింద్రియగ్రాహ్యుఁడు కాక వెలుఁగు పరమపురుషుని గనుఁగొనఁజేయును. ఆపురుషుఁడు విద్యామయుఁడుకాని కర్మమయుండుగాఁడు. ఇది శ్రుతిసమ్మతమగుమార్గము. ఇట్టిజ్ఞాన మేమహాత్మునకుఁ గల్గునో యాజ్ఞాని యఖిలసంకల్పముల వదలి యాత్మ నాత్మయందే కాంచి నాశరహితమై యజరమై తగునమృత మనుపదమ్ము నొందును. జ్ఞాననిష్ఠగలిగి విముక్తిపద మిది నిర్ణయించుశక్తి గలవారిచేత నిర్ణయింపఁబడినపద్ధతి యిది యని యెఱుంగుఁడు. దీనికి మించిన మంచిమార్గము లేదు. వాంఛల వదలి యసంగతి నభ్యసించి సర్వసమత్వము గలిగియుండు మహాత్ములే యీమార్గమునఁ బ్రవ

*కర్మ కేచిత్ప్రశంసంతి మందబుద్ధిరతా నరాః, యే తు వృద్ధా మహాత్మానో న ప్రశంసంతి కర్మ తే. ౩౧. కర్మణా జాయతే జంతుర్మూర్తిమాన్ షోడశాత్మకః, పురుషం గ్రసతేఽవిద్యా తద్గ్రాహ్యమమృతాశినామ్. ౩౨. తస్మాత్కర్మసు నిస్స్నేహా యే కేచిత్పారదర్శినః, విద్యామయోఽయం పురుషో న కర్మమయస్స్మృతః. ౩౩. శ్లో. ౫౧ అధ్యాయము.

ర్తింప నర్హు లగుదురు. మీరడిగిన ప్రశ్నములకు బదులు చెప్పితిని. ఈమార్గముననే ప్రవర్తింపుఁడు. వేఱుమార్గములఁ బ్రవర్తింప నూహింపకుఁడు. ఈత్రోవన నడువఁబూనితిరేని పరమపదసిద్ధి మీకుం గల్గును. అని చతురాననుఁడు మానులకుఁ దత్త్వ ముపదేశింపఁగా వా రామార్గమున నిష్ఠగలిగి యితరాలభ్యమగు సౌఖ్యమునొందిరి. అని యాగురువు శిష్యున కీసంవాదమును మునులకు బ్రహ్మదేవునకు నైనదానిని బోధింపఁగా శిష్యుఁడు జ్ఞానియై యమృతపదము నొందెను.

అని యిట్లు శ్రీకృష్ణపరమాత్మ హిత ముపదేశింపఁగా విని యర్జునుఁడు మహాత్మా! యాగురు వెవ్వఁడో శిష్యుఁ డెవ్వఁడో తెలుపుమన విని కృష్ణమూర్తి పార్థా! గురువన నేనే. నామనస్సు శిష్యుఁడు నీపైఁగలప్రీతిచేత నీవిషయమును దెల్పితిని. ఇది మహాగుహ్యమగువిషయము. నిర్మలమై, శాశ్వతమై తగుచిత్తము నీయధ్యాత్మవిషయమున ననుసంధింపుము. నాయందే భక్తి నునుపుము దాన దురితవిముక్తుఁడ వగుదువు. *యుద్ధకాలమున నీవు శంకాకులచిత్తుఁడవై ప్రశ్నింపఁగా నమృతపదప్రాప్తికిఁ గారణమగు తత్త్వము నుపదేశించితిని. దానిని మఱచి మరలఁ బ్రశ్నించితివి. మరల నావిషయమునే చక్కఁగాఁ దెలిపితిని. మనశ్చంచలతను మాని శమముగలిగి యీవిషయమును స్మరించుచుండుము. దాన

* పూర్వముప్యేతదేవోక్తం యుద్ధకాల ఉపస్థితే, మయా తవ మహాబాహో తస్మాదత్ర మనః కురు. ౫౦. మయా తు భరతశ్రేష్ఠ చిరదృష్టః పితా ప్రభుః, తమహం ద్రష్టుమిచ్ఛామి సమ్మతే తవ పాల్గున. ౫౧. అని మూలము.

సకలార్థములు గల్గును. *అర్జునా! నాయందు నీకుఁ బ్రీతి కల
దేని కురుకులోద్ధారకుఁడవు గావున నీయధ్యాత్మవిద్యను
విన్నవాఁడవగుట దానిరీతి నాచరింపుము. ఈధర్మము నాచ
రించితివేని యది ముక్తిని నిన్నుఁ బొందింపఁగలదు. అని
మహారహస్యమగు నీవిషయము నుపదేశించి కృతకృత్యుండ
య్యెనని తలంచి పార్థా! నీకుఁ దెలుపఁదగినవిషయములఁ
దెల్పితిని. నాచిత్త మిపుడు వసుదేవునిఁ జూడఁగోరెడిని.
వసుదేవుఁడు నాకుఁ బ్రభువు, తండ్రియు నగునుగదా.
నీమనోవృత్తిని గనిపెట్టి నీయనుమతి నొంద నెంచితిని. కావున
నావలనఁ గాఁదగినపనులు నెఱవేఱినవి. నన్నిఁకఁ బంపుమా
యని యాచించెను.

ఆమాటకుఁ బరమానందభరితుఁడై పార్థుఁడు శ్రీకృష్ణా!
తమకట్టియుద్దేశముగలదేని మనము కరినగరమున కరుగుదము.
ధర్మరాజునకుఁ దమయూహ నెఱింగించెదను. వా రనుమతించు
నట్లు చెప్పెదను. మాయన్న యనుమతి నొంది పయనము
సాగింపవచ్చునని వినయమున బదులిడెను. అంత శ్రీహరి పార్థు
నాశయ మెఱింగి దారుకు రావించి రథం బాయత్తము చేయు
మని యాజ్ఞాపింప నాతండు రథంబుం బూన్చి తెచ్చుటయుఁ
గృష్ణార్జునులు పయనమునకుఁ దగినవేషములఁ బూని పరిజనం
బుల హృష్టులం గావించి యరదంబెక్కి కరిపురి కరిగిరి. మార్గము
నడుమ. పార్థుఁ డాహరిం గాంచి వినయవినమితోత్తమాంగుఁ

*మయి చేదస్తి తే ప్రీతిర్నిత్యం కురుకులోద్వహ, అధ్యాత్మమే-
చ్ఛ్రుత్వా త్వం సమ్యగాచర సువ్రత. తతస్త్వం సమ్యగాచీర్ణే ధర్మేఽస్మిన్న
కర్శన, సర్వపాపవినిర్ముక్తో మోక్షం ప్రాప్స్యసి కేవలమ్. అని మూలము.

డై మహాత్మా! మీప్రసాదమున ధర్మరాజు శత్రువుల నోడింపఁ గ ను. శత్రువులు మరణించిరి. రాజ్యము నిష్కంటక మయ్యెను. పాండవు లిపుడు నాథవంతు లయిరి. నీవను నోడసాయ మున మేమాకురుసాగరమును దాటఁగలిగితిమి. ప్రపంచకార్య నిర్వహణచతురా! విశ్వాత్మా! పరమేశ్వరా! నీకు నమస్కార ములు. నీవలన నే నొకరథికుఁడ నైతిని. నీమహత్త్వము గాని యాడ నే నెంతవాఁడను. క్రీడయు మరణము సకలము నీవలన నగును. నిన్నువదలిన నేదియు లేదని విశ్వసించితిని. స్థావర జంగమాత్మకప్రపంచము నీస్వరూపమే యగును. నీవే చతుర్విధ మగు నీభూతగ్రామమును నిర్మించితివి. కాని దీనినంటక నీవున్న వాఁడవు. సర్వభావాతీతుఁడవు. సర్వేశ్వరుఁడవు. నీమహత్త్వ మును నారదుఁడు దేవలుఁడు కృష్ణద్వైపాయనుఁడు కురుపితా మహుఁ డగుభీష్ముఁడు తెలుప నెఱంగితిని. పాపులకు దూర మున నుందువు. పుణ్యాత్ములకుఁ జెంత నుందువు నిన్నిప్పటికి సర్వమయునిగా నెఱుంగఁజాలితిని. నీయందీప్రపంచమంతయు నిమిడియున్నది. నీవొక్కఁడవే సకలమగుదువు. నాయందలి యవ్యాజప్రీతిచే నీమహాద్భుతాధ్యాత్మవిషయముల నెఱింగించి తివి. ఈనీయుపదేశమునఁ గృతకృత్యుఁడ నైతిని. నీమాట చొప్పునఁ బ్రవర్తింతును. ఈయుపదేశ మత్యద్భుతము. నా యందుఁ దమ కెంతగాఢప్రీతియున్నదో యతిసులభముగ నుప దేశించితివి. నాకొఱకై కౌరవులఁ దునుమాడితివి. నీవు చంపిన వారినెల్లఁ బిదప నే దునిమితిని. జయించెనన్నఖ్యాతి నాకుఁ గల్గుట నీయనుగ్రహముననే. కర్ణవధోపాయమును దెల్పితివి. దుర్యోధనుని దురుద్యోగము నెఱిగించితివి. అది యిది యన

నేల? నన్ను రక్షింప నేయే కార్యములు చేయఁదగునో వానినెల్ల
నొనరించితివి. కావున నిఁక ద్వారక కరుగఁదలఁచు నీయుద్దేశ
మును రాజున కెఱిఁగించి యతఁడు సమ్మతించునట్లు చేసెదను. ఈ
ప్రయాణము తగినదే. అని పలుక నర్జునునిసల్లాపముల నాదరిం
చుచు మార్గమును గడచి కరినగరమును సమీపించెను. నగర
మును జేరి ధృతరాష్ట్రునిమందిరమున కరిగి యావృద్ధదంపతులకుం
బ్రణమిల్లి కుంతిని గారవించి విదురాదుల నుచితరీతి బహూక
రించి కౌంతేయాగ్రజుని నతిశయభక్తిపై నారాధించి యతండు
నాలింగనాదివిశేషంబుల నాదరింప నానందించుచు ధనంజయు
నింటికింబోయి యాదినమందుండెను. పార్థుండును మహాదరం
బున భగవంతుం బూజించి ధర్మరాజునకు శ్రీకృష్ణు నభిమతంబు
దెలుప నాతం డందుల కంగీకరించెను. మఱియు శ్రీకృష్ణుఁడు
ద్వారకకుంబోయి యచ్చటిబంధువులకు హృదయప్రమోదంబు
గావించి యుచితకార్యములు నడపి మరలి యశ్వమేధమునకు
దయచేయుఁగాక యని వాంఛించెను. శ్రీహరియు నందులకు
సమ్మతించెను. అంత నాజనార్దనుఁడు కుంతీదేవిని ద్రౌపదిని
దగురీతి మాటలాడి సంతసింపఁజేసి సుభద్రనుం బిలుచుకొని
ద్వారవతికిం బ్రయాణము సాగించెను. అందఱు నర్ఘ్యవిధం
బుల ననునయించి శ్రీహరి యరుగునపుడు పార్థునిపై దృష్టి
నిలిపి చూచుచునే యరద మెక్కెను. పార్థుండు నాహరి
యరుగుపజ్జనే దృష్టిని బ్రసరింపఁజేయుచుండెను. ఇట్లు పాండ
వుల వీడ్కొని శ్రీహరి ద్వారవతికిం బ్రయాణము సాగించెను.
సాత్యకియు సుభద్రయుఁగూడ నరిగిరి. ఆత్తఱి దేవేంద్రుఁడు
శ్రీహరిపై విరులసోనలఁ గురియించెను. మహర్షు లానందించిరి.

సురదుందుభులు మ్రోసెను. పవమానుఁడు మహానుకూలభంగి వీచెను. శుభచిహ్నము లనేకములు తోఁచెను.

మహాశయులారా! ఇప్పటికి భగవంతుఁడు మానవలోకమున నేకార్యార్థ మవతరించెనో యాకార్యము నెఱవేఱినది. భూభారహరణలీల పూర్తిచేసి పరాత్పరుఁడు హృష్టుఁడయ్యెను. తానిఁక నేమిచేయఁదగునని యూహించు నవకాశము గలవాఁడయ్యెను. వేసరక జన్మప్రభృతిగా దుష్టాత్ముల వధించుచుఁ గర్మానురూపముగా వధింపఁజేయుచు నింతదనుకఁ గాలము గడుపవలసినవాఁ డయ్యెను. ఈమహాకార్యమునకు నర్జును నొకసాధనముగా నొనరించికొనియెను. అర్జునుఁ డొక చర్మప్రతిమ. భగవంతుఁడు సూత్రధారుఁడు. సూత్రధారుని యిష్టానుసార మాతోలుబొమ్మ యాడుచుండును కాని దాని కొకయహంకారము గలదు. అది తొలఁగింప భగవంతుఁడు పెక్కుతడవలు ప్రయత్నించెను. ఎన్నితడవలు ప్రయత్నించిన నాబొమ్మ స్వకీయకర్మానుసార మహంకారము గలదిగనే కనఁబడసాగెను. ఆచర్మప్రతిమ యీజన్మమునఁ గృతకృత్యతఁ గాంచఁగలదని పరాత్పరుం డెఱింగియే మరల మరల దాని కుపదేశింపసాగెను. నీవు నిమిత్తమాత్రమే నీవలన నేకార్యము కాఁబోదు. అని తెలుపుటయే దీనికిఁ బ్రమాణము. ఆయుపదేశ మాప్రతిమకుఁ జాలకపోయెను. తనయుపదేశము సత్యమని యావ్యక్తి మదినాటుటకే మరలఁ బ్రయత్నించి నీవు నిమిత్తమాత్రమే యని తెలుపక విశ్వరూపముం జూపి యాభావము దృఢఃడునట్లు చేసెను. అవిశ్వరూపసందర్శనమున నాప్రతిమ యేమని గ్రహింపఁగల్గెను? జీవులందఱు స్వకీయకర్మప్రేరితులై

మృత్యుముఖమునఁ బ్రవేశించుచున్నవారు. ఇందెవ్వరు చేయు
ఘనకార్య మించుకంతయు లేదు. నేను నొకసాధనమువంటి
దాననే. ఇందు నేఁజేయఁదగి నాశక్తికి లోఁబడినకార్యము
లేదు. భగవదిచ్ఛవలన నంతయు సాగుచున్నది. ఎవ్వరుగాని
దాని మార్పఁజాలరు. ఒకప్రాణి నింకొక్కప్రాణి వధింపఁజాలదు.
వారివారికర్మమే వారివారి నుత్తమగతినో నీచగతినో పొం
దించుచుండును. ఇతరులు మాచేత నీకార్యము సాధింపఁబడిన
దనుకొనుట యజ్ఞానముచేతనేకాని వేఱుగాదు. అనునర్థము
యాయర్జుననామమును ధరించినతోలుబొమ్మ గ్రహించెను.
అంతతోఁ గొంతగర్వము తగ్గెను. భగవంతుఁడు సంతసిం
కార్యమును సాధించెను. నడుమ నడుమ మరల మరల నా
యహంకారము పొడసూపుచునే యుండెను. దానిని దొలఁ
గించుచుఁ బనిని సాధించెను. ఆయర్జునున కుపదేశించునెపమున
భగవంతుఁడు సర్వమానవకోటికి నజ్ఞానము తొలఁగునట్లు గీతా
శాస్త్రమును వెలువరించెను.

మహానుభావులారా! గీతాశాస్త్రము కర్మసిద్ధాంతము
ప్రధానముగా బోధించునని యుక్తియుక్తముగాఁ బదునొకం
డవసంపుటమున వ్రాసితిని. అది సిద్ధాంతమా కాదా యన్న
శంక మీకుఁ గలుగవచ్చును. అనుగీత లాసందియమును దొలఁ
గింపఁగలవు. అనుగీత లుపదేశించునపుడు భగవంతుఁ డర్జునుని
దూలనాడెను. అజ్ఞానమున నాయుపదేశమును మఱచితివని
యెను. దానిభావమేమి? ఆయుపదేశమున నీమనస్సు పరిపక్వము
కాలేదనియేకదా. మరల దాని నుపదేశింప శక్యమా
యనియు శ్రీకృష్ణుఁడు హెచ్చరించెను? దీనియందలి సార

మేమి? మరల గీతల నుపదేశించుశక్తి భగవంతునకు లేదని యూహింపఁదగునా? లేకవానిమరల నుపదేశింపఁగూడదని హరి తలంచెనని గ్రహింపఁదగునా? ఇఁక నిందలిసారమిదియని గ్రహింపుఁడు గీతోపదేశకాలమున నర్జుననకు వైరాగ్యమును గల్గింపఁదగకయుండెను. అతనివలనఁ గాఁదగినకార్యములు పెక్కులుండెను. కావునఁ గర్మమార్గమునే బోధించెను యుద్ధానంతరము భీష్మునిమూలమున సకలధర్మములు తెలియఁజేసెను. ఇఁక నర్జుననిమూలమునఁ గాఁదగిమహాకార్యము లేదని యెఱింగి యాతనికి ననుగీతల నుపదేశించెను.

భగవద్గీతలకు ననుగీతలకుఁ గలతారతమ్య మేది? అను ప్రశ్నమును మది నుంచుకొనుఁడు. ఇందుఁ బ్రధానముగా నింద్రియజయమే ప్రధానమని చెప్పఁబడినది. బహిర్త్యాగమునకంటె నంతర్త్యాగ మత్యుత్తమమని తెలుపఁబడినది. సకలధర్మములలో సత్యము అహింసయుఁ బ్రధానములని తెలుపఁబడినది. గీతాశాస్త్రమునందు,

శ్లో. "స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి,
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే.
యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతం,
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్. 32
అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి. 33
అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం,
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే. 34
హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసేమహీం,

తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః. 37

(౨ అధ్యాయము)

స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః,
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ౪౫
యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్." ౬౦

(౧౮ అధ్యాయము.)

అను నీధర్మ ముపదేశింపఁబడినది. మొదటినుండి కొసవఱకుఁ గర్మమునే ప్రతిపాదించుననియే మనము గ్రహింపవలయు. అట్లు కాకయున్న వైరాగ్యసంపన్నునిగాఁ జేసి యదునెనిమిదవయధ్యాయమున నర్జునా! శత్రువులవధింపుమని బోధించునా? అట్లుమనము గ్రహింపఁజనునా? నిజముగా వైరాగ్యమునే కలుగఁజేసి నచో మరల నర్జునుఁడు మఱచితిని. ఉపదేశింపుమని శ్రీహరిఁ గోర నవకాశముకలదా? ఇఁకేమనిన నాలకింపుఁడు. మహాసంగ్రామము సాగనున్నది. అర్జునుఁడు జంకెను. కార్యమేమో కావలయును. అత్తఱి శ్రీహరి గీతాశాస్త్రము నుపదేశించి కర్మమార్గమును దెలిపి యందు ఫలమును గోరక స్వకులవిహిత కర్మముల నాచరింపవలయుననియుఁ గర్తను నేనన్న యభిమానము వదలవలయుననియు నట్లు చేయకమానినఁ బాపవలయు. నీవూరకున్నను బ్రకృతి నిన్ను నిర్బంధించి నీచేతనే చేయించు ననియుఁ దెలియునట్లు చేసెను.

ఆయుపదేశానుసారము పార్థుఁడు స్వకర్మమును నెఱవేర్చెను. భూభారము తొలఁగెను. పిదప నర్జునుఁడు ఫలాభిసంధిరహితకర్మాచరణమునఁ బరిపక్వమనస్కుఁ డయ్యెను. మరల నాఁటియుపదేశమును మఱచితిని. దానినే యుపదేశింపుమని ప్రశ్నించెను. మరల నాగీతల నుపదేశింపలేదు. అందలిసిద్ధాంతవిూతరుణమున నర్జునునకుఁ బనికిరాదని హరి యెఱింగెను. కావుననే,

శ్లో. "అబుధ్యామాగ్రహీర్యత్త్వం తన్మే సుమహద ప్రియం,
న చ సాద్య పునర్భూయస్స్మృతిస్తే సంభవిష్యతి. ౧౦
నూనమశ్రద్ధధానోఽసి దుర్మేధా హ్యసి పాండవ,
న చ శక్యం పునర్వక్తుమశేషేణ ధనంజయ ౧౧
స హి ధర్మస్సుపర్యాప్తో బ్రహ్మణః పరివేదనే,
న శక్యం తన్మయా భూయస్తథా వక్తుమశేషతః. ౧౨
పరం హి బ్రహ్మ కథితం యోగయుక్తేన తన్మయా,
ఇతిహాసం తు వక్ష్యామి తస్మిన్నర్థే పురాతనమ్. ౧౩
యథా తాం బుద్ధిమాస్థాయ గతిమగ్ర్యాం గమిష్యసి,
శృణు ధర్మవతాం శ్రేష్ఠ గదితం సర్వమేవ మే." ౧౪

అను నీరూపమున వైరాగ్యము నుపదేశించెను. భగవద్గీతాంతమున నీ వీ క్షత్రియధర్మమగుసంగ్రామమును జేయక పోయినచోఁ బ్రకృతి నీచేతనే చేయింపకమానదని పల్కినట్లు గాక యనుగీతాంతమునందు,

"మయి చేదస్తి తే ప్రీతిర్నిత్యం కురుకులోద్వహ,
అధ్యాత్మమేతచ్ఛ్రుత్వా త్వం సమ్యగాచర సువ్రత. ౪౫

తత స్త్వం సమ్యగాచీర్ణే ధర్మేఽస్మిన్నరికర్శన,
సర్వపాపవినిర్ముక్తో మోక్షం ప్రాప్స్యసి కేవలమ్." ౪౯
(అశ్వమేధపర్వము ౫౧ అధ్యాయము.)

అని యుపదేశించెను. "కేవలం మోక్షం ప్రాప్స్యసి" ఒక్క మోక్షమునే పొందఁగలవు. ముక్తుఁడ వగుదువని సారముకదా. ఆ యీయుపదేశధోరణిఁ బరికింపుఁడు. నాయందు నీకుఁ బ్రీతి యుండినచో నీయధ్యాత్మవిద్య నాచరింపుమని యిందును,

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే."

అని గీతాంతమునందు నుపదేశించెను. అప్పు డర్జునుఁడు,

"స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ."

అని బదులిచ్చెను. అనఁగాఁ గర్తృత్వాభిమానమును మాని యుద్ధముచేసెదను ? నీయాజ్ఞను శిరసావహించెదను. అని యేకదా దీనిభావము. ఈ రెండువిషయములను నిష్పక్షపాత బుద్ధి నాలోచించినపుడు గీతాశాస్త్రము ప్రధానముగాఁ గర్మ సిద్ధాంతమును దెలుపునని. అనుగీతాశాస్త్రము ముక్తిమార్గ మునే బోధించును. కావున నీవిషయముల నీసిద్ధాంతముగల వని యూహింపఁదగియుండును. ఇఁక నీవిషయమును బెంచి వ్రాయక యవ్వలిభగవచ్చరిత్రమును వ్రాయఁబూనెదను. ఇఁక మీఁదటి శ్రీకృష్ణచరిత్రము విచిత్రముగ నుండును. భూభార హరణానంతరము పరిపక్వజీవులను ముక్తులను జేయుటయే శ్రీహరి చేయఁబూనినపని. కాఁబట్టి యాచర్యలనెఱుంగుటయే ప్రధానము. వానింబరికింపఁ బ్రయత్నింపుఁడు.

## శ్రీకృష్ణమూర్తి యుదంకాశ్రమమునకుఁ బోవుట.

*పాండవుల వీడుకొని కొంతదవ్వరిగి యందుఁ ద్రోవకుఁ జేరువగనున్న యుదంకాశ్రమమునకుం బోయెను. ఉదంకముని మహనీయతేజశ్శాలి. భృగువంశ్యుఁడు ఆమహర్షిం గాంచి వలగొని మ్రొక్కి యాతం డొనరించు సత్కారములం గైకొని యించుక యందు విశ్రమించెను. ఉదంకముని దివ్యదృష్టిగల వాఁడు. అట్లయ్యు శ్రీహరిప్రవృత్తి పక్షపాతమని భావించి యిట్లు ప్రశ్నించెను శ్రీకృష్ణా! భరతవంశ్యులపాలికిం బోయితివి కదా. అందిరు తెగలవారును మహాహవంబు చేయఁబూని నిశ్చయించియుండ నీచమత్కారమున వారల లోఁగొని యాయా యిదేశపు రాజుల వారినెలవులకుం బోవంబంచి యుద్ధము నాపితివా? రాజులందఱు తమతమ రాజ్యములఁ బాలించుచు సుఖంబున్నవారుకదా? పక్షపాత మనుదోషములేని నీవు సకలప్రజాసంతోషకార్యము నిర్వహించి విఖ్యాతిం గాంచినాఁడవే? తెలుపుమా. విన వేడుకయయ్యెడు. నీసంధినిబంధనము ననుసరించి కురుపాండవులు సుఖంబున్నవారలని నమ్మెదను. అని నిందాగర్భంబుగా నడిగెను.

పరమేశ్వరుఁ డాప్రశ్నసారము నెఱింగి తాను నట్లే బదులుచెప్పంబూని యిట్లనియె. మునీంద్రా! కురుపాండవుల సంగరమును భంగపఱుపంబూని యే నచటికిం బోయి న్యాయమున కనుకూలముగా మాటలాడితిని. మహోద్ధతి నదలించితిని. భయముగలిగించి లొంగఁజేయం జూచితిని. ఆదృతిమై నుపదే

* ఇది యశ్వమేధపర్వమున నేఁబదిమూఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

శించితిని ఇన్నిపాట్లుపడియు దుర్యోధను నాతనితమ్ముని దదను
బంధులను మెత్తపడునట్లు చేయఁజాలకపోతిని నాకనుకూల
ముగా భీష్మద్రోణులు నొక్కిచెప్పిరి. విదురుఁడు పలుపోకలఁ
బల్కెను. ఇంచుకంతయుఁ బాటింపరైరి. వారిని లోభగుణంబు
బంధించెను. వంశధర్మ మాశ్రయింపఁ బ్రయత్నింపక సంధియం
దించుకంతయు నాసక్తిఁబూనక పాండవులతో యుద్ధముచేసిరి.
హతులైరి. బంధుమిత్రపరిజనులంగూడి కురుకుమారులు రణ
మరణముఁ గాంచి పుణ్యలోకముల కరిగిరి పాండవులుతప్పఁ
దక్కినరాజులు హతులైరి. మునీంద్రా! కాలగతిగడువ నెవ
రికే శక్యమగునే?

అనుటయు నామాటలకు రోష ముప్పతిల్ల దాన నేత్ర
ములు కషాయితములు కాఁగా నుదంకముని యదుకులపుంగవా
నీవు మిథ్యాచారుఁడవు. శక్తిగలవాఁడవయ్యుఁ బక్షపాత
మూని కౌరవవంశమును నశింపఁజేసితివి. నీసామర్థ్యమును
దాఁచితివి. ఈమహాపాపకార్యము నిన్నూరకపోనిచ్చునే.
బలవంతపఱచి యుద్ధమాపుటకు నీకు శక్తిగలదు. నీ వట్లు
చేయక మోసముగాఁ బ్రవర్తించితివి. నీ వుపేక్షించుటంజేసి
వారెల్ల నశించిరి. కావున నీకు ఘోరశాపం బొసంగెదను.
అనుటయు నచ్యుతుం డామునితో మునీంద్రా భృగు
నందనా! నామాటలు సవిస్తరములుగా నాలకించి యను
నయమొందుము. తపస్వివికదా. కోపమూనుట న్యాయము
కాదు. మఱియొక్కమాట వినుము. అల్పతపశ్శక్తి నన్ను
భయపెట్టఁ దరముగాదు. శపించితివేని చిరకాలకృతతపస్సు
బ్రహ్మచర్యము వ్యర్థములుకావా. గురువుల నారాధించితివి.

కావున వ్యర్థముగాఁ దపశ్శక్తిని వ్యయింపకుము. అను హరి పలుకులు విని యుదంకుఁడు శ్రీకృష్ణా! నీవు చెప్పఁబూను న్యాయమును బోధింపుము. ఆలకించెద శాపము నీయఁబూను నామనస్సును మరలించిన మరలింతును. శ్రేయస్సునుగూర్చినఁ గూర్తును. నావుడు నమ్మునిచంద్రు నాలోకించి శ్రీపరమేశ్వరుఁడు నవ్వుచు నిట్లు పలికెను.

తమోరజస్సత్త్వములు మద్వశంగతములు. వసురుద్రాదిత్యప్రముఖులెల్ల నావలన నుద్భవించినవారు.సమస్తము నాస్వరూపమే. సర్వభూతములు నాయందుండును. నేను వానియం దుండువాఁడను. ఈవిషయము నమ్ముము. శంక నొందకుము. సత్తని యసత్తని వ్యక్తమని యవ్యక్తమని క్షరమని యక్షరమని చెప్పఁబడునదెల్ల మదాత్మకమే. నాలుగు విధములగు నాశ్రమధర్మములు వైదికము లనఁబడునవియెల్ల మదాత్మకములే యని యెఱుంగుము. అసత్తు సదసత్తు సదసత్పరము నాకు లోఁబడినదే. దేవాదిదేవుఁడనై సనాతనుఁడనగు నాకంటె వేఱుగా నుండునది యుత్కృష్టమైనదియు లేనే లేదు. ఓంకారప్రముఖము లగు వేదములు నన్నుగా నెఱుంగందగు. దేవతలకుఁ దృప్తిని గావించుయూపము సోమము హోమము హోతయు హవ్యము నన్నుఁగా నెఱుంగుము. యజ్ఞముచేయఁబూని దానినుండి ఫలమునొందఁగోరువారు నన్ను వినుతించి ఫలముగాంతురు. దోషయుతులు ప్రాయశ్చిత్తములఁ గృతాత్ములగుదురు మత్సంకీర్తనాసక్తులై వారును దరింతురు. ధర్ముని నాజ్యేష్ఠపుత్త్రునిగా నెఱుంగుము. అతఁడు నామానసపుత్త్రుఁడు. నాకత్యంతప్రియుఁడు. జగద్రక్షణమునకై

యాయాయికాలములఁ దగినజన్మముల నొందుదును. ధర్మ
సంస్థాపనమునకై రూపముల ధరింతును. *సృష్టిలయముల
నొనరింప బ్రహ్మయని శంకరుఁడని పేరుధరింతును. ఇంద్రుఁడను
నేనే. సర్వమునకు నాధారభూతుఁడనై విష్ణువని యచ్యుతుఁ
డని పిలువంబడువాఁడను నేనే. సకలభువనముల నిండియుండు
వాఁడను నేనే. ప్రతియుగమునందును ధర్మసేతువు చలనమును
గాంచఁగా దానిని స్థిరతగాంచఁజేయుటకై యాయాజన్మము
లను గాంతును. ఉదంకమునీ! †నేను దేవతలవంశమున జన్మించి
నప్పుడు దేవతవలెనే వర్తింతును. గంధర్వాదియోనులయందుఁ
బుట్టువుంగాంతునేని యట్లే వర్తింతునని యెఱుంగుము.
ఏకార్యమున కేజాతింబుట్టుదునో యాజాతిధర్మముల ననుసరిం
చుచుందునని యెఱుంగవలయును. లోకరక్షణార్థమే యీకా
ర్యముల నొనరింతునని నమ్ముము. అట్టి నేను గురుకుమారులకు
మహాభయమును గలుగఁజేసి భయపెట్టితిని. కాని వారు కాల
ముచేఁ బ్రోత్సహింపఁబడి మరణించిరి. ధర్మనిహతులై స్వర్గము

*అహం విష్ణురహం బ్రహ్మ శక్రోఽథ ప్రభవాప్యయః. ౧౪. భూత
గ్రామస్య సర్వస్య స్రష్టాసంహారఏవచ, అధర్మే వర్తమానానాం సర్వేషా మహ
మచ్యుతః. ౧౪. అనిమూలము. † యదా త్వహం దేవయోనౌ వర్తామి
భృగునందన, తదాహం దేవవత్సర్వమాచరామి న సంశయః. ౧౭. యదా
గంధర్వయోనౌ వా వర్తామి భృగునందన, తదా గంధర్వవత్సర్వమాచరామి
న సంశయః. ౧౮. నాగయోనౌ యదా చైవ తదా వర్తామి నాగవత్,
యక్షరాక్షసయోన్యోస్తు యథావద్విచరామ్యహం. ౧౯. మానుష్యే వర్త
మానే తు కృపణం యాచితా మయా, న చ తే జాతసంమోహా వచోఽ
గృ ౦ తమోహితాః. ౨౦.

నొందిరి పాండవులు ధర్మము నాచరించి విఖ్యాతి నొందిరి. మునీంద్రా! నీ వడిగినందులకు బదులుచెప్పితిని. ఇంక నేమడి గెదవో అడుగుము.

ఆ శ్రీహరిపలుకులు చెవులసోఁకినంతనే యుదంకుఁ డానందపరవశుఁడయ్యెను జనార్ధనా! యని సంబోధించి యిట్లుపలికెను. జగత్కర్తవని యెఱుంగుదును. ఇది భవత్ప్రసాదమే యనుటకు శంకలులేవు. నామనస్సు నిర్మలమయ్యెను. సంశయములు తొలఁగినవి. నాశాపమును మరలించితివనియే యెఱుంగవలయు. నాయందు సుంత యనుగ్రహము నీకుంగల్గు నేని నుహాత్తరమై చూడఁదగినవానిలో నుత్తమోత్తమమైన విశ్వరూపమును గనఁబఱుపుము కృతార్థుఁడ నయ్యెదను అని ప్రార్థించెను. ఆప్రార్థనము భగవంతునకుఁ బ్రీతిని గలిగింపఁజాలెను.

## శ్రీహరి యుదంకమునికి విశ్వరూపము నగపఱచుట.

కావునఁ బరాత్పరుఁడు తనవాస్తవరూపమును గనఁబఱచెను. అది శాశ్వతమైనది. సర్వత్ర వ్యాపించునది. దానినే యుద్ధకాలమున నరునునకుం జూపెను. ఉదంకుఁ డారూపమును గాంచెను. వేయిసూర్యబింబములయంతటి ప్రకాశము గలిగి యగ్నితుల్యమై యెల్లతావుల వ్యాపించి యెల్లతావుల ముఖములుగలిగి పరమాద్భుతమై యుండెను. దానింగాంచి విస్మయోత్ఫుల్లనయనుఁడై యుదంకుఁ డిట్టులనియెను. మహానుభావా! పరమేశ్వరా! విశ్వకర్తా! నీకు నమస్కారములు. పాదములచేఁ బృథ్విని శిరస్సుచే నంబరమును జఠరమున వానియంతరమును బాహువులచే దిక్కులను వ్యాపించియున్నవాఁడవు. ఆశ్చర్యమగు నీయీరూపము నుపసంహరింపుము.

తొలుత నాతో మాటలాడినపు డున్న రూపమున నిన్నుఁ జూడ గోరెదను నీవు శాశ్వతుఁడవు. అని ప్రార్థించెను. అంతఁ బరా త్పరుఁడు గోవిందుఁడు ప్రసన్నుఁడై వరముగోర నిచ్ఛగలచేని కోరుము ఒసంగెద. అని పలుక నుదంకుఁడు జగన్నాథా! విశ్వ రూపమును జూడనోచితిని. ఇఁక వరమేదికావలెను? అనఁగా హరి నాయీదర్శనము మేలుచేకూర్పకపోదు. ఏది ప్రియమో దాని నడుగుమని నొక్కి చెప్పుటయు నమ్ముని కరుణాశరధీ! నీ యాజ్ఞయవశ్యమాచరణీయముగాన వేఁడెద. ఇది మరుభూమి ఇందు జలంబులుండవు మిగుల శ్రమంపడి సాధింపఁదగియుం డును. కాన నీయనుగ్రహమున జలంబు లుండవలయును, ఇదియె నా వాంఛితమని యాచించెను. ఆప్రార్థనము సఫలము గావించి వలసినచో నన్నుఁ దలంపుమని యాజ్ఞనిడిద్వారకకుం బోయెను.

భగవంతుఁ డరుగ నాయుదంకుఁడు దప్పిగొని మనస్సున శ్రీకృష్ణుని ధ్యానించెను. అంతలో నొకచండాలుఁ డగపడియె ను. ఆతనిచుట్టును శునకములుండెను. దిగంబరుఁడు మలినాంబ రుఁడుగా నాతఁడుండెను. భయంకరబాణబాణాసనపాణియై య రుగుచుండెను ఆతనితనువునుండిస్వచ్ఛమగునుదకముస్రవించు చుండెను వాని నమ్ముని చూచుచుండెను. ఆమాతంగుఁ డోయుదంకమునీ! దప్పిగొని యున్నవాఁడవు. ఈజలము త్రాగుము, దప్పిచే నలసియున్న నిన్నుంగాంచి నాకు నత్యంత కృప కలిగినది వలదనక ప్రీతిమెయిఁ ద్రాగుము ఆమాటలు విని యాయుదకమును త్రావనొల్లక కఠినవాక్కుల నదలిం చెను. మరల మరల మునీ! యీనీరు త్రాగుమా యని

Acc 60

మాతంగుఁడు పలికెను. వత్సా! కోపపడకుము. శాం
నొందుము జలపానముచేయుము. అని యెంత చెప్పిన నాముని
నిరాకరించెను. అంతే కుక్కలతో నామాతంగుఁ డదృశ్యుఁ
డయ్యెను. ఉదంకుఁడమ్మాతంగుని పోకడఁ దెలిసి సిగ్గునొందెను.
ఈకృత్యము శ్రీకృష్ణమూర్తి యొనరించినమోసమే యని
తలంచెను. మాతంగునితోడనే శంఖచక్రగదాధరుం డగు
పంకజాక్షుఁడు పొడసూపెను. ఉదంకుఁ డాహరిం దిలకించి
తండ్రీ! సకలలోకవిభూ! మాతంగునియొడలినుండి స్రవించు
జలమును విప్రముఖ్యుల కిచ్చుట న్యాయము కాదు. అని
ప్రార్థింపఁగా శ్రీకృష్ణుఁ డుదంకు నూఱడించుచు మృదు
తమవచనములనిట్లుపలికెను. ఆర్యా! ఏరూపమున జలములీయఁ
దగునో యారూపముననే కనఁబడితిని కనుఁగొనఁజాలకపో
తివి. ఇంచుకంతయుఁ బరికింపఁజాలకపోతివి. నీనిమిత్తమే
మహేంద్రునకుం దెల్పి సుధారసము నిమ్మంటిని. అది యితరు
లకు దుర్లభము అదితోయరూపముగా నుండును. ఇంద్రుఁడు
దీనిం ద్రావిన మర్త్యుఁ డమర్త్యుఁడగును ఇదేల యీవలయు
నంటి వని యతఁ డడిగెను నే నాతనితో నీకుం దెల్పినమాట
వ్యర్థము కారాదు. ఎట్టులైన నాముని కమృతరస మిమ్మంటిని.
ఇంద్రుఁడు శ్రీకృష్ణా! మాతంగరూపమునఁ బోయెదను.
సమ్మానించి యుదంకునిం బ్రీతునింజేసెదను త్రాగుమని ప్రార్థిం
చెద. సిగ్గునొంది యతఁడు దూషించిన సరిగెదను దీనికి నీవే
సాక్షివని సమయముచేసి వచ్చెను. నీవావిషయమును దలంప
వైతివి. ఆతఁ డంతర్ధానమందెను. కానిమ్ము దానికేమిగాని
నాయిచ్చినవరము బొంకుగానేరదు. నీకు జలము సర్వకాలము

294.5211

కలుగఁజేయువాఁడను. మునివరా! నీవు కోరినతఱి మేఘము లిందు వర్షించును ఆమేఘము లుదంక మేఘములనం బ్రఖ్యాతిం గాంచును మరియాదతోఁ బ్రవర్తిలును. సమృద్ధిగా వర్షించును. నన్నింక దూషింపకుము. పోయివచ్చెద. అనుమతింతువే యని హరి పలుకఁగా నాయుదంకముని ప్రీతుండయ్యెను. శ్రీహరియు నట నదృశ్యుఁ డయ్యెను. అదిమొద లామరుదేశంబున నుదంక మేఘములు పుణ్యాతిథులయందు వర్షించుచుండును.

మహనీయులారా! ఈచరిత్రమునందు విశేషములు లేకపోలేదు. "ఆర్తత్రాణాయ వశ్శస్త్రం న ప్రహర్తుమనాగసి" అని కాళిదాసమహాకవి తెలిపినట్లు భగవంతునిచ్ఛ యార్తత్రాణమునే కోరుచుండును. ధర్మరక్షణమునకే ప్రయత్నించును. భక్తరక్షణము భగవంతుని ప్రధానకృత్యమనుట నిస్సందేహము. ఉదంకునియాశ్రమమునకుఁ దానై పోయెను. ఏల? ఆతఁడు పరిపక్వజీవుఁడు. కాని యించుక గర్వముగలదు. అది తపోనిరతిసంభవము. కావున దాని నడంచి కృతకృత్యునిజేయ వలయునని భగవంతుఁ డూహించెను అంతియగాక మరుభూమి జలాభావమని దానికి జలముదొరకు కాలము సమీపించెననియు నెఱింగెను. ఉదంకునకు లోకవిఖ్యాతి గలుగఁదగినసుకృతము ఫలమునీయఁదలఁచి వేచియుండుటయు నెఱింగెను. కావుననే ద్వారకకుంబోవుచుండి పిలువకయున్నను దన్మునియాశ్రమమునకుఁ బోయెను. భగవంతునింగాంచినంతనే యమ్మునిసుకృతవిషము శిష్టమగుపాపమును ద్రోసివేయఁ బ్రయత్నించెను. ముని మనస్సునందు హరికృత్యమునఁ బక్షపాతము కలదని

యెఱింగి శపింపఁబూనెను. కృష్ణుఁ డింక నీతనిగరువము తగ్గించి పరిశుద్ధాంతఃకరణునిజేయవలయునని తలంచి తనస్వరూపము నెఱింగించెను. దానఁ గలిగినఫలమేమి? మునికింగల యహంకారభూతమగు రజోగుణము తగ్గుటయే. అల్పతపస్సులకు నేభయంపడననియెనుగదా దానిసారమేమి? నీవల్పతపస్సొనరించితివి. దానిబలమున నన్ను శపింపఁబూనెదవు. సాధ్యమగునా? అని యేకదా. ఎప్పుడు కర్మవశమునఁ గౌరవులు తుదిఁగాంచిరి ధర్మసంస్థాపనమునకు నధర్మవిచ్ఛేదమునకు నేనవతరింతును. ఏజన్మమును గాంతునో తదుచితవర్తనములఁ బ్రవర్తింతును. అని యెఱింగించెనో అప్పుడే యుదంకునకుఁ దనయశక్తత స్పష్టమయ్యెను ఆవెంటనే గర్వము వదలిపోయెను. త్రిమూర్తులు (బ్రహ్మవిష్ణుమహేశ్వరులు) నేనే. ఆయాకార్యముల కాయాతనువులను నామములను దాల్తునని భగవంతుఁ డనియెను. ఈమూవురిలో నొకఁడెక్కుఁడు ఒక్కఁడల్పుఁడు. అనువారెంతపట్టుదలగలవారో వర్ణింపశక్యమా? తమస్సావరించినపుడు దృష్టిమాంద్యము స్వభావము. అట్లే తమోగుణము వృద్ధికాఁగా కేవలాజ్ఞానజనితమగు పట్టుదల మిగిలియుండును. అది యెపుడు వదలునో జ్ఞానభానుఁడు పొడసూపును. దానఁ దత్త్వము కనఁబడును.

ఉదంకుఁ డాతరుణమున భగవంతుని శరణు వేఁడి విశ్వరూపమును జూపఁగోరెను. నిర్మలాంతఃకరణుఁడు కావున భక్తుఁడుకోరినపుడుపేక్షచేయక యట్లే కనఁబఱచెను. దానిచే నమ్మునికి సర్వము బ్రహ్మస్వరూపమే. తద్భిన్నమేదియును లేదను నిశ్చయము కల్గెను. ఆతేజస్సు దుర్భరమైనది.తపశ్శక్తి యించుక

సాయపడఁదగినవాఁడు కావునఁ జర్మచక్షుస్సులతోఁ జూడఁ
జాలెను లేకున్న నది గనుఁగొన శక్యమగునది కాదు. మహా
త్మా! దీని నుపసంహరింపుము మున్నగపఱచినసౌమ్యరూప
మునే కనఁబఱుపుమని కోరెను. దీనఁ దేలినసారమేమి? భగవం
తుఁడు తేజోరూపుఁడనియే. పెక్కుతావుల నీవిషయము పొడ
కట్టెడిని తేజోరూపము నుపాసించువారే యోగులు. అంత
ర్దృష్టికి గోచరించునది తేజోరూప మొక్కటియే. కర్మరతులు
కూడ దానినే యుపాసింతురు. యజ్ఞమననేమి? అగ్నిపూజయే
కదా. అగ్ని తేజస్సుకాదా? దాని నుపాసించుట ముక్తిప్రద
మేలకాదో తెలియఁజాలకయున్నాఁడను. కొందఱు కర్మములు
తత్ఫలము లల్పములందురు. అది మిగుల పొరపాటు. భావన
యందు నల్పత్వబృహత్త్వములు గలవుగాని తత్త్వమున లేదు.
అగ్ని భగవత్స్వరూపమే. దానినే పరమేశ్వరునిగా భావించిన
నాసత్కార్యముననే ముక్తినొసంగును. కావుననే విశ్వరూ
పము పరమైశ్వర్య మాపరాత్పరున కని సారమును గ్రహింపవల
యును సర్వవ్యాపకత్వమేకదా దానిశక్తి. ఈవిషయమును
జక్కఁగా నాలోచించువారికి భేదబుద్ధి కలుగ నవకాశమే
యెంతయోజించినను లేదు.

తరువాత వరమొసంగి ద్వారక కరిగెను. దప్పిగొని భగ
వంతు నాఋషి స్మరించెను. పుణ్యా మెంతమాత్రమో పరికింత
మని మాతంగరూపమునఁ దోఁచెను. కుక్కలు చుట్టుచున్న
మలినాంబరమును దాల్చి నీరుగాఱుచుండ నాతఁడుదంకా!
యీజలమును ద్రాగుమనియెను. మునిచిత్తము పరమహంస
[illegible]ము నొందలేదు. తాను బ్రాహ్మణుఁడనని వాఁడు చండాలుఁ

డని యీదేహము మలినమని అందుండి స్రవించునీరు హేయమని యే భావించి యీసడించెను. ఎంతప్రార్థించినను దెలిసికొనఁజాలకపోయెను. అమృతపానమును జేయునంతటిపుణ్య మతఁడొనరింపలేదు. కావుననే యెవ్వఁడుగనుండునా యనియైన యోజింపకపోయెను. తర్వాత శ్రీహరి వృష్టిరూపమున నాతని కాంక్ష దీర్చెను లభించినదైన ననుభవించునంతటిపుణ్యము చేయకయున్న నది పనికిరాదని దీనినుండి మనము గ్రహింపవలయును. ఇట్టినీతు లీకథ మనకుఁ దెలుపుచున్నది. ఇఁకఁ దరువాతిహరిచరితము నాలకింపుఁడు.

## హరి ద్వారకం బ్రవేశించుట.

ఉదంకునకు వరప్రదానమున శాంతిని గల్పించి ద్వారకానగరమును బ్రవేశించెను. వసుదేవాదు లానందపరవశులైరి యాదవులెల్ల శ్రీకృష్ణాగమనమున మహానందమునఁ దేలిరి. వసుదేవుఁ డొకనాఁడు శ్రీహరింగాంచి వత్సా! కురుపాండవ యుద్ధమును బెక్కండ్రు పెక్కురీతుల వచింతురు. నీవు కన్నులారఁ జూచినవాఁడవు. కాన జరగినది జరగినట్లు వచింపుమని యడిగెను శ్రీహరియుఁ దనరాయబారము మొదలుకొని చెప్పుచు భీష్మద్రోణకర్ణశల్యులసేనాధిపత్యపద్ధతియు వారిని బాండవులు రణరంగమున నెట్లు మృతినొందించినదియుఁ దెలిపి దుర్యోధనుఁడు హ్రదమున దాఁగియుండుటయు భీమదుర్యోధనులగదాయుద్ధము దుర్యోధనుఁడు మృతినొందుట సౌప్తికపర్వవార్తయు నెల్లం దెలిపెను. వసుదేవాదులు గగుర్పాటుతోఁప దుఃఖపడిరి. యదువృష్ణిభోజాంధకులు పరిక్లేశపడిరి. యుద్ధవార్తలం దెలుపునపుడు కృష్ణుఁ డభిమన్యుమరణమును దెలి

పినఁ దండ్రికి మనస్తాపముకలుగునని వదలిపెట్టెను. సుభద్రయు నావృత్తాంతమును వినుచుండి పుత్త్రవధమునువదలుట నెఱింగి కృష్ణా! సౌభద్రమృతి నెఱిఁగింపుమా యని పలుకుచు నట్టె భూమిపైఁబడియెను. సుభద్ర భూమిఁబడుటఁజూచి మనుమని మృతినెఱింగి యట్లే తానును బుడమిఁ ద్రెళ్లెను. కొంతసేపటికి సంజ్ఞ రాఁగాఁ గృష్ణా! యని పిలిచి సత్యవాక్కుగలవాఁడవని ప్రసిద్ధినొందితివికదా. నామనుమని మరణము నేలదాఁచితివి? నీ మేనయల్లునిమరణమును జక్కవదలక వివరింపుము నీతో సాటి చేయఁదగినయభిమన్యుఁడు శత్రునిహతుఁ డెట్లయ్యెను? దుర్మరణముకదా. కాలమునకుముందే మృతినొందెనే. అయ్యో! ఆ మనుమనిమరణవార్తను విన్న నాహృదయము శతథా బ్రద్దలు కాకయున్నది. తల్లిని సుభద్ర నేమని యూఱడింతును? ఆ ముద్దులమనుమఁడు నాకత్యంతప్రియమును గల్గించువాఁడు సుమీ యుద్ధరంగమున నీవుండఁగా శత్రువులచేఁబడి భూమిపై శయనించెనా. ఆతఁడు నామ్రోల వినయమున నెన్నియోపలు కులు పలుకుచుండువాఁడు. అని యిట్లు పెక్కుతెఱఁగుల విల పించుచుఁ దన్నడుగుచుండఁగా గోవిందుఁ డిట్లుపల్కెను. అభిమన్యుఁడు వెన్నిచ్చినవాఁడుకాఁడు. వేనవేలుగా శత్రువీరులఁ దునుమాడి ద్రోణకర్ణాదులకు ఖేదమును గల్గించి దుశ్శాసనుని కొడుకుతోఁబోరుచుఁ బరస్పరశస్త్రహతుల నిరువురును వీరస్వర్గ మలంకరించిరి. ఆతఁడు జీవించియేయుండిన నింద్రుఁడుకూడ వానిమృతి నొందింపఁజాలఁడు. లోకవిఖ్యాతినిగాంచి స్వర్గము నాక్రమించెను. కావున దుఃఖింప నవసరములేదు. బుద్ధిమంతులు దుఃఖపడి మనస్సును గలవిలపాటొందించుకొనరు. దేవేంద

సమానులు ద్రోణకర్ణాదులు యుద్ధమృతిం గాంచియుండ నభి
మన్యుఁ డేల కాంచ రాదు? దుర్జయమగుమృతినిగూర్చి దుఃఖింప
రాదు. శస్త్రపూతమగుపరమగతి నభిమన్యుఁడొందెను. నాతోఁ
బుట్టు వాత్మజమరణమును విని కురరివలె విలపించెను. ద్రౌపది
లోనగువారెల్ల దుఃఖించిరి. మనుష్యధర్మము మృత్యువొందు
నదియే కాన వగపాలు కాకుమీ యని పెక్కువిధముల నాశ్వా
సించితిని. ఉత్తరను బెక్కురీతుల నాశ్వాసించితి. గర్భస్థుఁడగు
శిశువును గాపాడుకొనుమని తెల్పితిని. తండ్రీ! నీవును మను
మనిమృతివిషయమున దుఃఖింపఁబని లేదు.

అని యూఱడింప వసుదేవుఁ డూఱటంజెందెను. శ్రీ
హరియు మేనల్లునకు నూర్ధ్వదైహికక్రియలు చేయించి బ్రాహ్మ
ణుల కన్నదానము చేసెను ఎల్లరు సౌభద్రునకుఁ దర్పణక్రియ
లాచరించిరి. కృష్ణవాక్యప్రబోధితులయ్యు వగమానఁజాలక
పోయిరి. ఉత్తరయుఁ బతివిషయమునఁ జింతించుచు భోజనము
మాని జాలిగలిగించు స్థితియందుండెను. ఆమెకుక్షియం దున్న
గర్భము వృద్ధిగాంచకుండెను. దివ్యజ్ఞానమున నెఱింగి వ్యాస
ముని కరినగరమున కేతెంచి కుంతింగాంచి యావిషయమును
దెలిపి యుత్తర ననునయించి శోకము వదలుము గర్భము
వృద్ధిగాంచకుండెడిని. భుజింపమానితివి. యశస్వినీ! నీకొడుకు
మహాతేజుఁడు కాఁగలఁడు. వాసుదేవుని ప్రభావమువలనను,
నాయాశిషములచేతను పాండవులయనంతరము రాజ్యమును
భావింపఁగలఁడు. అనిపలికి వారి నూఱడించి ధర్మరాజుతో
నర్జునుఁడు వినుచుండఁగా నిట్లు చెప్పెను. ధర్మనందనా! మహా
భాగుండగు పౌత్త్రుఁడు నీకుఁ గలుగఁగలఁడు. చతుస్సముద్ర

ముద్రితభూభాగమును బాలింపఁగలఁడు, ధర్మమును జక్కఁ
నిలుపఁగలఁడు. కావున శోకమును వదలుము. ఇది విచారింప
సమయముకాదు. సంశయ మీవిషయమున లేదు. శ్రీకృ
ష్ణమూర్తిచే నీవిషయము ముందే చెప్పఁబడియెనుగదా. అది
యన్యథా కాఁజాలదు. ఇతరదుర్లభములగు నాకలోకముల
నాయభిమన్యుఁడు చేకొనియెను. కావుననాతనిం గూర్చి దుఃఖింపఁ
గూడదు. కురుకుమారుల నుద్దేశించియుఁ జింతింపరాదు. వారె
ల్లఁ దమతమకార్యములను దీర్చి సురనగరమున కరిగిరి. వారి
నుద్దేశించి యేల వగచెదవు అను వ్యాసమహర్షి వాక్యముల
నాలకించి దుఃఖమును వదలి యుత్తరాగర్భము వృద్ధియగుఁ
గాత మనుకోర్కెతో నుండెను. విశేషించి వ్యాసముని తెలు
పఁగా నశ్వమేధయాగము నొనరింప నుద్యుక్తుఁడయ్యెను.

## శ్రీకృష్ణుఁ డుత్తరాగర్భమును గాపాడుట.

* కరినగరమున నిట్లు ధర్మజా జశ్వమేధము చేయఁ
బ్రయత్నించుచుండ ద్వారకానగరముననుండిన శ్రీహరి యాగ
ప్రయత్నము మనోగోచరంబగుటయు ధర్మరాజామున్నే తన్నుఁ
బ్రార్థించియుండుటయుఁ దలంచి కరినగరమునకుఁ బ్రయాణ
మయ్యెను. ఆర్తత్రాణము ధర్మరక్షణము దుష్టదమనము నను
నీమూఁడును దనముఖ్యకార్యములగుట సాత్యకిప్రభృతులం
గూడి త్వరపడుచుఁ బయనము సాగించెను. హస్తినాపురముఁ
జేరి తొలుదొలుత ధృతరాష్ట్రునిమందిరమున కరిగి యతఁడు
సగౌరవముగా నాతిథ్యము లొనరింప సంతోషించి గాంధారి

* ఈవిషయ మశ్వమేధపర్వమున నఱువదియాఱవయధ్యాయ
మాదిగా నుండు నధ్యాయములనుండి గ్రహింపఁబడినది.

పూజించి విదురాదుల యథావిధి సంభావించి యటనుండి
ధర్మనందనుగృహంబునకుం బోయి సుభద్ర తన్నుఁగన నరుదేర
దగుభంగి నాశ్వాసించి ధర్మరాజు మన్ననల కానందించుచు
నుండెను. కాని నాఁడు శ్రీకృష్ణు నంతరంగము సంతోషా
క్రాంతముగాక వ్యథనొందిన ట్లితరులకుం దోఁచెను.

అంత విరాటరాజనందనకుఁ బ్రసూతిసమయము డాసె
ను. చిహ్నములం గాంచి యెల్లరు వేచియుండిరి. పురుషశిశు
వుదయించినవార్త తెలియవచ్చెను ఎల్లరు సంప్రమోదాయత్త
మానసులైరి. ముదుసలు లెల్లఁ దమయానందమును వెలిపుచ్చ
సాగిరి. అంతలో మృతశిశువే వెడలివచ్చెనన్న దుర్వార్తయు
వినఁబడియెను. రోదనధ్వను లాక్రమ్మిడి వెల్లురేఁగెను. పుత్త్రుఁ
డని చూడఁబోవువారెల్ల వెనుకకు మరలిరి శ్రీకృష్ణుఁడు సాత్యకిఁ
గూడి లోపలికరిగి కుంతియున్నచోటికిం బోయెను. ఆమెయు
నేడ్చుచుఁ బరుగెత్తివచ్చుచుఁ గృష్ణా! పరుగెత్తుమా,
ఇటురమ్మా యని పిలిచెను. ఆమెవెనుక నే ద్రౌపదీసుభద్రలు
వచ్చుచు నట్లే విలపించుచుఁ గృష్ణుం బ్రార్థించిరి. శ్రీహరియు
మనస్సుచెదరఁగా లోపలికరిగెను. కుంతీదేవి బాష్పగద్గదవా
క్కుల నిట్లుపలికెను. శ్రీకృష్ణా! గోవిందా! నిన్నుఁగన్న దేవకీ
దేవి సుప్రజయేగదా. మాకెల్ల నీవేగతి మాప్రతిష్ఠయెల్ల
నీయధీనము. ఈవంశము భవదాయత్తము. నీమేనయల్లునికుమా
రుఁడు మృతుఁడయ్యెను. అశ్వత్థామ క్రూరాస్త్రజ్వాలల నిట్ల
య్యెను. ఈశిశువును బ్రదికింపుమా ఆదారుణాస్త్రసంప్రయో
గము వ్యర్థము చేయుమా. కృపానిధివికదా. మున్ను ప్రతినచే
సితివికదా. ఉత్తరాగర్భజనితుని బ్రదికింపకయున్న నీవంశమంత

నంత నొందును. ఆతఁడు జీవింపకయున్న నెల్లరము జీవింప
పాండుతనయులకుఁ బిండదానము చేయువా రెవ్వ రింకఁగలరు?
ఉత్తర నొకనాఁ డూఱడించితివికదా ఆపలుకు సార్థకము చేయు
మీ అని వేఁడుచు వగపెల్లున భూమిపయింబడియెను. హరి
యూఱడించుచు లేవనెత్తెను అత్తరుణమున సుభద్ర యాశ్రీ
కృష్ణునితో నన్నా! పుండరీకాక్షా! ధీమంతుఁడగు పార్థపౌత్రుని
జూడుము కురుకుమారులు పొడవడంగిరి ద్రోణతనయుఁ
డాపగ మది నిడుకొని భీమునిపై నిషీకమును బ్రయోగించెను.
అది యిపు డుత్తరమీఁదను, నామీఁదను పార్థునిమీఁదను
బడినది. ఈమృతశిశువును గాంచి యేమనఁజాలుదుము. నీకు
నమస్కరించెద. ఈ శిశువును జీవింపఁజేయుము ఈ కుంతీద్రౌ
పదులంజూడుము. * ఆనాఁడు ద్రోణనందనుఁడు పాండువం
శము నీయస్త్రము నిర్మూలించునని పలుకుచుండఁగా నీవు నీచ
మానవా! అసద్బ్రాహ్మణుఁడా! నీమాటను నిరర్థకముగా నొన
రింతును. నే నర్జునపౌత్రుని బ్రదికించెదను. అని ప్రతినపట్టితివి.
ఆమాటనువిని బ్రదికియున్నవారము. ఆశపథము స్మృతిపథ
మున కిపుడు తెచ్చుచున్నాఁడను. నీవాశపథమును సత్యేతరము
గా నొనరింతువేని నేనిందే మృతినొందుదును. తప్పనుజుమీ.
[1]అభిమన్యునికొడుకుజీవింపకపోయినచో నీవుజీవించియు నాకేమి
ఫలము? సర్వశక్తిమంతుఁడవు. కావున శ్రీకృష్ణా! ఉత్తరాగ

* అశామం త్వాం కరిష్యామి బ్రహ్మబంధో నరాధమ, అహం సంజీవయిష్యామి కిరీటితనయాత్మజమ్. అని మూలము. 1 అభిమన్యోస్సుతో వీర న సంజీవతియద్యయం, జీవతి త్వయి దుర్ధర్ష కింకరిష్యామ్యహం త్వయా. అని మూలము.

ర్భమును బ్రదికింపుమా. కేశవా! సత్యవచనుఁడవు సత్య పరాక్రముఁడవు. ధర్మాత్ముఁడవు. శత్రుసూదనుఁడవు. ఆడిన పలుకును సార్థకముగా నొనరింపుము. నీవే తలంచిన భస్మీభూతము లగుముల్లోకముల మరల యథాపూర్వముగ నుండఁజేయఁగలవు. ఈ మేనల్లునితనయుని జీవింపజేయు టొక గొప్పకార్యమా. అన్నా! నీప్రభావము నెఱుంగుదును. కావుననే నిన్నిత్తరుణమున యాచించుచున్నాఁడను. పాండుతనయులపై నింతమాత్ర మనుగ్రహమునుపుము. *తోఁబుట్టువని హతపుత్త్రయని విపన్నురాలని నాయందీకారణములలో దేనిననుసరించియైన దయ యునుప నర్హుఁడవు. అని ప్రార్థించి యూరక నిలుచుండెను.

ఇట్లు కుంతీసుభద్రాదులు ప్రార్థింపఁగా శ్రీహరి వారి దుఃఖమును దానును దుఃఖమును గనఁబఱచుచు నిదియే బ్రదికించెదను. దుఃఖపడకుఁడు. అనుపలుకులచే నెల్లర సంతోషపఱచెను. దప్పిగొన్నవారికి శీతలోదకములువలె నా శ్రీహరి మధురోక్తు లానందమును గలిగింపఁజాలెను. వెంటనే సూతికాగృహమును బ్రవేశించెను. హరి నందుండువారు శ్వేతపుష్పహారములచేఁ బూజించిరి. అందుఁ బూర్ణకలశములు లోనగు శుభకరపదార్థము లుండెను. వానిం గాంచి మేలుమేలని పొగడెను శ్రీహరి మోమునసంతోషము తాండవమాడుచుండెను. ద్రౌపది త్వరగాఁబోయి యోయుత్తరా! ఇదె శ్రీకృష్ణమూర్తి వచ్చెను. పురాణముని అమేయాత్ముఁడు, అపరాజితుఁడు నీకు

* స్వసేతి వా మహాబాహో హతపుత్త్రేతివాపునః, ప్రసన్నాం మామయంచేతిద యాంకర్తు మిహార్హసి. అని మూలము.

మంగళముకలుగును. నీసమీపమునకే వచ్చెను. అనుటయు నాయుత్తర త్వరపడి లేచి భగవంతుని గాంచి బోరున విల పించెను. భర్తవలెనే నన్నును మృతినొందినదానినిగాఁ దలం పుము. శిరస్సు పాదములు సోఁక నీకు నమస్కరించి ప్రార్థించు చున్నాను. ద్రోణాత్మజు నస్త్రాగ్నిదగ్ధుని నాయీకుమారుని బ్రదికింపుము. నాగర్భమందేయున్న యీశిశువు నస్త్రముచే వధించి యశ్వత్థామ యేమిఫలమును బొందఁగోరెనో యెఱుం గఁజాలకున్నాను. మఱొకసారి నమస్కరించి వేఁడెదను. ఈబాలకుఁడు జీవింపనిచోఁ బ్రాణములను వదలెదను. ఈశిశు వును నమ్మి నామనోరథము లెన్ని ఫలింపఁజేసికొనఁగోరితినో ఆశిశువు ద్రోణి నారాచహతుఁడైన నింక నేనేమిచేయుదును? ఏమని బ్రదుకుదును? కృష్ణా! ఈచిన్నికుమారు నెత్తికొని ముద్దాడఁగోరియుంటిని. ఆకోరిక వ్యర్థమయ్యెను. చూడుము. కృష్ణా! ఈబాలునినేత్రము లెట్టులున్నవో ఈశిశువు బ్రహ్మాస్త్ర దగ్ధుఁడై పడియున్నవాఁడు. కృతఘ్నుఁడై యీతనితండ్రి పాండవుల రాజ్యలక్ష్మిని వదలి యరిగెను. ఆనాఁడు నేనిట్లు ప్రతినపట్టితిని ఇదె యభిమన్యూ! నేను నిన్నుఁగూడవచ్చు చున్నాను. నే నిపుడుపోయిన నన్నేమని ప్రశ్నించును? మృతపుత్త్రవై పాండవశ్రీని వదలివచ్చితివా యని ప్రశ్నిం పఁడా? అని జాలిగొలుప విలపించెను. వెతలపెంపునఁ గ్రిందఁ బడి పొరలాడెను.

హతపుత్త్రయై పరిదేవనంబుచేయుచున్న యావిరాట నందనం గాంచి యెల్లరు విలపింపసాగిరి. ముహూర్తమాత్ర మాపాండవభవనము దుఃఖాక్రాంతములయ్యెను. ఉత్తరయు

నాదుఃఖంబు పెంపున మూర్ఛిల్లి తెలివొంది నందను నంకమున నిడుకొని యిట్లుపలికెను. ధర్మజ్ఞునికొడుకవై ధర్మము నెఱుంగవు. శ్రీహరి కేల నమస్కరింపవు. వత్సా! పోయి నీవు తండ్రితో నిట్లుచెప్పుము. మాయమ్మ నిన్నువదలి నన్నువదలి యెట్లు జీవింపఁగలదు? ఒకప్పుడు మరణము సంభవింపకున్నను ధర్మరాజు ననుమతినొంది విషభక్షణముచేసియైన మృతినొందును. అని పలుకుము. వత్సా! పతిపుత్త్రవిహీననై యెట్లు జీవింపఁగలను? నాయనా! లెమ్ము లెమ్ము. నీప్రపితామహిని దిలకింపుము. దుఃఖసాగరనిమగ్నయై యున్నది. ఇదిగో పాంచాలినిజూడుము; నన్నుం జూడుము ఎట్లు దుఃఖపడుచున్నామో తెలిసికొనుము.

ఈ విధమునంతయుం గాంచి పుండరీకాక్షుఁడు శిశువును బ్రదికింపఁ దలంచి యాచమనముచేసి బ్రహ్మశిరోనామకాస్త్రము నుపసంహరించెను. శిశువును బ్రదికింప శపథము చేసెను. దాని నెల్లవారు వినుచుండిరి. *శత్రువులయెడలఁగూడ నే నసత్యమాడనిమాట నిజమైనచో, యుద్ధరంగమున మనో

* న బ్రవీమ్యుత్తరే మిథ్యా సత్యమేతద్భవిష్యతి, ఏషసంజీవయామ్యేనం పశ్యతాం సర్వదేహినాం. ౧౮. నోక్తపూర్వం మయామిథ్యా స్వైరేష్వపి కదాచన, న చ యుద్ధాత్పరావృత్త స్తథా సంజీవతామయం. ౧౯. యథా మే దయితో ధర్మో బ్రాహ్మణాశ్చ విశేషతః, అభిమన్యో స్సుతో జాతో మృతోజీవత్వయం తథా. ౨౦. యథాహం నాభిజానామి విజయే నకదాచన, విరోధం తేన సత్యేన మృతో జీవత్వయం శిశుః. ౨౧. యథా సత్యంచ ధర్మశ్చమయి నిత్యం ప్రతిష్ఠితౌ, తథామృతః శిశురయం జీవతామభిమన్యుజః. ౨౨. యథా కంసశ్చ కేశీచ ధర్మేణ నిహతౌ మయా, తేన సత్యేన బాలోఽద్యపునస్సంజీవతామయమ్. ౨౩. అని మూలము.

ధైర్యములేక వెనుక కడుకిడనేని యీశిశువు బ్రదుకుఁగాక. విశేషించి బ్రాహ్మణులయందును ధర్మమునందును నాకుఁ బ్రీతి యెక్కుడుగ నుండెనేని యుత్తరానందనుఁడు మరల జీవితములఁ గాంచుఁగాక. విజయునియెడ నామనంబున నేవిధమునను విరోధము పొసఁగనిమాట సత్యమేయైన నీబాలకుఁడు జీవయుక్తుఁడగుఁగాక. మఱియు ధర్మమార్గముననే నే నాకంసుని గేశిని వధించుట నిజమేయైన నది యార్యసమ్మతమైన నీశిశువు ప్రాణయుక్తుఁడగునుగాక. సత్యము ధర్మమునిత్యము నాయందు సుప్రతిష్ఠితములైనచో నిబ్బాలకుఁడు బ్రదుకుఁగాక అని యిట్లు పురుషోత్తముఁడు శపథములు పలుకుటయు నాబాలుని శరీరమునఁ బ్రాణములువచ్చెను. సూతికాగృహము నాశ్రయించియున్న రక్షోగణములు పరుగెత్తెను. అంతరిక్షమునుండి యప్పుడొకవాక్కు వీతెంచెను. ఈ కృష్ణవాక్కు సత్యము. సత్యము. అనియే యావాక్కు.

అంతట నాబాలకుఁడుకదలెను. కన్నులు విప్పిచూచెను. ఆవిచిత్రమును గాంచినవారెల్లఁ బరమానందమునొందిరి. హరిశాసనమున బ్రాహ్మణులు స్వస్తివాచనకర్మము నడపిరి ఎల్లరు పరమేశ్వరుం బొగడిరి. ఉత్తరయు పుత్త్రసహితయై శ్రీహరికిం బ్రణమిల్లెను హరి యాశీర్వదించి రత్నము లుపహారము లిచ్చెను. బంధువులెల్ల నామెకుఁ బరమానందమున రత్నము లిచ్చిరి. పెలందలు విన బాలకా! పాండువంశము పరిక్షీణమగుతఱి నీవు బ్రదికింపఁబడితివి. కావునఁ బరీక్షిన్నామమును దాల్చుము. అనిపలికెను. ఆబాలకుఁడు క్రమక్రమమున వృద్ధినొందెను. రాజ్యమునఁగలవారెల్ల నానందించిరి.

మహాశయులారా! ఈవిషయ మత్యంతప్రధానము. దీని రహస్యము నెఱుంగవలయును. ప్రాణికోటి కాయుస్సు నియతమయియేయుండును. దానిమార్పఁదరముగాదు. అనుప్రవాదమంద తెలిసింగినదియే కాని క్రొత్తదిగాదు పరీక్త్ప్రాణరక్షణ మెట్లు? అనునదియే యిటఁగల మహాప్రశ్నము కర్మానుసారము జీవితకాలముండును. దానిని మార్పఁదరముగాదు. భగవంతుఁడు మార్పఁగలఁడుకాని తననియమమును దా నతిక్రమింపఁడు. సర్వేశ్వరుఁడు,

"శ్రుతిస్మృతీ మమైవాజ్ఞేయ స్తే ఉల్లంఘ్యవర్తతే"

అను తనప్రతినను మఱవఁడు. ఏకార్యమేని చేయుటకుఁ జేయకుండుటకు మఱొకవిధముగాఁ జేయుటకు శక్తుఁడు భగవంతుడనుట నిర్వివాదాంశము జన్మముతలి నింత కాల మాయుర్దాయమని వారివారికర్మమే నిర్ణయించును అది భగవంతుఁ డెఱుంగనిదికాదు. కాని యపమృత్యువనునది యొకటిగలదు. అది మార్పఁదగినదియే. దానిని దొలఁగించుకొనుటకే భగవదారాధనము లోనగుమార్గములు. ఔషధాదులు దానికి లోఁబడినమార్గములే వాని నాచరింపవలయును. కాలమృత్యువును మార్పరాదు అపమృత్యువును మార్చుమార్గము లేలయనరాదు. వాని ననుసరించినఁగాని ప్రత్యక్షఫలములు గలుగవు. ప్రత్యక్షముగా ఫలమును గాంచినఁగాని వానియందు భక్తి కుదురదు. అది కుదిరినఁగాని భగవంతు నారాధించు నుద్దేశము దృఢపడదు. కావున నపమృత్యు నిరాకరణమార్గములనేకములు నిర్ణయింపఁబడినవి.

ప్రకృతము నాలోచింతము. పాండవులు తత్పుత్రులు,

తత్పుత్రపత్నియగు నుత్తరయు దుఃఖమనుభవించు కర్మముచేసి యున్నవారు. దానిని వారనుభవింపక తప్పదు. కారణములేక కార్యముగలుగదన్న న్యాయముకలదు. దానిననుసరించి యశ్వత్థామ కారణభూతుఁడయ్యెను. శ్రీహరి తనయందు భక్తి లోకులకుఁ గుదురునట్లు చేయుటకై శపథముచేసెను. ఈఖ్యాతి భగవంతున కక్కఱలేదు. కాని మృతశిశువును బ్రదికించెను. గాన శ్రీకృష్ణుఁడు భగవంతుఁడని యెల్లరు నమ్మి తనతత్త్వము నెఱింగి కృతకృత్యులు కావలయుననియే శ్రీహరియాశయమని మనము నమ్మవలయును. హరి ప్రతిజ్ఞల నాలకింపుఁడు అనృతము నేనెన్నఁడు చెప్పకుండుట నిజమైనచో యుద్ధమునుండి వెనుకంజవేయునిస్వభావము నాకుండుట నిజమైనచో ధర్మమునందు బ్రాహ్మణులయందుఁ బ్రీతి నాకు నెక్కువగనుండినచో నర్జునునియందు నాకు నిరంతరప్రీతియుండినచో కంసుఁడు కేశి లోనగుదానవులను నేను ధర్మయుక్తముగాఁ జంపుట నిజమైనచో ఈకారణములన్నియు సత్యములేయైన నీశిశువు జీవించుఁ గాక అనికదా హరి పలికెను. దీనిసారమేమి? ధర్మము నాశ్రయింపదగినదని సద్బ్రాహ్మణులయందుఁ బ్రీతి నునుపవలయునని అసత్యమాడకుండు టుత్తమమార్గమని, రణరంగమున వెనుకంజవేయరాదని మిత్రునియందుఁగలప్రీతి నిష్కపటముగా నుండవలయునని లోకు లెఱింగి యట్లువర్తింతురుగాక యనియే కాని వేఱొకటికాదు. ఈప్రతినలుచేయకున్నను, శ్రీకృష్ణుఁడు బ్రదుకుమా యన్నంతన శిశువులేచును కాని లోకుల కీమూలమున సత్యధర్మములయందు మహాదరణముకలుగవలయునని కృష్ణు నభిప్రాయము. హరియాశయ మేవిషయముననను దాంభి

కత్వమును బోధింపదు. ఏకార్యముచేసిన నేమాటచెప్పిన దాని ననుసరించువారు కృతార్థులగుదురు కాని లోకులనువంచించి పొందఁదగినలాభ మాపరాత్పరునకు లేదు. సత్కార్యముల నాచరించి యహంకారమునుమాని నిశ్చలభక్తిమాని లోకులు కృతార్థులగుదురు. వేఁటొకమార్గమునఁగారు అనువిషయమునే యీకథనుండి మనము గ్రహింపవలయును. ఇఁకఁ దరువాతి భగవచ్చరిత్రమును బఠింతము.

## శ్రీకృష్ణుఁడు ధర్మరాజుచే నశ్వమేధమును జేయించుట.

పరీక్షిత్పునరుజ్జీవనకార్యానంతర మాపరాత్పరుఁడు ధర్మరాజుచే నశ్వమేధయాగమును జేయింప నందే నిలిచెను. వ్యాసముని యంతకుమున్దే ధర్మరాజున కశ్వమేధమునం దాసక్తిఁ బుట్టించియుండెను. మరల నమ్ముని శ్రీకృష్ణునింగూడి ధర్మరాజుండుచెంతంగి యచ్చోటికివచ్చి వారిచేఁ బూజితుఁడై ధర్మరాజా! సంపూర్ణదక్షిణలనొసంగి యశ్వమేధమొనరించి సకలపాపనిర్ముక్తుఁడవై సుఖంపుమని పలికెను. ధర్మరాజు శ్రీకృష్ణా! ఈసత్కార్యముచేయ నన్నాజ్ఞాపింపుము * నీవుచెప్పినట్లే నేనొనరింతును. నీవే మాకుఁ బరమగురుండవు నీమూలమున సకలపాపనిర్ముక్తుఁడ నగుదును. యజ్ఞము నీవే అక్షరమన నీవే ధర్మము నీవే ప్రజాపాలనతత్పరుండవు నీవే సర్వభూతములకు గతియన నీవే యని నానిశ్చితమని ప్రార్థించెను. శ్రీహరియు

* దీక్షయస్వ త్వమాత్మానం త్వం హి నః పరమోగురుః, త్వయీష్టవతి దాశార్హ విపాప్మాభవితాహ్యహమ్. ౨౧. త్వం హి యజ్ఞోఽక్షరస్సర్వ స్త్వం ధర్మస్త్వం ప్రజాపతిః, త్వం గతిస్సర్వభూతానా మితి మేనిశ్చితామతిః ౨౨. అని మూలము.

ధర్మరాజునందుఁ దనకుంగలప్రీతి తేటపడ, రాజా! నీవుచెప్పిన ట్లొనరింతును నీవే నన్నాజ్ఞాపింపుము. నీవే సర్వభూతములకు మార్గదర్శకుఁడవు కావలయు. కావున సత్కార్యము నొనరింపఁ బూనుము నీచెప్పినచందమున నేనాచరించుచుందును. నేను సమ్మతించితిని. ఇఁక నీవశ్వమేధముచేయఁబూనుము. సకలపాపములు తొలంగ నిర్మలయశఃకీర్తులఁబొందుదువు.

అనుటయు ధర్మరాజా! గోవిందు నాజ్ఞం దలం దాల్చి పారాశర్యుఁ డుపదేశించినచందంబున సుముహూర్తమునఁ దీక్షకుంబూనెను. మహర్షులాయజ్ఞకృత్యమును సవిధినొనరించి నిర్వహింప నుద్యుక్తులైరి. వ్యాసుఁడు సకలవిషయముల జాగరూకుఁడై పరీక్షించుచుండెను. శ్రీహరి సర్వసాక్షియగుట దానిఁజక్కఁగా నరయుచుండెను. యజ్ఞాశ్వము వెంటనరుగఁ బార్థుండును, రాష్ట్రరక్షణంబునకు భీమసేననకులులును, కుటుంబనిర్వహణమున సహదేవుండును నియోగింపఁబడిరి. అత్తఱి ధర్మనందనుం డర్జునుంగాంచి వత్సా! ఈయుత్తమాశ్వము వెంటఁజన నీకంటె నొరులు లేరు. నీవ యిక్కార్యము నకు వలంతివని శ్రీకృష్ణమూర్తియు వ్యాసమునియు నాదేశించిరి నాకు నట్లెతోఁచెను అనిపంచిన నాతం డట్లకాక యని యాజ్ఞను శిరసావహించి పయనమయ్యెను తక్కుంగలవారెల్ల నాయాయిపనులయం దప్రమత్తులై యుండిరి. సవనాశ్వము వెంటనరిగి యర్జునుండు రాజన్యుల నోడించుచుఁ దనవిజయం బాయాదేశములంజాటుచు బభ్రువాహానునితోఁ బోరాడి కారణాంతరమున నాతనిచేఁ జచ్చి మరల నుజ్జీవితుఁడై యవలఁబోయి నానాదేశంబులు తిరిగి సకాలమునకు యజ్ఞా

శ్వమునుగూడి వచ్చెను. అర్జునుఁడు రాకముందే ధర్మరాజు కృష్ణునిం దిలకించి మహాత్మా! యర్జునుఁడు రాకమసలె. ఆతని ప్రవృత్తి నెఱుంగఁగోరుచున్నాఁడ ననఁగా శ్రీహరి విజయుని కుశలవృత్తాంతము నెఱిఁగించి విజయపరంపరలు తెలిపి యల జడినిమాన్చెను అప్పుడీవిజయుఁ డంపినదూత యరుదెంచి రేపు యజ్ఞాశ్వముంగూడి విజయుఁడువచ్చునని తెలిపెను. శ్రీకృష్ణుఁ డాత్మ నెఱింగియు నప్పుడు విన్నయట్లే యానందించెను.

మఱుదినము విజయుఁడు సవనాశ్వముతోఁడ నరుదెంచెను. నానాదేశాధీశానీతరత్నరాసుల నన్నకు సమర్పించెను. బభ్రువాహనాదులు చనుదెంచిరి హస్తిపురము రాజన్యభూయిష్ఠమయ్యెను. యజ్ఞము సవిధిగా నడచెను. ఎవ్వరుగాని కొఱంతగాంచక యుండునట్లు సత్కారము లాచరింపఁబడుచుండెను. ప్రాయశ్చిత్తమనునది లేక యజ్ఞముసాగెను. ధర్మరాజు యజ్ఞదక్షిణగా వ్యాసమునికి రాజ్యమంతయు నర్పించెను. వియద్వీధినుండి మేలుమేలనువాక్కు నేతెంచెను. వ్యాసమునియు ధర్మరాజుతో రాజా! మరల రాజ్యము నీకే యొసంగెదను. పరిగ్రహించి పాలింపుము. మాకు రాజ్యమేల? వలసినతఱి మరలఁ బుచ్చుకొందును. ఈఋత్విక్కులకుఁ హిరణ్యమొసంగుము. అని యాజ్ఞాపింప నమ్మునిపంపున నట్లే యొనరించెను. యజ్ఞాంతమున ధర్మరాజు బలభద్రాదుల యథావిధి నర్చించెను. ఎల్లరాజుల గౌరవించెను. ఎవరినగరములకు వారరిగిరి. శ్రీహరియు ధర్మరాజు సబహుమానముగా నర్చింతుండై పాండవులవీడుకొని రాఁగలపాండవులగతిని బరికించి ద్వారకానగరమున కరిగెను.

మహాశయులారా! శ్రీహరి పాండవులవిషయమై చేయఁగలకృత్యముల నొనరించెను. సత్కర్మానుష్ఠానతత్పరులం గావించి విజయునిమూలమున సత్కృత్యత్యుత్కృష్టయశఃకీర్తులఁ గల్గించెను. అశ్వమేధమూలమున నించుక మిగిలియున్న రాజుల వధించి భూభారమును దగ్గించెను. తనయవతారఫలమును బూర్తినొందించెను. విజయునకు బభ్రువాహానునిచే మరణమునుగల్గించెను. దానవతనికి శిష్టమైయున్న మహాంకర్తృత్వవేశమును దుడిచివేసెను. విగతగర్వునింజేసెను తనసర్వసాక్షిత్వమును దృఢపఱచెను. పక్షపాతరాహిత్యమును బయలుపఱచెను. స్వస్వకర్మానురూపశుభపాపఫలము లనుభవింపక తప్పదను భావమును సర్వజనులకుఁ దెలియునట్లుచేసెను. ఎన్నియెన్ని విధములఁ బాండవులు లాభనష్టముల నొందఁదగుదురో యన్నియు నాయాయిమార్గములఁ బొందునట్టు లొనరించెను ఇఁకఁ జేయఁదగినమిగిలినకార్యములనొనరింపఁబూనెను ద్వారకానగరమున కరిగి యందుఁ జేయఁదగినపను లేవియని యాలోచించి యిదమిత్థమని నిర్ణయించుకొనెను. తన్ను నమ్మియున్నవారి నుద్ధరించుటకుఁ దీర్మానించుకొనియెను బలదేవాదులంగూడి ద్వారకానగరమునకుఁబోయెను ఇంతవనుకఁ బాండవులమూలమునఁ గాఁదగినకార్యములన్నియు నెఱవేఱినవని నమ్మవలయును. తాను జేయఁదగినభూభారహరణకృత్యములు పూర్తినొందినవి. భక్తరక్షణకృత్యములు కొన్నిమాత్రము మిగిలియున్నవి. వానింజదువ మనము ప్రయత్నింపవలయును. ద్వారకానగరమున నూరకయుండలేదు. ముందేమిచేయఁదగును? అశిష్టకార్యము లేయున్నవి? ఇతరులమూలమునఁ జేయింపఁదగు కార్యము

లేవి? ఉపదేశింపఁదగువిషయములేవి? కానున్నకలియుగమునం దుఁగుండ నిల్వఁదగినసత్కార్యములేవి? అను నీమొదలగువిషయముల నాలోచింపఁబూనెను. సర్వజ్ఞుఁడుకావున నీపని యిట్లు చేయఁదగునని నిశ్చయించెను. ఈరూపమున నీకార్యముఁ సాగిన మేలనియుఁ దీర్మానించెను. సర్వము విధిమంతముగా సాగింపవలయుననియే భగవంతునియూహ. కావున నాతని నట్లే యొనరించి లోకుల నుద్ధరించును.

## సృగాలవాసుదేవునకు శ్రీహరి ముక్తినొసంగుట.

* ఇట్లు తనయూహలు బ్రహ్మాదులకే నలవిగాకయుండఁ దనసర్వసాక్షిత్వమును దృఢపఱచుచుఁ దనవాక్కోట్యక్కటియు వేదరూపమై వెలయునట్లొనరుచుండ ద్వారకానగరమున నేమియు నెఱుంగనట్లు యాదవులం గూడియుండెను. సుధర్మయను సింహాసనము నధిష్ఠించియుండుతఱి నొకనాఁడు తటాలున నెందుండియో యొకబ్రాహ్మణుఁ డరుదెంచెను. ఆతనిమోమున బ్రహ్మతేజము నృత్యముచేయుచుండెను. దిక్కులు తత్తేజమున వెలుంగుచుండెను. భగవంతునిఁగాంచి బహుభంగుల నర్హరీతిని వినుతించి పురుషోత్తమునందుఁ గలభక్త్యతిశయమున నాదివ్యమంగళవిగ్రహమును దిలకించుచు నెల్లరకు వినఁదగిన మాటలతో నించుకభీతిల్లుచు వినయమునుదాఁటక యిట్లుపలికెను. పురుషోత్తమా! పరమేశ్వరా! సృగాలవాసుదేవుఁడను రాజేంద్రుఁడు రాజ్యపాలనతత్పరుఁడు కలఁడు. ఆరాజరాజు మీతోఁబలుకమని నన్నంపెను. ఆమాటల విన్నవింప నేవచ్చి

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండములోనిదని గ్రహింపుఁడు.

తిని. నావిన్నవించునవి యతనిపలుకులే. కావున సావధానము గాఁ జిత్తగింపుము.

"వైకుంఠమునందు వాసుదేవుఁడను నేనే. చతుర్భుజుఁడనుగా నందుందును. లక్ష్మీపతిని నేనే జగత్సృష్టికర్తను నేనే, బ్రహ్మాండనాయకుఁడ నేనే రక్షకుఁడను. బ్రహ్మ నన్నుం బ్రార్థింప భూభారహరణార్థము వైకుంఠమునుండి పయనముసాగించితిని. భారతవర్షమున నవతరించితిని. క్షత్రియవంశమున నుద్భవించితిని. వసుదేవపుత్త్రుఁడు వైశ్యుఁడు కలఁడు. మానవులకు నొండొరులకు విరోధమును గల్పించుచు దుర్బలుని బలవంతునిచే జయించుచు దుర్మార్గుఁడై భూపతులజంపుచున్నవాఁడు. దురోధ్యనుని జరాసంధుని తక్కినదుర్బలు లగు రాజులను భీమునిచేఁ జంపించెను. ద్రోణభీష్మకర్ణులను దక్కుంగలయోధులను మఱియొకరిచేఁ జంపించెను. ఇది విలాసమని తలంచెను. అప్రసిద్ధులను బ్రసిద్ధులచేతను దుర్బలులను బలవంతుల చేతను బొలియించి యానందించెను. శిశుపాలదంతవక్త్రులను, చిరకాలరోగార్తుఁడగుకంసుని, మత్పుత్త్రుఁడగునరకనామకుని, కేశిని, మురనాముని మోసమునఁ దానే సంహారించెను. అక్కటా! ఇది యొకపౌరుషమగునే. మోసము వీరధర్మమగునే. ధర్మయుద్ధము నాతఁడుచేయఁడు. కపటి, బాలుఁడు, అధార్మికుఁడు, స్త్రీలను బూతనను గుబ్జను నలయించెను. వస్త్రహేతువుచే రజకుని సంహారించెను. తనకృత్యమును జక్కఁగా నారజకుఁడుచేయువాఁడు. కావున శిష్టుఁడనంబడు. వాని నశిష్టుఁడై చంపెనుగదా. ఇది వసుదేవపుత్త్రుని విక్రమవృత్తాంతము.

నేనన్ననో హిరణ్యాక్ష హిరణ్యకశిపు లనుమహాబల

వంతులను, మధుకైటభులను బొడవడంచి సృష్టికర్తనై యున్న వాఁడను సృష్టిరక్షకుఁడను నేనే యగుదును. బ్రహ్మను నేనే. శంకరుడను నేనే. జగత్పాలకుఁడగువిష్ణువును నేనే.దుష్టదమనుఁడను నేనేయగుదును.మానవులు మునులు నాయంశములే యగుదురు. నారాయణమూర్తి యను వాఁడను నేనే. ప్రకృతికిఁ బరుఁడననఁగా నేనే యని నమ్మవలయును. వసుదేవనందనా! నీ కార్యములను వారించుట నాకు లజ్జాహేతువే యగును.కరుణఁబూని క్షమించి యింతదనుక నుంటిని. ఇఁక నూరకుండ రాదని తోఁచెను. శక్తియున్న నాతో సంగరముచేయుము. దూతల మూలమున మిగుల నహంకారముగలవాఁడవని యెఱింగితిని. అట్టి నిన్ను నెంచుట నాకుచితము విఱ్ఱవీఁగుచుండువారల నడంచు టుత్తమమార్గముకదా! ఇది రాజధర్మమనవలయు. ఇపుడు భూమిపాలకుఁ డనఁగా నేనొక్కఁడ నేకద! చక్రచక్ర గదాపద్మములధరించిన చతుర్బాహుభూషితుఁడను. నేనని నమ్మవలయును. యుద్ధకాంక్షచే ద్వారకకుఁ రాఁదలంచితిని. శక్తిగలిగిన నాతోఁ బోరాడుము. ఇచ్ఛలేదేని నన్ను శరణు వేఁడుము. శరణ్యుఁడనగు నన్ను శరణుపొందవేని ద్వారకా నగరము క్షణకాలమున భస్మముగ నొనరింతును. నేనలతోఁ బుత్రులతో బంధువులతో వసుదేవనందనా! నిన్ను సపరివారముగా క్షణకాలమున భస్మముచేయ నేనొక్కండనే చాలుదును. ఆకార్యమొకవిహారముగ భావింతును. నీవు తపోనిరతుఁడై వృద్ధుడై యున్నశంకరుని బాణాసురసంగ్రామకాలమున జయించితివి. బ్రాహ్మణశాపమున రోగియై నీచచిహ్నములు వేయిగలయింద్రు నోడించితివి. ఈరెండుకార్యములు మహా

త్తరములని భావించి పొగ రెక్కితివి. నాకంటె వీరుఁడు కలఁడా యని విఱ్ఱవీఁగుచున్న వాఁడవు. పారిజాతాపహరణ కార్యమును బట్టి యాలోచింప నీవు స్త్రీకి లోఁబడినవాఁడవని తేలకమానదు. పారిజాతమును దెచ్చుటకంటె వ్యర్థ కార్యము కలదా. నీవు కాంతాలంపటుఁడవు. గోకులమున రాధాదేవ్యధీనుఁడవు. సత్యభామాది కాంతల కిపుడు కింకరతుల్యుఁడవే యైతివి. అని తన రాజాపలుకులఁ దెలిపి యావిప్రుఁ డూరకుండెను.

శ్రీహరి యామాటలు సంబోధవుఁడుగా విని పక్కున నవ్వెను. పరమాదరమున నావిప్రునకుఁ జతుర్విధాహారములను బెట్టి తృప్తునిం గావించి యామాటలకు మనస్సు నేవగించుచు నెట్లో యా రేయిగడపెను. ప్రభాతమున మేలుకాంచి కాల్యకృత్యములందీర్చి సపరివారముగా రథారూఢుఁడై ప్రయాణముసాగించి యతివేగమున సృగాలవాసుదేవుఁ డున్న నక్కటికిం బోయెను శ్రీకృష్ణునియాగమనము చారులమూలమున నాలకించి సృగాలవాసుదేవుఁడు కృత్రిమచతుర్భుజుఁడు కావున సబలుడై హరియుండుచోటికి సంగరము చేయవచ్చెను. విచిత్రరీతిగా లౌకికముననుసరించి శ్రీహరియతనితో సంభాషింపఁ దలంచెను. సృగాలభూపతి కృష్ణునినాలింగనము చేసికొని మధురాలాపములసాగించి చిఱునవ్వులయఁ గటాక్షవీక్షణముల హరిపైఁ బరఁగించుచు నాతిథేయము లొనరించెను. శ్రీహరి దాని నంగీకరింపఁడయ్యెను. శ్రీహరిదర్శనముననే యా రాజుభీతినొందెను. కావున దంభమునుమాని వారితో నిట్లుపలికెను.

పరమేశ్వరా! చక్రధారల నాశిరస్సును ద్రెంచి త్వరగా

ద్వారకానగరమున కరుగుము. అశాశ్వతమై మహాపాపావిలమై తగునాయీదేహము వేగమపడిపోవుఁగాక. నీద్వారభూమి జయవిజయులుండురీతి సకలశుభములఁ బడయుచు నేనుందును. నీవు సర్వ మెఱుంగుదువు. ఆలస్యముచేయకుము. ప్రభూ! నాయీప్సితమును దీర్పుము. మహాలక్ష్మి శాపకారణమున నీలోకమునుండి భ్రష్టుఁడనై పడితిని శాపకాలము పూర్ణమయ్యెను. శాపాంతము శతవర్షములకని లక్ష్మీదేవి యనుగ్రహించెను. ఇఁక నీలోకమునకుఁ బోవుదును. అని భక్తిరసముట్టిపడఁ బలికి యూరకుండెను. శ్రీహరియుఁ దాను సర్వజ్ఞుఁడగుటఁ గరుణారసభరితాంతఃకరణుఁడై మిత్రమా! తొలుదొలుత నీవు నన్నుఁ బ్రహరింపుము. పిదప నీతోఁబోయెదను. నీవృత్తాంత మెఱుంగుదును. వత్సా! పూర్వసుఖములనొంద నీవు వైకుంఠమున కరుగుము. అని శ్రీకృష్ణుఁడు పలుకఁగా నాతఁడు పదిబాణముల వింట సంధించి హరిపైఁ బ్రయోగించెను. ఆ పదిబాణములు హరికిఁ నమస్కరించి కాలరూపములై యంబరమున వేగముగాఁ బరుగిడెను. అంత నా రాజు ప్రళయాగ్నిజ్వాలాసంకాశమగుగదను హరిపై విసరెను. అది కృష్ణతనుస్పర్శమునఁ దునుకలయ్యెను. కాలరూపమై యతిభయంకరమగు ధనుస్సును ఖడ్గమును రాజాహరిపై వైచెను. అవియు హరిదేహమును స్పృశించి శకలములయ్యెను. నిరాయుధుఁడగు నారాజును గాంచి కృపావారాశియగు వాసుదేవుఁ డిట్లు పలికెను. మిత్రమా! గృహమునకరిగి యస్త్రమును దెచ్చుకొనుము అనవుడు సృగాలవాసుదేవుఁడు. ఆత్మాకాశమస్త్రవిద్ధము కాదు. ఆత్మతో నాత్మకు యుద్ధమేల? ఈసంసారసాగరమునుండి నన్ను

ధ్ధరింపుము. ధరోద్ధరణకారణుఁడవు. సంసారార్ణవము దుస్తర విషయము. విషమునకంటె నధికము. నాయీకంఠమును ద్రుంపుము. దానితోడ స్వకర్మమోహజాలమును మాయను దొలఁగింపుము. నీవేకదా కర్మములకధిపతివి. సృష్టికర్తవు. శుభ ఫలప్రదాతవు. సర్వసంపత్ప్రదాతవు. ప్రాక్తనకారణుఁడవు. ప్రాగ్జన్మదుఃఖఖండనమున శక్తుఁడవు. ఇతరదుర్వాసదనుగు వైకుంఠగృహమున కరుగుదును. అందు సప్తమద్వారమున నుందును. ప్రాకృతమై నశ్వరమగు నీదేహమును పాంచభౌతికమునువదలి కృతకృత్యుఁడ నయ్యెదను.

అని యిట్లు మిత్రుఁడు వినుతింపఁగా విని కృపావారాశి యగు శ్రీకృష్ణుఁడు సంగరరంగమున విలపించెను. ఆశ్రీకృష్ణుని యశ్రువులు పడినతావున బిందుసరస్సునది యేర్పడెను అది పరమపావనమయ్యెను సర్వతీర్థోత్తమమును.ఆజలమును స్పృశించి నంతనే జీవన్ముక్తుఁ డగును. సప్తజన్మార్జితపాపములు నశించును. ఈవిషయమున శంకలు లేవు అప్పుడు శ్రీకృష్ణుఁ డాదరమున నిట్లుపలికెను. మిత్రవర్యా! నీకిట్టియుత్తమబుద్ధి యిపు డెట్లుకలిగెను? ఇంత నిర్మలమగుమన స్సెట్లు కుదిరెను? దూతముఖమున నంతటిదారుణము కఠినమునగుపలు కెట్లు చెప్పిపంపితివి? వినఁ గోరెదను. తెలుపుమా యన నాతఁ డిట్లుపలికెను. అట్లు పరుష వాక్కులు దూతముఖమునఁ బంపుటచేతనే యాగ్రహించి నీవు వేంచేసితివి. జగన్నాథా! రక్షకా! అట్లుగాకయున్న స్వప్నమునందైన నీదర్శనము దుర్లభముకదా. అట్లు పలుకుచునే భగవంతుని జూచుచుఁ బ్రాకృతశరీరమును వదలి దివ్య విమానారూఢుఁడై యతఁడు వైకుంఠమునకుఁబోయెను. సప్త

తాళప్రమాణజ్యోతి స్పష్టముఁ బొడకట్టెను. శ్రీకృష్ణునిపాదారవిందముల దర్శించుచునే పోయెను. శ్రీహరియు సంతోషవికసితవక్త్రసరసిజుఁడై ద్వారకానగరమునకుఁబోయెను. సకలాలంకారసంభృతమగు రుక్మిణీగేహమును బ్రవేశించెను. రుక్మిణీదేవియు శ్రీహరిని దర్శించి కృతకృత్యురా లయ్యెను.

మహామతులారా! ఈగాథనుండి యొక్కవిషయము గ్రహింపవలయును. సృగాలవాసుదేవుఁడు దూతముఖమునఁ బంపినవార్తను విన్నంతనే గర్వమున విఱ్ఱవీఁగువాఁడని తోఁచును. భగవంతునిజూడఁగనే యతఁడు పలికినపలుకులు విన్నంతనే పరిపక్వజీవుఁడనియుందోఁచును ఇదెట్లు?అనియే ప్రశ్నము. దుష్కర్మ వశమున నాసమయమున నట్టిపరుషోక్తులు పల్కెను. దాన నాకర్మము ముగిసెను. అదియే శాపాంతమునను దెల్పును. సత్కర్మము ఫలోన్ముఖమయ్యెను. దానఁ బరమేశ్వరదర్శనము లభించెను.ఆదివ్యదర్శనముఫలముల నొసంగఁదగినదికదా.దర్శనమాత్రముననే దివ్యజ్ఞాన ముదయించెను. ఆవిజ్ఞానము దుష్కర్మతమస్సుచే సంవృతమైయుండును. ఆతమస్సు తొలఁగఁగనే జ్ఞానభానుఁడు ప్రకాశించును దానభగవత్సేవాపుణ్యముపొడసూపును. దానిచేఁ గృతార్థుఁడగును. కర్మవశమున భగవంతుని దిట్టినను సత్కర్మముచేసియున్న చోఁబరమేశ్వరుకరుణ వానిపైఁ బ్రవహించుననుట కిదియొకయుదాహరణము. ఈనీతిని లోకులకుఁ దెలుపుటకేశ్రీహరి యాతని నిక్లేలదూషించితివని ప్రశ్నించెను. ఆదూషణమే నిన్నిటకుం దోడి తెచ్చెనని తెలిపెను. హరి సంతోషించెను. ఇదియే యీాకథాసారము. క్రోధముననొండె ప్రీతిమైనొండె నిత్యము భగవంతుని సంస్మరించుట తరణో

పాయమని యిందలిసీతి. ఇఁకఁ దరువాతివృత్తాంతము నవధరింపుఁడు.

## రాధాదేవి మహాగణపతి నారాధించుట.

* మహాశయులారా! రాధామాధవులకు శాపవశమున నూఱువత్సరములు వియోగముగల్గునని యింతకుముందే వ్రాసియుంటిని. శాపమున వియోగము గల్గినను శ్రీహరి యామెకుఁ గొడసూపుచునేయుండుననియు వ్రాసియుంటిని. మీరును జదివియేయుందురు భూభారహారణము సాగినతర్వాత శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమున నున్నతఱి శ్రీరాధాంబిక హరికడకుఁ జేరవలసియున్నది. ఆప్రయత్నము సాగవలయును. అందులకే యీవిషయ మిట వ్రాయఁబడునని యూహింపవలయును.

నారదముని నారాయణమూర్తిని గాంచి యిట్లు ప్రశ్నించెను. లోకరక్షకా! గణేశుని బూజించుపద్ధతి పురాణములయందు విస్తరించి వర్ణింపఁబడలేదు. వానినుండియే దానిని గ్రహించుట దుర్లభము. బ్రహ్మముఖమునుండి సామాన్య విషయమునే విన్నవాఁడను. గణనాథుఁడు సర్వదేవతాగ్రపూజ కర్హుఁడగుటకుం గారణము వినఁగోరెదను. విస్తరించి యా దేవునిచరిత్రము నెఱుంగఁ గోరికకలదు. రాధాదేవి మాధవ సమాగమమును గోరి యాదేవుని బూజించునని వింటిని. శాపముక్తి నూఱువత్సరములకగునుగదా. ఇతరదేవతలు రాజులు గణపతినిబూజింతురు కావున నాదేవునిపూజన ముత్తమోత్తమ

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నూటయిరువదిమూఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపవలయును. ఇది నారదనారాయణసంవాదరూపమనియుం దెలియంగవలయును.

మని స్పష్టమయ్యెను. అందులకే దానినివినఁగోరి ప్రశ్నించితిని.
మహానుభావా! యాపూజాపద్ధతిని విస్తరించివచింపుమా యని
ప్రార్థించెను.

శ్రీమన్నారాయణమూర్తి యాప్రశ్నము నాలకించి
నారదా! త్రిలోకములయందుఁ బృథ్వి ధన్యరాలు. మాన్య
రాలు. పుణ్యస్వభావురాలు. అందును భారతవర్షముత్తమోత్త
మము. సకలకర్మములకు ఫలములనొసంగును. పుణ్యక్షేత్రముల
యందు భారతవర్షముత్తమోత్తమము. అందును సిద్ధాశ్రమ
ముత్తమోత్తమము. ముక్తిప్రదము. మహాత్ముడగుసనత్కుమా
రుఁ డందే తపస్సుచేసి సిద్ధినొందెను. ఇంతయేల? బ్రహ్మదేవుఁ
డాయాశ్రమమునఁ దపస్సుచేసి ఫలమునుబడసెను. కపిలాదు
లగుయోగీంద్రులు తక్కుంగలమునీంద్రులు శతముఖుఁడును
దపస్సుచేసి సిద్ధులైరి. కావున సిద్ధాశ్రమము సర్వాశ్రమవర్గ
ములయందు శ్రేష్ఠము. ఆయాశ్రమమునందే గణపతికి నివా
సముకలదు. గణపతిస్థానములలో నదియుత్తమము.

దేవతలు వైశాఖపూర్ణిమయం దాగణపతిని రత్నమయ
ప్రతిమయం దావహింపఁజేసి పూజింతురు. సిద్ధేంద్రమునీంద్రులు
మానవులు నర్చింతురు. ఒకానొకతరుణమున నామహాపూజం
దిలకింపఁగోరి శంకరుఁడు పార్వతింగూడి వచ్చెను. కార్తికే
యాదు లాశంకరుంగూడి యరుదెంచిరి బ్రహ్మాదులు చనుదెం
చిరి. నాగేంద్రుఁడగుననంతుఁడు వచ్చెను. తక్కుంగలదేవత
లరుదెంచిరి. ఆవేడుకను జూడఁగోరి రాజాధిరాజులు వచ్చిరి.
ద్వారకావాసులంగూడి శ్రీకృష్ణుఁ డరుదెంచెను. నందాదులు
నాకృష్ణునిపయనము నెఱింగి వెంటఁబోయిరి. శ్రీకృష్ణప్రాణాధి

దేవతయగు రాధికయు నాసమయముననే వచ్చెను. శతవత్సర ములు నిండినందున శాపము క్తి సమయము నెఱింగి యారాసే శ్వరి పరమేశ్వరదర్శన మెప్పు డగునా యనుకుతూహలమున నుండెను. ధౌతవస్త్రములఁ దాల్చి నిరాహారయై సువ్రతయై యారాధాంబిక మణిమయమండపముం బ్రవేశించెను. ఆమెకు శ్రీకృష్ణప్రాప్తియే సంకల్పమైయుండెను. గణపతి పూజాఫల ముగా హరినిఁగూడవలయునని నిశ్చయించెను. మందాకినీపావ నోదకములచే నాగణపతిప్రతిమను స్నానము చేయించెను. సామ వేదోక్తమగు స్తుతిరాజమును బఠించి యాదేవోత్తము నేకా గ్రమనస్కయై ధ్యానించెను. తాను జతుర్వేదములకు సకల లోకములకు జననియే యైనను బుద్ధిరూపిణియైనను జ్ఞానులకుఁ గూడ నుపాసింపఁదగినదైనను లోకోపదేశకార్యమునకుగా నాపార్వతీసత్పుత్రుని ధ్యానించెను. తేజోరాశ్యంతరమున లం బోదరుని బ్రహ్మతేజస్సుచేఁ బ్రకాశించువానిని గజవక్త్రుని వహ్నిసమాన దేహకాంతిగలవాని నేకదంతుని సిద్ధులకు యోగులకుఁ బరమగురువగువానిని సర్వమహాత్ములచే సంస్తు తింపఁబడువానిని సర్వపూజితుని సనాతనుని బ్రహ్మస్వరూపుని బరమమంగళప్రదాతను సకలశుభాకరుని సకలవిఘ్ననివారకుని బరమశాంతుని సర్వసంపత్ప్రదాతను భవాంబురాశిమునిగిన వారల నుద్ధరించువానిని శరణాగతుల దీనుల నార్తులఁ గాపాడ నెల్లప్పు డాలోచించు కరుణాంతరంగుని భక్తవత్స లుని గణపతిని ధ్యానించెను.

భక్తు లీగుణములను దలంచుచు ధ్యానింపవలయును. రాధిక యారీతిధ్యా నించి తనశిరస్సునందుఁ బుష్పము నునుచు

కొనియెను. వేదోక్తముగసర్వాంగ శోధనన్యాసము నొనరిం చెను మరల నాదేవమూర్తిని ధ్యానించి గణపతిపాద పద్మము లయందుఁ గుసుమము నుంచెను. మహానదుల నేడింటినుండి పరిశుద్ధోదకములను దెప్పించి పాదములఁగడిగి తుడిచి దూర్వా క్షతలచేతను, శ్వేతపుష్పములచేతను బూజించి, యర్ఘ్య మొసంగెను. గోలోకవాసిని నగునే నర్ఘ్య మిచ్చుచున్నానని పలుకుచు నావిధి నొనరించెను. గంధ మొసఁగి పారిజాతాది పుష్పములచేఁ గూర్చినమాల్యము సమర్పించెను. పరిమళమిళిత గంధమును సర్వాంగములయందు విలేపనము నొనరించెను. శుక్ల పుష్పము లాదేవునకుఁ బ్రీతినొసంగునవి యని యెఱింగి వానిని భక్తితో నర్పించెను. ధూపము ఘృతదీపమును సమ ర్పించి చతుర్విధనైవేద్యమును సమర్పించెను. సుపక్వమధురతర ఫలముల నర్పించెను మధురతరభక్ష్యముల నర్పించి నమస్క రించెను. మఱియుఁ దక్కుంగల యుపచారవిధులఁ జక్కఁగా నాచరించెను. కల్పోక్తప్రకారము పూజల నొనరించెను. కామ ధేనువు నొసంగి పుష్పాంజలి నర్పించి మంత్రమును బ్రణవయు క్తమును దన్నామాద్యక్షరబీజవర్ణయుక్తంబును విఘ్నవినాశినే యనుపదమునుగూడి "స్వాహా" అనునక్షరద్వయము చిట్టచివ రనఁగలదానిని, పదాఱక్షరములుగల్గి మంత్రరాజమును బ్రఖ్యా తిని గాంచినదానిని వేయిపర్యాయములు జపంచెను. జపాంత మున మోము వంచి భక్తిభారముగలదియై యానందబాష్ప ములు వర్షించుచు సంతోషమున నిట్లు వినుతించెను.

గణనాథా! పరమతేజస్సుగలవాఁడవు, పరబ్రహ్మవు, పర మేశ్వరుఁడవు, విఘ్ననాశకరుఁడవు, శాంతుఁడవు, పుష్టుఁడవు,

అనంతుఁడవు, సురాసురయోగీంద్రవినుతుండవు. ఇట్టి నీకు నమస్కరించెదను. మంగళాలయుఁడవు. గణేశా! నీకివె వందనములు. అని ధ్యానించెను. * ఇట్లు రాధాదేవి పూజపద్ధతి సాగించి సర్వరత్నసారమగుహారము నర్పించెను. రాధాంబ తన్నుఁ బూజించి భక్తిసాంద్రమతిని సంస్తుతింపఁగా నానందించి గణాధిపతి సుప్రసన్నవదనారవిందుఁడై యిట్లు పలికెను. రాధికా! నీవు జగన్మాతవు లోకశిక్షాకరివి. బ్రహ్మస్వరూపిణివి. శ్రీకృష్ణవక్షస్స్థలమున సర్వదా నివసించుదానవు. నీపాదారవిందభజనము దుర్లభము. కావుననే మహర్షులు ధ్యానింతురు. సనకాదులు నిన్నారాధింతురు జీవన్ముక్తులగుకపిలాదులు నిన్ను వినుతింతురు. జగన్నాథునకు హృదయేశ్వరివి. వామాంగము నీది. దక్షిణాంగము మాధవునిదగు. మహాలక్ష్మి నీవామాంగనిర్మితయగును. సకలదేవతలు వేదములు నీవలన నుద్భవిల్లును. మూలప్రకృతివి నీవే. సర్వప్రకృతులు నీవిభూతులు. ప్రపంచములు కార్యములు. నీవు కారణరూపిణివి. ప్రళయమున బ్రహ్మాయు లయమందఁగాఁ దొలుత రాధానామము పిదప శ్రీకృష్ణనామము నుచ్చరించి హరి గోలోకము నొందెను. నిన్ను వదలినచోఁ దరణోపాయము వేఱొండు కానరాదు. నీ స్మరణమున బ్రహ్మహత్యాది మహాపాపములు తొలంగును. జగములకుఁ దల్లివి నీవు. హరి తండ్రి. తండ్రికంటెఁ దల్లి యధికురాలు. కావునఁ బూజింపఁదగినది. నిన్ను వదలి యితరదేవతలను గాని శ్రీకృష్ణుని సర్వకారణుఁడని పూజించినచో వాఁడు

* శ్రీకృష్ణజన్మఖండమున నూటయిరువదినాల్గవ యధ్యాయమునుండి యీభాగము గ్రహింపఁబడినది.

మూఢుఁడనఁబడును. ఎవ్వఁడేని నిన్ను నిందించునో వానికి. వంశహానియగు. దుఃఖము లప్పుడే కలుగును. వాఁడు మహా నరకకూపమునఁ బడును.

ప్రాణులు దేవతలమంత్రమును జపించిన భక్తులగుదురు. వారు దుర్గాపూజ కర్తలగుదురు. జగత్కారణుండగుశంభు మంత్రమును జపించినచో మీదంపతుల పాదారవిందముల నారాధింపఁగలఁడు. మీపాదారవిందభజనము మహాపుణ్య మునఁగాని లభింపదు. విష్ణుభక్తులమూలమున మీమంత్రమును సంగ్రహింపవలయును. కవచము స్తవము నట్లే గ్రహింప వలయు. దాన సర్వపాపములు నశించును. భారతవర్షమునఁ బుణ్యక్షేత్రమున నీమంత్రమును జపించి నీస్తవము పారాయ ణముచేసి కవచము న్యాసరూపమునఁ దలంచిన సకలపాపములు తొలంగును. వస్త్రాలంకారచందనముల గురువు నారాధింపవల యును కవచమును మదిని ధరించునతఁడు విష్ణుతుల్యుఁడే యగును. నాకొఱ కేవస్తువు నీయఁదలంతువో నతృప్తి కొఱకు విప్రున కొసంగుము. దాన నేను సంతృప్తినొందుదును. దేవునికొఱకు నిచ్చుదానములు దక్షిణలు విప్రవరున కిచ్చిన దేవత తృప్తినొందును. బ్రాహ్మణముఖమే దేవతాముఖము. విప్రభుక్తమగుపదార్థమున దేవతలు సంతృప్తు లగుదురు. అని గణపతి పలుక నానందించి యారాధాంబపూజాంతమున బ్రాహ్మ ణులకు నన్నదానముచేసెను. లంబోదరుఁ డాకార్యమున సంతు ష్టాంతరంగుఁ డయ్యెను.

ఆవటమూలముచెంత కర్తలి బ్రహ్మేశానాదు లరు దెంచిరి. అప్పుడు శివానుచరుం డొక్కఁడు దేవతలను దేవీ

శిరోమణులను బరికించి యిట్లుపలికెను. వృషభానుని తనూజాతయగు నీరాధాదేవి స్వస్తివాచనపూర్వముగా గణనాథుని బూజించెను. గోపికానాయికయగు నీజగజ్జనని దేవకోటులం గూడి పూజించెను. ఆపూజావిధాన మితరులకుం దెలుపవలదన్నను విన్నవించుచున్నాఁడను. సర్వకార్యములకు మొదట గణపతిని బూజించిన ననంతఫలములు గలుగును. నడుమఁ బూజించిన మధ్యమఫలములే కలుగును. కార్యాంతమున నల్పఫలములు గలుగును. సకలదేవతాసహితయై యీరాధిక పూజించెను. కావున సంపూర్ణఫలము నందఁగలదు. అని పలుక నాదూతవాక్కు లాలకించి సర్వదేవతలు నవ్విరి. మునీంద్రులు యోగీంద్రులు రుక్మిణ్యాదిహరిపత్నులు పరమవిస్మయావిష్టహృదయలైరి. సరస్వతియు సావిత్రియుఁ బార్వతియు రోహిణీదేవియు స్వాహాదిదేవీకదంబయు మునిపత్నులు పరమానందము నొందిరి. శ్రీకృష్ణుఁడు లోనగువారలెల్లఁ దమ రుతెచ్చిన యమూల్యద్రవ్యములతో నాగణపతిని బూజించిరి. సకలవిధనైవేద్యములు విధిమంతముగా సమర్పించిరి ఎల్లరు తమతమయాసనములపై నుపవిష్టులైరి.

అంతఁ బార్వతియుఁ బరమప్రీతిమీఱ రాధికచెంతకు వచ్చెను. ఆదేవినిజూడఁగనే రాసేశ్వరిలేచి యథాయోగ్యముగ నాదరణముమీఱ సంభాషించెను పరస్పర మాలింగనాదుల వారాచరించి సంతోషించిరి. రాధికనుఁ గౌఁగిలించుకొని యా దుర్గాంబ యిట్లుపలికెను. మంగళాలయ యని ప్రఖ్యాతినొంది నిన్నేమని ప్రశ్నింతును. శ్రీదాముని శాపఫలము ముగిసెను, వాయందే నీపంచప్రాణముల నెట్లుంచితివో నేను నీయందే నా

ప్రాణపంచకము నునిచితిని. ప్రకృతిపూరుషులకు భేదములేని యట్లే మనకిరువురకు భేదములేదు * ఏ నీభక్తులు నన్ను నిందింతురో. ఏ నాభక్తులు నిన్ను నిందింతురో రవిచంద్రు లుండునంతదనుకఁ గుంభీపాకనరకమునఁ బడియుండుదురు. రాధామాధవుల కేనరాధములు భేదమును గల్పింతురో వారికి వంశహానియగును. అంతియగాక చిరకాలము నరకవాసము కల్గును. ఆవలసూకరయోనింబుట్టుదురు.మరలఁగ్రిములై మలవాసముం గాంతురు.నాకొడుకు గణనాథుఁడు నీచేతనే పూజింపఁబడియెను.. సర్వకార్యాదియం దతఁడు పూజ్యుఁడగు. నీకెట్లో నాకు నట్లే పూజ్యుఁడునగు. దేవీ! మీకిఁక నెప్పటికి వియోగముకలుగదు.పాలకు శ్వేతవర్ణమునకు భేదముగలుగనట్లు రాధామాధవులకుఁ గలుగదు భారతవర్షమున కధికపుణ్యక్షేత్రమగు నీసిద్ధాశ్రమమునందు విఘ్నఖండనదక్షుఁడగు గణనాథు నర్చింతివి గావున గోవిందుని బొందుము. నీవు రాసేశ్వరివి. రసికాభిధానము నీకుఁ జెల్లును. శ్రీకృష్ణుఁడు రసికేశ్వరుఁడు. రసికునితో రసికురాలికిఁ గలుగుకూడిక గుణవంతమే యనవలయు. నూలువత్సరములు శ్రీదాముని శాపకారణమున శ్రీకృష్ణవియోగము నీకుఁగల్గెను. నావరమువలన నిఁక హరినెడఁబాయకయుండుము. నాయీవర మమోఘము. కావున యథాపూర్వముగా నానందసాగరమునఁ దేలుము.

* యే త్వాం నిందంతి మద్భక్తాస్త్వద్భక్తాశ్చాపి మామపి, కుంభీపాకేచ పచ్యంతే యావచ్చంద్రదివాకరౌ. ౪౪. రాధామాధవయోర్భేదం యే కుర్వంతి నరాధమాః, వంశహానిర్భవేత్తేషాం పచ్యంతే నరకే చిరం. ౪౫. అని మూలము.

ఇట్లు పార్వతిపలుకఁగాఁ దదాజ్ఞచేఁ జేడియలు రాధా దేవిని బలువిధముల శృంగారించిరి. రత్నసింహాసనమునఁ గూరు చుండఁజేసిరి కంఠమున నమూల్యరత్నహారము నర్పించిరి. రాధాదక్షిణహస్తమున మనోహర క్రీడాపద్మము నుంచిరి. అందుఁ బద్మముఖి యను చెలికత్తె రాధాపాదపద్మములకు నల క్తకవిలేపనకార్య మొనరించి కృతకృత్యురాలయ్యెను. సుందరి యనుగోపిక సుందరసిందూరము నునిచెను. చందనరేఖపై నీ సిందూరతిలకము నమరునట్లు చేసెను. సీమంతభాగమున నది యల రారుచుండెను. మాలతి యనుసఖి జడ నమరించెను. మాలతీ హారమున నా రాధ మిగుల నలరింపఁబడెను. ప్రఫుల్లనవమల్లికా హార మమర్పింపఁబడెను. రసిక యను నెచ్చెలి నవరత్ననిర్మిత హారముల నాజననిఁ గైచేసెను. కాటుక నెలమి నలరించి నయ నాలంకారము నొనరించెను. దేవేంద్రుఁడు సమర్పించినపారిజాత ప్రసూనహారమున నారాధిక యలంకరింపఁబడియెను. పరిమళ ముల వెదఁజల్లు పారిజాతపుష్పహారమే హస్తమున నునుపఁబడి యెను సుశీలయనుగోపిక శ్రీహరిపార్శ్వమునఁ గూరుచుండఁ దగిన సింహాసనమునిచెను. కలావతి రాధికశాపవశమున మఱచిన శ్రీకృష్ణలీలాగీతికల స్మృతికిం దెచ్చెను సుధాముఖి యను రాధిక సోదరిహరిఁపల్కుచున్న యమృతవర్షమును గురియించు వాక్చా ర్యంబును దెలియఁజేసెను. మఱియుఁ జేడియ లాయిరువురకుఁ దగినయలంకారముల నర్పించితమకృత్యముల నెరవేర్చిరి. అత్తఱి నాయాశ్రమ మెల్ల శ్రీహరిసంకల్పమున గోరోచనజలసిక్తమై పరి మళములఁ జిమ్ముచుండఁ గాంచి మహర్షులు విస్మయావిష్టస్వాం తులైరి. శ్రీహరికడకరిగి కారణమడిగిరి. సర్వకారణ కారణుండగు.

నా శ్రీకృష్ణుం డిట్లు మహామునులకు బదులుచెప్పెను.

మునీంద్రులారా! దీనికారణమునాలకింపుఁడు. మున్ను గోలోకమున శ్రీదాముఁడు రాధికను గారణాంతరమున శపించెను. దాన నీమె శోభాహీనురా లయ్యెను. నాయెడఁ బాటున సంతాపము కలుగ సర్వవిషయజ్ఞానము మఱచెను. వర్షశతకము పూర్ణముకాఁగా మరల నాజ్ఞానమును స్మరింపఁ జాలెను. ఈరాసేశ్వరి తేజస్సుచేత నీసిద్ధాశ్రమమెల్లఁ బచ్చని వర్ణము కలదయ్యెను. ఆ తేజస్సు విచిత్రమైనది. సకలప్రాణుల కానందజనకమైనది. సుఖప్రదమైనది. దానింగాంచుటయే నేత్రఫలము. అని శ్రీహరి పలుకఁగా మును లచ్చెరువందిరి. మనువులు దేవతలు తత్పత్నులు నచ్చెరువందిరి. త్వరగాఁ బోయి యారాధాపీఠముకడనిలుచుండి భక్తిభారమునఁ దలలు వంచి యాపరాంబకు మ్రొక్కిరి ఆజననిరూపము మానస పుత్త్రులనఁబడు సనకాదిమహర్షులకేని దృశ్యముగనుండెను. సనాతనియై పరాంబికయై సర్వమంత్రాధిదేవతయై పరమాత్మస్వరూపుఁడగు శ్రీకృష్ణునకుఁ బ్రాణాధిష్ఠానదేవతయై పూజింపఁబడుచు వినుతింపఁబడుచుఁ దనమహిమమునఁ దేజరిల్లు నారాధాంబనుదర్శించి పద్మప్రముఖకుసుమములచేఁబూజించిరి. ఆమె ధ్యానసాధ్యయై గోలోకదేవతయై సురాసురమునివరనమస్కృతచరణారవిందయై యలరారెను. అట్టిరాధికను దర్శించి పరమానందమునందిరి. బ్రహ్మ యిట్లు పలికెను. తల్లీ! పరమపవిత్రమగు భారతవర్షమునఁ బుష్కరక్షేత్రమున నఱువది వేలసంవత్సరములు తపస్సుచేసితిని. నీపాదారవిందముల ధ్యానించితిని. కానిదర్శించుభాగ్యము లేకపోయెను. స్వప్నము-

నందును దర్శించుసంపద కలుగలేదు. చింతాకులమానసుఁడనై యుండ నశరీరవాక్కొక్కటి వీతెంచెను.

వారాహాకాలమున భారతవర్షమున సిద్ధాశ్రమమున గణపతిపాదారవిందములఁ జూడఁగలవు. అత్తటి రాధామాధవులసేవించుభాగ్యము నీకుఁ గలుగఁగలదు. అదియే నీతపస్సునకు ఫలమగును. అనుమాట వినఁబడినతోడనే తపస్సు చాలించితిని. ఆవాంఛితము నేఁటికి ఫలించినది. అనుచుండునంత మహాదేవుం డిట్లుపలికెను దేవీ! మహర్షులు దేవర్షులు సురాసురాదులు నీపాదపద్మముల నారాధింతురు. అది పరమదుర్లభమైనది. స్వప్నమున నీదర్శనము దుర్లభము. అట్టి నీవిట మాకెల్ల దర్శనమొసంగితివి. అనుచుండ ననంతుఁ డిట్లు భాషించెను. తల్లీ! వేదములు వేదమాతయగు గాయత్రియు సకలపురాణములు యోగులు నేను సరస్వతియు నిన్ను వినుతింప సమర్థులము కాము. నీభ్రూభంగచాలనమునుగూడ వినుతింపఁజాలమనుట నిక్కువము. అని యిట్లు సకలదేవతలు యథాశక్తి న్యాయము ననుసరించి వినుతించిరి. నమస్కరించి కృతార్థుల మైతిమని తలంచిరి. రుక్మిణ్యాదియోషిల్లలామలు సిగ్గుచే దలలువంచుకొనిరి. నిట్టూర్పులఁబుచ్చి దర్పణముల మలినములుగా నొనరించిరి. సత్యభామయు మృతతుల్యయై యాహారమును మఱచి మనస్సునందునుగూడ నభిమానమును వదలి యుండెను.

ఆర్యమహాశయులారా! ఈగాథయం దొకయద్భుత వార్తగలదు. దాని నెఱుంగవలయును. లాభ మేమనఁగా సర్వదేవతాసమత్వము కుదురుటయే. అదియేకదా కోరఁదగిన

విషయము. అదొక్కటి కుదురకున్న మానవజన్మమే వ్యర్థమగును. కావున నించుక త్రచ్చి చూతము. రాధాశాపము నకుం గలకారణమును మీరింతకుమున్నే యెఱుంగుదురు. శాపావధియు నెఱుంగుదురు. శాపాంతమున శ్రీహరిసమాగమ మెట్లులయ్యెనో కారణ మద్దానికిందుఁ దెలుపఁబడినది. శాపాంత మనఁగా దుష్కర్మానుభవాంతమని తాత్పర్యము కదా. సత్కర్మ ఫలారంభమున దేవతాప్రార్థనమే ప్రధానము. అద్దియే యిందుఁ గలవిషయము. మహాగణపతిపూజ సర్వదేవతాపూజాది భాగముననే చేయఁబడును. ప్రాయకముగా నిదిసాగును. వైష్ణవులిస్థానమున విష్వక్సేనుని బూజింతురు. గణపతిదేవతాకమే గాణాపత్యము. ఆఱుమతములలో శైవ శాక్తవైష్ణవగాణాపత్య సౌర కాపాలికములలో నిది యొకటి. భారతవర్షమున నీయాఱుమతములే ప్రాచీనములు. బహుజనావలంబములుగలవి. అం దిదియు నొకటి. ఇందు గణపతియే పరదైవమని, తదారాధనమే చతుర్విధపురుషార్థప్రదమని, యది చేయకుండుట మౌర్ఖ్యమని చెప్పఁబడును. ఆఱుమతములధర్మము లిట్లే బోధించును. ఇందేది సత్యమని కొందఱు ప్రశ్నింతురు. అది మిగుల పొరపాటే యనక తప్పదు. ఇందొక్కదానికంటె నొక్కటి యధికమని యొకటి తక్కువయని పలుకవలనుపడదు. అన్నియు నొక్కటియే. అన్నింటియందును సార మొక్కవిధముగనే యున్నది. ఏమతధర్మముల నవలంబింతుమో యాధర్మములఁ జక్కఁగ నాచరింపవలయు. అందుఁ బేర్కొనఁబడినదైవమే పరమాత్మయని భావింపవలయు. సర్వదేవతాస్వరూపుఁ డనియు నమ్మవలయును. తద్భిన్న మేదియు నెందును లేదని

తలంపవలయును. తదారాధనము పరమపురుషార్థప్రదమని నిశ్చయింపవలయును. తదన్యము లేదని తలంచుబుద్ధిమంతుని భావము సద్భావముగాక మఱెవ్వరిదగును? అదియే తరణోపాయమగును. అట్లుగాక యితరమతముల దూషించుచున్న నీదేవత సుప్రసన్నుఁడు కాఁడు. ఫలము నొసంగఁ దలంపఁడు. ఏదేవత నాత్మ నిలిపి యెవ్వఁడు ధ్యానించునో సర్వదేవతామయుండగు నాపరాత్పరుఁడు సుప్రసన్నుఁడై వానినేల యుద్ధరింపఁడు? ఉద్ధరింపనిచో సర్వదేవతామయుఁ డతఁ డెట్టులగును? సర్వపనుఁ డెట్టులగును? సర్వశబ్దవాచ్యుఁ డెట్టులగును? సర్వము తానేయై సర్వత్ర వ్యాపించియుండుట నిశ్చయమేయైన నేరూపమున ననన్యభక్తితో ధ్యానించినఁ గృతార్థునిగఁ జేసియే తీఱవలయును. లేకున్నఁ బరాత్పరుఁడే కాఁడు.

కొందఱు బాహ్యాచారములఁ బాటించి కపటవేషధారులై పరమతధర్మానుష్ఠానమునఁ దరింపవలనుపడదని తెల్పుదురు. వారికంటె భగవద్ద్వేషులు లేరనవలయును. శివుని భస్మధారణము చేయక యారాధించిన వరము లీయఁడని కొందఱు, విష్ణువు నూర్ధ్వపుండ్రధారణము చేయక పూజించిన మేలుకలుగదని కొందఱును బలుకుదురు. ఔరా! ఎంతటి సాహసము! ఎంతటికపటనాటకసూత్రధారత్వము! ఎంతటి స్వార్థపరత్వము! అట్టివారికి ధనార్జనముతప్ప వేఱేదియుఁ దెలియదనియు వారి ప్రవృత్తి కాపట్యభూయిష్ఠమనియు నొక్కిచెప్పక తప్పదు. భగవంతునకు విభూతియు నూర్ధ్వపుండ్రములా ప్రీతికరములు? శైవవైష్ణవాదిమతములా ప్రీతిపాత్రములు? ఏనాఁడును గావు. మఱేమన నిర్మలభక్తి, పరిశుద్ధప్రవర్తనము, సర్వభూతదయాళు

త్వము, నిస్సంగత్వము, సర్వమతసహిష్ణుత యనునీగుణములే భగవత్ప్రీతిపాత్రములగును. ఇవి లేనినాఁడు నామధారణాదులు వ్యర్థములగుటమాత్రము కాదు. తనకు బంధకములగును. లోకమును వంచింపఁబూనుట తన్నుఁ దా వంచించుకొనుటయే. అలింగత్వము భగవద్ధర్మము. అట్టితత్త్వమునకు లింగత్వారోపణమునందు నూర్ధ్వపుండ్రాదికల్పనము వ్యర్థము. ఆచిహ్నములు లేనిచో భగవంతునియనుగ్రహము కలుగదనుట కేవలాజ్ఞానము. వారేనాటికిని దరింపఁజాలరు. ఇతరుల నుద్ధరింతుమనుట పరిహాసాస్పదము. శివవిష్ణ్వాదినామములెల్ల నాపరతత్త్వమునకుఁ జెల్లు ఇందుఁ దారతమ్యముకలదనుట కర్మమువలని దుష్ఫలము. కావున నట్టిదుష్ప్రయత్నముచేత నేలాభముకలుగదు. వానినిమాని తాఁ దరింపఁ బ్రయత్నింపవలయునుగాని యితరుల నుద్ధరింపఁబూనినట్లు వేషములు వేసికొనరాదు. తాఁ దరించి యితరుల నుద్ధరింపఁబూనుటే లెస్స. ఈమొదలగువిషయముల నీకథ బోధించుచున్నది. ఇట్టికథనుండి సారమును గ్రహించి భగవత్కరుణకుఁ బాత్రుఁడగుటకుఁ బ్రతిమానవుఁడును బ్రయత్నింపవలయును. ఇఁకఁ దరువాతికథను బఠింతము.

## శంకరుఁడు వసుదేవునకు హరిమహత్త్వము నెఱిఁగించుట.

* గణపతిపూజానంతరము రాధామాధవు లొక్కటం గూడియుండిరి. వచ్చియుండినదేవతలు మునులు లోనగువారెల్ల నందుండిరి. ఆమహాసభ దర్శనీయముగా నుండెను.

* ఈకథయుం శ్రీకృష్ణజన్మఖండమందున నూటయిరువదైదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

రాధాస్తోత్రము నాలకించి వసుదేవుఁడు దేవకీదేవియు నాశ్చర్యమునొందెను జగన్మాయను సామాన్యస్త్రీనిగా భావించితిమికదా యని లజ్జనొందిరి అత్తఱి వసుదేవుఁడు శంకరుం గాంచి స్వామీ! మాదంపతులకుఁ దరణోపాయము ననుగ్రహింపుఁడు. ఉత్తమగతి నెఱుంగ వేఁడుచున్నాము. మీరు దీనబాంధవులరు. మేమో యత్యంతదీనులము. సంసారసాగరమును దరించునౌకకు మీరు కర్ణధారకులరు. జలమయములగుతీర్థములు, మృత్పాషాణమయములగు దేవతలు యజ్ఞరూపములగుపుణ్యములు, నుపవాసనియమముగలవ్రతములు, తపస్సులు, నానావిధదానములు, విప్రదేవార్చనములు నింకను గలయనేకమార్గములు మానవుని జిరకాలమునకుగాని యుద్ధరింపఁజాలవు. భగవద్భక్తులన్ననో దర్శనమాత్రంబుననే యుద్ధరింతురు. భగవద్భక్తులగుసజ్జనుల పాదపద్మరజస్స్పర్శమున భూదేవి పవిత్రురా లయ్యెను. సకలతీర్థములు పవిత్రములయ్యెను.సముద్రములు పర్వతములు పరమపావనములయ్యెను. దేవత లామహాత్ములను దర్శింపఁగోరుదురు. వారిదర్శనము మహాపాపదారుహుతాశనము. అట్టిసాధువుల నెఱుంగనివారు పామరులు. అజ్ఞానులు. నేనన్న శ్రీకృష్ణునకుఁ దండ్రినని పిలువఁబడువాఁడను సంసారసంగముగలవాఁడను.దేవకియు నాయట్టిదేయగును. మహాత్మా! శంకరా! జ్ఞానులకు నీవు పరమగురుఁడవు. కావునఁ దరణోపాయము నుపదేశింపుమా యని ప్రార్థించెను.

నాల్గువేదములకు జనకుఁడై పరమేశ్వరుఁడై వెలయుశంకరుఁ డావసుదేవునిపలుకుల నాలకించి పక్కున నవ్వి యిట్లు లికెను. ఇందు జ్ఞానులంద ఱున్నవారు. వీరిసన్నికర్షణమున

నిట్లు ప్రశ్నించుట యచ్చెరువుగనున్నది. మహాత్ముఁడగు వాసుదేవునకుఁ దండ్రివి. పండితుఁడవు. జ్ఞానఘనుండగు కశ్యపమునియంశమున జన్మించినవాఁడవు. అట్టినీవు జ్ఞానము నుపదేశింపుఁడని మమ్ముఁ బ్రశ్నించితివి. మేమో శ్రీకృష్ణాజ్ఞను శిరసావహించువారము. తత్పుత్త్రులము. ఔరా! దుర్గాదేవిమహామాయ. జ్ఞానులకు నజ్ఞానమును గల్పించునది. విష్ణుమాయ దురారాధ్య యనఁబడు. త్రిజగద్వాసులలో నెవరుగాని దానిని సాధింపఁజాలరు. మేమును మహామాయామోహితులమే. బ్రహ్మయు విష్ణుమాయామోహితుఁడు. కనుకనే శ్రీహరిని బరీక్షించెను. బ్రదికియుండుదనుక హరిపాదాంభోజము ధ్యానింపఁదగినది ఎందఱో యింద్రులు పతనముగాంచ బ్రహ్మకాయుస్సు ముగియును. ఆ బ్రహ్మ యాయుఃపరిమాణము శ్రీకృష్ణునకు నిమేషకాల మగును. అట్టి శ్రీహరితోఁ బారిజాతవిషయమున నింద్రుఁడు యుద్ధముచేసెను. పారిజాతమును సమర్పించి నేనాయింద్రుని గాపాడితిని. వసుదేవా! మాకున్నజ్ఞాన మత్యల్పము. కావున నీసంశయమును దీర్పఁజాలము. శ్రీకృష్ణునే ప్రశ్నింపుము. బ్రహ్మకు నాలుగుయామములు కాఁగా నాకాలమునే కల్పమని కల్పవేత్తలు పేరిడిరి. మార్కండేయ మహాముని యట్టికల్పము లేడు సాగువఱకు బ్రదుకును. తొంబదియేనమంద్రు శతక్రతువులు మృతినొంద నాముని మృతినొందు. అంత నమ్ముని తనతపస్సునకు ఫలముగా శ్రీకృష్ణుని దాస్యము నొందును. బ్రహ్మప్రళయముదనుక లోమశుఁడను ముని యుండును. దిక్పాలురు చిరంజీవులు దీర్ఘాయుర్దాయము కలవారే యగుదురు. ఊర్ధ్వరేతస్సులగు మహర్షులకు రుద్రు

లకు నంత యాయుస్సు వెలయు. మృత్యుంజయుఁడ నగు
నన్ను వదలి రుద్రులను బరిగణింపుము. బ్రహ్మప్రళయముకాఁగా
శివలోకమున శివుఁడనఁ బరఁగుచునే నుందును. బ్రహ్మ ఫాలో
ద్భవుఁ డగుశంభుఁడు గలఁడు. శ్రీకృష్ణవామాంగసంభూత
యగురాధికయు దుర్గయు లక్ష్మియు సావిత్రీసరస్వతులు, నాది
త్యుఁడు లోనగువారును గల్పములు జీవించువారు. శాశ్వత
ముగా నుండువారిం దొక్కరుఁడును లేఁడు. శ్రీకృష్ణుఁడు సర్వ
దేవతలకు మూలరూపుఁడు మహారాజా! అట్టి శ్రీకృష్ణుని నీ
పుత్త్రుని శరణు వేఁడుమా. రాజసూయము నొనరింపుము.
యజ్ఞేశ్వరుఁడై యజ్ఞకారణుఁడై తగుహరిని భజింపుము. విధ్యు
క్తమగుదక్షిణ నొసంగి భవసాగరమును దాఁటుము. నీకు నీ
జన్మమున ముక్తి లేదు. కశ్యపమహర్షి వికదా. నీకీజన్మమునఁగృష్ణ
దాస్యము లభింపదు. దేవకి యదితికదా. భోగబీజమగు స్వర్గము
నకుఁ బొమ్ము. అమరాలయమగునది నీకు స్వస్థానమగు.

అని శంకరుఁడు తెలుపఁగా సంయతుఁడై వసుదేవుఁడు
శుభముహూర్తమున నెల్లర యాజ్ఞనొంది సంభృతవస్తు
వ్రాతుఁడై రాజసూయము నారంభించెను. దేవత లందే నిలిచి
తమతమహవిర్భాగములఁ దమరే గ్రహించిరి యజ్ఞేశుఁడగు
కృష్ణపరమాత్మ యందే యుండెను. అప్రాయశ్చిత్తముగ నాయ
జ్ఞము సాగఁగా శ్రీకృష్ణాజ్ఞచే సనత్కుమారుఁడు వసుదేవునకు
నీరీతిఁ దెలిపెను. వసుదేవా! సర్వస్వమును దక్షిణగ నొసం
గుము. వేవేగ యొనరింపుము. ఈమహాకర్మమును సార్థకముగ
నరింపుము. ఇది వేదోక్తమగువచనము. సకాలమున విప్ర
ప్రవరునకు దక్షిణనీయ వేని ముహూర్తకాలాతిక్రమణమున

నాదక్షిణ రెండింతలగును. ఒక్కదినము గడచినయెడల నాలు గింతలగును. మూఁడురాత్రు లాలసించిన నాఱింతలగును, పక్షాంతమున నూఱింతలగును. మాసాంతమున నయ్యది నాలు గింతలగును. ఆఱుమాసము లించుమించుగా నాలసించిన వేయి యింతలగును. సంవత్సరాంతమున నది లక్షగుణములగును. కర్త కర్తయుఁ బురోహితుఁడును దక్షిణ కొసంగనిచో నరకమునఁ బడుదురు.

ఆమాటలు సనత్కుమారునోటినుండి వెడలఁగనే సర్వ స్వమును ద్యజించెను. వాసుదేవాజ్ఞచే నాయాయధికారులకు నర్హమగురీతిని దక్షిణలనిచ్చెను. అమూల్యరత్నముల నొసం గెను. తొలుదొలుతఁ గులగురువగుగర్గాచార్యులకు నొసం గెను. పిదపఁ దక్కినయోగ్యులకు నర్హరీతిగాఁ దనకుఁగలరత్నా దుల నర్పించెను. ఎల్లరకు మృష్టాన్నమిడి సంతృప్తినిగల్గించెను. ప్రభాతమున వారెల్ల సంతృప్తులై పయనమునుసాగించిరి. యాద వులందఱు శ్రీకృష్ణానుమతినొంది ద్వారకానగరమున కరిగిరి. రుక్మిణ్యాదులు రాధామహత్త్వము నెఱింగి ద్వారకకుం బోయిరి.

## రాధకు శ్రీకృష్ణుఁడు తత్త్వోపదేశముచేయుట.

* ఈవిషయమును దెలిపి నారాయణమూర్తి నారదున కవ్వలివృత్తాంతము నిట్లు తెలిపెను. గణేశ్వరునిబూజించినతర్వాత శ్రీకృష్ణమూర్తి యాదవులంగూడి స్వాంశమున ద్వారక కరి గెను. తాను సిద్ధాశ్రమముననే యుండెను. తనయంశము రుక్మి

* ఈవిషయముకూడ లోపలియధ్యాయము తరువాతియధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

ణ్యాదులంగూడిపోవునట్లు లోనరించెను. గోలోకవాసులతో విశేషించి సంభాషించెను. తల్లిదండ్రులను బంధువర్గములను గాంచి యిట్లు పలికెను. తల్లిదండ్రులగు యశోదానందభూపతులారా! నందవ్రజమున కరుగుఁడు. అందవశిష్టభోగముల ననుభవించిగోలోకమునకుంబొండు. గోకులవాసులతోఁ గూడిపొండు.అందు మీకెల్ల సాలోక్యముక్తి ననుగ్రహింతును అనిపలికి ద్వారకనుండి తల్లిదండ్రుల యనుమతినొంది రాధాదేవిచెంత కరిగెను. నందాదులు గోకులమున కరిగిరి.

రాధ స్వ...నమున నాహారమును మానియుండెను. పండ్రెండువత్సరములయీడుగలిగి నవయౌవనస్ఫురణమునఁ దనరారుచుండెను. రత్నసింహాసనమున నాసీనయైయుండెను. గోపికలు పరిగణింప శక్యముగాక సేవించుచుండిరి. కొందఱు వేత్రహస్తలై యుండిరి. దూరమునుండి శ్రీహరి రాకంగాంచి రాధిక హర్షసంఫుల్లనయనారవింద యయ్యెను. శ్రీకృష్ణుఁ డత్తఱి శిశువేషమునుదాల్చి వేషము మనోహరమైకనంబడ సుస్మితము మోము నలంకరింప నవీనజలదశ్యాముఁడై పీతకౌ యవస్త్రమును దాల్చి చందనమలంది రత్నాలంకారశోభితాంగుఁడై మయూరపింఛము శిరమునఁ జెలఁగుచుండఁగా మాలతీమాల్యము మురువుసూపఁగా భక్తానుగ్రహవిగ్రహము వెలయఁగాఁ గ్రీడాకమలమును ద్రిప్పుచు మరళీనాదముఖరితదిక్తటుఁడై మనోహరమంగళాస్పదుఁడై కానఁబడియెను. శ్రీకృష్ణునింగాంచి నంతనే గోపికలంగూడి యెదురేగి సాదరముగా నమస్కరించి ...రితాత్మ యై యిట్లు వినుతించెను.

ప్రాణేశ్వరా! నాజన్మమిపుడు సఫలమయ్యెను. జీవితము

సుజీవితమయ్యెను. నీముఖచంద్రదర్శనమున నాలోచనములు మనస్సు సంతోషభరితములయ్యెను. పంచప్రాణములు తృప్తము లయ్యెను. పరమాత్మయు నాయందు సుప్రియుఁ డయ్యెను. శోకార్ణవమున మునింగియుంటిని విరహానలజ్వాలల చేఁదపించు చుంటిని. అమృతవృష్టిని గురియించు నీచూపులచేఁ దడపఁబడి హాయిచెందితిని. నిన్నుఁగూడిన నేను భక్తాభీష్టప్రదాత్రినగు దును. శివస్వరూపిణి నైతిని. నిన్నుఁగూడనియెడ నిశ్చేష్టురాల నగుదును. నీచెంతనుండిన నేకార్యమైనను జేయఁజాలుదును. అది లేనిచో నే నేకార్యము చేయఁజాలను. స్త్రీపురుషులకెడఁ బాటు సామాన్యముగా దారుణమగును. పరమాత్మవియోగ మున సర్వశక్తులు నశించును. అనిఁ బలికి పరమాత్మను శ్రీకృష్ణుని దనరత్నసింహాసనమునఁ గూరుచుండఁజేసెను. పాదముల నర్చిం చెను. రాధను బ్రక్కనఁ గూరుచుండఁజేసి శ్రీకృష్ణుఁడుం డెను. రాధిక రత్నహారమున శ్రీహరికంఠము నలంకరించెను. సకలో పచారముల నారాధించెను. రహస్యముగా మధురోక్తుల నిట్లు పలికెను.

సర్వమంగళనిధివగు నిన్నుఁగాంచి మంగళప్రశ్నము గావించుట వ్యర్థము. సర్వమంగళబీజభూతుఁడవు. మంగళ ప్రదుఁడవు ఐనను కుశలప్రశ్నము గావింతును. లౌకికవ్యవ హారము ననుసరించిచేసెదను. రుక్మిణీకాంతుఁడవు. సత్యభామా ప్రియుఁడవు. నీకుంగుశలమా? సత్యభామాజ్ఞచేతనేకదా నీవు దేవేంద్రునితో యుద్ధముచేసితివి. నందనవనమునుండి పారి జాతవృక్షమును బెకలించి దేవతలనోడించి దెచ్చితివని వింటిని. ఆపారిజాతమూలమునఁ బుణ్యకవ్రతము నాసత్యాదేవి యాచ

రించెను. నిన్నే యావ్రతాంతమున సంపూర్ణదక్షిణగా నొసంగెను. బ్రహ్మాశేషువులకు సాధ్యునిగాని నిన్ను నాసత్యయెట్లు సాధ్యునిగాఁజేసెనో తెలియఁజాలకున్నాను. ఎల్లకాంతలకంటె నెక్కుడు గారవమున నాసత్యను భావింతువుకదా. రుక్మిణియందుఁ గలప్రేమ సౌభాగ్యములకంటె మిన్నగా గారవమును బ్రేమను సత్యయందునిచి భయపడుచుందువు. సత్య యెంతటి యదృష్టవంతురాలోకదా. జాంబవతీప్రియుఁడా వాస్తవము తెలుపుము. వినఁగోరెదను. నీకుఁగల భార్యలయం దెవ్వతెయందు నెక్కుడు ప్రీతిగలదో తెలుపుము. శృంగారమందు సర్వభావమునందు నెవ్వతుక రసికురాలు. నీయందుఁ బ్రీతి యెవ్వతుక కెక్కుడు కలదు? నేర్పుగత్తె యెవ్వతుక? ధన్యురాలెవ్వతె? అతిసువ్రత యెవతె యగును? ఏకాంతభావానురక్తయెవ్వతెయో ఆభార్యనే పతి పాలించును స్త్రీపురుషులకుఁ బ్రేమాతిరిక్తవస్తువు ముల్లోకములయందును దుర్లభము. రసికురాలయి గుణవతియై యలరు నారీమణి పతికిఁ బ్రీతిపాత్ర మగు. గుణజ్ఞుఁడని, రసికుఁడని, శూరుఁడని, సుశీలుఁడని, రతియందు విదగ్ధుఁడని యానారియే పతి నెఱుంగఁగలదు. *మధువ్రతము మధువునందలి యాదరమునఁ బద్మార్థము దూరమునుండి పరుగెత్తివచ్చును. కప్ప పద్మగుణము నెఱుంగఁజాలక దానిమూర్ధమున నడుగిడును. యంత్రి సంగీతరసము నెఱుంగఁ

* దూరాద్ధావతి పద్మార్థం మధులోభాన్మధువ్రతః, భేకస్తన్నహి జానాతి తన్మూర్ధ్ని పాదముత్సృజేత్. ౫౧. యంత్రీ జానాతి సంగీతరసం యంత్రం చ నైవ చ, దుగ్ధస్వాదం విదగ్ధశ్చ న దర్వీ నైవభాజనమ్. ౫౨. అని మూలము.

గలఁడు. యంత్ర మెఱుంగఁజాలదు. విదగ్ధుఁడు రగుణముల
నెఱుంగఁగలఁడు. దర్వి(గరిటె)పాలలో నున్నను వానిగుణము
నెఱుంగఁజాలదు. పరిపక్వఫలములరసమును భోగు లెఱుంగు
దురు. చెంతనున్నను ఫలవృక్షములఁ బెంచువాఁ డెఱుంగఁ
జాలఁడు. సుశీతలజలాస్వాదమును కృషీవలు లెఱుంగఁగలరు.
బావియు ఘటము నెఱుంగఁజాలునా. ఏమహాపురుషుని వేద
ములు బ్రహ్మేశానాదులు యోగులు సిద్ధులు మునులు నెఱుం
గఁ జాలకున్నవారో యాపరాత్పరుని గాంతామణు లేమెఱుం
గుదురు? సౌభాగ్యము గౌరవము ప్రేమము దుర్లభము.
నిత్యము నూతనమే యగుచుండును. స్త్రీలకు వానినిమించిన
దేదియు లేదు. అత్యుచ్ఛ్రితమగునది పతనముం గాంచును.
అది ధ్రువము. వైష్ణవులకు హింసను గలిగించుట దూరమున
నాపదలు రాఁదలంచియుండుటచేతనే యని యెఱుంగవల
యును. భక్తవత్సలా! నీభక్తుఁడగు శ్రీదాముఁడు నన్నుశపిం
చెను. పుత్త్రునివంటి శ్రీదామునిశాపమున నా కిట్టివిపత్తు
కలిగెను. ఈశ్వరుఁ డెవరికిని బంధువు కాఁడు. ప్రియుఁడు
కాఁడు. విరోధియును గాఁడు. సర్వదా భక్తిసాధ్యుఁడే
యగును. ఎవ్వఁడు భక్తుఁడో వానికిఁ బ్రీతుఁడు. వేదములు
వైదికకర్మములు పురాణములు రాధకు మాధవుఁడు సాధ్యుఁ
డని పలికెడిని. అది వ్యర్థవాక్య యనఁదగును. ఈశ్వరు
నోడించి బాణాసురునిభుజముల ఛేదించి రుక్మిణీపౌత్త్రుఁడగు
ననిరుద్ధుఁ డుషాకన్యకతో శోణపురమునుండి నీచేఁ దేఁబడి
యెను నీ వీకార్యము నొనరించి రాఁగా రుక్మిణి యేమి సంభా
షించెను! ఎల్లరయందు నీకుఁ బ్రేమము సమానమేయని నమ్మ

వచ్చునా? కురుపాండవయుద్ధమునఁ గౌరవులు నిహతులైరి. పాండవపక్షపాతమున రాజులెల్ల వధింపఁబడిరి. పరమాత్మవగు నీకు నభిమాన మెల్లరయందును సమానమనుటకు నిదియు నొకయుదాహరణమేయగునా? ఇంద్రపుత్త్రుఁడగు నర్జునునకుఁ గుంతీపుత్త్రునకు రాజమండలమెల్లఁ గాంచుచుండ నీవేకదా సారథివైతివి? మహాభక్తుఁడగు భీష్ముఁడు నీకు లజ్జ పోడము నట్లు మహారాజులు వినుచుండ నేమని పలికెను? బ్రహ్మేశాన సంజ్ఞితులచే దేవతలయందును సమానగౌరవము చూపఁబడు చున్నదియేకదా?

మహాత్మా! శ్రీకృష్ణా! నాలుగువేదములయందును బురాణేతిహాసములందును బ్రకృతికంటెఁ బరుఁడీశ్వరుఁడనియే చెప్పఁబడుచున్నది. మఱియు నిర్గుణుండని నిరీహుండని సర్వకర్మములయందు నిర్లిప్తుఁడనియుఁ బేర్కొనఁబడుచున్నది. సర్వకర్మములకు సాక్షిరూపుఁడనియు భక్తానుగ్రహవిగ్రహుఁడనియుఁ జెప్పఁబడియెడిని. పరబ్రహ్మావనియుఁ బరంజ్యోతివనియుఁ బరమేశుఁడవనియుఁ బరాత్పరుఁడవనియుఁబరమాత్మవనియు వర్ణింపఁబడు నీవు పార్థసారథివైతివి. వృద్ధయగు కుబ్జయు క్షత్త్రియకామినియయ్యు నీచే ననుభవింపఁబడినది. మాతులుఁడగుకంసుఁ డేహేతువుచే నీచేఁ జంపఁబడియెనో. అని యిట్లనేకభంగులఁ బలికి పక్షపాతమున నన్నిన్నియేండ్లు వదలి పెట్టితివే యనుభావము తోఁపఁజేయుచు నారాధిక మిగుల విలపించెను. నిశ్వాసములను బుచ్చుకుండ నట్టె మూర్ఛిను. గవాక్షములకడనుండినగోపికలెల్ల నాపల్కులు వినిరి. ఆమె సోలుటఁ జూచిరి. తటాలున వచ్చి రాధిక మృతినొందె

నని తలంచి హరికింగూడఁ దెల్పిరి. ఆజననిని కౌఁగిలించుకొని బిట్టు రోదనముచేసిరి. ఓనరసింహా! మహాప్రభూ! శ్రీకృష్ణా! మా యీరాధాంబికను గాపాడుమాయని ప్రార్థించిరి. కృష్ణా! ఏమిచేసితి వేమిచేసితివి? నీచే మా రాధిక మృతినొందింపఁబడి యెనే. రాధను బ్రదికింపుము. నీకు దాన శ్రేయస్సుగలుగును. లేకున్న మేమడవులపా లగుదుము. నీవు పేక్షించిన స్త్రీహత్య నీయం దారోపింతుము గోపికలపలుకులు రాధికభాషణములు నాలకించి మాధవుఁ డమృతవర్షిణియగు దృష్టిచేత నా రాధాంబికను బ్రదికింపఁజేసెను. అంత నారాధ లేచెను. విలపించెను గోపిక లామెను బలుభంగుల నూఱడించిరి.

అప్పుడు శ్రీకృష్ణమూర్తి యిట్లు పలికెను. రాధా! నాయీయుపదేశము నాలకింపుము. అది జ్ఞానసారము. ఆధ్యాత్మిక మనంబడును. దాని నాలకించినంతనే మూర్ఖుఁడగుకృషీవలుఁడుకూడ నప్పుడే పండితుండగును. నేను జాతిచే జగములకు స్వామి నగుదును. రుక్మిణ్యాదినారీమణులమాట యేటికి? కార్యకారణరూపుఁడనుగా నేను నానారూపముల నుందును. విశ్వములకెల్ల నేనొక్కఁడనే యాత్మను. జాతిచే జ్యోతిర్మయుఁడను. వ్యక్తరూపమున నాబ్రహ్మస్తంబపర్యంతమును వ్యాపించియుందును. ఒక్కప్రాణి భుజింపఁగా వేఱొక్కప్రాణి తృప్తినొందదు. ఒక్కయాత్మ నానుండి వెడలిన వేఱొక మృతినొందిన ప్రాణి బ్రదుకును. జాతిచే నిపుడు కృష్ణరూపుఁడను. కానిపరిపూర్ణుఁడనుగా నెల్లతావులనుందును. గోలోకమునందు గోకులమునందును విశేషించి బృందావనమునందును ద్విభుజుఁడనై యుందును. గోపవేషుఁడను రాధానాథుఁడను. శిశురూప

ధారిని. గోపాలకులు గోపికలు కామధేనువులు నన్నాశ్రయింప నుందును. వైకుంఠమునఁ జతుర్బాహుఁడ లొప్పనుందును. లక్ష్మీసరస్వతీకాంతుఁడనై శాంతాకారుఁడనై. చెలంగుదు. సింధుకన్యయగు మహాలక్ష్మియనుపేర మాయ నాకు భార్యగా నందుండును. శ్వేతద్వీపమునందును రవారాశియందును జతుర్భుజుఁడనై యుందును. నేనే నారాయణమునిననియుఁ బిల్వఁబడుదును. ధర్మమే నరుఁడనఁబడును ధర్మమును బోధించుచు ధర్మము నాచరించుచు ధర్మప్రవర్తకుఁడనుగా నేనుందును. శాంతియే లక్ష్మీరూపమున ధర్మిష్ఠయై పతివ్రతయై నాకడ నుండును. పరమపావనక్షేత్రమగు భారతవర్షమున నాశాంతికిఁ బతినై యున్నవాఁడను. కపిలావతారుఁడను నేనే. సిద్ధేశుఁడను నేనే. సర్వసిద్ధిప్రదుఁడను నేనే *రాధాంబికా! వ్యక్తిభేదమున నానారూపములుగా నేనుండువాఁడను. చతుర్భుజుఁడనుగా నుండువాఁడను నేనే. ద్వారవతియందు రుక్మిణీపతినగుదును సత్యభామాగృహమున నుందును. పాలకడలి శయనించియుందును. అనేకరూపములఁ దక్కినకాంతల గేహములయందుందును. నారాయణముని నగు నేను పార్థసారథినైతిని. ఆపార్థుఁడు ధర్మపుత్త్రుఁడు మదంశజనితుఁడు. బలవంతుఁడు నగుపుష్కరక్షేత్రమునఁ దపస్సుచేసి నన్నారాధించి సారథిగా నుండ వరమొందెను. గోలోకమునందును గోకులమునందును రాధిక నగునీవే నాపత్నివి. నీవే వైకుంఠమున మహాలక్ష్మీసరస్వతీరూపముల నుందువు మర్త్యలోకమున లక్ష్మివి నీవే. పాలసముద్రమునఁ బవ్వళించిన నాకును బ్రియురాలవు నీవే యగుదువు.

* నానారూపధరోఽహం చ వ్యక్తిభేదేన సుందరి. అని మూలము.

ధర్మపుత్రవధువవు నీవే. శాంతివి లక్ష్మివి నీవే. కపిలముని కాంత యగు భారతివి నీవే మిథిలానగరమున సీతాఖ్యనుండినదియు నీవే. నీఛాయయే ద్రౌపదియునగు ద్వారవతిరుక్మిణివని పిలువఁ బడుచుందువు. పంచపాండవులకుఁ గళచేఁ బ్రియురాలగు ద్రౌపది వేఱుగాదు. నీవేసుమా. రావణుఁ డపహరించిన రామ పత్నివి నీవేకదా. ఛాయామాత్రమునఁ గళామాత్రమున నానారూపములఁ దాల్చుదానవు నీవే. నేను నీవలెనే నానా రూపములఁ దాల్చుచుందును పరిపూర్ణుఁడను. పరమాత్మను. పరాత్పరుఁడను నేనని నమ్ముము. రాధా! ఈయాధ్యాత్మికోప దేశమును గ్రహింపుము జగజ్జననీ! రాధా! నాసర్వాపరాధ ముల క్షమింపుము. పరమేశ్వరివికదా. అని శ్రీకృష్ణుఁడుప దేశింప నాలకించి రాధిక పరితుష్టురా లయ్యెను. గోపికలును దుఃఖముల వదలిరి. పరమేశ్వరుండగు శ్రీకృష్ణునింబొగడిరి.

మహాశయులారా! ఈ రెండుగాథలసారము నాలకింపుఁ డు. ఇందు విశేషము లేకపోలేదు. రాధాస్తుతి నాలకించినవసు దేవునకుఁ దత్త్వమెఱుంగువాంఛ గల్గెను. శంకరుని బ్రశ్నిం చెను. పుణ్యక్షేత్రముల సేవించితిని. పుణ్యనదీతోయముల మునింగితిని. దేవాలయములయందుఁ బాషాణరూపముల నుం డుదేవతల దర్శించితిని. దానిఫలము చిరకాలమునకుంగాని కలుగదు. మీరు భక్తులలో నుత్తములని నాభావము. కానఁ దరణోపాయ మనుగ్రహింపుఁడని ప్రార్థించుటయే యాప్రశ్న సారము. అనఁగాఁ బైవానినిసేవించుటకన్న సర్వవ్యాపకుండగు భగవంతుని త్తత్వ మెఱింగినభక్తుల నారాధించు టుత్తమమని దానినుండి గ్రహింపవలయును. ప్రశ్నమునకు బదులు చెప్పుచు

శ్రీకృష్ణునితత్త్వ మాతఁ డెఱుంగలేదని గ్రహించి దానిం దెలుపఁబూని యజ్ఞస్వరూపుఁడగు శ్రీకృష్ణుని రాజసూయ యజ్ఞ రూపమున నారాధింపుమనియెను. దానికి సర్వస్వము దక్షిణగా నీయవలయుననునియమముకలదు కావున నేదానిం జేయు మనియె. అశ్వమేధము చేయ నుపదేశింపలేదు. ఈయుపదేశసార మేమనఁగా సంసారసాగరమును దరించుట కడ్డుగానుండునది ద్రవ్యము. దానికి లోఁబడినవారెల్ల సాగరమున మునిఁగియే యుందురు. కాని దాఁటఁజాలరు. దానినివదలినవారు సుఖముగా శీఘ్రముగా దాని నుత్తరింతురు. వసుదేవునకు ద్రవ్యాశ పూర్ణముగాఁ దొలఁగినచో భగవత్తత్త్వ మెఱుంగు నవకాశము కలదు. లేనిచో నుండదు. అని యూహించియే యజ్ఞమును జేయఁబురికొలిపెను. ఈషణత్రయమున ధనము మానవులకుఁ బ్రధానము. పశువులకు సంతతిపై వాంఛ మెండు పక్షులకు భార్యపై మక్కువ మెండు. ఈ యీషణత్రయము ప్రతిప్రాణిని బంధించుచుండును. ఈమూఁడింటిని వదలినఁగాని తరించుమార్గముదొరకదు. ఏరూపముననైన ద్రవ్యమును సంపాదింపఁగుతూహలముండిన నది యాప్రాణి నదృశ్యపాశములబంధించి సంసార మహాసాగరమధ్యభాగమున ముంచి తేలకయుండ నొక్క మహాభారమును మోపునని మనము నమ్మవలయును. దేవతానిమిత్తమున నొండె, పరోపకారనిమిత్తముననొండె, ధనము నేకరించువా రాజన్మముననఁగాదు మఱొక్కజన్మముననఁగూడఁ దరింపఁజాలరు. వా రితరులఁ దరింపఁజేయఁబూనుట పరిహాసాస్పదము కాక వేఱేమగును? కావుననే శంకరుఁడు శ్రీహరి తండ్రికి రాజసూయముచేయు నూహకల్గించెను దాన శ్రీహరి సంతుష్టి

నొందునని తెల్పెను. సర్వస్వము దక్షిణగా నొసంగి యజ్ఞము పూర్తి చేసి వసుదేవుఁడు కృతకృత్యుఁడయ్యెను. కాఁబట్టి ధనాశ వదలుటయే గాక యున్న ధనము నెల్ల వ్యయించినఁగాని మనస్సు శాంతినొందదు. అది శాంతినొందినఁగాని భక్తినిశ్చలతనందదు. అట్టి దలవడినఁగాని భగవంతుని జేరు తలంపుపుట్టదు. అది పొడసూపినఁగాని పరమేశ్వరానుగ్రహము కలుగదు. అది కలిగినఁగాని తరింపఁజాలఁడు.

ఇఁక రాధామాధవులసంభాషణసారము నాలకింపుఁడు. రాధిక శాపకారణమున శ్రీహరివియోగము ననుభవించెను. ఆ పరితాపము వర్ణనాతీతము, ప్రకృతి కట్టిపరితాపము సత్యముగా లేకపోయినను లోకులకుఁ గర్మతత్త్వమును దెలుపుటకై యనుభవించునట్లు రాధిక నటించెనని మన మూహింపవలయును. ప్రకృతిపురుషులకు వియోగ మసంభవముకదా. దుష్కర్మ ఫలమెవ్వారికైన ననుభవింపక తప్పదనుటయే యిందలినీతి. నూఱు వత్సరములుకాఁగా హరి యామె చెంత కేగెను. ఆమె యేమని ప్రశ్నించెను? సత్యాదికామినులమాయలకు లోఁబడి నాగతి యేమైనది విచారింపకపోతివికదా యనునర్థమే యాప్రశ్నసారమనక తప్పదు. దానికిబదులు శ్రీహరి తెల్పెను. తాసర్వసాక్షియగుటయే దానిసారము. నిర్లిప్తునకుఁ బక్షపాతము కలదా యని తేటపఱచెను. ఆమె మదింగలపరితాపము నాపుటకే యధ్యాత్మవిషయము నుపదేశించెను. జాతిచే జ్యోతిర్మయుఁడనియె. జ్యోతిరాకారమే ధ్యానగమ్యమని యోగులతాత్పర్యము.

"తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చిర్విశ్వతోముఖః,

తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
స బ్రహ్మా స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్"

అని శ్రుతియు బోధించును గదా. భగవంతుని సాకారునిగా ధ్యానించుటకంటెఁ దేజోరూపునిగా ధ్యానించుటే యత్యుత్తమమని మనమెఱింగి యట్లొనరించి కృతకృత్యులము కావలయును. వేఱుమార్గము దీనినిమించినది కానరాదు. ఇట్టి మహారహస్యవిషయములఁ దెలుపు నీచరిత్రమును శ్రద్ధమై బఠించి దానిసారమెఱింగి యద్దాని ననుష్ఠానమున సార్థకముచేసి కృతార్థత నొందవలయును. ఇఁకఁ దరువాతి భగవచ్చరిత్రము నవధరింపుఁడు.

## రాధామాధవులు గోపలమును బ్రవేశించుట.

* శ్రీకృష్ణునియధ్యాత్మోపదేశమునఁ గలంకమాని రాధిక ప్రహృష్టురా లయ్యెను. సఖీకదంబము తమనెలవుల కిరిగెను. రాధిక కటాక్షవీక్షణముల హరిపైఁ బ్రసరింపఁజేసెను. పరమేశ్వరుఁ డాజగజ్జననిని జేరఁదీసికొని చింత వాపెను. ఆమెయు యు హరివక్షమున నుత్తమాంగముగదయించి యించుక శయనించెను. చిరకాలసశ్లేశనఫలమును వారిరువు రనుభవించిరి. మూర్ఛమునింగినట్లున్న యారాధిక యించుక తెలివొంది కోకిలరవము నాలకించి యులికిపడెను. పరాత్పరుని శ్రీకృష్ణునిం గాంచి పరమేశ్వరా! రాసమునకురమ్ము. పవిత్రబృందావనమున నించుక కాలముఁ బుత్తము. జలస్థలవిహారముల మనస్సంతోషము ననుభవింతము. బృందావనమున నిన్నుఁగూడి చరియింప

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండమున నూటయిరువదేడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

నిచ్చపాడ మెడిని. ఆవాంఛితమునుదీర్పుమాయనియెను- ఆపలు
కుల నాలకించి హరి యామెచిత్తము ననుసరింప నెంచెను.
ఆసంభాషణముననే తెల్లవాఱెను. ప్రాతఃకాలకృత్యములందీర్చి
రథము నధిష్ఠించి గోపికలు రాధికయు రాఁగా గోలోకమునుండి
తనవిహారమున కనుకూలముగ భూమి నలంకరించిన బృందావన
ముని కరిగెను. ఆబృందావనమునకు శతవత్సరములకుముందే
రాధంగూడి పోయియుండెను. అందు జలస్థలవిహారముల
నానందింపఁజేసెను. వనోపవనముల విహరించి రాధిక కావన
శృంగారమును గనఁబఱచెను లోకశృంగారములగు సర్వస్థల
ముల నందే కల్పించెను. ఎల్లద్వీపములఁ దిరిగినట్లే రాధికతలం
చెను. ద్వారకను గనఁబఱచి పవిత్రరైవతకాద్రిని జూపించి
గోకులము నా రాధికను జేర్చెను. ఖాండీరవనమును బృందావన
మును మరలఁ బ్రవేశించెను. యశోదయు నందుఁడును రాధా
మాధవు లరుదెంచుటఁ గాంచి వాష్పాశ్రుపూర్ణనేత్రులై యెదు
రేగిరి. వారలంగని మాధవుఁ డాదరించి యందు విడిసెను
ఆదంపతులు రాధామాధవుల నొకరమ్యహర్మ్యమున విడి
యించిరి. ఆయిరువురు పెద్దల బహూకరించిరి. రాధ గోపికల
కనేకభూషణాంబరముల నొసంగి గారవించెను. ఎల్లరు వారి
రాక కానందపరవశు లైరి.

మహాశయులారా! శాపవిముక్తినొందిన రాధాదేవి శ్రీ
హరిని గలసికొనియెను విరహదుఃఖముశాంతింప శ్రీకృష్ణుఁడా
జగదంబ నూఱడించెను మఱియు రాసక్రీడావినోదములం
దేలించి గోకులమున నామెంగూడి ప్రవేశించెను మరల రాధా
మాధవుల దర్శించుభాగ్య మాగోకులవాసులకుం గల్గెను.

వా రానందపరవశులై పరమేశ్వరీపరమేశ్వరుల సందర్శించు
చుండిరి. ఇఁకఁ దరువాతిచరిత్రమును బరిశీలింపుఁడు కృష్ణుఁడు
తనయవతారఫలమగు భూభారహరణమును దీర్చెను. ఇంక
భక్తత్రాణము చేయుటఁదప్పఁ దాఁజేయఁదగిన పనిలేదని యెంచెం
గెను. దాఁగలకలియుగమునఁ గొంతకాలము సర్వస్థలముల
యందును గొంతకాలమందందును దనభక్తుల నిలుపఁ బ్రయ
త్నించెను. ఆవిషయమే మీరు చదువఁదగినది. కేవలకథలుకాక
తన్మంత్రము, తదుపాసనక్రమము, తత్పూజాపద్ధతియు మీ రె
ఱుంగవలయును. కథలయందుఁ గలచమత్కృతి వేఱు ఈవిషయ
మునఁ గలచమత్కారము వేఱు కథలను బఠించి పఠించి శ్రీకృ
ష్ణుఁడు పరదైవమని భావించితిరి. ఆపరదైవము నారాధించు
టెట్టులనియే తెలిసికొనఁదగు అదియే తరణోపాయము. కథా
శ్రవణము మాత్రమే తరించుటకుఁజాలదు. తొలుదొలుతనదియే
మహోపకార మొనరించును. ఆవలఁ తత్త్వ మెఱుంగవల
యును. తత్త్వమనఁగా నిరంతరము భగవన్మహిమములఁ దలం
చుటయే యని కొందఱందురు. అది యలసులవాగ్ధోరణి. భగ
వన్మంత్రమును జపింపవలయు. దాన యోగసిద్ధియగు. యోగ
సిద్ధిలేక మంత్రసిద్ధి కాదు. ఈ రెండు నన్యోన్యాశ్రయదోషమున
కుదాహరణములు. అది తొలంగు టెట్లు? అని ప్రశ్నించు
కొని సమాధానమును విమర్శింపుఁడు. తొలుదొలుతఁ జంచల
మనస్సు నిలుకడఁగాంచుటకు మంత్రము జపింపవలయును.
అజపప్రభావమున ధ్యానశక్తి యలవడును. దానియభ్యాసబల
మున మనస్సు వరుసఁగా నిలుకడఁగాంచును. ఆశక్తి
మంత్రము జపింపవలయును. మనస్సు నిలుకడఁగాంచినతఱి

నొనరించుజపమే ఫలసిద్ధినిగల్గించును. తత్ప్రభావమున మనస్సు నిర్మలమగు. ఇట్లారెండింటి నభ్యసించినఁగాని భగవత్కరుణ గలుగదు. మంత్రమున కర్థమేమనఁగా మననమునఁ దరింపఁ జేయునదియనియే. మనస్సు నిశ్చంచలతఁ గాంచకయున్నను మంత్రమును గురుభక్తిగలిగి జపించినచో నయ్యది కొంతకాలమునకో చిరకాలమునకో మనోమాలిన్యమును దొలఁగించును. ఆవల నద్దాని వదలక యొనరించుచున్న మనశ్చాంచల్యము తొలఁగు. తర్వాత విడువక జపించిన నదియే పరమేశ్వరుని దర్శనలాభమును కల్గించును దానఁ దరించుకావునఁ దరణో పాయమున కాదిభూతమగు మంత్రమును దానినుపాసించు పద్ధతియు నాలకింపుఁడు.

## శ్రీకృష్ణమంత్రారాధనక్రమము.

* నారదమహాముని శివహానుమన్మంత్రపూజాదిపద్ధతుల నాలకించి సనత్కుమారునితో మునీంద్రా! తమవలన ననేక మంత్రముల నాలకించితిని. ఇంక నేనేమడుగవలయునో దానిని మీరే తెలుపుఁడు వేనినినాకునెఱిఁగించినఁగృతార్థుఁడనగుదునో మీరారసి యనుగ్రహింపుఁడు. నావిని సనత్కుమారుఁ డానందించి యిట్లుపలికెను. నారదా! శివహానుమన్మంత్రములను వాని విధుల నెఱింగించితిని. ఇఁక శ్రీకృష్ణమంత్రము నాలకింపుము. అది భుక్తిముక్తులఁ బ్రసాదించును. ఆ మంత్ర మొక్కవిధము కాదు. అనేక విధములుగ నుండును. దేనినుపాసించినను భగ

* ఈవిషయము బృహన్నారదపురాణమున నెనుబదియవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది. మఱియు నిది నారదసనత్కుమారసంవాదరూపమని గ్రహింపవలయుననియు మనవి.

వంతుఁడు సుప్రసన్నుఁడగును. బ్రహ్మాదులామంత్రముల నుపా
సించియే సృష్ట్యాదికార్యక్షములైరి.

## జపవిధి.

కకారము దానిపై నీకారము దానికి సంయుక్తముగా
లకారము చేర్చి యనుస్వారసహితముగా నుచ్చరింపవలయును.
అదియే కామబీజమని కామరాజబీజమనఁబడును. దానికిఁ జేరు
వఁగాఁ జతుర్థ్యంతముగ కృష్ణగోవిందపదముల నుచ్చరింపవల
యును. దానిపిఱుంద గోపీజనపదము దానివెంట "వల్లభాయ"
యనుపదమును దానితర్వాత నగ్నిభార్య నుచ్చరింపవలయును.
ఇది పదునెనిమిదియక్షరములుగల మహామంత్రమగును. దుర్గా
ధిష్ఠాతృదైవతముగలది యగును. దీనికి ముని నారదుఁడు
(నీవే) గాయత్రి ఛందస్సు. శ్రీకృష్ణపరమాత్మ దేవత. కామ
బీజమే బీజము. అగ్నిభార్యయే శక్తి. * చతుర్విధపురుషార్థ
సిద్ధియే వినియోగము. ఋషిని శిరస్సునఁ గనఁబఱుపవలయు.
ముఖమున ఛందస్సును, హృదయమున దేవతను, † గుహ్య
మున బీజమును, పాదములయందును శక్తిని గనఁబఱుపవల
యును. (అనఁగా న్యాసము చేయవలయునని భావము.) అంగు
ష్ఠాదులయందు వరుస బీజాదిపదములను విన్యసించి హృద
యాదిన్యాసము నట్లే చేయవలయును. పిదపఁ దత్త్వన్యా

* ఈమంత్రమునకు బీజశక్తులేకాని కీలకము చెప్పఁబడలేదని తెలియ
వలయును. దానిచే శాబరమంత్రమని గ్రహింపరాదు. పెక్కుతావులకు
మహామంత్రములకుంగూడ నీకీలకము లేకుండ నుండుట తంత్రములయం దగ
పడియెడి. † బీజము నాభియందని నియమము. ఇం దది వేఱుగాఁ జెప్పఁ
నది. కీలకములేనందున నని యెఱుంగవలయు.

సము చేయవలయును. ఆమీఁదఁ బ్రాణాయామము చేయవలయును. పూరకకుంభక రేచకముల నది చక్కఁగా నమరియుండవలయు. పీఠన్యాసము చేసి యింకను న్యాసఖండమునఁ జెప్పఁబడు వానింగూడఁ జేయవలయు. శక్తి లేకయున్న వానిని మానవచ్చును. సర్వాంగన్యాసము చేయవలయును. (శిరస్సు మొదలు పాదాంతము మూలమంత్ర ముచ్చరించుచుఁ బరిశుద్ధునిగాఁ దన్నుఁ జేసికొనునదియే సర్వాంగన్యాసమని సారము) రస్సు, లలాటము, భ్రూమధ్యము, హస్తములు, నేత్రములు, నాసికలు, ముఖము,కంఠము,హృదయము, నాభి, కటి,లింగము, జానువులు, పాదములు నను నీయవయవములయందు నమః ప్రభృతి మంత్రవర్ణములను భావింపవలయును. మరలశిరస్సునందును, నేత్రములయందును,ముఖమందును,హృదయమందును, గుహ్యమందును,పాదములయందును, మంత్రమునఁ గలపదములను భావింపవలయును. మరల ఋష్యాదికమును భావించి కరహృదయన్యాసమును బూర్వరీతిగాఁ జేయవలయును. మఱియు వి షన్యాసము లిందుఁగలవు. వానిని యథావకాశముగనే చేయవలయును. ఇట్లు న్యాసపద్ధతిఁ బరిపూతుఁడగు సాధకుని గాంచి సిద్ధగంధర్వకిన్నరులు దేవతలును నమస్కరింతురు. మానవులమాట యిటఁ జెప్పనేటికి? సుదర్శనమంత్రమున దిగ్బంధనము చేయవలయును.

ఆవల నభీష్టదైవమును హృదయకమలమున నిలిపి ధ్యానింపవలయును. ఆమూర్తిని ధ్యానమునఁ జెప్పఁబడిన ప్రకారము భావింపవలయును.

"ఉత్ఫుల్లకుసుమవ్రాతనమ్రశాఖై ర్వరద్రుమైః,

సస్మేయమంజరీబృందవల్లరీవేష్టనైశ్శుభైః. ౧
గళత్పరాగధూళీభిస్స్ఫురభీకృతదిఙ్ముఖః,
స్మరేచ్ఛిశిరితం బృందావనం మంత్రీ సమాహితః. ౨
ఉన్మీలన్నవకంజాళి విగళన్మధుసంచయైః,
లుబ్ధాంతఃకరణై ర్గుంజద్ద్విరేఫపటలైశ్శుభం. ౩
మరాళపరభృత్కీరకపోతనికరైర్ముహుః,
ముఖరీకృతమానృత్యన్మాయూరకులమంజులమ్. ౪
కాళింద్యా లోలకల్లోలవిప్రుషైర్మదవాహిభిః,
ఉన్నిద్రాంబురుహవ్రాతరజోభిర్ధూసరైశ్శివైః. ౫
ప్రదీతస్మరైర్గోష్ఠసుందరీ మృదువాససాం,
విలోలనసరైస్సంసేవితం వాతైర్నిరంతరం. ౬
స్మరేత్తదంతే గీర్వాణభూరుహం సుమనోహరం,
తదధస్స్వర్ణవేద్యాం చ రత్నపీఠమనుత్తమం. ౭
రత్నకుట్టిమ పీఠేఽస్మిన్నరుణం కమలం స్మరేత్,
అష్టపత్త్రం చ తన్మధ్యే ముకుందం సంస్మరేత్ స్థితం. ౮
ఫుల్లేందీవరకాంతం చ కేలిబర్హావతంసకమ్,
పీతాంశుకం చంద్రముఖం సరసీరుహనేత్రకమ్. ౯
కౌస్తుభోద్భాసితాంగం చ శ్రీవత్సాంకం సుభూషితం,
వ్రజస్త్రీనేత్రకమలాభ్యర్చితం గోగణావృతం. ౧౦
గోపబృందయుతం వంశీం వాదయంతం స్మరేత్సుధీః,
ఏవంధ్యాత్వా జపేదావయుతదయుత ద్వితయంబుధః."

ఈ తీగా ధ్యానించి కృతకృత్యత నొందఁజేయుమన్తా యని మంత్రము నిరువదివేల పర్యాయములు సమాహితాత్ముఁడు జపము చేయవలయును. ఆజపసంఖ్యలోఁ బదియవపా

లుగా నెంతసంఖ్యయగునో యన్ని రక్తారవిందములచే హోమ ముచేయవలయును. ఆవల సమాహితాత్ముఁడై మంత్రసిద్ధి కొఱకు లక్షపంచకము జపముచేయఁదగు. దాని దశాంశము ఎఱ్ఱనికమలములచే హోమముచేయవలయును. అపుడు మంత్రసిద్ధి వానికింగల్గును.

## పూజాపద్ధతి.

ఇఁకఁ బూజాపద్ధతి నాలకింపుము. విష్ణుపూజార్థ మలంకరించినపీఠమునందు భగవన్మూర్తిని సంకల్పించి యావేశింపఁజేసి ధ్యానప్రకార మామూర్తిని భావించి గోపీజనమనోహరుఁడగు నాభగవంతు నర్చింపవలయును ముఖమున వేణువును, హృదయమున వనమాలాకౌస్తుభ శ్రీవత్సములను, ధరించినట్లు ధ్యానించి పుష్పాంజలిని విడువవలయును. శ్వేతతులసీదళకల్పితహారమును శ్వేతచందనపంక మిళితముగను, రక్తతులసీదళ మాలికను రక్తచందన సంసిక్తముగ నొనరించి యర్పించి నమస్కరింపవలయును. ఆహారములను వరుసగ దక్షిణవామకరము లయం దలంకరింపవలయు. అట్లున్న యట్లు ధ్యానింపవలయును. శిరస్సునందు హృదయమునందు గన్నేరుపూలహారమునుసమర్పింపవలయు. పద్మద్వయమున శిరస్సలంకరింపందగు. పిదప సర్వాంగములయందుఁ దులసీదళద్వయమును బంకజయుగళమును, గన్నేరుపుష్పముల రెండింటిని మఱియుం గల పుష్పములను బూజింపఁదగు.

దక్షిణభాగమున శుద్ధసత్త్వప్రధానమగు వాసుదేవాఖ్యచైతన్యమును వామభాగమందు రజోగుణప్రధానరుక్మిణినునిచి ధ్యానించుట శాస్త్రసమ్మతము. ఇట్లు సామాన్యపద్ధతిం

బూజించి గోలోకమును భావించి యావరణార్చనము చేయవలయును తూర్పు మొదలగుదిక్కులయందు దామసు దాములను వసుదాముని గింకిణిని నిలుపవలయును. వారిపేరు లను జతుర్థీవిభక్త్యంతములుగా నుచ్చరించి పూజింపవల యును అగ్నికోణాదులయందు హృదయాదిదేవతల నారా ధింపవలయును. ఇది దిక్పూజ యనంబడు. ఆవలఁ జక్రపత్రి ములయందు మహర్షుల నారాధింపందగు. రుక్మిణియు సత్యభా మయు నాగ్నిజిత్తియు సువిందామిత్రవిందలు లక్ష్మణయు జాంబవతియు సుశీలయు ననుదేవతలను రక్తవర్ణవిచిత్రాంబర భూషితదేహవిరాజితలనుగా భావించి దిక్కులయం దావా హనముచేయవలయును. దళాగ్రములయందు వరుసఁగాఁ దూర్పుమొదలుకొని వసుదేవుని దేవకిని నందగోపుని యశో దను బలభద్రుని సుభద్రను గోపులను గోపికలను గోవిందవి లీనమతులనుగా ధ్యానించి యావాహనము చేయవలయును. జ్ఞానాభయముద్రలుగలవారలుగను బీతపాండురవర్ణులుగను దల్లిదండ్రుల భావింపవలయును. తల్లుల నిద్దఱను దివ్యమాల్యాం బరముల ధరించినట్లు తలంచి చరుపాయస పూర్ణపాత్రధారిణు లుగ జింతించి యరుణశ్యామల హారమణికుండల మండితలనుగ నాత్మ నెంచుచుఁ బూజింపఁదగు. బలదేవుని శంఖచంద్రధవళ వర్ణునిగను ముసలలాంగలాయుధునిగను హాలాలోలాంతరంగు నిగను నీలాంబరధరునిగను భావింపఁదగు. సుభద్రను శ్యామల వర్ణను భూషణవిశేషభూషితగను దలంపందగు. మఱియు వరా భయకరముద్రలఁదాల్చిపీతవస్త్రమును గట్టుకొనియారూఢయౌ వనమునఁ గనఁబడుచునుండురీతిని సుభద్రను ధ్యానింపవలయు

ను. గోపకులు గోపికలు వివిధమనోహరాన్నపూర్ణపాత్రముల ధరించికృష్ణపాదారవిందసంసక్తమనస్సుల నున్నయట్లుభావించుచుఁబూజింపవలయును. మందారాదికల్పవృక్షముల నాచక్రదళాగ్రములకడ నున్నయట్లు చింతింపఁదగు. మందారపారిజాతసంతానహరిచందనములని వానిపేరులు. ఇంద్రాదిదిక్పాలకులను వారియస్త్రములను నిలిపి యర్చింపవలయును. కృష్ణ వాసుదేవ దేవకీనందన నారాయణ వార్ష్ణేయ ధర్మపాలకాసురాంతక భూభారహారినామముల నష్టసంఖ్యల నుచ్చరించి పుష్పాంజలిం బట్టి ధ్యానింపవలయు. ఇది సంసారసాగరమును దాఁటఁగోరి ధర్మార్థకామమోక్షములను పురుషార్థములను బడయఁగాంక్షించి పూజించు నావరణపూజ యని యెఱుంగుము. ఈరీతి నారాధించి శ్రీకృష్ణపరబ్రహ్మకృపాపాత్రుఁడై సూర్యపుత్త్రుఁ డగుయముఁడు సిద్ధుఁడయ్యెను. ఇది నైమిత్తికపూజావిధానము.

## త్రికాలపూజావిధానము.

నారదమునీ! ఇఁకఁ ద్రికాలపూజావిధి నెఱిఁగింతు. ఆలకింపుము. ఆపూజ సర్వార్థసిద్ధిదమని యెఱుంగుము. ఉద్యానములనడుమ రత్నమండపమును భావించి కల్పవృక్షము క్రింద రత్నపీఠమునెంచి కమలాకారసింహాసనము నూహించి యింద్రనీలరత్నతుల్యతనువుగలిగి గుడస్నిగ్ధాలకవిరాజితుఁడై యొప్పుశిశువురూపం దుపవిష్టునిగాఁ జేసి

"చలత్కనకకుండలోల్లసితచారుగండస్థలం
సుఘోణధరమద్భుతస్మితముఖాంబుజం సుందరమ్,
స్ఫురద్విమలరత్నయుక్కనకసూత్రనద్ధం దధ

త్స్వవర్ణపరిమండితం సుభగపౌండరీకం నఖమ్. ౧
సముద్భాసరోరస్థ్సలే ధేనుధూల్యా
సుపుష్టాంగమష్టాపదాకల్పదీప్తమ్,
కటీలస్థలేచారుజంఘాంతయుగ్మం
పినద్ధం క్వణత్కింకిణీజాలదామ్నా. ౨
హసంతం హసద్బంధుజీవప్రసూన
ప్రభాపాణిపాదాంబుజోదారకాంత్యా
దధానం కరే దక్షిణే పాయసాన్నం
సుహైయంగవీనం తథా వామహస్తే. ౩
లసద్గోపగోపీగవాం బృందమధ్యే
స్థితం వాసవాద్యైస్సురైరర్చితాంఘ్రిం
మహీభారభూతామరారాతియూథాం
స్తతః పూతనాదీన్నిహంతుం ప్రవృత్తమ్." ౪

అని యీరీతి నాపరమేశ్వరుని ధ్యానింపవలయును పిదప సమాహితచిత్తుఁడై భగవంతుని బూజింపవలయును. దధిగుడ సహితాన్నములనైవేద్యము నొసంగి వేయిసారులు మంత్రము జపింపవలయును ఇది ప్రాతఃకాలపూజాప్రకారము. మాధ్యందినమున విశిష్టరూపధారినిగా హరిని ధ్యానింపందగు. నారదాది మహర్షులు దేవబృందములు పూజించుచున్నవానినిగా నారాధింపవలయును. ఇట్లు పూజ నెఱవేర్చి

"లసద్గోపగోపీగవాం బృందమధ్య
స్థితం సాంద్రమేఘప్రభం సుందరాంగం
శిఖండిచ్ఛదాపీడమబ్జాయతాక్షం
లసచ్చిల్లకం పూర్ణచంద్రాననం చ ౧

చలత్కుండలోల్లాసిగండస్థల
శ్రీభరం మందహాసం సునాసం
సుకార్తస్వరాభాంబరం దివ్యభూషం
క్వణత్కింకిణీజాలమత్తానుషం. ౨.
వేణుం ధమంతం స్వకరే దధానం
సవ్యేదరం యష్టిముదారవేషం
దక్షే తథైవేప్సితదానదక్షం
ధ్యాత్వార్చయేన్నందజమిందిరాప్త్యై." 3

అని ధ్యానించి శ్రీకృష్ణుని బూర్వప్రకారమే పూజింపఁదగును. అపూపపాయసాన్నాదుల నర్పించి నూటయెనిమిది పర్యాయములు ౹౹ రాన్నము నాజ్యసహితముగా హోమము చేసి యాయాదిగధిపతుల కాయాదిక్కులయందు బలిసమర్పించి యాచమనజలముల నిడి యష్టోత్తరసహస్రమును దదేకచిత్తుఁడై మూలమంత్రమును జపింపవలయు. మధ్యాహ్నకాలమం దీరీతిగా నెవ్వాఁడు భక్తిపురస్సరముగా శ్రీకృష్ణు నారాధించునో వానిం గాంచినంతన దేవతలు నమస్కరింతురు. లోకపూజ్యుఁడగును. మేధయు, దీర్ఘాయువు, శ్రీయుఁ, గాంతియుఁ గలుగు. పుత్త్రపౌత్రసమన్వితుఁడగు. ఇది మధ్యాహ్నపూజావిధానము.

## సాయంసమయపూజాపద్ధతి.

నారదా ! ఇఁక సాయంకాలపూజాపద్ధతి నాలకింపుము. ఈపూజయందుఁ గాలవికల్పన కలదు. సాయాహ్నమునందుఁ గాని నిశియందుఁగాని పూజింపవలయునని పండితులు కొందఱు పలుకుదురు. రాత్రియం దారాధించువారు దశాక్షరమంత్రము

జపింపవలయును. సాయంకాలమందుఁ బూజించువారు పదు నెనిమిదివర్ణములు గలమంత్రమును జపింపవలయును. మఱి కొందఱీవిషయమున నీరెండుమంత్రములలో దేనినైన నొక దానినిగాని రెండింటినిగాని జపింపవలయు నందురు. సాయం కాలపూజయందు ద్వారకానగరము విచిత్రోద్యానపరిశోభిత ముగఁ దలంచి యందు నెనిమిదివేలభవనోత్తమములచే నలం కృతముగ నుండునట్లు భావించి హంసాదిజలవిహంగరాజనిబిడ ము లగుసరోవరములు కమలకువలయాదికుసుమములచే నలరు చుండ నవి నగరముచుట్టు నున్నయట్లూహించి యందు భవన రాజమును దలంచి యుదయభానునికిరణములభంగి మెఱయు నవమణిమండపమునందు స్వర్ణపంకజాసనమున నాసీనుఁడగు శ్రీకృష్ణుని త్రైలోక్యమోహనాకారుని బూజింపవలయును పిదప,

"మునిబృందైః పరివృతమాత్మతత్త్వ వినిర్ణయే,
తేభ్యో మునిభ్యస్స్వం ధామ దిశంతం పరమాక్షరం. ౧
ఉన్నిద్రేందీవరశ్యామం పద్మపత్త్రాయతేక్షణమ్,
స్నిగ్ధం కుంతలసంభిన్నకిరీటవనమాలినం. ౨
చారుప్రసన్నవదనం స్ఫురన్మకుటకుండలం,
శ్రీవత్సవక్షసం భ్రాజత్కౌస్తుభం సుమనోహరం. ౩
కాశ్మీరకపిశోరస్కం పీతకౌశేయవాసనం,
హారకేయూరకటకకటిసూత్రైరలంకృతం. ౪
హృతవిశ్వంభరాభూరిభారం ముదితమానసం,
శంఖచక్రగదాపద్మ రాజద్భుజచతుష్టయం." ౫

౩ - సమాహితచిత్తమున ధ్యానించి పూజింపవలయును. అంగ

దేవతలతోఁ బ్రథమావరణమును, పట్టపుదేవీసహితముగ ద్వితీయావరణమును, నారద పర్వత జిష్ణు నిశఠోద్ధవదారుక విష్వక్సేనశైనేయులతోడఁ దృతీయావరణమును, వినతాతన యునితోఁ బురోభాగమును లోకపాలకులు తదాయుధవిశేష ములు తలంచి దిక్కులను బూజింపవలయును. ఆవలఁ బాయస మును నైవేద్యముగా నర్పింపవలయును. శర్కరమిశ్రితదుగ్ధ బుద్ధిచే జలములచేతనే తర్పణము చేయవలయును. భగవంతుఁ డగు పురుషోత్తముని ధ్యానించుచు నూటయెనిమిదిసారులు మూలమును జపింపవలయును. ఎల్లపూజలయందు మధ్యాహ్న ముహోమము చేయవలయును. వలనుపడనిచో నర్ఘ్యపర్యం తముపూజించి స్తుతించి నమస్కరించినంజాలు. పూజాంతమునఁ దన హృదయకమలాంతరమున నుద్వాసనము చేసికొనవలయు ను. తన్నుఁ దన్మయునిగా ధ్యానించి తన్నుఁ దాఁబూజించు కొనఁదగు.

సాయంకాలమున శ్రీవాసుదేవు నీరీతిఁ బూజించుచున్న మానవునకు సర్వవాంఛలు ఫలించును. అంతమున భగవత్ప్ర దము నొందునదృష్టము గలుగును. రాత్రియందుఁ గ్రీడా సక్తచిత్తుఁడగు నందనందనుని రాసకేళీపరిశ్రాంతుని గోపీమండ లాంతరస్థుని బూజించి ధ్యానించుపద్ధతి నాలకింపుము.

"వికసత్కుందకహ్లారమల్లికాకుసుమోద్గతైః,
రజోభిర్ధూసరైర్మందమారుతైః శిశిరీకృతే. ౧
ఉన్మీలన్నవకైరవాళివిగళన్మాధ్వీకలబ్ధాంతరం
భ్రామ్యన్మత్తమిళిందగీతలలితే తన్మల్లికోజ్జృంభితే,
పీయూషాంశుకరైర్విశాలితహరిత్ప్రాంతేస్మరోద్దీపనే

కాళిందీపులినాంగణే స్మితముఖం వేణుం రణంతం ముహుః
అంతస్తోయలసన్నవాంబుదఘటాసంఘట్టకారత్విషం
చంచచ్చిల్లికమంబుజాయతదృశం బింబాధరం సుందరం,
మాయూరచ్ఛదబద్ధమౌళివిలసద్ధమ్మిల్లమాలం చలం
దీప్యత్కుండలరత్నరశ్మివిలసద్గండద్వయోద్భాసితం. 3
కాంచీనూపురహారకంకణలసత్కేయూరభూషాన్వితం
గోపీనాం ద్వితయాంతరే సులలితం వన్యప్రసూనస్రజం,
అన్యోన్యం వినిబద్ధగోపదయితా దోర్వల్లవీతం లస
ద్రాసక్రీడనలోలుపం మనసిజాక్రాంతం ముకుందం భజే.
వివిధశ్రుతిభిన్నమనోజ్ఞతర
స్వరసప్తకమూర్ఛనతానగణైః,
భ్రమమాణమమూభిరుదారమణి
స్ఫుటమండనసింజితచారుతనుం. ౫
ఇతరేతరబద్ధకరప్రమదా
గణకల్పితరాసవిహారవిధౌ,
మణిశంకుగమప్యమునా వపుషా
బహుధా వివిధస్వకదివ్యతనుమ్." ౬

అని ధ్యానింపవలయు. అంగదేవతా సహితముగాఁ బూజింపవలయును. శ్రీకామునిదైనసాధకుఁడు సస్వరప్రథమ బీజములుగా నుచ్చరించి పూజింపవలయును. కేశవకీర్త్యాది మిథునములను, బదాఱునామములను, వజ్రి మొదలగు దేవతలను వరుసగాఁ బూజింపవలయును. రాసగోష్ఠి గొప్పదై వర్తులాకారమై సుందరమై ద్వాదశాంగుళమాత్ర మున్నతము లగయుండును. అందు నన్యోన్యపాదంబులంగలుపుచు నిత

రేతరహస్తములంబట్టుకొని నృత్యముచేయుదురు. అట్టి రాస గోష్ఠియం దాపరమాత్మ యున్నచందమును భావించుచు నర్చింపందగు. శర్కరాసహితపయస్సును నేతినిగూర్చి నైవేద్యమిచ్చి సెనగలు పక్వముచేసి యర్పించి పాయసము నారాసగోష్ఠియం దున్నదంపతులకు వరుసగా సమర్పించి పూర్వోక్తరీతి నవశిష్ట కార్యమును సాగించి సహస్రవారములు మంత్రమును జపింప వలయు. సకలవిధోపచారముల నారాధింపవలయును. ఇట్టులు పూజించి యెవ్వఁడా శ్రీకృష్ణు నారాధించునో యతఁ డుత్తమ పద మొందును. అణిమాద్యష్టసిద్ధుల కధిపతియగు సకలభోగ ముల ననుభవించి విష్ణుపుకడఁజేరును ఈరీతి బూజావిధానా దులచే భగవంతు నారాధించి సిద్ధుఁడై కామ్యముల సాధింపఁ బూనవలయును.

## ఇష్టములను సాధించుపద్ధతి.

త్రికాలములయందు నిరువదెనిమిది పర్యాయములు శ్రీకృష్ణుని బూజింపవలయును. తొలిజామున బెల్లముదధియుఁ గలిపిన నైవేద్యము, మధ్యాహ్నకాలమునఁ బాలువెన్నయు, సాయంకాలమునందు శర్కరయుఁ బాలును గలిపియు నైవే ద్యము సమర్పింపఁదగును ఆయాయినామములతుదిని "తర్ప యామి" అనుపదముజేర్చి నామమును ద్వితీయాంతములుగా నుచ్చరించుచుఁ దర్పణముచేసి పూజాశేషమును బూర్తిచేయ వలయును. ఆయభిషేకోదముల శిరస్సునఁ జల్లుకొని కొంత జలముత్రాగవలయును. దాన సంతృప్తినొంది సవిధిగఁ బూజా విధానము నొనరించి "కృతార్థోఽస్మి" యనుకొనుచు మంత్ర మును జపింపవలయును. కామ్యకర్మములయందు ద్రవ్యము

లెట్టివి కావలెనో వినుము. వానిని సేకరించి యుపాసింపఁదగు నని శాస్త్రమర్యాద కలదు. పాయసము, దధ్యన్నము, ఆజ్యము, గుడాన్నము, కుసరము, పాలు, దధియుఁ, గదళీఫలము, మోచాఫలములు, చించానామపదార్థము, అపూపములు, మోదకములు, పేలాలు, అడుకులు, వెన్నయు, రజస్స్వలయు నను నీపదాఱు వస్తువులు యోగ్యములు. లాజలు నడుకులు కలిపి శర్కరచేర్చి డెబ్బదినాలుగుపర్యాయములు ప్రాతఃకాలమునఁ దృప్తిచేయవలయును. ధ్యానమునందు శ్రీకృష్ణపదమున బుద్ధినిలిపి యీరీతి నలువదిదినము లారాధించిన మనోరథమును బొందును. ధారోష్ణపక్వపయస్సులచే వెన్నను దధినాజ్యమును గలిపి మత్స్యండియు క్షౌద్రము కీలాలము ననువీనిని దొమ్మిదివస్తువులను నొక్కొక్కదానిని బండ్రెండుసారులు సమర్పించుచు నూటయెనిమిదిసారులు శ్రీకృష్ణుని దృప్తునిజేసిన నలువదిదినముల కభీష్టములంబడయును. విశేషించి వర్ణింపనేల? నారదా! ఈతర్పణము సర్వాభీష్టప్రదాయకమని నమ్ముము. శర్కరాధారోష్ణమిశ్రితదుగ్ధబుద్ధిచే జలములచేతనే శ్రీహరికిఁ దర్పణక్రియ నొనరించిన గ్రామము వ్రజము లభించును. ధనవస్త్రములను భోజ్యమును బరివారదేవతలతో శ్రీకృష్ణుని బూజించి సాధకుఁడు తత్సంఖ్యాతుల్యసంఖ్యచే మంత్రమునుజపింపవలయును. తర్పణముచేతనే సకలకార్యములు సాధింపవచ్చును. సాధకులకు హితముఁగోరి హోమవిధిఁ జెప్పెద.

### కామ్యహోమవిధానము.

శ్రీపుష్పములచే హోమముచేసి న్యాయముగసంప గోరినఁ గల్గు. సాజ్యాన్నమున హోమముచేసిన నన్నసమృద్ధియు

బాఁడియుఁ జేకూరు. వన్యపుష్పహోమము విప్రవశీకరణమున
కును, జాతీకుసుమహోమము నృపాలవశీకరణమునకును, అసిత
ప్రసవహోమము వైశ్యవశీకరణమునకును, నల్లఁ గలువలచే
హోమము శూద్రవశీకరణమునకును బనికివచ్చును లవణహో
మము సర్వవశీకరణక్రియకు నుత్తమము. కమలపుష్పముల
హోమము యువతీజనవశీకరణము నొనర్చును. సర్పిస్సుతోఁ
గలిపినపాయసముచే గోశాలలయందు హోమముచేసిన గోవు
లవ్యాధుల నడంచి శాంతిని గల్పించును. గోసమృద్ధియుఁ గలు
గును. విద్యార్థివేషమును ధరించిన శ్రీకృష్ణుని గింకిణీజాలశోభి
తునిగా ధ్యానించి దుగ్ధబుద్ధిచే నిర్మలజలములఁ దర్పణము చేసిన
ధనధాన్యములు కీర్తియు సుపుత్త్రులుగలుగఁ బరమాత్మయను
గ్రహించును. బ్రహ్మవృక్షసమిధలచేతఁగాని దర్భలచేతఁగాని
తిలతండులములచేతఁగాని పదివేలసారులు త్రిమధువులఁగలిపి
హోమముచేసిన విప్రులు లోఁబడుదురు. రాజవృక్షకుసును
ములచేత హోమముచేసిన క్షత్త్రియులు, కురండకుసుమముల
హోమముచేసిన వైశ్యులు, పాటలకుసుమములచేత హోమము
చేసిన శూద్రులు వశ్యులగుదురు. శ్వేతపంకజములు. రక్తవర్ణ
పద్మములు చంపకములు పాటలకుసుమములు త్రిమధువులఁ
గలిపి పదివేలసారులు హోమముచేసినయెడల వారికాంతలు
లోఁబడుదురు. ప్రతిదినము గన్నేరుపూవులను ద్రిమధువుల
తోఁజేర్చి నిశీథమున హోమముచేసి దినాష్టకము నీరీతిగడపిన
సర్వప్రజావశీకరణదక్షుండగును. సిద్ధార్థపుష్పములు త్రిమధు
వులంగలిపి ముప్పదివేలసారులు రాత్రియందు హోమ మొక
మాసము వదలక యొనరించిన నింద్రుఁడుకూడ వశుఁడగును.

గోపికలవస్త్రముల సంగ్రహించి నీపవృక్షము నెక్కియున్న శ్రీహరిని ధ్యానించి సోమవారము రాత్రి వేయిసారులు మంత్రముజపించినఁ దటాలున నూర్వశియైనను లోఁబడివచ్చును. విశేషించి చెప్పనేల? ఈమంత్రము సర్వవశ్యకరము. పరమ రహస్యము. మానవులకు మోక్షము ననుగ్రహించునదియు నగు.

శ్రీమత్కుందేందుగౌరం సరసిజనయనం శంఖచక్రేగదాబ్జే
బిభ్రాణం హస్తపద్మై ర్నవనళినలసన్మాలయాదీప్యమానం,
వందే వేద్యంమునీంద్రైః కణికమునిలసద్దివ్యభూషాభిరామం
దివ్యాంగాలేపభాసం సకలభయహరం పీతవస్త్రం మురారిం.

అని ధ్యానించి హృదయకమలమధ్యభాగమున నాసీనుం జేసికొని పంద్రెండులక్షలు జపించి జిల్లేడుసమిధలను బాలుగలుగువానిని హోమము చేసినను, లేక సమధుఘృతసితయుక్త పాయసమున హోమము చేసినను,మనువులలో నొక్కఁడగును.

ఇట్లే లోకేశ్వరారాధ్యుఁడగు శ్రీకృష్ణుని స్వకీయహృదయారవిందమునందు నిలిపి ప్రతిదినము ధ్యానించుచు మూఁడు వేలుమంత్రజపము చేసి సాయంకాలమునఁ జెప్పఁబడినవిధానమునఁ బూజించి హోమము చేసి తద్గతమానసుఁడై యారాధించిన సంసారసాగరము నుత్తరించి పరమపదము నొందును. కామరాజబీజమును దొలుతఁజేర్చి చతుర్థ్యంతముగ శ్రీకృష్ణ శబ్దము నుచ్చరించి నమశ్శబ్దము నుచ్చరించిన షడక్షరమంత్ర మగును. సర్వసిద్ధికరము. పదునెనిమిదక్షరమంత్రమునందు గోవిందశ్రీబీజములఁ జేర్చిన నిరువదక్షరముల మంత్రమగును. పాలగ్రామమునందును, మణియందును, యంత్రమునందును,

మండలాకారవస్తువునందును బ్రతిమలయందు నిందు దేనియం
దైనను భగవంతు నావాహనముచేసి. హరిపూజచేయవలయు
ను. అంతియకాని కేవలభూతలమున భావించి పూజింపరాదు.
ఎవ్వఁ డీరీతి నారాధించునో వాఁడు పరమపదము నందును.
ఇరువదక్షరములుగలమంత్రమునకు ముని బ్రహ్మ యగును. ఛం
దస్సు గాయత్రియగు. శ్రీకృష్ణుఁడు దేవత. కామబీజము తక్కి
నవి పూర్వమునందువలె గ్రహింపవలయును. *ఈరీతిగా భగ
వంతు నారాధించి కృతకృత్యుఁడు కావలయు. నారదమునీ!
నీప్రశ్నమునకు బదులు పల్కితిని. మంత్రప్రకారము లోనగు
వానిం దెల్పితిని. ఇంక నొక్కవిషయము నాలకింపుమని యి
ట్లనియె.

## రాధాకృష్ణసహస్రనామములు.

†మునిచంద్రా! నారదా! పూర్వజన్మవృత్తాంతమును
మఱచితివా? భగవంతుఁడగు శంకరునివలన యుగళాత్మకమయి
పరమపావనమగు శ్రీకృష్ణసహస్రనామస్తోత్రము నీకు లభింప
లేదా? దాని నించుక స్మరింపుము. అని సనత్కుమారముని
పలుకగనే ధ్యానయోగమున నారదుఁడు పూర్వజన్మచరిత్రము
నెఱింగెను. చాలసేపు ధ్యాననిష్ఠనుండి సర్వవృత్తాంతమును
దెలిసికొని ప్రసన్నవదనుఁడై యిట్లుపలికెను. మహాత్మా! పూర్వ

ఇందనేకమంత్రములు గలవు. వానినెల్ల వ్రాయఁబూనలేదు. ప్రధాన
మంత్రమును నిహితమగు తత్పూజనువ్రాసితిని. ఈవిషయమును పాఠకమహా
శయులు గ్రహింపవలయును. ఎనుబదియొకటవయధ్యాయమునందు ననేక
మంత్రము లున్నవనియు గ్రహింపవలయును. † ఇదియు బృహన్నారద
పురాణమున నెనుబదిరెండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

జన్మవృత్తాంతమెల్ల నవగతమైనది. కాని యుగళాత్మకస్తుతి మాత్రము గోచరింపదు. అని నారదమునివర్యుఁడు చెప్పఁగా సర్వజ్ఞుఁడగు నాసనత్కుమారమునిచంద్రుఁ డిట్లు పలికెను. నారదమునీ! నీప్రాగ్జన్మమున శంకరప్రసాదలబ్ధమగు సహస్ర నామస్తోత్రమును వివరించెదను. వినుము. ఇది సారస్వత కల్పము. లోపల నిరువదైదవకల్పమున నీవు కాశ్యపుఁడవై యుంటివి. పేరు నారదుఁడనియే యుండెను. ఒకానొకప్పుడు నీవు కైలాసమున కరిగి శంకరునిదర్శించి శ్రీకృష్ణయోగీశ్వరుని పరమతత్త్వమును బ్రశ్నింపఁగోరితివి. ఆపరమేశ్వరుఁడు శ్రీహరి నిత్యలానుస్తోత్రము నుపదేశించెను. మరల నీవు నిత్య లీలాస్తుతి నెఱింగింపుమని కోరితివి. ఆపరమశివుఁడు నీ కద్దాని నిట్లుపదేశించెను.

నారదా! వినుము. గోపీజనపదముచెంత వల్లభపదము నుచ్చరించి 'శరణం ప్రపద్యే' యనుమాటను జేర్పుము. ఇదొక మంత్రమగును. దీనికి సురభి ముని, ఛందస్సు గాయత్రి, వల్లవీ వల్లభుఁడు దేవతయగు. 'ప్రపన్నోస్మి'యనునది వినియోగము. ఈమంత్రమును సిద్ధారిచక్రమును శోధించి పరిగ్రహింప నక్కఱలేదు. కరహృదయాదిన్యాసకల్పన మక్కఱలేదు. నిత్య లాప్రకాశకమగు నీచరిత్రమునే పఠింపందగును. ఇది గైకొని సాధకుడు మనస్సునఁ జేయఁదగుధర్మముల నెఱింగింతును. ఈ మంత్రమును గ్రహించి గురుభక్తియుక్తుఁడై మనస్సున నామహాపురుషుని ధ్యానించుచుఁ దదీయకృపనుగోరి నిజధర్మమునే యాశ్రయించి పరాత్పరునే తలంచుచు నీస్తోత్రమున సంతోషపఱుపవలయు. ప్రపన్నుల భయమును దొలఁగించు

ధర్మములనెఱుంగవలయు. ఐహికాముష్మికచింతావిధురులై సిద్ధి దాయకులగు విష్ణుభక్తుల నారాధింపవలయు. వారిని గసరుట లోనగుదుష్కార్యముల నెంతమాత్రము చేయరాదు. పూర్వ కర్మము ననుసరించి యైహికాముష్మికములను దానెఱింగి యా శ్రీహరి యొసంగును. సాదకుఁ డెల్లప్పుడు నిత్యలీలాస్థితుఁడగు శ్రీకృష్ణుని స్మరించుచుండవలయును. అర్చావతారమున హరిని బరిచితునిగఁ జేసికొనుచుండవలయును శరణార్థులై ప్రపన్ను లగువా రితరదేవతలఁ జింతింప నక్కఱయుండదు. దేహగేహా దులయం దుదాసీనుఁడై భక్తుఁడుండవలయును. [1] గురువులఁ దిరస్కరించుట, సాధునిందయు, హరిహరులకు భేదము గలదనుటయు, వేదములదూషించుటయు, హరినామము లర్థ వాదములనుటయు, పాషండాచారముల నంగీకరించుటయు మంచివిగావు. అలసునకు నాస్తికునకు హరినామోపదేశము చేయరాదు భక్తుఁడు భగవన్నామముల మఱువరాదు. వానియం దనాదరము చూపరాదు. అట్లు చేయువారిని దూర ముగా వదలవలయును. ఈచెప్పినవన్నియు దారుణమహా దోషములు. హృదయకమలస్థితుఁడగు హరిని ధ్యానించి "ప్రపన్నోఽస్మి" యనవలయు. ఆశ్రీహరియే నన్ననవరతము కాపాడునని యూహింపవలయు. రాధికానాథా! మనోవా క్కర్మములచేత నీయందు రాధికయందును భక్తుఁడ నైతిని. మీరే నాకు దిక్కు. శ్రీహరిదాసులు మిత్రులు పితరులు ప్రియు రాండ్రు సర్వదా స్మరింపఁదగుదురు. హరిసఖులు పండ్రెండు

[1] గురోరవజ్ఞాం సాధూనాం నిందాం భేదం హరేహరౌ అని మూలము.

గురు శ్రీమాదులుగలరు. రాధికకు సుశీలా ప్రభృతికాంతలు ముప్పదిరెండుసంఖ్యచేఁ బరిగణింపఁదగినవారు కలరు. సాధకుఁడు తనను వారినడుమ మనోహరాంగముగల్గినరూపయౌవన సంపన్నురాలినిగను కిశోరిగను నానాలంకారభూషితగను నానాశిల్పకలాభిజ్ఞగను, కృష్ణభోగానురూపిణిగను, తత్సేవన సుఖాహ్లాదభారమున మిక్కిలి తృప్తిగలదానినిగను జింతింప వలయును. బ్రాహ్మముహూర్త మారంభించి యర్ధరాత్రమగు దనుక నాయాకాలానుసారమున రాధామాధవుల నారాధింప వలయును. ప్రతిదినము తన్నామసాహస్రనామస్తోత్రమును బఠింపవలయును. *ప్రపన్నులకు నిష్టార్థసిద్ధికై యిది నిర్దేశింపఁ బడినది. నీవెవ్వనికి దీనిం జెప్పకుము. రహస్యతత్త్వమును

---

## శ్రీరాధామాధవసహస్రనామస్తోత్రమ్.

*శ్లో. దేవకీనందనశ్శౌరిర్వాసుదేవో బలానుజః, గదాగ్రజః కంసమోహః కంససేవకమోహనః. ౧. భిన్నార్గళో భిన్నలోహః, పితృబాహ్యః పితృస్తుతః, మాతృస్తుతశ్శివధ్యేయో యమునాజలభేదనః. ౨. వ్రజవాసీ వ్రజానందీ నందబాలో దయానిధిః, లీలాబాలః పద్మనేత్రో గోకులోత్సవ ఈశ్వరః. ౩. గోపికానందనః కృష్ణో గోపానందస్సతాం గతిః, బకప్రాణహరో విష్ణుర్బకముక్తిప్రదో హరిః. ౪. బలదోలాశయశయ శ్శ్యామలస్సర్వసుందరః, పద్మనాభో హృషీకేశః క్రీడామనుజబాలకః. ౫. లీలావిధ్వస్తశకటో వేదమంత్రాభిషేచితః, యశోదానందనః కాంతో మునికోటినిషేవితః. ౬. నిత్యం మధువనావాసీ వైకుంఠస్సంభవః క్రతుః, రమాపతిర్యదుపతిర్మురారిర్మధుసూదనః. ౭. మాధవో మానహారీ చ శ్రీపతిర్భూధరః ప్రభుః, బృందావనమహాలీలో నందసూనుర్మహాసనః. ౮. తృణావర్తప్రాణహారీ యశోదావిస్మయప్రదః, త్రైలోక్యవక్త్రః పద్మాక్షః పద్మహస్తః ప్రియంకరః. ౯. బ్రహ్మణ్యో

ఛాత్రభూతుఁడవని నీకుం దెల్పితిని. నీవు తొలిజననమున శంకరు నడుగ నమ్మహాదేవుఁ డిట్లుపలికెను. మునీ! నామ

ధర్మగోప్తా చ భూపతిశ్శ్రీధరస్స్వరాట్, అజాధ్యక్షశ్శివాధ్యక్షో ధర్మాధ్యక్షో మహేశ్వరః. ౧౦. వేదాంతవేద్యో బ్రహ్మస్థః ప్రజాపతిరమోఘదృక్, గోపీకరావలంబీ చ గోపబాలకసుప్రియః. ౧౧. బాలానుయాయీ బలవాన్ శ్రీదామప్రియ ఆత్మవాన్, గోపీగృహాంగణరతిర్భద్రస్సుశ్లోకమంగళః. ౧౨. నవనీతహరో బాలో నవనీతప్రియాశనః, బాలబృందీ మర్కబృందీ చకితాక్షః పలాయితః. ౧౩. యశోదాతర్జితః కంపీ మాయారుదితశోభనః, దామోదరోఽప్రమేయాత్మా దయాళుర్భక్తవత్సలః. ౧౪. సుబద్ధోలూఖలే నమ్రశిరా గోపీకదర్థితః, వృక్షభంగీ శోకభంగీ ధనదాత్మజమోక్షణః. ౧౫. దేవర్షివచనశ్లాఘీ భక్తవాత్సల్యసాగరః, వ్రజకోలాహలకరో వ్రజానందవివర్ధనః. ౧౬. గోప్తాత్మా ప్రేరకస్సాక్షీ బృందావననివాసకృత్, వత్సపాలో వత్సపతిర్గోపదారకమండనః. ౧౭. బాలక్రీడో బాలరతిర్బాలకః కనకాంగదీ, పీతాంబరో హేమమాలీ మణిముక్తావిభూషణః. ౧౮. కింకిణీ కటకీ సూత్రీ నూపురీ ముద్రికాన్వితః, వత్సాసురపతిధ్వంసీ బకాసురవినాశనః. ౧౯. అఘాసురవినాశీ చ వినిద్రీకృతబాలకః, ఆద్య ఆత్మప్రదస్సంగీ యమునాతీరభోజనః. ౨౦. గోపాలమండలీమధ్యస్సర్వగోపాలభూషణః, కృతహస్తతలగ్రాసో వ్యంజనాశ్రితశాఖికః. ౨౧. కృతబాహుశ్శృంగయష్టిర్గుంజాలంకృతకంఠకః, మయూరపింఛమకుటో వనమాలావిభూషితః. ౨౨. గైరికాచిత్రితవపుర్నవమేఘవపుస్స్మరః, కోటికందర్పలావణ్యో లసన్మకరకుండలః. ౨౩. ఆజానుబాహుర్భగవాన్నిద్రారహితలోచనః, కోటిసాగరగంభీరః కాలకాలస్సదాశివః. ౨౪. విరించిమోహనవపుర్గోపవత్సవపుర్ధరః, బ్రహ్మాండకోటిజనకో బ్రహ్మమోహవినాశకః. ౨౫. బ్రహ్మా బ్రహ్మేడితస్స్వామీ శక్రదర్పాదినాశనః, గిరిపూజోపదేష్టా చ ధృతగోవర్ధనాచలః. ౨౬.

సాహస్రస్తోత్రము నుపదేశింతును. సావధానుఁడవై వినుము.
ఈస్తుతిని పారాయణము చేయునపుడు సాధకుఁడు

పురందరేడితః పూజ్యః కామధేనుప్రపూజితః, సర్వతీర్థాభిషిక్తశ్చ గోవిందో గోపరక్షకః. ౨౭. కాళీయార్తికరః క్రూరో నాగపత్నీడితో విరాట్, ధేనుకారిః ప్రలంబారిర్వృషాసురవిమర్దనః. ౨౮. మాయాసురాత్మజధ్వంసీ కేశికంఠవిదారకః, గోపగోప్తా ధేనుగోప్తా దావాగ్నిపరిశోషకః. ౨౯. గోపకన్యావస్త్రహారీ గోపకన్యావరప్రదః, యజ్ఞపత్న్యన్నభోజీ చ మునిమానాపహారకః. ౩౦. జలేశమానమథనో నందగోపాలజీవనః, గంధర్వశాపమోక్తా చ శంఖచూడశిరోహరః. ౩౧. వంశీ వటీ వేణువాదీ గోపీచింతాపహారకః, సర్వగోప్తా సమాహ్వానస్సర్వగోపీమనోరథః. ౩౨. వ్యంగధర్మప్రవక్తా చ గోపీమండలమోహనః, రాసక్రీడారసాస్వాదీ రసికో రాధికాధవః. ౩౩. కిశోరీ ప్రాణనాథశ్చ వృషభానుసుతాప్రియః, సర్వగోపీజనానందీ గోపీజనవిమోహనః. ౩౪. గోపికాగీతచరితో గోపీనర్తనలాలసః, గోపీస్కంధాశ్రితకరో గోపికాచుంబనప్రియః ౩౫. గోపికామార్జితముఖో గోపీవ్యజనవీజితః, గోపికా కేశసంస్కారీ గోపికాపుష్పసంస్తరః. ౩౬. గోపికాహృదయాలంబీగోపీవహనతత్పరః, గోపికామదహారీచ గోపికాపరమార్జితః. ౩౭. గోపికాకృతసంనీలో గోపికాసంస్మృతప్రియః, గోపికావందితపదో గోపికావశవర్తనః. ౩౮. రాధాపరాజితశ్శ్రీమాన్నికుంజేసువిహారవాన్, కుంజప్రియః కుంజవాసీబృందావనవికాసనః. ౩౯. యమునాజలసిక్తాంగో యమునాసౌఖ్యదాయకః. శశిసంస్తంభనశ్శూరః కామీకామవిమోహనః. ౪౦. కామాద్యః కామనాథశ్చ కామమానసభేదనః, కామదః కామరూపశ్చ కామినీకామసంచయః. ౪౧. నిత్యక్రీడో మహాలీల స్సర్వస్సర్వగతస్తథా, పరమాత్మా పరాధీశస్సర్వకారణకారణః. ౪౨. గృహీతనారదవచా హ్యక్రూరపరిచింతితః, అక్రూరవందితపదో గోపికాతోషకారకః. ౪౩. అక్రూరవాక్యసం

యమునాతీరమున నున్నమనోజ్ఞతను బృందావనమునందుఁ
గల్పవృక్షముక్రిందఁ గూరుచున్నట్టియు, రాధికాయుతుఁడై

గ్రాహీ మధురావాసకారణః, అక్రూరతాపశమనో రజకాయుః ప్రణాశనః. ౪౪. మధురానందదాయీ చ కంసవస్త్రవిలుంఠనః, కంసవస్త్రపరీధానో గోపవస్త్రప్రదాయకః. ౪౫. సుదామగృహగామీ చ సుదామపరిపూజితః, తంతువాయకసంప్రీతః కుబ్జాచందనలేపనః. ౪౬. కుబ్జారూపప్రదో విజ్ఞో ముకుందో విష్టరశ్రవాః, సర్వజ్ఞో మధురాలోకీ సర్వలోకాభినందనః, ౪౭. కృపాకటాక్షదర్శీ చ దైత్యారిర్దేవపాలకః, సర్వదుఃఖప్రశమనో ధనుర్భంగీమహోత్సవః. ౪౮. కువలయాపీడహంతా చ దంతస్కంధబలాగ్రణీః కల్పరూపధరో ధీరో దివ్యవస్త్రానులేపనః. ౪౯. మల్లరూపో మహాకాలః కామరూపీ బలాన్వితః, కంసత్రాసకరో భీమో ముష్టికాంతశ్చ కంసహా. ౫౦. చాణూరఘ్నో భయహర శ్శలారిస్తోశలాంతకః, వైకుంఠవాసీకంసారి స్సర్వదుష్టనిషూదనః. ౫౧. దేవదుందుభినిర్ఘోషీ పితృశోకనివారణః, యాదవేంద్రస్సతాం సాథో యాదవారిప్రమర్దనః. ౫౨. శౌరిశోకవినాశీ చ దేవకీతాపనాశనః, ఉగ్రసేనపరిత్రాతా ఉగ్రసేనాభిపూజితః. ౫౩. ఉగ్రసేనాభిషేకీ చ ఉగ్రసేనదయాపరః, సర్వసాత్వతసాక్షీ చ యదూనామభినందనః. ౫౪. సర్వమాధురసంసేవ్యః కరుణో భక్తబాంధవః, సర్వగోపాలధనదో గోపీ గోపాలలాలసః. ౫౫. శౌరిదత్తోపవీతీ చ ఉగ్రసేనదయాకరః, గురుభక్తో బ్రహ్మచారీ నిగమాధ్యయనే రతః. ౫౬. సంకర్షణసహాధ్యాయీ సుదామసుహృదేవ చ, విద్యానిధిః కలాకోశో మృతపుత్రప్రదస్తథా. ౫౭. చక్రీ పంచజనీ చైవ సర్వనారకిమోచనః, యమార్చితః పరోదేవో నామోచ్చారవశోఽచ్యుతః. ౫౮. కుబ్జావిలాసీసుభగోదీనబంధురనూపమః, అక్రూరగృహగోప్తా-చ ప్రతిజ్ఞాపాలకశ్శుభః. ౫౯. జరాసంధజయీ విద్వాన్ యవనాంతో ద్విజాశ్రయః, ముచుకుందప్రియకరో జరా

నట్టియు శ్రీకృష్ణుని ధ్యానించుచుండవలయును. అస్తు తియుగళనామము కలది. త్రికాలములయందు భక్తిశ్రద్ధలు

సంధపలాయితః. ౬౦. ద్వారకాజనకో గూఢో బ్రహ్మణ్యస్సత్యసంగరః, లీలాధరః ప్రియకరో విశ్వకర్మాయశప్రదః. ౬౧. రుక్మిణీప్రియసందేశో రుక్మిశోకవివర్ధనః, చైద్యశోకాలయశ్శ్రీశో దుష్టరాజన్యనాశనః. ౬౨. రుక్మివైరూప్యకరణో రుక్మిణీవచనే రతః, బలభద్రవచోగ్రాహీ ముక్తరుక్మీజనార్దనః. ౬౩. రుక్మిణీప్రాణనాథశ్చ సత్యభామాపతిస్స్వయం, భక్తపక్షీ భక్తివశ్యో హ్యక్రూరమణిదాయకః. ౬౪. శతధన్వాప్రాణహారీ ఋక్షరాజసుతాప్రియః, సత్రాజిత్తనయాకాంతో మిత్రవిందాపహారకః. ౬౫. సన్యాపతిర్లక్ష్మణాజిత్పూజ్యో భద్రాప్రియంకరః, నరకాసురఘాతీ చ లీలాకన్యాహరో జయీ. ౬౬. మురారిర్మదనేశోఽపి ధరిత్రీదుఃఖనాశనః, వైనతేయీ స్వర్గగామీ అదిత్యైకుండలప్రదః. ౬౭. ఇంద్రార్చితో రమాకాంతో వజ్రిభార్యాప్రపూజితః, పారిజాతాపహారీ చ శక్రమానాపహారకః. ౬౮. ప్రద్యుమ్నజనకస్సాంబతాతో బహుసుతో విభుః, గర్గాచార్యస్సత్యగతిర్ధర్మాధారో ధరాధరః. ౬౯. ద్వారకామండనశ్శ్లోక్యస్సుశ్లోక్యో నిగమాలయః, పౌండ్రప్రాణాపహారీ చ కాశీరాజశిరోహరః. ౭౦. అవైష్ణవవిప్రదాహీ సుదక్షిణభయావహః, జరాసంధవిదారీ చ ధర్మనందనయజ్ఞకృత్. ౭౧. శిశుపాలశిరశ్ఛేదీ దంతవక్త్రవినాశనః, విదూరథాంతకశ్శ్రీశశ్శ్రీదో ద్వివిదనాశనః. ౭౨. రుక్మిణీమానహారీ చ రుక్మిణీమానవర్ధనః, దేవర్షిశాపహర్తా చ ద్రౌపదీవాక్యపాలకః. ౭౩. దుర్వాసోభయహారీ చ పాంచాలీస్మ ణాగతః, పార్థదూతః పార్థమంత్రీ పార్థదుఃఖౌఘనాశనః. ౭౪. పార్థమానాపహారీ చ పార్థజీవనదాయకః, పాంచాలీవస్త్రదాతా చ విశ్వపాలకపాలకః. ౭౫. శ్వేతాశ్వసారథిస్సత్యస్సత్యసాధ్యో భయాపహః, సత్యసంధ త్యరతిస్సత్యప్రియ ఉదారధీః. ౭౬. మహాసేనజయీ చైవ శివసైన్య

గలిగి పఠించిన సకలదోషములు తొలఁగును. బృందావనమున

వినాశనః, బాణాసురభుజచ్ఛేత్తా బాణబాహువరప్రదః. ౭౭. తార్క్ష్యమానాపహారీ చ తార్క్ష్యతేజోవివర్ధనః, రామస్వరూపధారీ చ సత్యభామాముదావహః. ౭౮. రత్నాకరజలక్రీడో వ్రజలీలాప్రదర్శకః, స్వప్రతిజ్ఞాపరిధ్వంసీ భీష్మాజ్ఞాపరిపాలకః. ౭౯. వీరాయుధహరః కాలః కాలికేశో మహాబలః, బర్బరీషశిరోహారీ బర్బరీషశిరఃప్రదః. ౮౦. ధర్మపుత్రజయీ శూరదుర్యోధనమదాంతకః, గోపికాప్రీతినిర్బంధనిత్యక్రీడో వ్రజేశ్వరః. ౮౧. రాధాకుండరతిర్ధన్యస్సదాందోళసమాశ్రితః, సదా మధువనానందీ సదా బృందావనప్రియః. ౮౨. అశోకవనసన్నద్ధస్సదా తిలకసంగతః, సదా గోవర్ధనరతిః సదాగోకులవల్లభః. ౮౩. భాండీరవటసంవాసీ నిత్యం వంశీవటస్థితః, నందగ్రామకృతావాసో వృషభానుగ్రహప్రియః. ౮౪. గృహీతకామినీరూపో నిత్యం రాసవిలాసకృత్, వల్లవీజనసంగోప్తా వల్లవీజనవల్లభః. ౮౫. దేవశర్మకృపాకర్తా కల్పపాదపసంస్థితః, శిలానుగంధనిలయః పాదచారీ ఘనచ్ఛవిః. ౮౬. అతసీకుసుమప్రఖ్యస్సదా లక్ష్మీకృపాకరః, త్రిపురారిప్రియకరో హ్యుగ్రధన్వాపరాజితః. ౮౭. షడ్ధురధ్వంసకర్తా చ నికుంభప్రాణహారకః, వజ్రనాభపురధ్వంసీ పౌండ్రకప్రాణహారకః. ౮౮. బహుళాశ్వప్రీతికర్తా ద్విజవర్యప్రియంకరః, శివసంకటహారీ చ వృకాసురవినాశనః. ౮౯. భృగుసత్కారకారీ చ శివసాత్త్వికతాప్రదః, గోకర్ణపూజకస్సాంబకుష్ఠవిధ్వంసకారణః. ౯౦. వేదస్తుతో వేదవేత్తా యదువంశవివర్ధనః, యదువంశవినాశీ చ ఉద్ధవోద్ధారకారకః. ౯౧. రాధా చ రాధికా చైవ ఆనందా వృషభానుజా, బృందావనేశ్వరీ పుణ్యా కృష్ణమానసహారిణీ. ౯౨. ప్రగల్భా చతురా కామా కామినీ హరిమోహినీ, లలితా మధురా మాధ్వీ కిశోరీ కనకప్రభా. ౯౩. జితచంద్రా జితమృగా జితసింహా జితద్విపా, జితరంభా జితపికా గోవిందహృదయోద్భవా. ౯౪. జితబింబా జితశుకా జితపద్మా కుమారికా, శ్రీ

రాధామాధవులున్నయట్లు భావింపవలయును. వంధ్యాత్వము

కృష్ణకర్షణా దేవీ నిత్యం యుగ్మస్వరూపిణీ. ౯౫. నిత్యం విహారిణీ కాంతా, రసికా కృష్ణవల్లభా, ఆమోదినీ మోదవతీ నందనందనభూషితా. ౯౬. దివ్యాంబరా దివ్యహారా ముక్తామణివిభూషితా, కుంజప్రియా కుంజవాసా కుంజనాయకనాయికా. ౯౭. చారురూపా చారువక్త్రా చారుహేమాంగదా శుభా, శ్రీకృష్ణవేణుసంగీతా మురళీహారిణీ శివా. ౯౮. భద్రా భగవతీ శాంతా కుముదా సుందరీ ప్రియా, కృష్ణక్రీడా కృష్ణరతి శ్రీకృష్ణసహచారిణీ. ౯౯. వంశీవటప్రియస్థానా యుగ్మాయుగ్మస్వరూపిణీ, భాండీరవాసినీ శుభ్రా గోపీనాథప్రియా సఖీ. ౧౦౦. శ్రుతినిశ్శ్వసితా దివ్యా గోవిందరసదాయినీ, శ్రీకృష్ణప్రార్థనీశానా మహానందప్రదాయినీ. ౧౦౧. వైకుంఠజనసంసేవ్యా కోటిలక్ష్మీసుఖావహా, కోటికందర్పలావణ్యా రతికోటిరతిప్రదా. ౧౦౨. భక్తిగ్రాహ్యా భక్తిరూపా లావణ్యసరసీఉమా, బ్రహ్మరుద్రాదిసంసేవ్యా నిత్యం కౌతూహలాన్వితా. ౧౦౩. నిత్యలీలా నిత్యకామా నిత్యశృంగారభూషితా, నిత్యబృందావనరతా నందనందనసంయుతా. ౧౦౪. గోపికామండలీయుక్తా నిత్యం గోపాలసంగతా, గోరసక్షేపణీ శూరా సానందా నందదాయినీ. ౧౦౫. మహాలీలా ప్రకృష్టా చ నగరీ నగచారిణీ. నిత్యమాఘూర్ణితా పూర్ణా కస్తూరీతిలకాన్వితా. ౧౦౬. పద్మాశ్యామా మృగాక్షీ చ సిద్ధిరూపా రసావహా, కోటిచంద్రాననా గౌరీ కోటికోకిలసుస్వరా. ౧౦౭. శీలసౌందర్య నిలయా నందనందనలాలితా, అశోకవనసంవాసా భాండీరవనసంగతా.౧౦౮. కల్పద్రుమలతావిష్టా కృష్ణా విశ్వా హరిప్రియా, అజాగమ్యా భావగమ్యా గోవర్ధనకృతాలయా. ౧౦౯. యమునాతీరనిలయా శశ్వద్గోవిందజల్పినీ, శశ్వన్మానవతీ స్నిగ్ధా శ్రీకృష్ణపరివందితా. ౧౧౦. కృష్ణస్తుతా కృష్ణవృతా, శ్రీకృష్ణహృ దయాలయా, దేవద్రుమఫలా సేవ్యాబృందావనరసాలయా. ౧౧౧. కోటితీర్థమయీ సత్యా కోటితీర్థఫలప్రదా,కోటియోగసుదుష్ప్రాప్యా

నివర్తించును. దారిద్ర్యదోషము దూరమగును. రోగములు తొలఁగి యారోగ్యముకల్గును. శత్రుభీతియుండదు. రాధా

---

కోటియజ్ఞదురాశ్రయా. ౧౧౨. మనసా శశిలేఖా చ శ్రీకోటిసుభగాఽనఘా, కోటిముక్తసుఖా సౌమ్యా లక్ష్మీకోటివిలాసినీ. ౧౧౩. తిలోత్తమా త్రికాలస్థా త్రికాలజ్ఞా హ్యధీశ్వరీ, త్రివేదజ్ఞా త్రిలోకజ్ఞా తురీయాంతనివాసినీ. ౧౧౪. దుర్గారాధ్యా రమారాధ్యా విశ్వారాధ్యా చిదాత్మికా, దేవారాధ్యాపరారాధ్యాబ్రహ్మారాధ్యాపరాత్మికా. ౧౧౫. శివారాధ్యా ప్రేమసాధ్యా భక్తారాధ్యా రసాత్మికా, కృష్ణప్రాణార్పిణీ భామా శుద్ధప్రేమవిలాసినీ. ౧౧౬. కృష్ణారాధ్యా భక్తిసాధ్యా భక్తబృందనిషేవితా, విశ్వాధారా కృపాధారా జీవధారాతినాయికా. ౧౧౭. శుద్ధప్రేమమయీ లజ్జా నిత్యసిద్ధా శిరోమణిః, దివ్యరూపా దివ్యభోగా దివ్యవేషా ముదాన్వితా. ౧౧౮. దివ్యాంగనాబృందసారా నిత్యనూతనయౌవనా, పరబ్రహ్మావృతా ధ్యేయా మహారూపా మహోజ్జ్వలా. ౧౧౯. కోటిసూర్యప్రభాకోటిచంద్రబింబాధికచ్ఛవిః, కోమలామృతవాగాద్యా, వేదాద్యా వేదదుర్లభా. ౧౨౦. కృష్ణాసక్తాకృష్ణభక్తాచంద్రావళినిషేవితా, కలాషోడశసంపూర్ణా కృష్ణదేహార్ధధారిణీ. ౧౨౧. కృష్ణబుద్ధిః కృష్ణసారా కృష్ణరూపవిహారిణీ, కృష్ణకాంతా కృష్ణధనా కృష్ణమోహనకారిణీ. ౧౨౨. కృష్ణదృష్టిః కృష్ణగోత్రీ కృష్ణదేవీ కులోద్వహా, సర్వభూతస్థితావాత్మా సర్వలోకనమస్కృతా. ౧౨౩. కృష్ణదాత్రీ ప్రేమధాత్రీ స్వర్ణధాత్రీ మనోరమా, నగధాత్రీ యశోధాత్రీ మహాదేవీ శుభంకరీ. ౧౨౪. శ్రీశేషదేవజననీఅవతారగణప్రసూః, ఉత్పలాంకారవిందాంకా ప్రసాదాంకా ద్వితీయకా. ౧౨౫. రథాంకా కుంజరాంకా చ కుండలాంకపదస్థితా, ఛత్రాంకా విద్యుదంకా చ పుష్పమాలాంకితాపిచ. ౧౨౬. దండాంకా ముకుటాంకా చ పూర్ణచంద్రా శుకాంకితా, కృష్ణాన్నాహారపాకా చ బృందాకుంజవిహారిణీ. ౧౨౭. కృష్ణప్రబో

మాధవభక్తి దినదినాభివృద్ధినొందును. మహామేధగలిగి భగ
వంతుఁడగు శ్రీకృష్ణునకు నమస్కారములు. శ్రీహరి రాధాసం

---

ధనకరీ కృష్ణశేషాన్నభోజినీ, పద్మకేసరమధ్యస్థా సంగీతాగమవేదినీ. ౧౨౮.
కోటికల్పాంతభ్రూభంగా అప్రాప్తప్రళయాచ్యుతా, సర్వసత్త్వనిధిః పద్మశం
ఖాదినిధిసేవితా. ౧౨౯. అణిమాదిగుణైశ్వర్యా దేవబృందవిమోహినీ, సర్వా
నందప్రదా సర్వా సువర్ణలతికాకృతిః. ౧౩౦. కృష్ణాభిసారసంకేతా మాలినీ
నృత్యపండితా, గోపీసింధుసకాశాహ్వాగోపమండలశోభినీ. ౧౩౧. శ్రీకృష్ణ
ప్రీతిదా భీతా ప్రత్యంగపులకాంచితా, శ్రీకృష్ణాలింగనరతా గోవిందవిరహా
క్షమా. ౧౩౨. అనంతగుణసంపన్నా కృష్ణకీర్తనలాలసా, బీజత్రయమయీ
మూర్తిః కృష్ణానుగ్రహవాంఛితా, ౧౩౩. విమలాదినిషేవ్యా చ లలితాద్య
ర్చితా సతీ, పద్మబృందస్థితా హృష్టా త్రిపురాపరిసేవితా. ౧౩౪. బృందా
వత్యర్చితా శ్రద్ధా దుర్జ్ఞేయా భక్తవల్లభా, దుర్లభా సాంద్రసౌఖ్యాత్మా
శ్రేయోహేతుస్సుభోగదా. ౧౩౫. సారంగా శారదాబోధా సద్బృందావన
చారిణీ, బ్రహ్మానందా చిదానందా ధ్యానానందార్ధమాత్రికా. ౧౩౬. గం
ధర్వాసురతజ్ఞా చ గోవిందప్రాణసంగమా, కృష్ణాంగభూషణా రత్నభూషణా
స్వర్ణభూషితా. ౧౩౭. శ్రీకృష్ణహృదయావాసముక్తాకనకనాసికా, సద్రత్న
కంకణయుతా శ్రీమన్నీలగిరిస్థితా. ౧౩౮. స్వర్ణనూపురసంపన్నా స్వర్ణకిం
కిణిమండితా, అశేషరాసకుతుకా రంభోరూస్తనుమధ్యమా. ౧౩౯. పరా
కృతిః పరానందా పరస్వర్గవిహారిణీ, ప్రసూనకబరీ చిత్రా మహాసిందూరసుం
దరీ. ౧౪౦. కైశోరవయసా బాలా ప్రమదాకులశేఖరా, కృష్ణాధరసుధా
స్వాదా శ్యామప్రేమవినోదినీ. ౧౪౧. శిఖిపిచ్ఛలసచ్చూడాస్వర్ణచంపక
భూషితా, కుంకుమాలక్తకస్తూరీమండితా చాపరాజితా. ౧౪౨. హేమహా
రాన్వితా పుష్పాహారాఢ్యా రసవత్యపి, మాధుర్యమధురా పద్మా పద్మహస్తా
సువిశ్రుతా. ౧౪౩. భ్రూభంగాభంగకోదండకటాక్షశరసంధినీ, శేషదేవా

౫ రవారాశియందు సంతతము విహరించుచుండును. రాధాదేవి జగత్కర్త్రి. జగత్పాలనమున నాదృతిగలది. ప్రళయము

శిరస్థాచ నిత్యస్థలవిహారిణీ. ౧౪౪. కారుణ్యజలమధ్యస్థా నిత్యమత్తాధిరోహిణి, అష్టభాషవతీ చాష్టనాయికాలక్షణాన్వితా. ౧౪౫. సునీతిజ్ఞా శ్రుతిజ్ఞా చ సర్వజ్ఞా దుఃఖహారిణీ, రజోగుణేశ్వరీ చైవ జరచ్చంద్రనిభాననా. ౧౪౬. కేతకీకుసుమాభాసా సదా సింధువనస్థితా, హేమపుష్పాధికకరా పంచశక్తిమయీ హితా: ౧౪౭. స్తనకుంభీ నరాఢ్యా చ క్షీణాపుణ్యాయశస్వినీ, వైరాజసూయజననీ శ్రీశా భువనమోహినీ. ౧౪౮. మహాశోభా మహామాయా మహాకాంతిర్మహాస్మృతిః, మహామోహా మహావిద్యా మహాకీర్తిర్మహారతిః. ౧౪౯. మహాధైర్యా మహావీర్యా మహాశక్తిర్మహాద్యుతిః, మహాగౌరీ మహాసంపన్మహాభోగవిలాసినీ. ౧౫౦. సమయాభక్తిదాశోకా వాత్సల్యరసదాయినీ, సుహృద్భక్తిప్రదా స్వచ్ఛా మాధుర్యరసవర్షిణీ. ౧౫౧. భావభక్తిప్రదా శుద్ధప్రేమభక్తివిధాయినీ, గోపరామాభిరామా చ క్రీడారామా పరేశ్వరీ. ౧౫౨. నిత్యరామా చాత్మరామా కృష్ణారామా రమేశ్వరీ, ఏకానేకజగద్వ్యాప్తా విశ్వలీలాప్రకాశినీ. ౧౫౩. సరస్వతీశా దుర్గేశా జగదీశా జగద్విధిః, విష్ణువంశనివాసా చ విష్ణువంశసముద్భవా. ౧౫౪. విష్ణువంశస్తుతా కర్త్రీ విష్ణువంశావనీ సదా, ఆరామస్థా వనస్థా చ సూర్యపుత్ర్యవగాహినీ. ౧౫౫. ప్రీతిస్థా నిత్యమంత్రస్థా గోలోకస్థా విభూతిదా, స్వానుభూతిస్థితావ్యక్తా సర్వలోకనివాసినీ. ౧౫౬. అమృతాహ్యద్భుతా శ్రీమన్నారాయణసమీడితా, అక్షరాపిచకూటస్థా మహాపురుషసంభవా. ౧౫౭. ఔదార్యభావసాధ్యాచ స్థూలసూక్ష్మాతిరూపిణీ, శిరీషపుష్పమృదులా గాంగేయముకురప్రభా. ౧౫౮. నీలోత్పలజితాక్షీ చ సద్రత్నకబరాన్వితా, ప్రేమపర్యంకనిలయా తేజోమండలమధ్యగా. ౧౫౯. కృష్ణాంగగోపనాఽభేదా లీలావరణనాయికా, సుధాసింధుసముల్లాసా మృతాస్యందవిధాయినీ. ౧౬౦.

చేయును. బ్రహ్మాండేశ్వరి సర్వజగత్తులనుక్షణమాత్రమునసృష్టించును. ఆజగజ్జననీనామసాహస్రమును నారదా! నీకుఁదెల్పితిని!

---

కృష్ణచిత్తారాసచిత్తా ప్రేమచిత్తా హరిప్రియా, అచింతనగుణగ్రామా కృష్ణలీలామలాపహా. ౧౬౧. రాససింధుశశాంకా చ రాసమండలమండినీ, నతవ్రతాసింరీచ్ఛానుమూర్తిస్సురవందితా. ౧౬౨. గోపీచూడామణిరోపీగణేడ్యా విరజాధికా, గోపప్రేష్ఠా గోపకన్యా గోపనారీ సుగోపికా. ౧౬౩. గోపధామా సుదామాంబాగోపాలీ గోపమోహినీ, గోపభూషా కృష్ణభూషా శ్రీబృందావనచంద్రికా ౧౬౪. వీణాదిఘోషనిరతా రాసోత్సవవికాసినీ, కృష్ణచేష్టాపరిజ్ఞాతా కోటికందర్పమోహినీ. ౧౬౫. శ్రీకృష్ణగుణనాగాఢ్యా దేవసుందరిమోహినీ, కృష్ణచంద్రమనోజ్ఞా చ కృష్ణదేవసహోదరీ. ౧౬౬. కృష్ణాభిలాషిణీ కృష్ణప్రేమానుగ్రహవాంఛితా, క్షేమా చ మధురాలాపా భ్రువోమాయా సుభద్రికా. ౧౬౭. ప్రకృతిః పరమానందా నీపద్రుమతలస్థితా, కృపాకటాక్షా బింబోష్ఠీ రంభా చారునితంబినీ. ౧౬౮. స్మరకేళినిధానా చ గండతాటంకమండితా, హేమాద్రికాంతిరుచిరా ప్రేమాఢ్యా మదమంథరా. ౧౬౯. కృష్ణచింతా ప్రేమచింతా రతిచింతా చ కృష్ణదా, రాసచింతా భావచింతా శుద్ధచింతా మహారసా. ౧౭౦. కృష్ణా దృష్టిత్రుటియుగా దృష్టిపక్ష్మవినిందినీ, కందర్పజననీ ముఖ్యా వైకుంఠగతిదాయినీ. ౧౭౧. రాసభావా ప్రియాశ్లిష్టా ప్రేష్ఠా ప్రథమనాయికా, శుద్ధాసుధాదోహినీ చ శ్రీరామారసమంజరీ. ౧౭౨. సుప్రభా వాశుభాచారా స్వర్ణదీ నర్మదాంబికా, గోమతీ చంద్రభాగేడ్యా సరయూస్తామ్రపర్ణిభూః. ౧౭౩. నిష్కళంకచరిత్రా చ నిర్గుణా చ నిరంజనా.

ఏతన్నామసహస్రం తు యుగ్మరూపస్య నారద, పఠనీయం ప్రయత్నేన బృందావనరసావహే. మహాపాపప్రశమనం వంధ్యాత్వవినివర్తకం. దారిద్ర్యశమనం రోగనాశనం కామదం మహత్, పాపాపహం వైరిహారం

భుక్తిముక్తులు రెండును దీనఁగల్గును. సర్వకామప్రదమని తలంచియే లోకుల కుపకారమగునని నీ కుపదేశించితిని దీనిని వినఁగోరితివి. వింటివి. ఇఁక నేమి వినఁగోరెదవో తెల్పుము. అని సనత్కుమారుం డడుగ నారదముని యిట్లు ప్రశ్నించెను.

మహాత్మా! తంత్ర ప్రతిపాదితములగుమంత్రోపాసనవిధుల నుపదేశించితివి. అందును శ్రీకృష్ణమంత్ర వైభవము కడుంగడుం బ్రశంసార్హము. అందు రాధిక సర్వదేవతాదిపూజ్యయని తెల్పితివి. మూలప్రకృతియనియేకదా దానిసారము. ఆజగజ్జననియంశావతారము లగుదేవతాబృందములచరిత్రము మంత్రములు వానివిధులు తెలుపుము. తంత్రరహస్యములెందుండును. వానిని వినఁ గోరికకలదు శక్తితంత్రము లనేకములుగలవు. అన్నియు శంకరోక్తములే. వానిసారమును గ్రహించి నాకు నుపదేశింపుము. అని నారదముని ప్రశ్నింపఁగా సనత్కుమారుఁడు రాధాపాదారవిందములను మనస్సున భక్తిపూర్వకముగ స్మరించి యిట్లు పలికెను.

రాధామాధవభక్తిదం. నమస్తస్తై భగవతే కృష్ణాయాకుంఠమేధసే. రాధాసంగసుధాసింధో నమో నిత్యవిహారిణే. రాధాదేవీ జగత్కర్త్రీ జగత్పాలనతత్పరా, జగల్లయ విధాత్రీ చ సర్వేశీ సర్వసూతికా. తస్యా నామసహస్రం వై మయా ప్రోక్తం మునీశ్వర, భుక్తిముక్తిప్రదం దివ్యం కిం భూయశ్శ్రోతుమిచ్ఛసి.

రాధాకృష్ణసహస్రనామస్తోత్రం సంపూర్ణమ్.

## పంచప్రకృతిమంత్రపూజావివరణము.

* నారదా! వినుము. రాధాంశభూత దేవతారాధనమును వచింతును. అది పరమాశ్చర్యము. మంత్రసాధనపూర్వకముగ వాని నెఱుంగందగును. శ్రీకృష్ణార్ధాంగసముద్భూత రాధయని తెలిపితినిగదా. గోలోకాధినాథయగు నాదేవి కృష్ణసహాయిని యని నమ్ముము. తేజోమండలమునడుమ నుండును. దృశ్యాదృశ్యస్వరూపిణి యనందగు. ఒకానొక కాలమం దాదేవింగూడి శ్రీకృష్ణుం డుండెను. ఆతని వామభాగమునుండి నారాయణుం డుదయించెను. రాధికాదేవి వామాంగమునుండి మహాలక్ష్మి యుదయించెను. అంత శ్రీకృష్ణుం డామహాలక్ష్మిని నారాయణున కొసంగి వైకుంఠమున నిలిపెను. లోకపాలనము చేయుచుండం దగునని పల్కెను. పిదప గోలోకనాథుని లోమములవివరములనుండి లెక్కపెట్ట శక్యముకాని గోపాలకులు పుట్టిరి. వారెల్లం గృష్ణునితో సరిపోలువయస్సుకలవారు. ప్రాణమిత్రులు. వారెల్ల నాకృష్ణునకు భక్తులగుపార్షదులైరి. రాధాంగలోమకూపములనుండి గోపకన్య లుదయించిరి. వారెల్ల రాధాతుల్యవయస్స్ఫురితలు. రాధకు దాసికలయిరి.

తటాలున శ్రీకృష్ణశరీరమునుండి దుర్గ యావిర్భవించెను. విష్ణుమాయయని సనాతనియని యామె విఖ్యాతిం గాంచెను. దేవీనికాయమునకు బీజరూపిణి, మూలప్రకృతి, ఈశ్వరియు నగు. ఆమె తేజస్స్వరూపురాలు, పరిపూర్ణురాలు, త్రిగుణాత్మక, వేయిబాహువు లామెకుండెను. నానావిధశస్త్రవిభూషి

* ఈవిషయము బృహన్నారదపురాణమున నెనుబదిమూఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

తములై యవియుండెను. మూఁడుకన్నులాదేవికింగలవు. ప్రపంచ సంసార వృక్షబీజస్వరూపురాలామెయే. శాశ్వతముగానుండు దేవత. ఆమెయుదయింపఁగనే రత్నసింహాసనమొసంగి హరి గౌరవించెను. ఆతరుణముననే శ్రీహరి నాభికమలమునుండి సస్త్రీకుఁడై చతుర్ముఖములు వెలయఁగా జ్ఞానవంతులలో శ్రేష్ఠుఁడై యోంకారము నుచ్చరించుచుఁగమండలువు ధరించి తపోనిరతి యలర బ్రహ్మ యావిర్భవించెను. ఆతఁడు సావిత్రియనఁబడు భార్యతోడ శ్రీహరిని వేదవాక్కుల సన్నుతించి హరి యానతిఁగొని తదాదిష్టరత్నపీఠమునఁ గూరుచుండెను.

అంత నా శ్రీకృష్ణుఁడు రెండురూపములుగా నయ్యెను. వామార్ధాంగము మహాదేవుఁడు. దక్షార్ధాంగము గోపికాపతి యయ్యెను. మహాదేవునకుఁ బంచవక్త్రములు త్రినేత్రము లొప్పారును. కృష్ణు నభినుతించి హరిపురోభాగమునఁ గూరుచుండెను. శ్రీకృష్ణుఁ డప్పుడు చతుర్ముఖుంగని నీవు సృష్టిచేయుచుండుమనియె. సత్యలోకము నీకు నివాసము కాఁగలదు. అందుండి నన్ను స్మరించుచుండుము. బొమ్మని యానతిచ్చెను. నలువయు హరి యాజ్ఞంగొని నమస్కరించి భార్యంగూడి యరిగి సృష్టిచేయుచుండెను. నారదా! నాప్రభృతుల మా బ్రహ్మదేవుని మానసపుత్త్రులము. మరల మహాదేవుని గని హరి శంకరా! విశ్వేశ్వరా! ఈదుర్గను గ్రహింపుము. శివలోకమునఁ దపోనిరతి నుండుము. సృష్ట్యంతకాలమున దానిని సంహరింపుము. అనుటయు శంకరుఁడు శ్రీహరికి నమస్కరించి శివలోకమునకుఁ బోయెను. మఱి కొంతకాలమున కాహరిముఖమునుండి సరస్వతి యావిర్భవించెను. వీణాపుస్తకములఁ దాల్చియుండెను.

మానదా! శారదా! వైకుంఠమున కరుగుము. లక్ష్మిసమీప మున నుండుము. నాలుగు బాహువులుగల నారాయణు నాశ్రయింపుము. అని శ్రీకృష్ణుం డాజ్ఞాపింప నామె నమస్కరించి నారాయణునిచెంత కరిగెను.

ఈరీతిగా రాధాదేవి యైదురూపములుగా మాఱి సృష్టి కారణభూతురా లయ్యెను. వీరు పంచప్రకృతు లనంబడుదురు. వీరినారాధించుమార్గమును వచించెద మంత్రధ్యానార్చనాదికము ప్రతిపాదించెదను. దాన లోకులకు మంత్రసిద్ధియగు. దానవారు కృతార్థులగుదురు. మంత్ర ముపదేశార్హమగు. అందుం దొలిదేవతామంత్రమునకు ఋషిసుతపుండు. గాయత్రి ఛందస్సు. రాధికయే దేవత. ప్రణవము బీజము. స్వాహాయనునది శ . షడక్షరములచే షడంగన్యాసముచేయవలయును. అవి బిందు పూర్వకములుగా నుండవలయును శ్రీకృష్ణభామిని యగురాధికను హృదయకమలమున ధ్యానింపవలయును.

"శ్వేతచంపకవర్ణాభాం కోటిచంద్రసమప్రభాం,
శరత్పార్వణచంద్రాస్యాం నీలేందీవరలోచనామ్.
సుశ్రోణీం సునితంబాం చ పక్వబింబాధరాంబరామ్,
ముక్తాకుందాభదశనాం వహ్నిశుద్ధాంశుకాన్వితామ్.
రత్నకేయూరవలయహారకుండలశోభితామ్,
గోపీభిస్సుప్రియాభిశ్చ సేవితాం శ్వేతచామరైః.
రాసమండలమధ్యస్థాం రత్నసింహాసనస్థితాం,
ధ్యాత్వా పుష్పాంజలిం క్షిప్త్వా పూజయే దుపచారకైః."

పుష్పాంజలిపూర్వకముగాం బూజింపవలయును. మూలమంత్రము నాలులక్షలు జపింపవలయును. దానిదశాంశము

తిలలచే హోమముచేయవలయును. నేతిలో నాతిలలను దడిపియే హోమముచేయందగునని శాస్త్రమర్యాద. ఆవరణ పూజ యంగదేవతాసహితముగ నొనరింపవలయును. షట్కోణములయందు షడంగదేవతలను బూజింపందగు. తద్బాహ్యమునఁ గలయష్టదళములయందు మాలావతి, మాధవి, రత్నమాల, సుశీలిక, శశికళ, పారిజాత, పద్మావతి, సుందరి యను దేవతల నావాహనముచేసి పూజింపవలయును. ప్రాగాద్యష్ట దిక్కులయందు వీరిని వరుసఁగా నారాధింపవలయును. దళములయం దిట్లుపూజించి దిక్పాలకులనింద్రాదులను గ్రమముతప్పక యుండ నావాహనముచేసి పూజింపందగు. వారియాయుధముల కట్లే యారాధనము సాగింపవలయు.

రాధా కృష్ణప్రియా రాసేశ్వరీ గోపీగణాధిపా,
నిర్గుణా కృష్ణపూజ్యా చ మూలప్రకృతి రీశ్వరీ.
సర్వేశ్వరీ సర్వపూజ్యావై రాజజననీ తథా,
పూర్వాద్యాశాసు రక్షంతు పాతుం మాం సర్వతస్సదా.
త్వం దేవి జగతాం మాతా విష్ణుమాయా సనాతనీ,
కృష్ణమాయాదిదేవీచ కృష్ణప్రాణాధికే శుభే.
కృష్ణభక్తిప్రదే రాధే నమస్తే మంగళప్రదే,
ఇతి సంప్రార్థ్య, సర్వేశీం స్తుత్వా హృది విసర్జయేత్.

పూజాంతమున నీరీతిగా నాజగదంబను ధ్యానించి హృదయమున విసర్జనము చేసికొనవలయును. ఈప్రకార మే మానవుఁడు రాధికను నిత్యము సర్వప్రపంచమున కాదిభూతురాలని, సర్వమంగళయని, తలంచి పూజాదికమున సంతోషపెట్టునో యాసాధకుఁ డీలోకమున నెల్లభోగముల ననుభవించి

యంతమున గోలోకము నొందును. *నారదా! యిట్లే తక్కిన నల్వురకుఁ బూజ విధింపఁబడినది. వారినిగూడ నారాధింప వలయును. సాంగపూజ యగును.

రాధిక సాగరమును శాప మొసంగుట.

† మోహినియును నారీమణివసువువలన ననేకధర్మముల నెఱింగి ప్రసంగవశమున నిట్లు ప్రశ్నించెను. సాగరములలో నీప్రాక్సాగరము క్షారోదకముగలదికదా. ఏల యిట్లయ్యెను. గురువవగు నీ వీప్రశ్నమునకు బదులుచెప్పి నాసంశయమును దొలఁగింపుమా యని వేఁడెను. వసు విట్లు బదులుచెప్పఁ బూనెను. మోహినీదేవీ! సాగరజలము లిట్లగుటకుం గలహేతువును వివరించెద. ఆకర్ణింపుము. సృష్టికాలముననే సాగరములు సప్తసంఖ్యాకములుగా విభజింపఁబడెను అవియన్నియు మూలప్రకృతియగు రాధికాగర్భసంభూతము లని యెఱుంగుము. అవి వేలువేలురూపములు కలవగును.

ఒకానొక కాలమునందు రాధికాపతి సభార్యుఁడై బృందావనమున నుండెను. గోపకులు గోపికలు సేవించుచుండిరి. రాసమండలాంతరమునందు రత్నమండపమునందు సువేషముగలరాధికయుఁ దానును గూరుచుండి సంతోషరసము ననుభవించుచుండెను. సప్తసాగరములు బాలకరూపముల మాతృస్తన్యమును గోరి యరుదెంచిరి వారు క్షుధా

* తక్కిన దేవతాచతుష్టయమునకుఁ బూజావిధానము కలదు. ప్రకృతమున కది సంగతముకాదని వదలితిని. † బృహన్నారదపురాణోత్తర ఖండమున నేఁబదియెనిమిదవయధ్యాయమునుండి యీకథ సంగ్రహీతము. మోహినికి వసువునకు జరిగినసంవాదమని గ్రహింపఁదగును.

ర్తులుగాన రాసమండలమును జొచ్చిరి. స్తన్యపానాతురతను గనఁబఱచిరి. ద్వారముననున్న వారిది మీరరుగ సమయము కాదని వారించిరి. ఆబాలకులు క్షుధార్తులగుట నిలువక, లోపలి కరిగిరి. తల్లికడ కరుగుబాలకుల వలదనుట ధర్మము కాదని గోపిక లడ్డుపెట్టక యూరకయుండిరి. బాలకులగుటను, ఆకొన్నవారగుటను, మాతల్లి యెక్కడనున్నదని విలపింప సాగిరి. తల్లి రమ్మని పిలుచుటయుఁ గొడుకు లరుగుటయు నలవాటుగ నుండెను. ఆవాడుకఁ చొప్పున నీవల నిలుచుండి యందఱు మొఱ్ఱవెట్టుచుండఁ గొండికవాఁడు కక్కసించి రాసమండపాభ్యంతరమును జొచ్చెను. మూఁఢుడై భర్తకు శృంగారభంగముగావించె నన్నకోపమున మనస్సు కలవిల పాటొందఁగా బాలకా! నీవు భూలోకమునకరుగుము. త్వరగాఁ బొమ్ము. మాదంపతులకు విలాసభంగకరుఁడవైతివి. కాన నీశాపము ననుభవింపుము. తక్కినవారుకూడ భూలోకమున నొక్కచోటనుండకయాయాయిశావుల(వేఱువేఱుగా)నుందు రుగాక. ఆశాపము నాలకించి భీతులై మఱింత గట్టిగానేడ్చిరి. మాతృవియోగము నెడఁబాయఁజాలమని పలికిరి. ప్రణతార్తి హరుఁడు గావున శ్రీకృష్ణుఁడు సుప్రసన్నుఁడయ్యెను. పుత్త్రకులారా! భయంపడకుఁడు శాపము మాతృదత్తము. దాని ననుభవింపక తప్పదు. మీరు మానవలోకమున నుండుఁడు. మీచెంత నే నుందును. మీరు జలరూపముల వేఱువేఱనుందురు. అందు నీకనిష్ఠుఁడు ఘోరతనొందఁగలఁడు. మీకెల్ల నడుమ నుండును. అని వారిదుఃఖమునాపి వదలెను. వారిశాపమాపుటకే సాగరతీరములఁ దా వసించెను. శృంగారమందిరము నే

కుమారుఁడు ప్రవేశించెనో యాతఁడే క్షార జలాకృతినొందెను. తక్కినవారు ద్రవరూపములనుమాత్రమే ధరించువారైరి. రసాగరాదులని వారు ప్రఖ్యాతులైరి. వేలువేలుతావుల వారుండిరి. అని వసువుపలికి యామె శంకఁదీర్చెను.

—భగవన్మహిమము.—

ఆమాట లాలకించి మోహినీదేవి! గురువర్యా! జగన్నాథునిపత్ని యగునా రాధ యెవ్వతుక? ఆమెస్తుతిని వినఁగోరెదను. ఆకౌతూహలమును సార్థకముచేయుము. రాధామాధవులవర్ణనము పురాణములయందు రహస్యముగదా. సర్వజ్ఞుఁడవుగాన నీవు తత్త్వము నెఱుంగుదువు. అన వసు విట్లు పలికెను. కోమలీ! నామనస్సు భగవంతునియందు మిక్కిలి లీనమయియున్నది. దానికి సంతోషము గలిగింపఁబూనినట్లు ప్రశ్నము గావించితివి. పరమానంద మొందితిని. వినుము. అది రహస్యాతిరహస్యము. బ్రహ్మైకత్వవిధాయకము. కావున నెల్లరకుఁ దెలుపరాదు. * ప్రకృతిపురుషులకు నియంతయై విధికి విధియై సంహర్తకు సంహర్తయై యలరు భగవంతునకు నమస్కారము లాచరించెదను. ఇఁక వినుము. శ్రీకృష్ణుఁడే సర్వావతారముల నవలంబించును. స్త్రీరూపమునఁగూడ నవతరించును. సగుణుఁడని నిర్గుణుఁడని విఖ్యాతినొందును † ఆభగవంతుఁడే వస్తుగుణముల ననుసరించి రాముఁడని కృష్ణుఁడని పిలువఁబడును. లోక

* ప్రకృతేః పురుషస్యాపి నియంతారం విధేర్విధిం, సంహర్తారం చ సంహర్తు ర్భగవంతం నతోఽస్మ్యహం. అని మూలము. † స ఏవ రామః కృష్ణశ్చ వస్తుతో గుణతః పృథక్, సర్వే ప్రాకృతికా లోకా గోలోకో వినశ్వరః. అని మూలము.

ములన్నియుఁ బ్రకృతిమయములు గోలోకనుమాత్రము నిర్గు ణము. అనఁగాఁ బ్రకృత్యతీతము. గోవులనఁగా భగవంతునంశ ములని వేదవేత్తలు నిరూపించిరి. * బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ప్రకృతివికారులు గుణనిర్మితులు. ఆభగవంతుని తేజస్సు నిర్గుణ మని గుణాత్మకమని నిర్ణయింపఁబడినది. గుణములుకూడఁ దదం శములేయగు. సర్వజీవులు వ్యాకృతరూపులు. రజస్సత్వతమో గుణములు వ్యాకృతోత్పాదకములు. అవ్యాకృతుఁ డగుపురు షునిగుణములు విజ్ఞాపకములు, దేహాభూతములునగు. ఆభగవ చ్ఛక్తియే ప్రకృతియనంబడును. కార్యకారణరూపిణిని ప్రధాన ప్రకృతినిగా నిరూపింతురు నిర్గుణుఁడగుపురుషుని సనాతనుని సాక్షిగా వర్ణింతురు. పురుషుఁడా ప్రకృతిని వీర్యవతినిగాఁ జేయును. పిదప గుణములు వెలువడును మహత్తత్త్వమత్తతి గనఁబడును. వానినుండియే యని నమ్ముము. పురుషుఁ డనఁబడు వానియిచ్ఛచేతనే దానినుండి యహంకార ముదయించెను. అది ద్రవ్య, జ్ఞాన, క్రియాత్మకమై ముప్విధములుగ నుండును. అహంకారమే వైకారికమని, తైజసమని, తామసమని మూఁడు పేరులుగఁ బిలువఁబడును. దేవతలు వైకారికాత్ము లనఁబడు దురు. దిగ్వాతార్కప్రచేతోఽశ్విబ్రహ్మేంద్రోపేంద్రమిత్రజల ములని దశవిధములుగ వారు పిలువఁబడుదురు. ఇంద్రియ ములు తైజసము లనఁబడు. అవి జ్ఞానేంద్రియములని కర్మేంద్రి యములని రెండువిధములు. చెవులు, చర్మము, నాసికయు, నాలుకయు, నేత్రములను నీరైదును జ్ఞానేంద్రియములు.

* బ్రహ్మ విష్ణు శివాద్యాస్తు ప్రాకృతా గుణనిర్మితాః. అనిమూలము.

వాక్కు, బాహువులు, పురుషాంగము, పాదములు, పాయువు ననునివి కర్మేంద్రియములు. తామసమునుండి శబ్దము గలిగెను. దానినుండి యాకాశము, దానినుండి స్పర్శము, దాన వాయువు, పిదప రూపము, మఱి తేజస్సు కలిగెను. దానినుండి రసము, దాన నాపస్సులు, వానినుండి గంధము, దాన భూమియుఁ దోఁచెను. చరాచరస్థితి భూమివలననే సాగుచున్నది. ఆకాశాదితత్త్వములయందు నేకద్విత్రిచతుర్గుణములు, భూమియందుఁ బంచగుణములు కలవని చెప్పఁబడినవి. కావుననే భూమియం దీవిశేషముకలదని యెఱుంగవలయు. కాలమాయాంశలింగములనుండి యచేతనమగునండము కలిగెను దానియందుఁ జేతనము ప్రవేశించెను. ఆయండమునుండి విరాట్టుదయించెను. జలాంతరమున నాతఁడు శయనించెను ముఖాద్యవయవములు వచనాదుల కుపయుక్తములుగాఁ దోఁచెను. ఆ మహాత్ముని నాభియందే పద్మము కలిగెను. సహస్రార్కసమాన ప్రకాశముకలది యది యనివిఖ్యాతికలదు. ఆపద్మమునుండియే స్వాయంభువు కలిగెను. లోకముల కతఁడు ప్రపితామహుఁడు. విరాట్టువు దయఁగోరి తీవ్రతపస్సాచరించి యాస్వాయంభువు తదనుమతినొంది లోకములను లోకపాలకులను గల్పించెను. పదునాలుగులోకములు నూర్ధ్వాధోభాగముల నాతనినుండియే కలిగెను. ఇన్ని లోకములు కలిగిన యాకృతి బ్రహ్మాండమనఁబడును. అందు స్థావరజంగమాత్మకభూతముల నిర్మించెను బ్రహ్మమానసపుత్త్రులు సనకాదులు నలువురైరి. వరుసఁగా నీలోకము వృద్ధినొందెను. ఇది బ్రహ్మాండోత్పత్తిప్రకారము.

## రాధామాధవమహాత్త్వము.

*మోహినీ! ఆలకింపుము. ఈబ్రహ్మాండ మేమహాత్ముని వలనఁ గల్గెనో యాపరమపురుషుఁడు నిరంజనుఁడు, చిత్స్వరూపుఁడు, జనార్ధనుఁడు, జ్యోతిస్స్వరూపుఁడు శ్రీకృష్ణుఁడు. కావున నామహనీయునిమహిమము నాలకింపుము. తొలుతఁ దల్లక్షణమును వచింతు గోలోకమున శ్రీకృష్ణమూర్తి జ్యోతిర్మధ్యభాగమున నుండును. పరబ్రహ్మ యతఁడే. అద్వితీయుఁడు. దృశ్యాదృశ్య స్వరూపుఁడుగ నుండును. ఆ లోకమునందే గోవులు, గోపాలకులు, గోపికలు, బృందావనము, శతశృంగపర్వతము, విరజానదియుఁ, గల్పవృక్షములు, వివిధవిధపక్షులు గలవు. అవియే శ్రీకృష్ణావతారమున భూలోకమున వెలసెను. మూలప్రకృతియగు రాధిక యెంతకాలము జాగరూకత నందియుండునో యంతకాలము శ్రీహరి దృశ్యరూపుఁడయియే యుండును. ప్రళయకాలము రాఁగా గోవులు లోనగునవి నిద్రించును. అత్తఱి నవియెల్ల నాకరంధ్రాముని గనుఁగొనఁజాలకుండును. జ్యోతిర్మధ్యభాగమునఁ గమనీయతనువుధరించి కిశోరమూర్తి యనం గననగుచు నీలమేఘశ్యాముఁడై పీతకౌశేయధారియై ద్విభుజములుగలిగి వేణువు కరసరసిజమందలరారఁగాఁ గిరీటాదివిభూషణము లొప్పారఁ గైవల్యనాథుఁ డుండును. రాధాదేవి శ్రీకృష్ణహృదయవర్తినియై యుండును. ఆరాధిక శ్రీహరికిఁ బ్రాణాధికప్రియతమురాలు. సువర్ణచ్ఛాయగలిగి చిద్రూపిణియై ప్రకృత్యతీతయైయుండును. ఈరీతి నుండురాధా

* ఈవిషయము పూర్వవిషయము ననుసరించియే యేఁబదితొమ్మిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మాధవులకు భేదము కానరాకుండు. నిత్యస్వరూపులుకదా. దాని కేమికారణమో యెవ్వరు నిర్ణయింపఁజాలరు. వేదములు నిర్ణయింపఁజాలకయుండఁ దక్కినవా రెవ్వ రెట్లు నిర్ణయింపఁ గలరు? ఏరూపము శ్యామసుందరమై జ్యోతిర్మధ్యభాగమున నుండునో దాని నొకానొకప్పుడు శంకరుఁడు దర్శించెను. అది ధ్యానగోచరము. అదిమొద లందఱు గోలోకవాసుని మహిమము నెఱింగిరి. నారదాదిమునులు సనకాదియోగులు శంకరప్రోక్తరూపమును ధ్యానింపసాగిరి. కాని దర్శింపఁజాలకయుండిరి. శివుఁ డింతదనుక మరల నాజ్యోతిర్మధ్యవిలసచ్ఛ్రీకృష్ణరూపమును దర్శింపఁ దపస్సాచరించుచున్నవాఁడు కాని దర్శింప వలనుపడదయ్యె. కావున సనాతనమనుబుద్ధిచే ధ్యానించుచున్నవాఁడు.

ఒకానొకప్పుడు రాధామాధవులు క్రీడించుచుండఁగా నాహరిరూపము రెండుగా నయ్యెను. అందు వామాంగము చతుర్భుజములుగల దయ్యెను. సమానరూపముగా నుండెను. సమానాంబరాలంకారములు గలదయ్యెను. అట్లే రాధారూపముకూడ రెండుగా నయ్యెను. ఒండొరుల వీక్షింపసాగిరి. చతుర్భుజరూపము లక్ష్మీకాంతుఁ డనఁబరఁగెను. ఆరూపము శంకరాదులకు భక్తులకు దర్శింపఁదగియెను. బ్రహ్మయునెప్పుడో యొకతఱి దాని దర్శింపఁజాలెను. సృష్టికార్యమున నారూపమే దర్శింపఁదగి వాంఛాప్రద మాతనికయ్యెను. లక్ష్మీదేవి సనత్కుమారున కాచతుర్భుజరూపప్రభావమును దెలిపెను. విష్వక్సేనుఁడు తెలిసికొనఁగల్గెను. ఆరూపమే నారాయణాహ్వయము.

దానినే యెల్లరును ధ్యానింతురు. ధర్మపుత్త్రుఁడు దానిమహిమ్మ మును నారదమునికి నెఱిఁగించెను.

గోలోకమహిమమంతయు రాధామాధవ మయము. ఆరాధయే దేవవర్యపూజితపాదారవింద యని యెఱుంగుము. ఒక్కతఱి నాదేవియే శివరూపమును గౌతుకమున ధరించెను. యోగీశ్వరేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడే దానింగాంచి యచ్చెరు వందెను. వెంటనే యామె మూలప్రకృతిరూపమును ధరించెను. వామదేవముని యారూపమునే ధ్యానించువాఁడు. దుర్గారూపమును దాల్చినహారిని మునులు ధ్యానింతురు. రాధయే లక్ష్మియని సావిత్రీసరస్వతులని పిలువఁబడును. గంగయు నామెయే. వీరి కించుకంతయు భేదములేదు. కామధేనుస్వరూపిణియగు నారాధాంబ యైగువిధములుగా మూర్పు నొందెను. రాధికానాథుఁడగు శ్రీకృష్ణుఁడే లక్ష్మీశుఁడనియుఁ బిల్వఁబడును. ఆతఁడే బ్రహ్మయు ధర్ముఁడు నారాయణుఁడునగు. ఇట్టు లాపరమాత్మయే పంచధా పరిణమించెను. కార్యకారణ రూపునిగాఁ దత్త్వవేత్త లాపరమేశ్వరు ధ్యానింతురు. విషయాంతరప్రసక్తి శివుఁడు నయ్యెను. రాధాకాంతుని రాధికను ధ్యానించువారు సచ్చిత్సుఖాత్మకులగుదురు. ఆకృష్ణపరమేశ్వర తేజస్సముద్భూతురాలే రాధిక. మూలప్రకృతి సర్వలోకేశ్వరి కృష్ణరూప. దైత్యసంహారకారిణియునగు. ఒకానొకతఱి నారాధయే దక్షునకుఁ గూఁతురై పుట్టి శంకరునకుఁ బత్నియయ్యెను. భర్తృనిందావాక్యముల నాలకించి పతివ్రత గావునఁ దనతనువును యోగాగ్నిం గాల్చెను. హిమవంతునకుఁ గొమరితగాఁ బుట్టి మేనాదేవిని జననిగా భావించుచు శివునే భర్తగాఁ బడ

సెను. వస్తుతః రాధికయే శివపత్నియునగు. జగదంబాస్వరూపయు నామెయే. ఏలయనఁగా సర్వమున కధీశ్వరిగాన వలసిన రూపములఁ గార్యబాహుళ్యము ననుసరించి ధరించును. మోహినీ! వినుము *శ్రీకృష్ణుఁడే గణపతి. శివుఁడే స్కందుఁడగు. కొందఱు శివుఁడే రాధారూపమును ధరించెనందురు. కావున శివకృష్ణులకు భేదము కానరాదు. కృష్ణుఁడే మూలప్రకృతి. శివుఁడే రాధిక. లేక యొక్కతత్త్వమే. ద్విధావికృతి నొందెనో యెవ్వ రెఱుంగఁజాలరు? ఏపరతత్త్వమనిర్దేశ్యమగునో యది నిర్దేశింప నెట్లు శక్యమగును? †సర్వకర్మములకు శాస్త్రము నియామకమగును. కర్మి జీవుఁడని వర్ణింపఁబడు. అతఁ డీశ్వరాంశసంభూతుఁడు ప్రభువనంబడు. ప్రకృతిపరుఁడే యైనను మాయచే మోహింపఁబడియుండును. ఎవ్వఁడు సర్వసాక్షియనఁబడునో అనుశయితయునగునో యాతని ననుశాయి యెఱుంగఁజాలఁడు ఆర్తులని దృప్తులని యిరుదెఱంగుల జీవులుందురు. ఆర్తులసహాయులు. దృప్తులు జన్మాంతరసహాయులగుదురు నిర్భయులు నగుదురు. ఎవరు మహాలక్ష్మియందుఁ బ్రపన్నులై సఖిభావము నాశ్రయింతురో వారలకొఱకు విధిబోధితమగుమంత్రమును దెలిపెదను. "గోపీజనవల్లభచరణం శరణం ప్రపద్యే" అనునదియే మంత్రము. పదాఱువర్ణములు కలది. మంత్రరాజ మనంబడును. మహాలక్ష్మియే దీనిం బ్రకాశింపఁజేసెను. తొలుత సనత్కుమారునకు శివుఁ డుపదేశించెను.

---

* స్వయం కృష్ణో గణపతి స్స్వయం స్కందశ్శివోఽభవత్, శివమేవం వదంత్యేకే రాధారూపం సమాశ్రితమ్. అని మూలము. † శాస్త్రం నియామకం భద్రే సర్వేషాం కర్మణాం భవేత్. అని మూలము.

ఈమంత్రమును సఖిభావము నాశ్రయించి గోపికాబృందము నడుమనుండునట్లు తనను దలంచుకొనవలయు. సాధకుఁడు తన గురువునం దీశ్వరభావము నునిచి వర్తింపవలయు. సదా ప్రణతుఁడుగా నుండవలయును. రాధామాధవసంజ్ఞగలవానినిగాఁ దన్ను దలంపవలయును. విష్ణుభక్తులయందు సమత యునుపందగు. ప్రేమబంధనమువలన రేయింబవళ్లు ధ్యానించుచుండవలయు. శక్తిలేదేని పర్వములయందైనను ధ్యానింపవలయు. దాన భగవత్ప్రీతిపాత్రుఁ డగును.

మహాశయులారా! రాధామాధవపూజపద్ధతి లోనగు విషయములను వ్రాసితిని. వీనిని భక్తిగలవారలే పంపఁదగును. అది లేనిచో నివిసుంతయు ఫలమునీయఁజాలవు. ఈమహాపురాణమునందుఁగూడ నేవిషయమునందును శివకేశవులకుఁగాని రాధాసాత్వతులకుఁగాని భేదములేదని స్పష్టపఱుపఁబడినది. సాధకుఁడనఁగా నుపాసకుఁడని యర్థము. అతఁడు భేదబుద్ధిగలవాఁడైనచో ఫలముగలుగదనుట సత్యము. ఆభేదబుద్ధిగలవాఁడయ్యెనేని తంత్రోక్తఫలము గలుగును. ఎన్నిమంత్రములు నేర్చుకొన్నను నేర్చుకొనఁదగినవిషయముఁనువదలిన ఫలముగలుగునని యాశపడుటకల్ల. మంత్రమహిమమును బురాణమునుండి గ్రహించి తద్విధానమును నమ్మకయున్న వ్యర్థముగాక మఱేమగును? వృథాయాసము. అంతియగాదు. జన్మాంతరమున నీచయోనిజననముకూడఁ గల్గును. కావున నొక్కదేవతను నమ్మినా నాదేవతయే సర్వదేవతాస్వరూపుఁడని నమ్మిన దంత్రమునఁ జెప్పఁబడినఫలముగలుగును ప్రకృతిపురుషులలోఁ బురుషుఁడే యుపాస్యుఁడనియుఁ బ్రకృతియుపాసనార్హ కాదనియు

వాదించుట మొండితనముగాక మఱేమిటి! అవయవవిశిష్టము ధ్యానసాధ్యము. అది ప్రకృతిమయమేకాక మఱేమగును? అపుడు ప్రకృతి యెట్లుపాస్యకాదో తెలియరాదు రూపనామ క్రియాసహితమగునది యెల్లఁ బ్రకృతికి లోఁబడినదియే. హరి హరబ్రహ్మాదు లామూలప్రకృతి కింకరులేగాక మఱేమి? తద తీతుఁ డుపాస్యుఁ డెట్లగును? ఆయుపాసనము వేఱు. దాని కీవిధు లక్కఱలేదు భావనారూపమే యాయుపాసనమగును. సర్వత్ర యాపరతత్త్వమునే కాంచుటయే నిర్గుణోపాసనము.

"సర్వత్ర సమదర్శనః." అన్న భగవదుక్తి కర్థమేమి?
విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః."

అన్నదానికి భావమేమి? నిర్గుణోపాసనమన నిదియే యనక మఱొక్కమాట పలుక సాధ్యమే ధ్యానమునకుఁ జందన పుష్పాదిపరికరము లక్కఱలేదు.

"ఆత్మా త్వం గిరిజా మతిః పరిజనాః ప్రాణాశ్శరీరం గృహం
పూజా తే విషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః
సంచారః పదయోః ప్రదక్షిణవిధిస్స్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్.

అన్న శ్రీమచ్ఛంకరోక్తియందుఁ గలసారమేమి? ఏపని చేయు చున్న నీశ్వరునివిగా దాని భావించుటయే యనికాదా. మఱొక్కమాట పలుక సాధ్యమా. ఇదియే పూజారహస్యము. వేషధారుల కివి రుచింపవు. ఏలన? వీనిచే వారికి ద్రవ్యము దొరకదు. కావునఁ దొలుదొలుత బాహ్యపూజావిధానము నెఱవేర్చి కొంత మనశ్శాంతిని గలిగించుకొని పిదప మానసిక

పూజావిధి ననుసరించి మనశ్చాంచల్యమును వదలించుకొని పిదప భగవంతుని సర్వవ్యాపిగాఁ జూడ నభ్యసింపవలయు. ఆతరుణమున భక్తునిమనస్సు భేదబుద్ధిని మాని కామక్రోధాదులకు లోఁబడక సర్వవస్తువులను భగవద్రూపమునుగాఁ జూడగల్గును. అదియే భక్తిపరాకాష్ఠావస్థ. జ్ఞానిలక్షణమదియే. ఇఁకఁదరువాతి శ్రీకృష్ణమహిమము నాలకింపుఁడు.

## శ్రీకృష్ణప్రేమామృతస్తోత్రము.

*పరశురాముఁడు శంకరునివలన దివ్యాస్త్రలాభము నొందెను. కాని యవి తనకు సాక్షాత్కరింపకయుండెను. కారణ మేమని యగస్త్యునిచెంత కరిగి యడవినడుమ జరిగినమృగీమృగ సంవాదమును నెఱింగించెను. అగస్త్యముని పరశురాముని సంశయము నెడఁబాపఁగోరి యిట్లు పలికెను. కార్యాకార్యవిశారదా! రామా! వినుము. హితముపదేశింతును. ఆరీతిగాఁ జేయుము. ఇక్కడికిఁ గొంతదూరమునఁ బరమదుర్లభమగు శ్రీమహావిష్ణుస్థానము కలదు. అందే యామహావిష్ణుపాద చిహ్నము లగపడును. పూర్వము బలినిగ్రహణమున వామనమూర్తిపాదత్రితయమున ముల్లోకములఁ గొలుచుతఱిఁ దత్పాదవిన్యాసస్థలమునుండి గంగ యావిర్భవించెను ఆస్థలమునకే నీవరిగి యొకమాస మేకాగ్రచిత్తమున నీచెప్పఁబోవు శ్రీకృష్ణప్రేమామృతస్తోత్రమును బఠింపుము. నియమమునఁ బఠింపవలయుఁజుమీ. నియతాహారుఁడవు కావలయును. మంత్రసిద్ధినిగోరి యింతకుమున్నే నీవు కవచము నభ్యసించితివికదా.

* ఇది బ్రహ్మాండపురాణముల్లోనుపోద్ఘాతపాదము ముప్పదాఱవయధ్యాయమునుండి సంగ్రహీతమని యెఱుంగునది.

శత్రువిజయమును గోరితివి. అది యీపారాయణము చేసినఁ గాని సిద్ధింపదు.

అనుమాట లాలకించి పరశురాముఁ డచ్చటి కరిగెను. స్వర్ణది యెచ్చోట నావిర్భవించెనో యందునొకయాశ్రమమును గల్పించుకొని యకృతవ్రణుఁ డనుపేరుగలమిత్రునింగూడి వసించెను. శ్రీకృష్ణప్రేమామృతమను నామముగలస్తోత్రము నభ్యసింపసాగెను. ఆస్తోత్రమును భూదేవికి నాదిశేషు వుపదేశించినది. సర్వకామముల ఫలింపఁజేయునది. భుక్తిముక్తుల నొసంగునది *అది శ్రీకృష్ణుని మాటయెనిమిదినామములుగలది. భగవం

శ్రీకృష్ణప్రేమామృతస్తుతిః.

*శ్రీకృష్ణః కమలానాథో వాసుదేవస్సనాతనః, వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః. ౧. శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలో హరిః, చతుర్భుజాత్తచక్రాసిగదాశంఖాద్యుదాయుధః. ౨. దేవకీనందనశ్శ్రీశో నందగోపప్రియాత్మజః, యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః. ౩. పూతనాజీవితహర శ్శకటాసురభంజనః, నందవ్రజజనానందీ సచ్చిదానందవిగ్రహః. ౪. నవనీతవిలిప్తాంగో నవనీతనటోఽనఘః, నవనీతలవాహారీ ముచుకుందప్రసాదకృత్. ౫. షోడశస్త్రీసహస్రేశ స్త్రిభంగీ మధురాకృతిః, శుకవాగమృతాబ్ధీందుర్గోవిందో గోవిదాంపతిః. ౬. వత్సపాలనసంచారీ ధేనుకాసురమర్దనః, తృణీకృతతృణావర్తో యమళార్జునభంజనః. ౭. ఉత్తాలతాలభేత్తా చ తమాలశ్యామలాకృతిః, గోపగోపీశ్వరో యోగీ సూర్యకోటిసమప్రభః. ౮. ఇలాపతిః పరంజ్యోతిర్యాదవేంద్రో యదూద్వహః, వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః. ౯. గోవర్ధనాచలోద్ధర్తా గోపాలస్సర్వపాలకః, జో నిరంజనః కామజనకః కంజలోచనః. ౧౦. మధుహా మధురానాథో

తున కాస్తుతిని బారాయణముచేయువారలయం దత్యంత ప్రీతి యుండును. ఇది సామాన్యస్తుతివంటిది కాదు. సమాహిత

---

ద్వారకానాయకో బలీ, బృందావనాంతసంచారీ తులసీదామభూషణః ౧౧. స్యమంతకమణేర్హర్తా నరనారాయణాత్మకః, కుబ్జాకృష్టాంబరధరో మాయీ పరమపూరుషః. ౧౨. ముష్టికాసురచాణూరమల్లయుద్ధవిశారదః, సంసారవైరీ కంసారీ మురారిర్నరకాంతకః. ౧౩. అనాదిబ్రహ్మచారీ చ కృష్ణావ్యసనకర్షకః, శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధనకులాంతకృత్. ౧౪. విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః, సత్యవాక్సత్యసంకల్పస్సత్యభామారతో జయీ. ౧౫. సుభద్రాపూర్వజో విష్ణుర్భీష్మముక్తిప్రదాయకః, జగద్గురుర్జగన్నాథో వేణువాద్యవిశారదః. ౧౬. వృషభాసురవిధ్వంసీ బకారిర్బాణబాహుకృత్, యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః. ౧౭. పార్థసారథిరవ్యక్తో గీతామృతమహోదధిః, కాళీయఫణిమాణిక్యరంజితశ్రీపదాంబుజః. ౧౮. దామోదరో యజ్ఞభోక్తా దానవేంద్రవినాశకః, నారాయణః పరంబ్రహ్మ పన్నగాశనవాహనః. ౧౯. జలక్రీడాసమాసక్తగోపీవస్త్రాపహారకః, పుణ్యశ్లోకస్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః. ౨౦. సర్వతీర్థాత్మకస్సర్వగ్రహరూపీ పరాత్పరః, ఇత్యేవం కృష్ణదేవస్య నామ్నామష్టోత్తరం శతమ్. కృష్ణేన కృష్ణభక్తేన శ్రుత్వా గీతామృతం మహత్, స్తోత్రం కృష్ణప్రియకరం కృతం తస్మాన్మయా శ్రుతం కృష్ణప్రేమామృతం నామ పరమానందదాయకం. అత్యుపద్రవదుఃఖఘ్నం పరమాయుష్యవర్ధనం, దానం వ్రతం తపస్తీర్థం యత్కృతం త్విహ జన్మని. పఠతాం శృణ్వతాం చైవ కోటికోటిగుణం భవేత్, పుత్రప్రదమపుత్రాణామగతీనాం గతిప్రదం, ధనావహం దరిద్రాణాం జయేచ్ఛూనాం జయావహం, శిశూనాం గోకులానాం చ పుష్టిదం పుణ్యవర్ధనం. బాలరోగగ్రహాదీనాం శమనం శాంతికారకం, అంతే కృష్ణస్మరణదం భవ

చిత్తులై పఠించిన సర్వవాంఛితములు ఫలించును. అంతమున సాయుజ్యము గల్గును. ఇదియే యాస్తోత్రఫలము.

ఇట్టు లాపరశురాముఁడు శ్రీహరిని సన్నుతింపఁగా శ్రీకృష్ణుఁడు దర్శనమొసంగెను. చతుర్వ్యూహాధిపతి, కమలలోచనుఁడు దర్శనమొసంగఁగా నాజమదగ్నికుమారుఁ డానందాంబుధినోలలాడి సాష్టాంగనమస్కారము లాచరించి లేచి కరములుజోడించి శ్రీకృష్ణదివ్యపాదారవిందద్వయమును మదినిల్పి పరమేశ్వరా! దీనబంధూ! సకలాపన్నివారకా యని తలంచుచు వినుతించెను.*పరాత్పరుఁ డానందించి సర్వార్థసిద్ధులఁగలుగున

తాపత్రయాపహం, ఆసిద్ధిసాధకం భద్రే జపాదికరమాత్మనాం. కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే, నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే. ఇమం మంత్రం మహాదేవి జపన్నేవ దివానిశం, సర్వగ్రహానుగ్రహభాక్సర్వప్రియతమో భవేత్. పుత్రపౌత్రైః పరివృతస్సర్వసిద్ధిసమృద్ధిమాన్, నిషేవ్య భోగానంతేఽపి కృష్ణసాయుజ్యమాప్నుయాత్.

ఇతి కృష్ణప్రేమామృతస్తోత్రం సంపూర్ణమ్.

పరశురామకృతశ్రీకృష్ణస్తుతిః.

* నమోనమః కారణవిగ్రహాయ ప్రపన్నపాలాయ సురార్తిహారిణే, బ్రహ్మేశశక్రేంద్రముఖైస్తుతాయ నతోఽస్మి నిత్యం పరమేశ్వరాయ. ౧.
౦ వేదవాదైర్వివిధప్రకారైర్విశ్వేతుమీశానముఖా న శక్నుయుః, త్వం

ట్లాశీర్వదించెను. దాన సర్వాస్త్రములు స్వాధీనము లయ్యెను. కావున మహామతులారా! పరమేశ్వరునందుఁ బరశురాముఁడు భక్తియునిచి సకలమంత్రములఁ బరిగ్రహించి శ్రీకృష్ణునారాధించి వానిసిద్ధిని గాంచినట్లే మనముకూడ హరిహరులయందు

---

త్వామనిర్దేశ్యమజం పురాణమనంతమీడే భవ మే దయాపరః. ౨. యస్త్వేక ఈశో నిజవాంఛితప్రదో ధత్తే తనూర్లోకవిహారరక్షణే, నానావిధా దేవమనుష్యతిర్యగ్యాదస్సుభూమేర్భరవారణాయ. ౩. తం త్వామహం భక్తజనానురక్తం విరక్తమత్యంతమపీందిరాదిషు, స్వయం సమక్షం వ్యభిచారదుష్టచిత్తాస్వపి ప్రేమనిబద్ధమానసమ్. ౪. యం వై ప్రపన్నా అసురాస్సురాశ్చరాస్సకిన్నరాస్తిర్యగయోనయోపిహా, గతాస్స్వరూపం నిఖిలం విహాయ తే దేహాంస్త్వపత్యర్థమమత్వమీశ్వర. ౫. తం దేవదేవం భజతామభీప్సితప్రదం నిరీహం గుణవర్జితం చ, అచింత్యమవ్యక్తమఘౌఘనాశనం ప్రాప్తోఽరణం ప్రేమనిధానమాదరాత్. ౬. తపంతి తాపైర్వివిధైస్స్వదేహమన్యే తు యజ్ఞైర్వివిధైర్యజంతి, స్వప్నేఽపి తే రూపమలౌకికం విభో పశ్యంతి నైవార్థనిబద్ధవాసనాః. ౭. యే వై త్వదీయం చరణం భవశ్రమార్తిర్విణ్ణచిత్తా విధివత్స్మరంతి, నమంతి భక్త్యాథ సమర్చయంతి వై పరస్పరం సంసది వర్ణయంతి. ౮. తేనైకజన్మోద్భవపంకభేదనప్రసక్తచిత్తా భవతోఽంఘ్రిపద్మే, తరంతి చాన్యానపి తారయంతి హి భవౌషధం నామసుధా తవేశ. ౯. అహం ప్రభో కామనిబద్ధచిత్తో భవంతమాద్యం వివిధప్రయత్నైః, ఆరాధయం నాథభవానభిజ్ఞః కిం తేహ విజ్ఞాప్యమిహాస్తి లోకే. ౧౦.

ఇతి పరశురామకృతశ్రీకృష్ణస్తుతిస్సమాప్తా.

భేదబుద్ధిని బరిత్యజించి యేకతత్త్వమే కార్యాంతరములఁ సాధించునిమిత్తము రెండురూపముల ధరించెనని విశ్వసించి యందేరూపము నాశ్రయించినను ఫలముగలుగునని నమ్మి సేవింపవలయును. అదియే యిందుగలసారతరార్థము. ఇఁకఁ దరువాతికథ నాలకింపుఁడు.

శ్రీకృష్ణునికడకు బ్రహ్మాదిదేవత లరుదెంచుట.

* శ్రీకృష్ణుఁ డవతరించి చేయఁదగు చేయింపఁదగుమహాకార్యములనెల్ల నొనరించెను. ధర్మము చాలకాల మిల నెలకొన భగవద్గీతలు లోనగువానిమూలమున లోకుల కుపదేశించెను. దురాత్మకులెల్ల హతులైరని యోజించెను. ఇఁక యాదవులుమాత్రము మిగిలియున్నారు. వారినాశమునకుఁ దగుకారణములు తమంతటనే కలిగెను. తాను సాక్షిభూతుఁడై చూచుచు నానందించుచుండెను. అట్టితఱి బ్రహ్మదేవుఁడు సత్యలోకమునుండి ప్రయాణముచేసి సకలదేవతలు నింద్రాదిదిక్పాలకులు తన్నుఁ బరివేష్టించిరాఁగా సనకాదిమానసపుత్త్రులు కశ్యపాదిప్రజాపతులు ననుసరించిరాఁగా ద్వారకానగరమున కరుదెంచెను. దేవతాభేదజాతులెల్ల వారివెంటవచ్చెను. సకలదేవత లొక్కటిగాఁ గూడివచ్చుట చూచువారల కచ్చెరు కల్గింపఁ జాలియుండెను.

ద్వారకానగరమును జేరిరి. అందుఁ బరాత్పరుఁడు లీలామానవవిగ్రహమున వేంచేసియుండెను. చూచుటకు నున్న కన్నులు చాలవు. ఆభగవంతునిరూప మత్యద్భుతము. సకల

* ఇది శ్రీభాగవతమునఁ బదునొకండవస్కంధమున నాఱవయధ్యాయమునుండి ప్రధానముగా గ్రహింపఁబడినది.

లోకపాపధ్వంసనకరము. నిర్మలయశోదాయకము. జన్మముల నెన్నింటియందో మహాపుణ్యకార్యము లొనరించినఁగాని కనఁబడునదికాదు. అంతియగాక యేజన్మమున నామూర్తి కనఁబడునో దానింగాంచినంతన నిర్వ్యాజభక్తికుదురునో యది కడపటిజన్మ మనవలయు. ఈభావమున కేయుపనిషత్తులు, ఏపురాణములు నడ్డుపడఁబోనవు. అట్టి సకలగుణకల్యాణమూర్తి యాపురవరమున విజయంచేసి భక్తులకన్నులకఱవు దీర్చుచుండెను. బ్రహ్మాదు లెల్లరకుఁ గనఁబడునట్లు వచ్చి రాయనియు వారిసంభాషణము నెల్ల రాలకించిరాయనియుఁ గొందఱు ప్రశ్నింతురు. అది సమంజసమగు ప్రశ్నముకాదు. ఇన్నిశక్తులుగలబ్రహ్మాదులు ద్వారకానగరవాసులకుఁ గనఁబడకయుండ శ్రీహరితో మాటలాడఁజాలరా అనునదియే యాప్రశ్నమునకు సమాధానమనఁదగు. ఇట్లు వచ్చినబ్రహ్మాదులు భగవంతుని సందర్శించి కల్పవృక్షములనుండి ప్రీతిపూర్వకముగాఁ దెచ్చినపుష్పములను హారములుగా నలరించి దివ్యపాదారవిందములకడఁ గానుకలిడిరి. సాష్టాంగవిధి నమస్కారము లొనరించిరి. మఱియు భక్తిభారమునఁ గొనివచ్చినయుపాయనముల నర్పించిరి.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి."

అన్న భగవంతునభిప్రాయమునే యనుసరించి కానికలు సమర్పించి కరములు జోడించి యిట్లు స్తుతించిరి. దేవాదిదేవా! పురాణపూరుషా! కర్మపాశములనుండి విముక్తిని గోరుమహాత్ములు మనస్సుల నిరంతరము ధ్యానించు నీపాదపద్మములను బుద్ధీంద్రియప్రాణమనోవచనములచే నమస్కరింతుము. పరా

త్వరా! నీవు గుణత్రయరూపమగు మాయాయోగమునఁ నాత్మయందు మాయాగుణస్థితిచే నూహింపఁదరంబె కాని మహదాదిరూపంబగు నీప్రపంచమును బుట్టింతువు. చక్కఁగఁ బాలింతువు. ఉచితకాలమున సంహరింతువు. అట్లు మహాకార్యములఁ జేసియు నాత్మసుఖసంపన్నుఁడవై రాగాదులకు దూరంబుగ నుండి యాకర్మముల నంటవు. నీకీర్తి నాలకించుటచే జనించిన పట్టుదలచే సత్త్వగుణప్రధానజీవులకుఁ గలిగినచందమున రాగముగలవారలకు విద్యచే, శ్రుతాధ్యయనదానతపఃప్రభృతులచేతమనశ్శుద్ధికలుగదు. మహానుభావా! నీపాదపద్మములను మునులు ప్రేమశీతలహృదయములచే ముముక్షువులై ధ్యానింతురు. భక్తులు సమానైశ్వర్యకాములై వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధవ్యూహముల నారాధింపఁదగు నీపాదకమలముల నర్చింతురు. ఆత్మవేత్తలు వైకుంఠమునుగోరి కాలత్రయములఁ బూజింతురు. అట్టి నీయంఘ్రికమలములు *మాకుఁగల విషయవాసనలకుధూమకేతువులయ్యెను (వానినెల్లఁదుదముట్ట నశింపఁజేయునవి) మహాపురుషా! వైదికకర్మాభిరక్తులు తదుక్తపద్ధతిమీఱక పురోడాశాదికమును గ్రహించి యజ్ఞాగ్నిహోత్రమున వేల్చుచు దేనిని దలంతురో, ఆత్మయోగమును దెలిసికొన నభివాంఛించుయోగు లధ్యాత్మయోగమున ధ్యానింతురో, భక్తశిఖామణులు సర్వవిధములఁ బూజచేయుదురో, అట్టి నీపాదారవిందద్వంద్వము మాయశుభవాసనల నశింపఁజేసెను. శ్రీమహాలక్ష్మి ప్రతిక్షణము స్పర్ధను బూనియుండ

* స్యాన్నస్తవాంఘ్రిరశుభాశయధూమకేతుః. అని మూ. అశుభాశయానాం విషయవాసనానామ్. అని వ్యాఖ్య.

నా పెను లెక్కింపక భక్తజనులు సమర్పించుమనోహరవనమాలి
కను బహూకరించుచు నర్చనలం బరిగ్రహించు నీచరణసర
సిజయుగ్మము మాకుఁగలశుభేతరవాసనలం దుడిచివేసెడిని.
బలిచక్రవర్తిని నిగ్రహించుతరుణమున యందు మూఁడుపాద
ములచే ముల్లోకములం గొలుచుకాలమున విజయపతాకరీతి
సత్యలోకమువఱకుఁ బ్రాఁకి దుష్టులకు భీతిని దేవతలకు నభయ
ప్రదానము ననుగ్రహించి త్రిపథగానదిపతాకచందమున నలరా
రుచు సాధువులకు స్వర్గప్రాప్తి నసాధువులకు నరకనివాసమును
గల్గించు నీపాదపంకజములజంట భక్తులమగుమాచు సంక్రమిం
చినపాపముల భస్మీకరించెడు. పురుషోత్తమా! యుద్ధాదిపీడలనొంది
యున్న బ్రహ్మాదులు ప్రకృతిపురుషులకంటె విలక్షణుఁడై కాలా
త్మకుఁడై యలరు నేపరమాత్మవశమున ముకుఁద్రాటంగట్టఁబడిన
గోవులచందమున వర్తింతురో అట్టి నీదగుదివ్యపదసారసములు
మాకత్యంతసుఖప్రదము లగుఁగాక. సనాతనా! ఈసకలబ్రహ్మాం
డములు పుట్టుటకు పెరుగుటకు లయమందుటకు నీవెకారణము.
ప్రకృతిపురుషులకు మహత్తత్త్వమునకు నియామకుఁడవు నీవే
కదా. సర్వవిషయమునందుఁ బ్రవర్తించు చాతుర్మాస్యత్రయా
త్మకసంవత్సరరూపకాలమునీస్వరూపమే. ఉత్తమపురుషవాచ్యుఁ
డవు నీవే పురుషుఁడు ప్రకృతిసహాయమునుబడసి మాయచేత
విశ్వగర్భమునువలె మహత్తత్త్వమును ధరించుచున్నాఁడు.
ఆతత్త్వము మాయాగతమై యాత్మరూపమునుండి బహి
రావరణసమేతమగు హిరణ్మయాండకోశమును సృజించెను.
కాఁబట్టి చరాచరములకునెల్ల నధీశ్వరుఁడవు నీవేకాని వేఱొ
కరుఁడు కాఁడు. మాయచే వృద్ధినొందు నవయవవర్ధనమున

సన్నిధినొందింపఁబడు విషయములను సేవించియు శ్రీకృష్ణా! నీవు వానిసంబంధమునొందవు. ఇతరులగుజీవులు కాని యోగులు కాని మిథ్యాభూతములగు విషయసంబంధమునకు వెఱతురు. (వానిచే బంధింపఁబడుదురు) పదాఱువేలభార్యలు సరసవీక్షణాదులచేతను దక్కుంగలశృంగారచేష్టలచేతను నీమనస్సునకు వికారమును గల్గింప శక్తులు కారైరి. శ్రీకృష్ణా! అమృతమయములగు నీకీర్తిప్రవాహములు పాదప్రక్షాళనజలమయ గంగాదిమహానదులును లోకమునకుఁ బావనత్వమును గల్పింప సమర్థంబులగు. అందు వేదబోధితమగు భవత్కీర్తిమయతీర్థంబును శ్రోత్రేంద్రియముచేతను, పాదారవిందసంభవమగుగంగామహానదీతీర్థమును శరీరసంబంధములచేతను *స్వాశ్రమధర్మములందు నియతశ్రద్ధగలవారు సేవింతురు. అని భక్తిభరితస్వాంతముల ననేకరీతులఁ బ్రస్తుతించిరి.

### వైకుంఠమునకు విచ్చేయుమని బ్రహ్మ కృష్ణుని వేఁడుట.

అని యిట్లు సకలదేవతలు ద్వారకానగరమును జేరి యంతరిక్షమునందే నిలిచి యితరు లెఱుంగరాకయుండఁ బొగడుటయు బ్రహ్మదేవుఁడు వినీతుఁడై యిట్లు ప్రార్థించెను మహాప్రభూ! పూర్వము మేమెల్ల నిన్ను భూభారమును హరింపనవతరింపుమని యభ్యర్థించితిమి. సకలాత్మకుఁడవగు నీవస్మద్వాంఛితమును దీర్చి కృతకృత్యుఁడవైతివి. సత్యసంధులగు సాధువులయందు ధర్మంబు నెలకొన్నది. యాదవులకులమున నవతరించి సర్వలోకములపాపముల నడంచుకీర్తిని దశదిక్కులఁ

* తీర్థద్వయం శుచిషదస్త ఉపస్పృశంతి. అని మూ. శుచిషదః స్వాశ్రమధరస్థాః అని వ్యాఖ్య.

బరఁగించి సకలకల్యాణగుణమయమూర్తిచే లోకహితార్థము చేసిన మహాద్భుతపరాక్రమవిశేషచరిత్రములను ముందు కలికాలమునయందు సాధువులు కీర్తించియు నాలకించియు సంసారజలధిని సత్యముగా దాఁటఁగలరు. మహాత్మా! నీవీభూమి నవతరించినది మొదలుకొని యింతదనుక నూటయిరువదిసంవత్సరములు చెల్లెను. దేవహితకార్య మేదియుఁ జేయక వదలినట్లు కానరాదు. యదువంశము విప్రశాపమున నశించినట్లె యెంచవచ్చును. ఇఁక సమ్మతమగునేని పరమమగుస్థానముగా నుండు గోలోకమునకు విచ్చేయుము. అందు వేంచేసి దాసులమగు మమ్మును లోకపాలకులగు నింద్రాదులను లోకములను రక్షింపుమా యని ప్రార్థించి యంజలి గీలించి యుండెను.

శ్రీహరి బ్రహ్మాదుల వినుతుల నాలకించి మది సంతసించి మాయాకల్పితవిగ్రహుండగు శ్రీకృష్ణుఁడు శతానందా! నీయాశయమురీతి నింతకుముందే నే నాలోచించితిని మీప్రార్థనము చెల్లించితిని. భూదేవి శ్రమమును దీర్చితిని. వీర్యశౌర్యశ్రీమదమత్తంబగు నీయాదవవంశము చెలియలికట్టను దాఁటుసామ్ర్ముభంగి స్వేచ్ఛాప్రవర్తనములచే లోకమును మ్రింగఁ జూచుచుండెను. ఇట్టియవార్యగర్వమేదురమగు నీవంశమును దుదముట్ట నడంపక నే నీయవతారము నుజ్జగింతునేని ప్రపంచమునెల్ల నిది తాఱుమాఱుచేసి నశింపఁజేయును ఇంతియగాక బ్రాహ్మణశాపమున నీయదువంశమునకు నాశన మాసన్నమయ్యెను. ఈకార్యము పూర్ణముగా నెఱవేఱెనదిచూచి పరంధామమునకుఁ బోవ నెంచితిని. అని భగవంతుఁడు పలుకఁగా విని బ్రహ్మాదిదేవతలు సంతోషించి మహాపురుషునకు నమస్క-

రించి కృతకృత్యులమైతిమని తమతమలోకంబులకుఁ దదాజ్ఞ శిరంబులఁ దాల్చిపోయిరి.

ఉద్ధవుఁడు భగవంతుని బ్రార్థించుట.

శ్రీహరి తలంచినట్లే బ్రహ్మాదు లరిగినపిదప మహోత్పాతములు పొడసూప నారంభించెను అవి దివిభవములు, నంతరిక్షభవములు, భౌమము లని ముత్తెఱంగుల నుండెను. ఎల్లరు నిదియేమి విపరీతమని యాలోచింపసాగిరి. వాని నందఱుచూచినట్లే శ్రీహరియుం గాంచి యాకాలమునఁ దనచెంతనున్న యదువృద్ధులంజూచి యిట్లు పలికెను. వృద్ధులారా! మహోత్పాతములు పరంపరలుగఁ బొడకట్టుచున్నవి. మనవంశమునకు నేవిధముచేతను మీఱరానిబ్రాహ్మణశాపము కలిగెను. బ్రదుకఁదలఁచితిమేని మన మిందు నిఁకమీఁద నిలువరాదు త్వరపడి ప్రభాసతీర్థమునకుఁ బోవవలయు. అది పరమపావనము. పూర్వము దక్షుఁ డొసంగినశాపమున క్షయరోగము గలుగఁగాఁ జంద్రుఁ డాతీర్థమునకుంబోయి స్నానముచేసి పాపవిముక్తినొంది మరలఁ దనకళ లభివృద్ధినిగాంచఁగా యథాపూర్వముగ నొప్పెను. మనము నందు స్నానమొనర్చి దేవపితృతర్పణం బొనరించి మృష్టాన్నమున బ్రాహ్మణులకుఁ దృప్తిగావించి సత్పాత్రములకు మంచిదానము లొసంగి నౌకలసహాయమున సముద్రమును దాఁటినట్లు సకలపాపములను దాఁటుదము. అని పలుకుటయు నామహనీయునిమాటల నాలకించి యాదవులెల్లఁ బ్రభాసతీర్థమున కరుగ దృఢనిశ్చయులైరి. రథముల నాయత్తపఱచిరి.

ఆవిషయము నెఱింగి యామహోత్పాతంబులఁ గన్ను

లారఁ గనుంగొనియుఁ దలంకెడుమదిగలయుద్ధవుఁడు శ్రీకృ
ష్ణునియం దత్యంతభక్తికలవాఁడు గావున నేకాంతమున శ్రీ
హరిని దర్శించి చెంతకుంబోయి ప్రదక్షిణపూర్వకముగా
నమస్కరించి కైదోయిపట్టి వినయవినమితశీర్షుఁడై యిట్లు
ప్రార్థించెను. దేవదేవేశా! యోగేశ్వరా! పుణ్యశ్రవణకీర్తనా!
పురాణపూరుషా! బ్రాహ్మణశాపమును మరలింప శక్తిగలవాఁడ
వయ్యు నీ వీయదువంశము నుపసంహరించి యీలోకమును
త్యజింపఁబూనితివి. క్షణార్ధముకూడ నీపాదారవిందము విడిచి
యుండ నేనోపను నీపరమపదమునకు నన్నుం గొనిపొమ్ము.
మానవులకుఁ బరమమంగళమై కర్ణామృతమేయగు నీదివ్య
లీలాచరిత్రమును వీనులవిందుగాఁ గ్రోలి తక్కుంగలవాంఛల
వదలుదురు. శయ్యాసనవిహారస్థానస్నానక్రీడాశనాదుల నిన్ను
సేవించుచుండు మే మత్యంతప్రియుఁడవు నాత్మరూపుఁడవు
నగునిన్నెట్లు వదలియుండఁగలము? మహాత్మా! నీవుపయోగిం
పఁగా మిగిలినస్రక్చందనవస్త్రభూషణములను ధరించి నీయుచ్ఛి
ష్టమును భుజించుచు నీకు దాసులమై నీమాయనుండి విముక్తిం
గాంతుము. వాయు వాహరించి యూర్ధ్వరేతస్కులై
నిర్మలులు సర్వమును త్యజించినమునులు పొందుపరమపదము
నోమహాయోగీ! కర్మమార్గములఁ బ్రవర్తించుచు నీభక్తులతోఁ
జెలిమిచేసియు నీదివ్యచరిత్రముల వినియు దుస్తరమగు
తమస్సు నుత్తరించి సుఖముగాఁ బొందుదుము. అని మనవి
చేయఁగా నంగీకరించి భగవంతుఁ డగు దేవకీనందనుఁడు
ఏకాంతభక్తుఁడగు నుద్ధవు నుద్ధరించుపొంటె నిట్లుపదేశించెను.

మహాశయులారా ! భగవంతునకుఁ బక్షపాతము.

లేదనియుఁ, గౌరవులు భూభారభూతులుగా నుండ నెట్లు నశింపఁజేసెనో యట్లే దుర్వృత్తులగు యదువంశీయులనెల్ల నశింపఁజేయ సంకల్పించె ననియు మనము దెలిసికొనవలయును. భగవత్సంకల్పము ననుసరించియే యుత్పాతములు తోఁచెను. సర్వాంతర్యామి కావున సంకల్పించినతోడనే యేకకాలమున నఖిలబ్రహ్మాండమును వ్యాపించును. కాన నాపని నెఱవేఱును. ఇతరులగు బ్రహ్మాదులసంకల్పము లట్టివి కావు. ఈవిషయమునే
"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్."
అనుభావమున శ్రీహరి గీతాశాస్త్రమున నర్జునున కుపదేశించెను. కాఁబట్టి ధర్మపక్షపాతముతప్పఁ గృష్ణునకు వేఱొక పక్షపాతము లేదు. ఈవిషయమే ముఖ్యముగా మన మెఱుంగఁదగును ఇఁకఁ దర్వాతిభగవదుపదేశము నాలకింపుఁడు.

శ్రీహరి యుద్ధవునకు జ్ఞాన ముపదేశించుట.

* ఉద్ధవా! నీవేరీతిగా నూహించి చెప్పితివో నేనట్లే చేయఁబూనియున్నవాఁడను జుమీ. ఇంతకుఁ గొంతముందే బ్రహ్మశంకరాదు లరుదెంచి నా రాకను గోరుచున్నారమని తెల్పిరి. బ్రహ్మవేఁడికోలు నంగీకరించి నేనేకార్యముల సాధింప నిజాంశమున నవతరించితినో యాకార్యములెల్ల నెఱవేర్చితిని. విప్రశాపనిర్దగ్ధమగు యదుకులము పరస్పరకలహములన నశించును. నేఁటి కేడవనాఁడు సముద్ర మీద్వారకానగరమును ముంచివేయును. నే నీలోకమును వదలునాఁడే కలి ప్రవేశిం

* ఇదియుం దాని యనుబంధమగు నేడవయధ్యాయమునుండియే గ్రహింపఁబడినది.

చును. దాన నీలోకము నష్టమంగళం బయ్యెడు. *కలియుగ
మున జను లధర్మాసక్తు లగుదురు కాఁబట్టియే నే నీలోకమును
వదలినపిదప నీ కిష్మహీతలము వాసార్హము కానోపదు. కావున
నుద్ధవా! నీవు సర్వమును వదలి సర్వజనబాంధవస్నేహమును
బరిత్యజించి మనస్సు నచంచలముగ నాయందుఁ గుదురుకొనఁ
జేసి సర్వదర్శనుఁడవై భూమినెల్లఁ దిరుగుచుండుము. మన
స్సుచే వాక్కుచేఁ జక్షుస్సులచే శ్రవణాదులచే గ్రహింపఁ
బడుపదార్థమెల్ల మాయామయంబనియు నశాశ్వతమనియుఁ
దెలిసికొనుము. చంచలచిత్తునకు భేదవిషయమగు భ్రమము
గుణదోషభాజనంబగు. విహితకర్మము, దానినివదలుట, నిషిద్ధ
కర్మము అను భేదము గుణదోషమతికిఁగాని వివేకవంతునకుఁ
గాదని యెఱుంగుము. కాఁబట్టి యింద్రియముల జయించి
మనస్సు సమాహితముగనుండ నియమించి †యీప్రపంచ
మంతయు నపరిచ్ఛిన్నాత్మయందు నాయాత్మకధీశ్వరుఁడనగు నా
యందును జూడుము. శ్రుతితాత్పర్యనిశ్చయమునఁ దదర్థానుభవ
మును సంపాదించుకొని యాయాత్మానుభవమునఁ జిత్తము సం
తుష్టినొందఁగా శరీరులకాత్మభూతుఁడనై వర్తింతు వేని విఘ్నము
లబాధ నీకుఁ గలుగదు గుణదోషములకు రెండింటికి నతీతుఁడు
నిషిద్ధములమానుటయందును, విహితాచరణమునందును బ్రవ
ర్తించునుగాని దోషబుద్ధిని నివృత్తియు గుణబుద్ధిచే ననుష్ఠాన
మును జేయఁబూనఁడు. అట్లు చేయఁబూనినవాఁడు నిర్విష
యుఁడు కాఁడని యెంచవలయు. మఱియు నర్భకునివలె సంకల్ప

* జనోఽధర్మరుచిర్భద్ర భవిష్యతి కలౌ యుగే. అని మూలము.

† ఆత్మనీక్షస్వ వితతమాత్మానం మయ్యధీశ్వరే. అని మూలము.

విరహితుఁడై పూర్వసంస్కారమూలమునఁ జేయుచుండు. సర్వభూతములయందు సుహృద్భావముగలిగి శాంతిగలిగి జ్ఞానవిజ్ఞాననిశ్చయముగలిగి జగంబులనెల్ల నాయాత్మవలెఁ జూడఁజాలునాతఁడు క్రమ్మఱ నీసంసారక్లేశమును గాంచఁడు.

అని యిట్లు పరమేశ్వరుఁడు చెప్పఁగా విని యుద్ధవుఁడు తత్త్వము నెఱుంగఁగోరి భగవంతునకు నమస్కరించి యిట్లు ప్రశ్నించెను. యోగేశ్వరా! యోగాభిరతా! నిశ్శ్రేయఃప్రాప్తికి సన్న్యాసలక్షణయోగము చెప్పితివి. విషయాభిలాషగల యాత్మ గలుగువారలకీ కామత్యాగము దుష్కరము. అంతియ కాక నిన్ను సేవింపనివారల కయ్యది శక్యమే కాదని తలంచుచున్నాఁడను. తమయుపదేశము నొందిన నేను నీమాయావిరచితంబైనపరివార మగుదేహముపై నహం మమాభిమానములుంచిన మూఢచిత్తుఁడను. అట్లుగావున భవదుపదేశముచేత సాధించు విధముగా నీభృత్యుఁడనగు నన్ను శిక్షింపుము. స్వయంప్రకాశుఁడవు. సత్యాత్ముఁడవు. ఇట్టి నీవు తప్ప నింకొక్కఁడు దేవతలయందుఁగూడ నాకు బోధించువాఁడు కానరాకున్నాఁడు. బ్రహ్మాదులుగూడ నీమాయకుఁ జిత్తములు లోఁబడఁగా విషయములయం దాసఁబూనియున్నారు. కాఁబట్టి యనవద్యుఁడవై పారమనునది యెవ్వరికిఁగాని తెలియరాకుండ నుండుచు, సర్వజ్ఞుఁడవై యీశ్వరుఁడవై ప్రతిహతములేని వైకుంఠమున నుండువాఁడవై నరునకు మిత్రుఁడవై యలరుచు నారాయణుఁడవగు నిన్ను సంసారదుఃఖతాపములకు విసిగి రక్షింపుమని శరణుచొచ్చెదను. అని విన్నవించిన నుద్ధవునిం గాంచి శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను.

ప్రియభక్తుఁడా! వినుము. లోకతత్త్వవేత్తల, మునులుతఱచుగా విషయవాసనలనుండి తమ్ము నుద్ధరించుకొం దురు. విశేషించి పురుషుఁడు తనకుఁదానే హితాహితజ్ఞానమ్ము నందు గురువగును. ప్రత్యక్షానుమానములచేత నతఁడు శ్రేయస్సుగాంచును. పురుషత్వమునందును సాంఖ్యయోగవిశార దులగు విద్వాంసులు సర్వశక్త్యుపబృంహితుఁడనగు నన్ను సవిస్తరముగఁ గాంతురు. ఉద్ధవా! ఒక్కపాదముగలవానిని రెండుపదములుగలవానిని, మూఁడు పాదములుగలవానిని, నాల్గుచరణములుగలవానిని, ననేకపదములుగలవానిని, పాద ములేలేనివాని నీరీతి ననేకమూర్తులను సృజించియున్నాఁడను. అందు మానవదేహమే నన్నుఁ జక్కఁగా నెఱుంగఁదగినది గాన మిక్కిలి నాకుఁ బ్రియమైనది. భక్తా! ప్రత్యక్షముగాఁ గనఁబడుచున్న రూపాదిలక్షణములచేతఁగాని యనుమాన లక్షణముచేతఁగాని గ్రహింప నలవిగానివాఁడనుగదా. కావున మానవులలోఁ గొందఱుమాత్రమే యప్రమత్తులై యహంకా రాదివ్యతిరిక్తుఁడ నగు నన్ను గుణయుక్తములగు హేతువు లచే విమర్శించి వెదకుచుఁ గనుఁగొందురు. బుద్ధ్యాదిగుణము లకు స్వప్రకాశుఁ డొక్కఁడు లేకయుండినను ప్రకాశము కలుగదనియు బుద్ధ్యాదికరణంబులు కరణత్వమునంజేసి కర్తృ ప్రయోజ్యములని వ్యాప్తిని గల్పించియు నన్వేషణం బొన ర్తురు.

### అవధూతయదుసంవాదము నుద్ధవునకు శ్రీహరి తెల్పుట.

ఉద్ధవా! ఈవిషయమై పెద్దలు పురాతనమగు నొకయితి హాసము నుదాహరింతురు. అది మహాతేజుఁడగు యదువునకు

నవధూతకును జరగినసంవాదము. దానిం దెల్పిన నీప్రశ్నము నకుఁ దగినయుత్తరమగును. శ్రద్ధగా నాలకింపుము. బ్రాహ్మణుం డొక్కండు భయమన్ననది యెట్టిదో యేవిషయమునందు నెఱుంగక తిరుగుచు శీతోష్ణాదిద్వంద్వసహిష్ణువై యుండెను. అవధూత యని నాతని నెల్లరుం బిలుతురు. ఆయవధూత నొక్కనాఁడు యదువుచూచి సకలధర్మవేత్త కావున నిట్లు భాషించెను. విప్రప్రవరా! విద్వాంసుఁడవయ్యును బాలునివలె నేకర్మము నొనరింపక తిరుగుచుందువు. అత్యంతనిపుణమగు నీబుద్ధి యెట్లుకలిగినది? ప్రాయికముగా మానవులు ధర్మార్థకామములయందును వానికి సాధనముల వెదకుటయందును, ఆయుశ్శ్రీకీర్తి ప్రభృతుల నొందఁగోరియుఁ బ్రవర్తించుచుందురు. నీవో యట్టికార్యములయం దొక్కదానినేని చేయకున్నాఁడవు. చేయ నూహించినట్లు నగపడదు. కేవలము జడునివలె నున్మత్తునిరీతిని బిశాచముచందంబునఁ బ్రవర్తింతువు. ఏకార్యము చేయను సమర్థుఁడవే యగుదువు. విద్వాంసుఁడవు. సర్వకార్యదక్షుఁడవు. సుందరాంగుఁడవు. మితభాషివి. ఐనను జడోన్మత్తపిశాచచర్యల ననుసరించుచున్నావే ఏల? జనులెల్లఁ గామలోభజనిత మహాగ్నిచేఁ గాల్పఁబడుచున్నవారు. నీవన్ననో గంగాప్రవాహమున మునింగిన గజరాజుచందమున ముక్తుఁడవై యాసంతాపము నించుకంతయేఁ గాంచక హాయిగా నున్నాఁడవు. విషయానుభవము లేక భార్యాదిసంసారము లేకయుండు నీ కాత్మానంద మొదవుటకుంగల కారణమెయ్యదియో యెఱుంగఁజాలకున్నాను. దాని నెఱింగింపుమని యడిగెను. జ్ఞానసంపన్నుఁడై జ్ఞుఁడగు యదు విట్లు ప్రశ్నింపఁగా నాయవధూత వినయ

మున వంగియున్నయదువును మెచ్చుకొనుచు నిట్లుత్తర మిచ్చెను.

రాజేంద్రా! నాకు బుద్ధివిభవముగలగురువులు పెక్కురు గలరు. వారిమూలమున నే నీబుద్ధిని గ్రహించి తాపత్రయమునకుం జిక్కక ముక్తుండనై తిరుగుచున్నాఁడను. ఆగురువు లెవ్వరో యని ప్రశ్నింతువేమో వినుము (1) భూమి (2) వాయువు, (3) నభము, (4) (5) జలాగ్నులు, (6) (7) చంద్రసూర్యులు, (8) కపోతము, (9) అజగరము, (10) సముద్రము, (11) పతంగము, (12) మధుకరము, (13) గజము, (14) మధుహారియు, (15) హారిణము, (16) మీనము, (17) పింగళ, (18) కురరము, (19) బాలుఁడు, (20) కుమారి, (21) శరకారియు, (22) సర్పము, సాలెపురుగు, మంచిరూపమును గల్పించుపురుగు (తుమ్మెద) అను నీయిరువదినాలుగును నాకు గురువులు. వీనివృత్తులఁ బరీక్షించి నాయాత్మకు శిక్షగావించితిని. పూరుషవర్యా! అందేయేగురువునుండి యేయేవిషయమును నెట్లు నేర్చుకొంటినో యెఱింగించెద. ఆలకింపుము.

## పృథివ్యాదివృత్తులు.

దైవప్రేరితములగుభూతము లెన్ని తన్నాక్రమించి యెంత బాధించినను జలింపకయుండు (భూమివృత్తిని బరీక్షించి క్షమ (ఓర్పు) నేర్చుకొంటిని. భూమి పర్వతరూపముగను వృక్షరూపముగను దోఁచును. తనకుఁగలచేష్టలు పదార్థములు పరోపకారార్థ మేర్పడఁగాఁ గన్పట్టుపర్వతభూరుహరూపమున నున్నభూమినుండి పరాధీనతనేర్చుకొంటిని. అనఁగాఁ బరోపకారమునకే యీతనువును భగవంతుఁడొసంగెనని తెలిసికొంటిని.) (వాయువు ప్రాణవాయువని బాహ్యవాయువని రెండు భేదములుగ నుండును. అందుఁ బ్రాణవాయువు ఆహారాదివృత్తి

గలిగి యింద్రియవ్యాపారముల నపేక్షింపదు ఆవిధమెఱిం మనోవికలత్వము లేకయుండ దేహయాత్ర నడపుచు జ్ఞానమును సమార్జింపవలయుననియు, విషయాసక్తినొంది చిత్తచాంచల్యమును గాంచఁగూడదనియు నేర్చుకొంటిని బాహ్యవాయువు శీతోష్ణాదిధర్మములగు విషయములఁగూడియు వాని సంబంధము నొందకుండుట నెఱింగి నిస్సంగత్వము నేర్చుకొంటిని. గంధము లోనగు వానిధర్మములు గలిగియున్నట్లు లోకులకుఁ దోఁచుచున్నను వస్తుగతినిబట్టి యారయఁగా నట్లు లేదని తెలియునట్లే యాత్మ పృథివ్యాదిపంచభూతమయశరీరములం బ్రవేశించియు వానిగుణంబుల నాశ్రయించియు వానిధర్మంబులఁ బడయని తెఱంగున నిర్లేపత్వము నా వాయువునుండి యభ్యసించితిని.

ఆకాశము సర్వత్ర వ్యాపించియున్నది. కాని ఘటాదుల సంగమును పరిచ్ఛేదమును గాంచదు. అట్లే యాత్మ దేహాంతర్గతుఁడేయయ్యుఁ జరాచరములయందు సమన్వయమునం గల్గిన వ్యాప్తిని బ్రహ్మస్వరూపభావనమునను సక్తుండు నపరిచ్ఛిన్నుండును గాఁడని యెఱుంగవలయును. ఈవిషయము నాలోచించి నేను నేర్చుకొనినదేమనఁగా వాయువు ప్రేరేపింపఁగా మేఘములావరించినను నభంబునకు వానిసంస్పర్శము గలుగనియట్లు కాలస్పృష్టములగు తేజోఽన్నమయభావముల నాత్మకు సంబంధము లేదనియే. ఈవిషయమున నాకాశము నాకుగురువయ్యెను.

జలములయందు నిర్మలతయు స్వభావమున స్నిగ్ధముగానుండుటయు మధురత్వము తీర్థభూతత్వము గలదు. ఇవి ప్రకృతిసిద్ధములు. వానిం బరీక్షించి వానిసాదృశ్యము చేత, దర్శనమున, స్పర్శమునఁ, గీర్తనమున మునియగువాఁడు సఖులకుఁ

భావనత్వము కూర్పవలయును. ఇది జలము లనుగాంచి నేను నేర్చుకొంటిని.) (అగ్నివలెనే నియతాత్ముఁడగు మౌని తేజశ్శాలియై తపస్సుచేఁ బరితప్తుఁడై యక్షోభ్యుఁడై పరిగ్రహమనునది తుదముట్ట వదలి సర్వభక్షకుఁడయ్యును. వానిదోషముల నొందఁడు. అగ్నిహోత్రుఁడు హవిస్సును బరేచ్ఛానుసారము గ్రహించును. అట్లే ముని యొకచోటఁ బ్రచ్ఛన్నుఁడై వేఱొకచోటఁ బ్రకాశుఁడై మఱొక్కచోట శ్రేయస్కాములకు సేవింపఁదగినసర్వస్థలముల దాతలగువారి యతీతానాగతపాపములను బోలఁగించుచు భుజించును. మఱియు నగ్ని దారువుల (5) నాశ్రయించి వానివానికిందగినట్లు హ్రస్వదీర్ఘత్వాదిధర్మముల నొందినచందమునఁ గనుఁబడునట్లే యాత్మ యాత్మమాయాసృష్టములగు యీసదసల్లక్షణరూపములనొంది వానివాని రూపములకుఁ దగినట్లు కనఁబడుచుండును. కాని యవియన్నియు నతనికివాస్తవములు కావని యాయర్థంబులనెల్ల నగ్నింగాంచి నేర్చుకొంటిని. అంతియగాక యగ్నిమంటలు విజృంభించుచుఁ గొంతసేపటికి మఱుఁగుపడునట్లు కాలప్రవాహవేగముచే భూతములకెల్ల నుత్పత్తివినాశములు కలుగుచు నవి నిత్యములైనను సంసారి కాచందమునఁ దోఁపదనియు వివేకముగలవానికి క్షణభంగురములైన దేహము మొదలగు వానిపైని ప్రీతికలుగదనియు వైరాగ్యమును అగ్నివలననే నేర్చితిని.)

(ఇఁక జంద్రునివలన నేమి నేర్చుకొంటినో తెలిపెదను. అవ్యక్తమార్గమైనకాలమునఁ గలుగునట్టి జన్మము మొదలు (6) శ్మశానాంతములగు సంస్కారములు దేహమునకేకాని ఆత్మకుంగావు. వృద్ధిక్షయములు కళలకేకాని చంద్రునకుంగావు. అను

నర్థమును బరీక్షించి చంద్రుని దృష్టాంతమునఁ దెలిసికొంటిని.)
(సూర్యుఁ డాత్మకిరణమాలికలచే జలములను బీల్చి సమయము నందుఁ బర్జన్యరూపమున వర్షించును. అట్లే యోగి యింద్రియ ములవిషయములఁ బరిగ్రహించియు నందుఁ దగులనిచందం బును నేర్చితిని. జలములయందుఁ బ్రతిబింబించినసూర్యునివలె నాత్మ యుపాధులయందుఁ బ్రతిబింబించి పారమార్థికదర్శనము నందు స్వరూపస్థితిం గాంచి నిర్భేదుఁడై యున్నప్పటికిని భిన్నుఁడువలె మందబుద్ధులకుఁ దోఁచుచుండును అని తెలిసి కొని యాత్మభేదము కేవల ముపాధికృతమే కాని పారమార్థి కంబు గాదని సూర్యదృష్టాంతమున నేర్చుకొంటిని.)

ఎవ్వాఁడుగాని యతిస్నేహము నతిప్రసంగము నెప్పుడు గాని యెందుఁగాని యెవ్వనితోడను జేయరాదు. చేసినచోఁ బావురమువలె సంతాపంబు నొందునని తెలిసికొంటిని. ఎట్ల నఁగా నొకయడవిలోఁ గపోత మొండు వృక్షరాజముమీఁద గూఁడుకట్టుకొని భార్యంగూడి కొన్నివత్సరము లుండెను. ఆరెండును మిక్కిలి స్నేహమున నొండొరులహృదయములఁ గలిసి సంసారధర్మమునను జరపుచు శరీరము శరీరముతో బుద్ధి బుద్ధితోఁ జేర్చుకొని మెలంగుచుండెను. శయ్యాసనస్థాన వార్తావిహారభోజనాదులయందు నొక్కటిగవర్తించుచుండెను. ఒక్కతఱి నాయాఁడుపిట్ట చూలుదాల్చెను. కపోతము చూలాలికి నెపు డేదికోరినను దానిని సాధించి తెచ్చి యిచ్చు చుండెను. ఆఁడుపావురము ప్రసూతిసమయము రాగాఁ బతి యానందింప గ్రుడ్లుపెట్టెను. భగవదనుగ్రహమున నవి యవిసి కోంచియవయవములుగలిగి పిల్లలయెను. ఆదంపతు లాశిశు

వుల యవ్యక్తమధురాలాపముల నాలకించుచు మహానంద మనుభవించుచు వానిపక్షముల స్పర్శమునకు హాయిచెంది మెచ్చుచుండెను. శక్తివంచనములేక వానిఁ బెంచుచుండెను.

ఒక్కనాఁ డాపావురములు రెండుపిల్లలను గూఁటిలో నునిచి యెఱచికై కాననమున కేగెను. అత్తరుణముననే వ్యాధుఁ డొక్కఁడు మార్గవశమున నచ్చటి కరుదెంచి వల యొడ్డి వానిం బట్టుకొనియెను అవ్వల నప్పావురము లాహా రంబు గొనివచ్చి వలలోఁ దగులుకొనిన పిల్లలంగాంచి పరి తపించుచుండ నాఁడు కపోతము ప్రీతిభరింపరామి నచ్చటికరిగి తానును స్మృతితప్పి యవ్వలలోఁబడియెను కపోత మవ్వానిం గాంచి తనకంటె నధికమని తాఁబ్రేమించు ప్రియురాలును తనబిడ్డలును వలలోఁ దగులుకొనుటఁ దలంచి భరింపరాని దుఃఖమున నయ్యో! నే దృష్టహీనుఁడను. దుర్మతిని. అల్ప పుణ్యుఁడను. కావుననే యింకను విషయసుఖముల ననుభవించి తృప్తినొందకయున్నాను కానఁ గృతార్థుఁడను గాకపోయితిని. ఇంతలో ధర్మార్థకామములను మూఁడు పురుషార్థములకును సాధనభూతమగుగృహస్థాశ్రమము నాకు వృథయైనదికదా! నాభార్య పతివ్రత. ప్రియమునే నాకుఁగోరునది. అనురూపయై నది. నేనే దైవమని తలంచునది. అట్టి నా యీభార్య నన్ను వదలి నాగృహము పాడుపెట్టి తాను సాధువులగుతనయులతో స్వర్గమునకుఁ బోవుచున్నది. నే నిట్లు భార్యాపుత్రహీనుఁడనై దీనుఁడనై యీపాడుగృహమునందుండి యేపురుషార్థమును సాధింప బ్రదికియుండఁ గోరవలయునో తెలియకున్నది సర్వము పోఁగొట్టుకొని దుఃఖముతో జీవింపవలయునా. అని. యనేక

భంగుల విలపించెను. ఇట్లు విలపించుచుఁ దనబిడ్డలు వలలోఁ జిక్కియుండుటం గాంచి మూర్ఛిల్లి మూఢుఁడగుట దాను నా వలలోఁ దగులుకొనియెను. క్రూరాతిక్రూరుఁడగు బోయ వాని నన్నింటిని దీసికొని కృతార్థుఁడై యింటికింజనియెను.

ఆకపోతములరీతిగా నశాంతుఁడై ద్వంద్వములకుం జిక్కి యందేమో సుఖమున్నదని సంతసించుకుటుంబి దీనుఁడై దుఃఖములపాలగును. పక్షిజన్మము వివేకశూన్యము. మానవ జన్మ మట్టిదికాదు. మోక్షద్వారమును భేదింపఁగలది. అట్టి మానవదేహమును బడసియు గృహములయందుఁ గపోతము రీతిఁ దగులుకొని శ్రేయస్సాధనమార్గము నెఱింగియు నధోగతి పాల్సేయువృత్తుల నవలంబించి క్లేశపడువాఁడు వడివడిఁజెడు. * ఇంద్రియముల మూలమునఁ గలుగుసుఖము స్వర్గమునందును నరకమునందును బ్రారబ్ధవశమున లభించును. దుఃఖమును గోరకున్నను లభించునట్లు సుఖముకూడ లభించును. కావున బుద్ధిమంతుఁడు వానింగోరఁడు. అజగరవృత్తి యనఁగా నాహారము మిగుల రసవంతముగాని రసహీనముగాని యధికముగఁ గాని యల్పముగఁగాని దైవవశమున నెంత దొరకునో యంత మాత్రమునఁ దృప్తినొందుట చాలదని ప్రయత్నముచేయ కుండుట యని యెఱుంగుము. అట్లే మౌని నిర్వ్యాపారుఁడై దైవవశమున సుఖమో దుఃఖమో కలుగునని నిశ్చయించి దొర కినయాహారమును గొని సంతృప్తినొంది ధీరుఁడై యన్నము లంపదేని నిరాహారుఁడై యింద్రియబలము సహనము శరీర బలముగలిగిన దేహమును ధరించి దానిని గర్మములందుఁ జొను

* ఇటనుండి యెనిమిదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినవి.

పక శయనించి నిద్దురమాని స్వార్థమును బరికించుచు నేపనికిం బూనరాదు. (సముద్రమువలె మాని వెలుపలఁ బ్రసన్నుఁడై యంతస్సునందు గాంభీర్యముగలిగి యితరులకుఁ దనశక్తి తెలియ రాకయుండనుండి యనతిక్రమణీయుఁడై కలఁచి పుచ్చరాక వర్తించుచుఁ బ్రవాహములు వచ్చినపుడు హెచ్చుట అవి రాని తఱిఁ దగ్గిపోవుట యనుభేదము సాగరమునకు లేనిచందమున విషయసమృద్ధిగలిగినను లేకయున్నను మోదమును ఖేదమును గాంచక సముఁడై భగవంతునిపై మది నిలుపవలయును.)

(* భగవన్మాయవలె స్త్రీరూపము మోహము నొందించు నది. భూషణాదులచే సొగసుచేయఁబడిన యానారీరూపమును గాంచి మెచ్చుకొని యింద్రియవశుండగునేని యగ్నిజ్వాలం గాంచి మోసపోయి దానియందుఁబడు మిడుతవలె నంధంతమస్సునందుఁ బడును. కావున నీపతంగదృష్టాంతమున ననాసక్తి నేర్చితి.) (తుమ్మెద పూవులకు నొప్పికలుగకయుండ నందుఁగలమకరందము నించుకగా గ్రహించుచు నందందుఁ దిరుగుచుండునది మధుకరవృత్తియగు. ఆవృత్తిని బరికించి దేహయాత్రామాత్రము గృహస్థులకు హానికలుగకయుండ నాయాగృహములయందు నించుకించుక భిక్ష మార్జింపవలయు నని తెలిసికొంటిని తుమ్మెద పెక్కుపూవులుచూచి యన్నింటి యందుఁ గలసారమును గొంచెముగా గ్రహించుచుండుటం దిలకించి యల్పములు మహత్తరములు నగు శాస్త్రములనుండి సారము గొనఁదగునేగాని యొక్కదానిసారమే కైకొని తృప్తి

*దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావైరజితేంద్రియః, ప్రలోభితః పతత్యంధే తమస్యగ్నౌ పతంగవత్. ౮౭. అని మూలము.

పడరాదని నేర్చితిని. భిక్షమునకుఁబోయినపుడు ప్రాప్తించిన పదార్థమును దోసిటంగొని తినవలయునే కాని యిది రేపటికని యిది మాఁపటికని కూడఁబెట్టరాదు. అట్లు కూడఁబెట్టినయెడలఁ దేనెటీఁగ శ్రమించి కూడఁబెట్టిన తేనియను బరు లాయీఁగను బొలియించి దానిం గైకొనుచున్నారుకదా ఆరీతిగనే సేకరించిన ద్రవ్యమును లుబ్ధు లాతనికిం గీడుగావించి గ్రహింతురు. కాన నది మంచిదికాదని నేర్చితిని.)

*(భిక్షుకుఁడు నారిని దారువుతోఁ జేయఁబడినదానినైనను గాలితోనైనఁ దాఁకరాదు తృణాదులఁ గప్పియున్న గోతిమీఁద నుండు స్త్రీగజమును దారువునఁ జేయఁబడినదానిం గనఁబఱచు టెఱుంగక దానిని దాఁకఁగా పురుషగజ మావివరమునఁ బడు చందమునఁ దాను బట్టుపడుచున్నాఁడు. ఆత్మ మృత్యురూపిణి స్త్రీయగును. దానిని బ్రాజ్ఞుఁ డెక్కప్పుడు సమీపింపరాదు. సమీపించెనేని మగయేనుఁ గొకయాఁడుగజమునుబొంది బలాధికగజములచేఁ జంపఁబడునట్లు హతుఁడగు.) (లోభి కష్టమునకోర్చి యార్జించినధనము నొకరి కీయక తానును దినక మధువును గూడఁబెట్టిన యీఁగలవడువున నితరు లపహరింపఁగా దుఃఖములపాలగును. ఈదృష్టాంతమున దాఁచిపెట్టుట మంచిది గాదని తెలిసికొంటిని. మఱియు నామధుమక్షికములు కూడఁ బెట్టినద్రవ్యమును మధుహారి యపహరించులాగున గృహాలార్జించినయన్నము యతికి భోగ్యంబగునుగాని ధనమును

*పదాపి యువతీం భిక్షుర్న స్పృశేద్దారవీమపి స్పృశన్ కరవబధ్యేత కరిణ్యా అంగసంగతః. ౧౩. అనిమూలము. గజో హి కరణీం ప్రదర్శ్య ఖాతతృణపిహితగర్తే నిపాత్య బధ్యతే అని వ్యాఖ్య.

సంగ్రహించుట తగదనియు నిశ్చయించితిని.)

(యతియు వానప్రస్థుఁడును భగవద్గీతలు లోనగు వానిని వినవలయునే కాని గ్రామ్యగీతముల వినరాదు. గ్రామ్యగీతాసక్తి నొందుదురేని వేటకాఁడు మృగమువలె ధ్వనిచేయఁగా విని వచ్చినమృగమువలెఁ బట్టుపడును. అంతియగాక చేటొందు. స్త్రీ లొనరించునృత్యవాద్యగీతములు మునికిఁ బనికిరావని తెలిసికొమ్ము. తొల్లి ఋశ్యశృంగుఁడు స్త్రీలయాటలఁ బాటల నాలకించి తుదకు వారలకు లోఁబడిపోయెను. కావున నది మునికి మంచిది గాదు.) (ఎట్టివానినేని నాలుక క్షోభింపఁజేయునది జనుఁడు దానికిఁ లోఁబడి రసవంతమగువస్తువు నాశించునేని చేప యెఱ్ఱలను పురుఁగుల కాశపడి గాలమును మ్రింగి చచ్చునట్లు తదాశచే మృత్యువశుఁడగును. *నిరాహారులగుమునులు సర్వేంద్రియములను గెలువఁగలరుగాని నాలుకను గెలువఁజాలరు నిరాహారునకు జిహ్వాచాపల్యము వృద్ధినొందును. ఇతరేంద్రియముల నిర్జించినను రసనేంద్రియము గెలుచువంతదనుక నాతఁడు జితేంద్రియుఁ డనఁబడఁడు. రసము నిర్జింపఁబడిన నన్నియు నిర్జితములైనవనియే నమ్మవలయును.)

(తొల్లి విదేహనగరమున వేశ్య యొకర్తు పింగళ యను పేరుగలది యుండెను. ఆమెవలనఁ గొన్ని విషయముల నేర్చుకొంటిని. యదూ! వానిని దెల్పెదను, ఆలకింపుము. ఆపింగళ స్వేచ్ఛావృత్తిగలిగినదియే. సర్వాలంకారములఁ దన్నలంకరించుకొనుచు రహస్యకేళికిఁ బురుషులఁ బిలుచుటకుగా ద్వారసీమ

*ఇంద్రియాణి జయంత్యాశు నిరాహారా మనీషిణః, వర్జయిత్వాతు రసనం తన్నిరన్నస్య వర్ధతే. అనిమూలము.

నిలుచుండి రాకపోకలుచేయువారిని జూచియుఁ దాను గోరినంత ధనమిచ్చువారినే నెమకుచుఁ దక్కినవా రాసక్తిం గొని వచ్చినను వదలుచు ధనలోభమున నిద్దురకూడ పోవఁగానుండెను. అర్ధరాత్రమయ్యెను. దప్పి జనించెను. తాను గోరిన ధనమెల్ల నిచ్చువాఁడానాఁడొదవఁడయ్యెను. విసుగు తోఁచెను. కొంతసేపటికి వైరాగ్యము కల్గెను. అది సర్వజనుల కత్యంతసుఖావహము. కాన నది పాడసూపినతోడనే పింగళ నిర్వేదమునొంది యొకగీతము పాడెను. *నిర్వేదమాశాపాశములకుఁ గృపాణ తుల్యము. మూలచ్ఛేదము చేయును అవిరక్తునకు దేహబంధము వదలదు. ఇఁక నామె పాడినగీత మిది. అయ్యో! మనస్సు గెలువఁజాలని నాకు మోహ మెంత వృద్ధి నొందినది? మూర్ఖురాలనుగాన నీచుఁడగుపరునివలనఁ గామములఁగోరితిని. ఎల్లప్పుడు చెంతనుండి రతిసుఖముల నొసంగు రమణుఁడు నాహృదయమున నుండఁగా వానివదలి తెలియక యకామప్రదుఁడై దుఃఖమును, భీతి, నార్తిని, శోకమోహముల నొసంగువాని నొకని సేవించితిని. సంకేతము ముఖ్యము గాఁగల నింద్యవృత్తి నవలంబించి కామినీలోలుఁడు లుబ్ధుఁడు శోచనీయుఁడునగు నొకమానవునివలన విత్తసుఖములను గోరితిని. దాన వ్యర్థముగా నాత్మ పరితాపమును గోరితిని. ఆత్మ నిర్మితములగు వంశస్తంభంబులుఁగలిగి చర్మము రోమములు నఖములఁ గప్పఁబడి తొమ్మిదిద్వారములుగలిగి విణ్మూత్రము

* నిర్వేద ఆశాపాశానాం పురుషస్య యథా హ్యసిః, న హ్యంగాజాతనిర్వేదో దేహబంధంజిహాసతి. అహో మే మోహవితతిం పశ్యతావిజితాత్మనః, యా కాంతాదసతః కామం కామ యే యేన బాలిశా. అని మూ.

ల నింద్యంబై తుచ్ఛమయియున్న యీదేహగృహమును లోక
మున నేనుదప్ప నింకొకత యెట్లు మనోహరమని నమ్మి చేరును?
ఆత్మజ్ఞానము నను గ్రహించునచ్యుతుఁడు కాంతుఁడై యుండఁగా
వానివదలి వేఱొక్కని గాంతునిగాఁ గోరు నిర్భాగ్యు
రాలను నేనొక్కదానినే యీవిదేహనగరమున మూఢు
రాలను. ఎల్లదేహధారులకు మిత్రుఁడు మిక్కిలి ప్రియుఁడునగు
నాత్మరూపునకు నాత్మేచ్ఛను విక్రయించి రమాదేవిచంద
మున నాతనింగూడి సుఖింతును. కామము లాద్యంతములు
గలవి. మానవులు కామము నిచ్చువారు. దేవతలు కాలవశ
వర్తులు. ఇట్టివారిని సేవించినభార్యకు వీరేమి ప్రియమును
గూర్చిరి? కావున సేవ్యుఁడనఁగా భగవంతుఁ డొక్కఁడే.
పూర్వజన్మమున నేనేదో పుణ్యము చేసియుందును. లేకయున్న
నాయందు భగవంతుఁడు ప్రీతుఁడగునా? నిజముగాఁ దొలి
మేనఁ జేసినసుకృతమే లేకున్నచో సుఖమును గల్గించు దురాశా
నిర్వేదము నాకుఁగలుగునా? నేనదృష్టహీననే యైనయెడల
గృహము లోనగువానియందుఁ ద్యాగబుద్ధియు శాంతియు
నను వానిని గల్గించు నిర్వేదము దానికి హేతువులగు క్లేశములు
గలిగియుండునా? మానవులను గోరునేను శ్రీమన్నారాయణుని
దయాలబ్ధమగువైరాగ్యమును శిరసావహించి యీదురాశను
వదలి యయ్యధీశ్వరుని దాస్యమునొంది పరమాత్మపై శ్రద్ధ
గలిగి సంతుష్టిగలిగి దొరకినదానితోఁ దృప్తినొందుచు రమణుం
డగు భగవంతునితోడనే విహరింతును. విషయములచే
మనస్సు హరింపఁబడఁగాఁ గలవిలపాటొందుచు సంసారకూప
మునంబడి కాలమహాభుజంగమునకుఁ జిక్కినమానవుని గాపాడ

నాపరమేశ్వరుఁడు తప్ప మఱెవ్వఁడు సమర్థుఁడగును? ప్రమా
దంపడక యీ విశ్వమంతయుఁ గాలసర్పముచే మ్రింగఁబడిన
దని యెఱింగి సర్వవిషయములందు వైరాగ్యముగలిగినసమయ
మునఁ దనకాత్మస్వరూపుఁడే రక్షకుఁడగును అని పింగళ యీ
రీతిగా నాత్మలోఁ దలపోసి కాంతాభిలాష మనుదురాశను
మాని యుపశాంతినొంది శయ్యపయిం గూరుచుండెను. కాం
తునిపైనిగల యాశనువదలి యాపింగళ సుఖమునకే శయనిం
చుట దలంచి యాశ మిక్కిలి దుఃఖము నొసంగుననియు నిరా
శత్వ మెంతయు సుఖము నిచ్చునది యనియు గ్రహించితిని.

(*అని తెలిపి మఱియు నాయవధూత యిట్లు తెలిపెను.
రాజా! మానవునిమది కేయేవస్తువత్యంత ప్రియముగనుండునో
దానిని బరిగ్రహించుట మిక్కిలి దుఃఖము గలిగింప నది
హేతువగును. ఈవిషయము నెఱింగి యేమియుఁగోరనివాఁడు
మిగుల సుఖమును గాంచును. కురరమనఁ బరఁగుచిట్టిపిట్ట
యెందో తిరిగి మాంసమును సంపాదించుకొని నోట నునుచు
కొనియుండఁగా మాంసము దొరకక చింతించుబలవంతములగు
పక్షులు దానిని జంపఁబూనును అది దానిని విడిచినచో
నాభయము తొలఁగ సుఖించును.) మానావమానములను
గృహసంతానాదిరూపమగు దురంతచింతను వదలి బాలునివలె
నాత్మయందే క్రీడించుచు నాత్మయందే రతిగలిగి వర్తించువాఁ
డను. ఏమియుఁ బ్రపంచతత్త్వము నెఱుంగని బాలుఁడొక్కఁ
డు, పరమాత్మ నెఱింగినమహనీయుఁడు, వీరిద్దఱుమాత్రమే
యించుకంతయుఁ జింతలేని పరమానందపూర్ణులు.)

*ఇటనుండి తొమ్మిదవ యధ్యాయమునుండి వ్రాయఁబడినది.

(యదుభూపాలా! ఒక్కయూర నొక్కకుమారికయుం డెను. ఆకన్నియం బెండ్లియాడఁగోరి బంధువులు వచ్చిరి. తల్లి దండ్రు లింటలేరు. వారికి భోజనము సమకూర్చుపని తనపైఁబడి యెను. మానినఁ దల్లిదండ్రులకుఁ బరాభవమగును. అని తల పోసి యేకాంతగృహమున వడ్లుదంచుచు ముంజేతఁ దొడిగి యున్న శంఖకంకణములు మ్రోయఁగా లించి యొక్కొక్క చేతికి రెండింటినిమాత్రము నిలుపుకొని తక్కినవానిని దీసి వైచుచు నవియు ధ్వనింపఁగా నొక్కొక్కదాని నుంచుకొని తక్కినదానిని దీసివైచి పని సాగించి యింటిమర్యాదను గాపా డెను. ఆవిషయమును దలంచి నేను బ్రపంచతత్త్వ మేదని తెలిసికొనఁగోరి తిరుగుచుఁ బలువురితోఁ గూడినచోఁ గలహ ము నిర్వురతోఁగూడిన ముచ్చటలు గలుగును కానఁ గుమారీ కంకణముచాడ్పున నేనుమాత్రమే చరింపవలయుననియు నేర్చితిని.) 20

(యోగి మనస్సు నేకాగ్రతనొందించి శ్వాసములను జయించి యాసనశుద్ధిగలిగి యింద్రియముల వశపఱచుకొని యొక్కయెడ నిలువందగు. లయవిక్షేపములం గూడినమనస్సు పరమేశ్వరునందే నిలుచునట్టిదగునేని కర్మవాసనలు మెల్లగా వదలవచ్చును సత్త్వము వృద్ధినొందును. రజస్తమస్సులను వదలి గుణకార్యశూన్యమగు వృత్తిరహితమునగు ధ్యేయా కారస్థితిం గాంచును. శరమోక్షణము చేయునతఁడు దానిపై మనస్సునిలిపి పార్శ్వమున సకలవిధవాద్యధ్వనులతోఁ బ్రయా ణముచేయు రాజునుగూడ నెఱుంగకయుండు చందమున నాత్మచేఁ జిత్తమును స్థిరముగా నిలుపుయోగి యాంతరబా 21

హ్యముల నెఱుంగఁడు. ఒంటరిగాఁ దిరుగుచు నిల్లులేక ప్రమాదమునొందక గుహలలో నుండుచు మితహితభాషణుఁడై యుండుమునివరుఁడు తనయాచారములం గాంచి యితరులు తనవిషయము నెఱుంగక యుండునట్లుండవలయును.)

(క్షణభంగురదేహమునకై యిల్లుకట్ట నారంభించుట నిష్ఫలముమాత్రమే కాక దుఃఖప్రదముకూడ నగుచున్నది. సర్పము, చీమలు పెట్టినపుట్టలో హాయిగా నివసించునుగదా. భగవంతుఁడగు నారాయణమూర్తి యొక్కఁడే తొలుతఁదాను బుట్టించిన యీలోకజాలమును గల్పాంతమునందుఁ గాలశక్తిచే నుపసంహరించి సత్త్వాదిశక్తులనెల్లఁ బ్రధానమునందు లయింపఁజేసి పిదపఁ బ్రధానపురుషులకు నధిపతియగు తా నన న్యాశ్రయుఁడై యాత్మాధారుఁడై భేదశూన్యుఁడై యుండును. బ్రహ్మాదులగుముక్తజీవులకుఁ దానే ప్రాప్యుఁడై నిరుపాధికుఁడై కైవల్యసంజ్ఞ తనరఁగాఁ గేవలానుభవానందముగలిగి త్రిగుణాత్మికయగుమాయకు క్షోభము గలుగఁజేయుచుఁ గ్రియాశక్తి ప్రధానమగుమహత్తత్త్వమును వెలువరించెను. అదియు గుణత్రయకార్యంబగు నహంకారమూలమునఁ ద్రిగుణాత్మకమగు ప్రపంచములనెల్లఁ బుట్టించుచనియు వానియం దీజగము చేర్పఁబడినదనియు నదియే జీవునకు సంసారకారణమనియు మహానుభావులు చెప్పుదురు. సాలెపురుగు తననోటినుండి వెలువడుదారములచే గృహముగట్టుకొని యందే విహరించుచుఁ దాను దానికి హరించునట్లు మహేశ్వరుఁ డాత్మమాయాయోగమున నీవిశ్వమును సృజించి యందే విహరించి తుదకు దాని నుపసంహరించును. దేహధారి స్వబుద్ధిచే దేనియందు

మనస్సును స్నేహమునఁగాని ద్వేషభయములఁగాని నిలుపునో యందు దానిసామ్యమును బడయును. కీటము తనను దుమ్మెద గూఁటిలోఁ జొప్పించిన నాతుమ్మెదవంటిరూపమును దనతొల్లింటిరూపమును వదలుటయును బొందునుగదా. భ్రమరకీటన్యాయమనఁగా నిదియేకదా! ఈరీతిగా నీగురువులనుండి యీవిషయముల నేర్చితిని. ఆత్మ దేహమువలన నేర్చినదాని నీకు బోధించెద. శ్రద్ధగలవాఁడవు కమ్ము.

ఈదేహము జన్మనాశముల నొందుననియు, దుఃఖములే యొకదానిమించి యింకొకటిగాఁ గలుగుచుండుననియుఁ దలంచి దీనివిషయమై విరక్తినొందిదానిసాధనము విషయమున వివేకము నభ్యసించి దానికి సాధనముగు నీదేహ ముపకారము చేయున దియే యయ్యుఁ దుదకు నిరర్థకమని నిశ్చయించి యాసక్తిం బూనక తిరుగుచున్నవాఁడను. దేహసుఖార్థము శ్రమములకు నోర్చి భార్యాపత్యపరివారజనముఁ గాపాడుచుండినను దుదకు వృక్షమువలె మఱొకదేహము నొందుటకుఁ గర్మబీజమును గూర్చి నశించును. కావున నో రాజా! దేహికిఁ గలుగుకష్టముల నేమని చెప్పఁగలను? ఈదేహమును నాలుక యొకప్రక్కకు నీడ్చును. పిపాసయు నట్లే లాగును పురుషావయవ మొక్కచో లాగును. వేఱొక్కచోఁ జర్మము నిట్లే శ్రవణములు ఘ్రాణము నేత్రములు కర్మేంద్రియములు లాగిలాగి సపత్నులవలెఁ బలుబాములం బెట్టుచుండును.

*భగవంతుఁడప్రతిహతమగు నాత్మశక్తిచేతఁ బశువృక్ష

*సృష్ట్వా పురాణి వివిధాన్యజయాత్మశక్త్యా వృక్షాన్ సరీసృపపశూన్ ఖగదంశమత్స్యాన్, తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః. అని మూలము.

సర్పపక్షికీటకమత్స్యములు లోనగు నానావిధదేహములఁ బుట్టించి దానిచేఁ దృప్తినొందక ముక్తిసాధనంబయిన మానుష శరీరమును బుట్టించి సంతుష్టుఁ డయ్యెను. ఆరీతిగా మిగుల దుర్లభమగు మానవతనువున శాశ్వతమయ్యు ననేకపురుషార్థ ములను సాధించును. అట్టిదాని ననేకజన్మములెత్తి తుదకెట్లో పడసి యది నాశమునొందుటకుమునుపే త్వరపడిముక్తినొందు యత్నము చేయవలయును. ఇఁక విషయసుఖమనఁగా సర్వదేహ ములకు సామాన్యముగాఁ గలుగునదియే. కాఁబట్టి మానవత నువుచేఁ గూడ దానిని గోరరాదు. దాన లాభములేదు. ఇవ న్నియు నాలోచించి వైరాగ్యముం గాంచి సర్వసంగముల వదలి యహంకారమును బాఱఁద్రోలి విజ్ఞానమునందే దృష్టినిడి యాత్మనిష్ఠ గలిగియున్నవాఁడను. ఇందలి గురువు లేల యం దువో వినుము. ఒక్కగురువునుండి నేర్చుకొను జ్ఞానము చాలదు. అది ముక్తిని సాధింపవలంతిగాదు. బ్రహ్మమనఁగా నద్వితీయమే యని మహాత్ములు సంకీర్తనముచేయుదురు. కావునఁ బెక్కండ్రు గురువుల నేర్పఱచుకొని యొక్కొక్కవిషయ మొక్కొక్కరి వలన నేర్చుకొని దానినభ్యాసమునఁ బదిలపఱచుకొని కృతార్థుఁ డు కావలయును. అని యిట్లాయవధూత యదురాజునకు బోధించి యా రాజు నమస్కారము లోనగువిధ్యుక్తోపచారము లొన రింపఁగా సంతోషించి యతనిచే ననుమతుఁడై తనయిచ్చం జనియె. ఆయవధూత వాక్యముల నాలకించి మనపూర్వులకుం గూడఁ బూర్వుఁడగుయదురాజు సర్వసంగముల వదలి సమ ముసొంది ముక్తినొందెను.

## శ్రీహరి యుద్ధవున కాత్మతత్త్వప్రాప్తిమార్గములను దెల్పుట.

* అని యవధూతయదుసంవాదము నెఱింగించి మరల నుద్ధవునకుఁ దత్త్వజ్ఞానము దెలుపఁబూని భగవంతుఁ డిట్లనియె. మున్నుప శించిన స్వధర్మములయం దప్రమత్తుఁ డై నన్నేయాశ్రయించి †కామాసక్తుఁడు గాక వర్ణాశ్రమములకు నర్హములగు నాచారముల నాచరించుచుండవలయును దేహధారులు విషయాత్ములై విషయసుఖములు సత్యములని పూను సర్వప్రయత్నములు విపరీతములే యగునని నిశ్చయించి పరిశుద్ధాంతఃకరణుఁడై విమర్శించుకొనవలయును. ఇంద్రియజన్యమై బహిస్స్థితనానార్థములయందు వ్యాపించుబుద్ధినానాత్మకత్వము గలదగును. నిద్రవొందువానికిస్వప్నమునఁదోఁచువిషయములు సదా చింతించువానికి మనస్సునందుఁ బొడము. కోరికలును బ్రియాప్రియములుగా నానావిధములుగా నుండునుగాన నిష్ఫలములేకాని వానినుండి యొకసత్ఫలము గలుగదని నిశ్చయింపవలయును. ‡ నాయం దాసక్తిగలవానికి నివృత్తికర్మమే సేవింపఁదగినదికాని ప్రవృత్తికర్మము సేవ్యము కాదు. ఆత్మవిచారమునందుఁ జక్కఁగాఁ బ్రయత్నించి ప్రవర్తించు వానికిఁ గర్మచోదన మ్మనాదరణీయమమే కాని యాదరింపఁదగినది కాదు అహింసాదులగు యమములను, శౌచాదికములగు నియమములను శక్తి ననుసరించి యాచరింప వలయును. నన్నుం దెలిసికొని (సర్వమున కీశ్వరునిగా నిశ్చయించి)

* ఇది పదియవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది. † వర్ణాశ్రమకులాచారమకామాత్మా సమాచరేత్, అని మూ. ‡ నివృత్తం కర్మ సేవేత ప్రవృత్తం మత్పరస్త్యజేత్. అని మూలము.

మద్భూరిపుఁడై శాంతముగలగురువును బూజింపవలయును. అహంకారము లేక మాత్సర్యమునొందక యలసుఁడు గాక మమతాహీనుఁడు దృఢమగుసుహృద్భావమెల్ల భూతముల యందుఁ గలిగి వ్యర్థాలాపముల వదలి మార్పులనొందుచుండక పరశ్రేయస్పృహానముగలిగి సర్వస్థలములయం దాత్మప్రయోజనము సమానమని చూచుచు దారాపత్యగృహక్షేత్రబంధు ద్రవ్యాదులవిషయమున నుదాసీనుఁడై మంచి గురువునొద్ద శిష్యవృత్తి నవలంబింపవలయును.

దహింపఁదగినది ప్రకాశింపఁదగినది యగు దారువునకన్న దహించువాఁడు ప్రకాశింపఁజేయువాఁడు నగు నగ్ని దేవుఁడు విలక్షణుఁడుగ నున్నయట్లు సాక్షియు స్వప్రకాశుఁడు నగు పరమాత్మ దృశ్యము జడము నగు స్థూలసూక్ష్మశరీరమునకంటె విలక్షణుఁడు. దారువునందుఁ బ్రవేశించినయగ్ని దానఁగలుగు నాశాదుల నొందునట్లు దేహగతుఁడగు పరమాత్మ తాను నిర్వికారుఁ డయ్యు దేహగుణములగు జన్మనాశములు, నణుత్వము, బృహత్త్వము, నానాత్వములను బొందును. ఈశరీర మీశ్వరునిమాయాగుణములచే నిర్మింపఁబడినది. దాని నధిష్ఠించుటంజేసి జీవునకు సంసారము కలుగును. ఆత్మవిద్యసంసారనివృత్తింగల్గించునది. కాఁబట్టి యాత్మవిచారమున నాత్మగతుఁడగు కేవలపరమాత్మను జక్కఁగా శాస్త్రమూలమునను సదురూపదేశమున నెఱింగి వరుసగా దేహాదులయందు వస్తుబుద్ధిం జేసి వదలవలయును. * ఆచార్యుఁడు క్రిందియరణి, శిష్యుఁడు

* ఆచార్యోఽరణిరాద్యస్స్యాదంతేవాస్యుత్తరారణిః, తత్సంధాన ప్రవచనం విద్యాసంధిస్సుఖావహః. అని మూలము. ఆద్యః అధరః తత్సం

మీఁదియరణి యగు. ఈరీతిగా నూహించి వానినడుమనున్న చిలుకునట్టి దారువుపదేశము. (వేదాంతార్థవిచారము) విద్య యనఁగా నెఱుఁగుట. అది ఆరెండింటికూడికవలనఁ బుట్టిన యగ్నివంటిదగును. అయ్యది యత్యంతసుఖమునుగలిగించునది. దయావంతుఁడగుగురు వుపదేశింపఁగా నేర్పఱియగుశిష్యుఁడు నేర్చుకొనిన యావిద్య త్రిగుణాత్మికయగుమాయను నిరసించును. అనఁగాఁ దొలఁగించునని యర్థము. *దానిచేత సంసారనిమిత్తములైన గుణములను గాల్చి దారువులులేని యగ్నివలె శాంతుఁడై యీప్రపంచమెల్ల యేమహాత్ముని స్వరూపమో యట్టిపరమాత్మ స్వరూపుఁ డగును. కర్మకర్తలు సుఖదుఃఖముల ననుభవించువారు నగుజీవులు నానావిధములుగ నుందురనియుఁ బుణ్యలోకములు భోగానుభవకాలము. దానిని బోధించు శాస్త్రము భోక్తయాత్మ. అనువానికి నిత్యత్వమనియుఁ దలంతువేమో. స్రక్చందనాది సర్వభావస్థితి ప్రవాహరూపమున నిత్యంబగును. వానివానియాకృతులు భేదమనుబుద్ధియుం బొడమును. అట్లైయైనచో దేహధారులకెల్ల, దేహయోగనిమిత్తముచేఁ గాలమున జన్మము మొదలగునవి పలుసారులు కలుగుచుండును. అందును గర్మముల నాచరించువారికిని, సుఖదుఃఖభోగులకును స్వాతంత్ర్యము లేదని తోఁచెడిని. అస్వతంత్రుఁడగువానికే యర్థంబు గలుగునందువా? కర్మాచరణము చక్కఁగా నెఱింగినవిద్వాంసులకు సుఖము, అదియెఱుఁగని మూఢులకుదుఃఖముకలుగునన్న నియమముకూడఁ గనఁబడును.

ధానం తయోర్మధ్యమం మథనకాష్ఠమ్. అని వ్యాఖ్య. * గుణాంశ్చ సందహ్య [illegible] మేతత్స్వయం చ శామ్యత్యసమిద్యథాగ్నిః. అని మూలము.

కర్మకౌశల్యమున మేము సుఖించువారమని ప్రల్లదములాడుట వ్యర్థమగు నహంకారమే కాని వేఱులాభము కలుగదు. సుఖప్రాప్తిని దుఃఖప్రాప్తిని వానినివృత్తి నెఱింగినవారుకూడ మృత్యువు తప్పించుకొనుత్రోవ నెఱుంగరు. వధ్యస్థానమునకుఁ దీసికొనిపోవంబడువధ్యున కెట్టియాహారపదార్థము లెట్టిసుఖములు కల్పించినను సరిపడనిచందంబున, మృత్యువు చెంతనుండి యెప్పుడు మ్రింగుదునా యని వేచియుండఁగా నట్టివానికే యర్థకామములును సుఖములఁ గల్పింపఁజాలవు.

కర్మమును దెలుపుశాస్త్రములమూలమున వినఁబడుచున్న స్వర్గాదిసుఖములు, కనఁబడుచున్న యీలోకమువలె స్పర్ధ, అసూయ, నాశము, వ్యయము లనువానిచే దుష్టములు. కామవిషయమున ననేకవిఘ్నములు గలుగుటంజేసి నిష్ఫలంబు. విఘ్నములసోఁకున భీతినొందక ధర్మము ననుష్ఠించువాఁ డార్జించుపుణ్యస్థానమును బొందు టెట్లని ప్రశ్నింతువేని సమాధానమును వినుము. యజ్ఞము చేయువాఁడు మానవలోకమున దేవతల నారాధించి స్వర్గమునకుంబోయి యందుఁ దానార్జించిన దివ్యభోగములను దేవతలతో సమానముగ ననుభవించి తన పుణ్యమునకుఁ బ్రతిఫలముగా శుద్ధవిమానమున దేవతలయంతరమందు మంచివేషమును దాల్చి గంధర్వులపాటల నాలకించుచు నందనోద్యానము లోనగుపూఁదోఁటల నారీతిలకముల తోఁగూడి క్రీడించుచుఁ దనయధోభ్రంశము నెఱుంగఁడు. అతఁడు సంచితమగుపుణ్యము గలుగునంతదాఁక దేవలోకమునందు సుఖపడిపుణ్యము ముగియఁగాఁ గాలముపడఁద్రోయఁగా [illegible]ందఁబడు. అధర్మనిరతుఁడగు నేని యస నసహవాసమున

జితేంద్రియుఁడుగాక కామపూరితాత్ముఁడై దీనుఁడై యధికా శగలిగి కాంతాలంపటుఁడై భూతహింసకుఁడై విధివిహితము గఁగాక స్వేచ్ఛగాఁ బశువుల వధించుచు భూతప్రేతగణ ముల నారాధించుచుఁ బరవశుఁడై నరకములకుఁ బోయి భరింపరాని తమస్సునొందును. కర్మము లెట్టివైనను దుదకు దుఃఖమునే కలిగించును. కావున వానినే చేయువాఁడా దేహ ముచే మఱొకదేహముం బొందును. మరణము స్వభావము గాఁగలదేహము నెత్తువారికి సుఖము సుంతయైనఁ గలుగ దనుట సత్యము. లోకములకు లోకములఁ బాలించువారికిని మఱియుఁ గల్పాంతముదనుక బ్రదుకువారలకు రెండుపరార్ధ ములను కాలమాయుస్సుగల బ్రహ్మకుంగుఁడనావలన భయము తప్పదు.

ఇంద్రియములు కర్మములనుబుట్టించుచు సత్త్వాదిగుణము లాయింద్రియములను గర్మములయందుఁ బ్రవేశింపఁజేయును. ఇంద్రియాదిసంయుక్తుఁడై జీవుఁడు కర్మఫలముల ననుభవిం చుచున్నాఁడు- గుణవైషమ్యము గలుగునంతకు నాత్మకు నానాత్వంబును, ఆత్మనానాత్వముండుదనుకఁ బారతంత్ర్యము, ఆపారతంత్ర్యముగలుగునంతవఱకు నీశ్వరభయంబునుగలుగు. గుణవైషమ్యమును, తత్కృతములగు కర్మభోగములను సేవిం చువారు శోకాక్రాంతులై మోహమొందువారు. మాయా కృతమగుక్షోభము గలుగఁగా, నన్నుఁ గాలమని, ఆత్మయని, ఆగమమని, లోకమని, స్వభావమని, ధర్మమని యనేకప్రకార ములఁ బలుకుచుందురు.

అని భగవంతుఁడు పలుకుటయు నుద్ధవుఁడు శ్రీహరిం

గాంచి యిట్లు ప్రశ్నించెను. దేవా! దేహజము లగుగుణముల యందు వర్తించుచుండునాత్మ తద్గుణములచే బద్ధుం డెట్లు కాఁడు? అనావృతుండైన కారణమున బద్ధుఁడు కాఁ డందు వేమో. అనావృతునకు బంధ మెట్లుకలుగును? బద్ధుఁడు ముక్తుఁడు నెట్లు వర్తింతురు? ఎట్లు వినోదింతురు? ఏది భుజియింతురు? దేనిని వదలుదురు? యానాసనశయనాదు లెట్లు చేయుదురు? ఏయేగుఱుతులంబట్టి వారి నెఱుంగందగును? ఈ ప్రశ్నార్థముల నాకుఁ దేటపడునట్లు బోధింపుము. ఆత్మ యొక్కండయ్యు ననాదిగుణములసంబంధము చేత నిత్యబద్ధుండగుననియు ముక్తిజన్యమగువస్తు వేయైన ననిత్యము గాఁబట్టియయ్యదినిత్యమనియు, నాత్మ నిత్యముక్తుఁడనియు నిన్నిసంశయములు నాకుంగలవు వానిం దొలఁగింపుమని ప్రార్థింప నాశ్రీహరి యిట్లు పలికెను.

బద్ధముక్తులగుఱుతు లుద్ధవునకు హరి తెల్పుట.

భక్తవర్యా! ఉద్ధవా! ఆత్మ బద్ధుఁడని ముక్తుఁడని యుపపాదించుట నాయధీనములగు మాయామూలమునఁ గల్గినదిగాని వాస్తవము గాదు. గుణములుమాయామూలములు గావున బంధము మోక్షము ననునవి రెండును నాకుఁ గలుగవు. స్వప్నము బుద్ధివివర్తమై మిథ్యయగుతీరున శోకమోహములును సుఖదుఃఖములును దేహసంయోగవియోగములును మాయాకృతములు గావున సత్యములన వలనుపడదు. విద్యావిద్యలనుశక్తులు రెండుగూడ శరీరధారులకు బంధమోక్షములను గావించునని యెఱుంగుము. మదీయములగు నాశక్తు లనాదులు మదీయ మాయానిర్మితములు. నాయంశమునఁ గలిగి యద్వితీయుఁడై జీవునకు నవిద్యా యోగమున ననాదిబంధమును, విద్యా

యోగమున మోక్షంబు నగునని తెలిసికొనుము. శ్లో కానంద రూపతనొప్పువిరుద్ధ ధర్మములతో నొకదేహమునందు నియమ్యనియంతృభావమునవర్తించుచున్న బద్ధముక్తులగుజీవేశ్వరుల వైలక్షణ్యమున విశదీకరింతు. శ్రద్ధగలవాఁడవై యాలకింపుము. అది దుర్జ్ఞేయము. కావుననే నీకీవిషయమునమిగులశ్రద్ధగలవాఁడవుకమ్మని హెచ్చరించుచున్నాఁడను. సంశయములు దీనిచే వదలును. సంశయములున్నచో నెంతటి విషయమునైన నది తెలియనీయదు. ఈజీవేశ్వరు లిరువు రొక్కదేహమున విరుద్ధ ధర్మములు గలిగియే యుందురు. పక్షులు రెండుసమములగు పక్షములు గుణములు మైత్రియుఁ గలవిగ నుండునవి. అవి యొకవృక్షమునందు గూఁడుకట్టుకొని యుండును అట్లు దేహమునకు జీవేశ్వరులు పృథగ్భూతులు చిద్రూపత్వమున సమానులు. భేదములేకయెడఁబాయకయుండు మనస్సులుగలవారలుగాన సఖులు. అశాశ్వతమగు వృక్షమువంటి శరీరమునందు అనిరుక్తమగు మాయాయోగమునంజేసి గతహృదయస్థానులు. అందు జీవుఁడు వృక్షఫలమువంటి కర్మఫలము ననుభవించును. మఱియొక్కం డనీశ్వరుఁడు దాని ననుభవింపక నిజానందైకతృప్తుండై జ్ఞానశక్తిచే సర్వోన్నతుండై యుండు. *కర్మఫలభోక్త కానియీశ్వరుఁడుమాత్ర మేతన్నొరునిం దెలియఁగలఁడు కాని కర్మఫలభోక్తయగు జీవుఁ డెఱుంగఁజాలఁడు. అవిద్యాయుక్తుఁడగుజీవుఁడునిత్యబద్ధుఁడనఁబడు. విద్యామయుండైనయీశ్వరుఁ

* ఆత్మానమన్యం చ స వేదవిద్వా న పిప్పలాదో న తు పిప్పలాదః, యోవిద్యయాయుక్తస్తు నిత్యబద్ధో విద్యామయోయస్తు నిత్యముక్తః. ఠ అనిమూలము.

డు నిత్యముక్తు డనంబడును. జీవేశ్వరు లిరువురు బద్ధముక్తు లనుటమాత్రమేగాక జీవులలోపలంగూడ బద్ధముక్తపదములు గలుగును. అందు ముక్తుఁడగుజీవుఁడు దేహస్థితుండయ్యు స్వప్నమునుండి మేలుకొన్నవాని తెఱంగున స్వప్నగతములగు సుఖదుఃఖముల నొందమిచేత దేహస్థుఁడు కాఁడు. అవిద్వాంసుఁడు స్వప్నదేహగతునిరీతి దేహనిమిత్తము లగుసుఖదుఃఖముల నొందుచు దేహమునందుండి బద్ధుఁడగు ఇంద్రియార్థముల నింద్రియములును, గుణములను గుణములును గ్రహించుపక్షమున విద్వాంసుఁ డహంకారవికారములను బొందఁడు. ఈశరీరము పూర్వకర్మాధీనమైనది. దీనియందువర్తించుచునింద్రియభావ్యములగుకర్మములచేతఁ గర్తృత్వరూపమగు నహంకారము గలుగుటంజేసి యవిద్వాంసుఁడుబద్ధుండగును. ఈకర్మము స్వగతంబగునుగాని నాదికాదని యెఱింగి విరక్తుఁ డగువిద్వాంసుఁ డాయాయివిషయములను నింద్రియములు ప్రవేశింపఁగా దాను సాక్షిమాత్రుఁడై వర్తించుచు శయనాసనవిహారమజ్జనసందర్శనశ్రవణఘ్రాణ భోజనాదులందుఁ బ్రవర్తించియుంగూడ బద్ధుఁడుగాక యుండు.

ఆకాశము సర్వవ్యాప్తము. అట్లయ్యును, సూర్యుఁడు జలములయందుఁ బ్రతిబింబించియు, వాయువు సర్వతస్సంచారశీలంబయ్యు వానిసంగమును గాంచని తెఱంగున వైరాగ్యమునఁ దీవ్రంబగు స్వచ్ఛతమవిజ్ఞానముచేత సకలసంశయముల వదలి విద్వాంసుఁడు నిస్సంగుఁడే యగును. *ఎవ్వాని ప్రాణేంద్రియ

*యస్య స్యురవీతసంకల్పాః ప్రాణేంద్రియమనోధియాం, వృత్తయః నిరుగ్ధో దేహస్థోఽపిహి తద్గుణైః. ౧౩. అని మూలము.

బుద్ధివృత్తులు వీతసంకల్పము లగునో యతఁడు శరీరస్థుఁడయ్యును దద్గుణవినిర్ముక్తుఁడే యగు. ఇయ్యవి ముక్తునిలక్షణములు. ఆతనినోరులు తెలిసికొనుటెట్లో ఆప్రకారము తెల్పెద. వినుము అట్టిముక్తుఁడు ఘాతుకులు తనను హింసించినను కొంద ఱభిమానమునఁ బూజించినను ఈ రెండింటియందును వికారము నొందఁడు. గుణదోషవివర్జితుఁడై సాధుచర్యకు స్తోత్రము, అసాధుచర్యకు నిందయు నొనర్పక సమదర్శనుఁడై ధ్యానతత్పరుఁడై యేకార్యము చేయకయు నించుకేని పలుకకయుఁ దదీయములగు సాధ్వసాధువృత్తులను జింతింపకయు నాత్మారాముఁడై జడునివలె సంగరహితునియు నిర్లేపునియు చర్యనుబూని సంచరించును. * వేదము శబ్దబ్రహ్మము. దాని విషయమున నిష్ఠ నభ్యసించియుఁ బరబ్రహ్మమునందు నిష్ఠ నొందనివాని శాస్త్రపరిశ్రమము పాలీయనిగోవును బోషించువాని శ్రమమురీతి నిష్ఫలంబగును. పాఁడి యుడిగినగోవును, దుర్మతి యగుభార్యను, ప్రతిక్షణము దుఃఖహేతువగుశరీరమును, దుష్టసంతానమును, సత్పాత్రదానము చేయనిధనమును, నన్ను (భగవంతుని) గీర్తింపనివాక్కును, దుఃఖపరంపరలతోడ మానవుఁడు భరించుచుండునని నమ్ముము. జగత్తునకు దీనికి నుత్పత్తిస్థితిలయములఁ గల్పించు నాకర్మములను లీలాదివ్యచరిత్రములను బ్రశంసింపక వ్యర్థమగువాక్కు ధీరుఁడు భరించుట మంచిదిగాదు. ఈరీతిగా విచారముచేసి యాత్మకుం

*యశ్శబ్దబ్రహ్మనిష్ణాతో ననిష్ణాయాత్పరే యది, శ్రమస్తస్య శ్రమ ఫలో హ్యధేనుమివ రక్షతః. ౧౭. గాందుగ్ధదోహామసతీం చ భార్యాం దేహం పరాధీనమసత్ప్రజాం చ, విత్తం త్వతీర్థీకృతమంగవాచం హీనాం

గల్పించు నానాత్వభ్రాంతిని దూరముగాఁ ద్రోలి నిర్మలమగు మనస్సును సర్వగతుండనగు నాపై నిలిపి విరక్తుఁ డుపశమము నొందును. *ఉద్ధవా! నాయందే మనస్సు నచంచలముగ నిలిపి యుంచుశక్తి లేకుండినవాఁడు తా నొనరించుసకలకర్మములు నాకర్పించి ఫలాభిసంధిరహితుఁడై యుండుట మంచిది. సకల లోకములను బవిత్రములుగ నొనరించునవియు నిరుపమశుభ ముల నిచ్చునవియు నగు నాకథలు శ్రద్ధాభక్తులుగలిగి వినుచు వానిని గీర్తించుచు నాయవతారములను గృత్యములను బలు సారులు సంస్మరించుచు నాకొఱకై ధర్మార్థకామములను త్రివర్గ ముల నాచరించుచు నన్నారాధించువాఁడు శాశ్వతుఁడనగు నాపై నిశ్చలభక్తిని బొందఁగలఁడు. నాభక్తి సాధుసహవాసం బుననే కలుగును. దానింబొంది నన్ను నారాధించువాఁడు సాధువులచేఁ గనఁబఱుపఁబడిన నాపరమపదమును గష్ట మను నది లేకయే పొందఁగలఁడు. అని బోధించుటయు నుద్ధవుం డిట్లు పలికెను.

మహానుభావా! నీకు నిష్టుఁడైనసజ్జనుఁ డెట్టివాఁడు? సాధుసమ్మతమగుభక్తి యెట్టిది నీకు సమ్మతము? అది బహువిధ

మయా రక్షతి దుఃఖదుఃఖీ. ౧౮. అని మూలము *యద్యసీశో ధారయితుం మనో బ్రహ్మణి నిశ్చలమ్, మయి సర్వాణి కర్మాణి నిరపేక్షస్సమాచరేత్. ౨౧. శ్రద్ధాళు ర్మే కథాశ్శృణ్వన్ సుభద్రాలోకపావనీః, గాయన్ననుస్మరన్ కర్మ జన్మ చాభినయన్ ముహుః. ౨౨. మదర్థే ధర్మకామార్థా నాచరన్ మదుపాశ్రయః, లభతే నిశ్చలాం భక్తిం మయ్యుద్ధవ సనాతనే. ౨౩. స త్సంగలబ్ధయా భక్త్యా మయిమాం య ఉపాసితా, స వై మే దర్శితం సద్భిరంజసా విందతే పదమ్. ౨౪. అని మూలము.

ములుగా నుండునుగదా. నేను బ్రపన్నుఁడనుగాన నా కీవిష యము నుపదేశించి కృతకృత్యునింజేయుము. నీ వాకాశము రీతి నిస్సంగుఁడవు. ప్రకృత్యతీఁడవగు పురుషుఁడవు. పర బ్రహ్మావు నీవే. భక్తులు ప్రార్థించుటంజేసి పృథక్పరిమితమగు దేహమున నవతరించితివి. కావున నాకు వాంఛితము ఫలింప బోధింపుము. అని యుద్ధవుఁడు శ్రద్ధాళువై ప్రశ్నింపఁగా శ్రీ కృష్ణుఁ డిట్లనియె.

## సాధువులలక్షణములు.

ఉద్ధవా! చక్కనిప్రశ్నము చేసితివి. ఇది లోకమునకు బహూపకార మొనరించును. దీనికిఁ దగుసమాధానమును జెప్పెదను. చక్కఁగా నాలకింపుము. ఆలకించినదానిని మది నిలుపుకొనుము. దానిని బాత్రులగువారలకుం దెల్పుము. *కృపాళువు, (అనఁగాఁ బరదుఃఖములం గాంచి యోర్వఁజాలని వాఁడు) ఎవ్వారికే నేసమయమునైన ద్రోహముచేయనివాఁడు, క్షమ, సర్వశరీరులయందుఁగలవాఁడు, సత్త్వగుణము ప్రధా నముగాఁగలవాఁడు, అసూయాదిదోషములులేనివాఁడు, సుఖ

*కృపాళురకృతద్రోహ స్తితిక్షుస్సర్వదేహినాం, సత్యసారోనవద్యాత్మా సమస్సర్వోపకారకః. ౨౮. కామైరహతధీర్దాంతో మృదుశ్శుచిరకించనః, అనీహో మితభుక్ఛాంతస్థిరో మచ్ఛరణోమునిః. ౨౯. అప్రమత్తో గభీరాత్మా ధృతిమాన్ జితషడ్గుణః, అమానీ మానదః కల్యోమైత్రః కారు ణికః, కవిః. ౩౦. ఆజ్ఞాయైవం గుణాన్ దోషాన్ మయాదిష్టానపి స్వకాన్, ధర్మాన్ సంత్యజ్య యస్సర్వాన్ మాం భజేత్సోఽపి సత్తమః. ౩౧. అని మూలము.

దుఃఖాదిద్వంద్వములయందు సమత్వమున వర్తించువాఁడు, సర్వప్రాణుల కుపకార మొనరించువాఁడు, కామములకు లోఁబడని చిత్తముగలవాఁడు, అంతరింద్రియ బాహ్యేంద్రియనిగ్రహముగలవాఁడు, కఠినతలేని మనస్సుకలవాఁడు, సదాచారపరాయణుఁడు, కొంచెమేని పరిగ్రహింపక యుండువాఁడు (అప్రతిగ్రహీత), దృష్టాదృష్టక్రియాశూన్యుఁడు, లఘువగు నాహారమును గొనువాఁడు, నియతాంతఃకరణుఁడు, స్వధర్మమున నిశ్చలుఁడు, మదేకాశ్రయుఁడు, మననశీలుఁడు, సావధానుఁడు (శ్రద్ధతోఁ గూడినవాఁడు), నిర్వికారచిత్తుఁడు, విపత్తులయందును దీనుఁడుకానివాఁడు, క్షుత్పిపాసలు శోకమోహములు, జరామృత్యువులు నను నీయాఱును షడూర్ము లనఁబడును. వాని జయించినవాఁడు, మర్యాదను గోరనివాఁడు, ఒరులకు మర్యాదగల్పించువాఁడు, ఇతరులకు బోధించు నేర్పుగలవాఁడు, వంచకుఁడు కానివాఁడు, కరుణగలిగియే యెల్లప్పుడు ప్రవర్తించువాఁడు, చక్కని పరమాత్మజ్ఞానముగలవాఁడు ఉద్ధవా! ఈలక్షణములుగలవాఁడే సాధువనంబడును. ధర్మము నాచరించినచోఁ జిత్తశుద్ధి లోనగుగుణములు లభించుననియు దానిని మానిన దోషములు గలుగుననియు, మదాజ్ఞారూపములగు వేదములు బోధించు. కాన వాని నెఱింగియు దృఢభక్తి గలిగి యాస్వధర్మములఁ బరిత్యజించి నన్నే సేవించువాఁడును సాధువనంబడును. నే నెట్టివాఁడనో ఎంతవాఁడనో యని పెక్కుసారులు చర్చించి శాస్త్రమూలమున నెఱింగి యనన్యభావమ న్నారాధించువారును నా కత్యంతభక్తు లగుదురు.

## భక్తిలక్షణములు.

* ఇఁక భక్తిలక్షణముల నుపదేశింతు వినుము. మదీయ ప్రతిమలను నాభక్తులను దర్శించుట, స్పృశించుట, పూజించుట, పరిచర్యచే నలరించుట, స్తుతించుట, వినయము గనఁబఱచుట, గుణకర్మములఁ గీర్తించుట యనునవియు; నాకథాశ్రవణమున శ్రద్ధగలిగియుండుటయు, నన్ను ధ్యానించుటయు,సర్వలాభములను నాకర్పించుటయు, నాసంబంధములగు జన్మాష్టమ్యాదివ్రతోత్సవానుమోదనము, గీతము నృత్యము వాద్యములు అనుదానిగోష్ఠితో దేవాలయమున నుత్సవము లొనరించుటయు, నాయాత్రచేయుటయు; చాతుర్మాస్యైకాదశ్యాదులగునెల్లపర్వముల (ముఖ్యతిథులు)యందు బలివిధానమునడపుటయు, వైదికములు తాంత్రికములునగుదీక్షలనొందుటయు, నావ్రతముల నాచరించుటయు, నాప్రతిమలస్థాపించుటయందుఁ

* మల్లింగ మద్భక్తజనదర్శనస్పర్శనార్చనం, పరిచర్యాస్తుతి ప్రహ్వగుణకర్మానుకీర్తనం. ౩౩. మత్కథాశ్రవణే శ్రద్ధా మదనుధ్యానముద్ధవ, సర్వలాభోపహరణం దాస్యే నాత్మనివేదనం. ౩౪. మజ్జన్మకర్మకథనం మమ పర్వానుమోదనం, గీతతాండవవాదిత్రగోష్ఠీభిర్మద్గృహోత్సవః. ౩౫. యాత్రా బలివిధానం చ సర్వవార్షికపర్వసు, వైదికీ తాంత్రికీ దీక్షామదీయవ్రతధారణం. ౩౬. మదర్చాస్థాపనే శ్రద్ధాస్వతస్సంభూయచోద్యమః,ఉద్యానోపవనక్రీడాపురమందికర్మణి. ౩౭. సమ్మార్జనోపలేపాభ్యాం సేకమండలవర్తనైః, గృహశుశ్రూషణం మహ్యం దాసవద్యదమాయయా. ౩౮. అమానిత్వమదంభిత్వం కృతస్యాపరికీర్తనం, అపి దీపావలోకమ్మే నోపయుంజ్యాన్నివేదితం. ౩౯. యద్యదిష్టతమం లోకే యచ్చాపి ప్రియమాత్మనః, తత్తన్నివేదయేన్మహ్యం తదానంత్యాయ కల్పతే. ౪౦. అని మూలము.

జక్కని యాసక్తికలిగియుండుటయు, నాకొఱకు నుద్యానము లను ఫలవృక్షశ్రేణులను వృద్ధిచేయుటయందు, నాకై క్రీడా స్థానములను మందిరముల నిర్మించువిషయమందును శ్రద్ధగలిగి యుండుటయు, ఆకార్యములందుఁ దా నితరులం బ్రోత్సహించి సాగించుటయు, మఱియు నామందిరములను అలికి ముగ్గులు విచిత్రరీతుల నలంకరించి యోరుదీర్చి కపటములేకదాసునివలె నలంకరించుటయు, నభిమానమువీడుటయు, దాంభికత్వమును, దొలఁగియుండుటయుఁ, దానొనరించినసేవను బొగడుకొనకుం డుటయు, నితరులు నివేదించినదీపమునుగాని తానునివేదించిన వానినిగాని తనపని కుపయోగింపకయుండుటయు, లోకమునకు మిక్కిలి యిష్టముగానున్న దానిని విశేషించి తనకుఁ బ్రియంబ గుదానిని, నాకు నివేదించుటయు ననునవియే భక్తి లక్షణ - ములు. ఈ భక్తి యనంతఫలప్రదమని యెఱుంగుము.

పదునొకండు పూజాస్థానములు.

సూర్యుఁడు, అగ్నిహోత్రుఁడు, బ్రాహ్మణుఁడు, గోవులు, విష్ణుభక్తుఁడు, ఆకాశము, వాయువు, జలము, పృథివి, ఆత్మ, సర్వభూతములు నను నీపదునొకండును మదీయపూజకుఁ దగి నస్థానములు. సౌరసూక్తరూపములగు నుపస్థానములచేత సూర్యునియందును, వేదపూతమగు పురోడాశముచే నగ్ని హోత్రునియందును, అతిథిపూజచేబ్రాహ్మణునియందును,తృణము లోనగువాని నొసంగుటచేత గోవులందును, బంధువులను సత్కరించునట్లు సమ్మానముచేత విష్ణుభక్తునియందును, ధ్యాన చే హృదయాకాశమునందును, ప్రాణదృష్టిచేత వాయువు ను, తర్పణాదులచే జలములయందును, రహస్యమంత్ర

న్యాసములచేత భూమియందును, భోగములచేత నాత్మయం దును, సమత్వప్రవర్తనముచేత సర్వభూతములయందును శంఖచక్రగదాపద్మమనోహరచతుర్భుజుండనగు నన్నే సమా హితచిత్తుండై యిష్టాపూర్తము లనువ్రతముల నన్నే సర్వదా యారాధించునాతఁడు నాయందుభక్తి గలిగి దానిసామర్థ్యము చేతను సాధుసమారాధనముచేతను నావిషయకమగుదివ్య జ్ఞానమును బొందు ఉద్ధవా! *సజ్జనసాంగత్యముగల్గి భక్తియో గముచేతఁ దప్ప వేఱొక్కమార్గమున సంసారసాగరమును దరించుమార్గము సాధారణముగాఁ గనఁబడదు నేనే సాధువు లకు ముఖ్యాశ్రయము. నీవు నాకత్యంతభృత్యుఁడవు. సఖుఁ డవు. కావున నొకరహస్యవిషయమును దెలిపెద. అవధరింపుము.

## సాధుసంగమహాత్త్వము హరి యుపదేశించుట.

† ఉద్ధవా! ఆవిషయము పరమగోప్యము సుమీ. సర్వ సంగములను నివర్తింపఁజేయునది సత్సహవాసమని నమ్ముము. ఆయది నన్ను వశీకరించునట్లు యోగము, సాంఖ్యము, ధర్మము, స్వాధ్యాయము, తపస్సు, సన్న్యాసము, ఇష్టాపూర్తములు, భూరిదక్షిణలు, వ్రతములు, జ్యోతిష్టోమాదియజ్ఞములు, ఛంద

---

* ప్రాయేణ భక్తియోగేన సత్సంగేన వినోద్ధవ, నోపాయో విద్యతే సమ్యక్ప్రాయణం హి సతామహం. ४८. ప్రకృష్టం అయనం ఆశ్రయః. అని వ్యాఖ్య. † ఈవిషయము పండ్రెండవ యధ్యాయమునుండి సంగ్ర హింపఁబడినది. న రోధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ, న స్వాధ్యాయస్తపస్త్యాగో నేష్టాపూర్తం న దక్షిణా. ౧. వ్రతాని యజ్ఞ శ్ఛందాంసి తీర్థాని నియమా యమాః, యథావరుంధే సత్సంగస్సర్వసంగా పహో హి మామ్. ౨. అని మూలము.

స్సులు,తీర్థములు,నియమములు,యమములు ననునివియన్నియు నన్ను వశీకరింపఁ జాలవని యెఱుంగుము. దానవులు రాక్షసులు పక్షులు మృగములు గంధర్వాప్సరసలు నాగులు సిద్ధచారణగుహ్యక విద్యాధరులును, మానవులలో రజోగుణ తమోగుణప్రకృతు లగువైశ్యులు స్త్రీలును శూద్రులు, నంత్యజులు, వృత్రుఁడును, ప్రహ్లాదుఁడు మున్నగువారెల్లను, వృషపర్వుఁడు, బలిచక్రవర్తి, బాణుఁడు, మయుఁడు, విభీషణుఁడు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, జాంబవంతుఁడు, గజుఁడు, జటాయువు, తులాధారుఁడు, ధర్మవ్యాధుఁడు, కుబ్జ, వ్రజమునఁ గలగోపికలు యజ్ఞదీక్షితులభార్యలు నింకనుగల పెక్కండ్రు ఆయాయియుగంబులయందు సత్సంగముచేతనే నాపరమపదమును బడయఁగల్గిరి. పైన బేర్కొనంబడినవారిలోఁ గొందఱు వేదములఁ బఠించుటగాని, పెద్దలను సేవించుటగాని, వ్రతములను జేయుటకాని తపముల ననుష్ఠించుటకాని చేయకున్నను సత్సహవాసమను గొప్పకార్యము మహత్త్వముననే నన్నుఁ బడయఁజాలిరి. సాధుసహవాసముచేఁ గలిగినప్రేమాతిశయంబున గోపికలు గోవులు వృక్షములు సర్పములు మఱియుం గొందఱు మూఢచిత్తులును యోగముచే సాంఖ్యముచే, దానవ్రతతపస్సులచే యజ్ఞములచేత శాస్త్రమును జెప్పుటచేత స్వాధ్యాయముచే సన్న్యాసముచే నెంత ప్రయత్నముచేసినను బడయ శక్యముకాని నన్నుఁ గాంచఁజాలిరి.

అక్రూరుం డానాఁడు వచ్చి బలభద్రునితోడ నన్ను మథురకుఁ బిలుచుకొనిపోవఁగా నాయందుఁగల ప్రేమాతిశయమున నెడఁబాటువలని బాధను సహింపఁజాలక పరితపించుచు

నన్నుమాత్రమే యాపడంతులు చింతించుచుండిరి కాని సుఖముకొఱకొక్కరునిగూడఁ జూడరైరి. మిక్కిలి వారిప్రేమకుఁ బాత్రుఁడనగు నేను బృందావనమున నుండునపుడు నాతో విహరించుచు క్షణకాలముగాఁ బుచ్చినరాత్రులు వారు నన్నెడఁ బాయుటం జేసి కల్పతుల్యములుగాఁ గడుపఁగల్గిరి. ఆతఱి నాయందే మనముల నెలకొలిపి యహంకారమునకు నెలవగు నాత్మదేహమును బ్రీతిపాత్రములగుపతిపుత్త్రాదులను నీలోకము నాలోకమును దెలియక సమాధినిష్ఠులగు మును లెట్లు మైమఱచియుందురో యట్లు నామరూపములం దెలియక యే సముద్రోదకముల నదు లెట్లు చేరునో యారీతిగా నాలోపలఁ బ్రవేశించిరి. *ఈరీతిగా నాగోపికలు పెక్కండ్రు నన్ను సేవింపఁగోరి తమకామమునకు లక్ష్యభూతునిగా నన్నే నిర్ణయించి నాస్వరూప మిట్టిదనియోగు లెఱుంగునట్టు లెఱుంగకయున్నను బరబ్రహ్మమగు నన్ను జారబుద్ధి నాశ్రయించి సత్సహావాసబలముననే ముక్తిగాంచిరి. కాఁబట్టి యోయుద్ధవా! నీవుకూడ శ్రుతిస్మృతులను, బ్రవృత్తినివృత్తులను, శ్రుతశ్రోతవ్యములను వదలిపెట్టి సర్వదేహుల కాత్మయు నద్వితీయుఁడనగు నన్ను సర్వభూతాత్మభావమున శరణుచొచ్చి సర్వవిషయభయమును దొలఁగియుండుము. అని శ్రీహరి యుపదేశింపఁ నుద్ధవుఁ డిట్లు ప్రశ్నించెను.

యోగేశ్వరాధిపా! కర్మము చేయఁదగినదనియుఁ జేయనక్కఱలేదనియుఁ దెలిపితివి. నాసందియము నీపలుకులఁ

*మత్కామా రమణం జారం మత్స్వరూపావిదోఽబలాః, బ్రహ్మాపరమం ప్రాపుస్సంగాచ్ఛతసహస్రశః. ౧౩. అని మూలము.

పర ంతము పెరుఁగును. దానిఫలములలో నొక్కటియగు దుఃఖమును గాముకులగు గృహస్థు లనుభవింతురు.మఱొక్కటి యగు సుఖాత్మకమగు ఫలమును వివేకులగు సన్న్యాసులే యనుభవింతురు.పరమాత్మయొక్కండయ్యు మాయామయుండై బహురూపములుగఁ దోఁచు చుండునని సద్గురుసేవనంబున నెవ్వఁడెఱుంగునో యాబుద్ధిమంతుఁడు వేదతత్త్వార్థంబు నెఱుంగును.ఈరీతిగా గురువు నారాధించి దానవలవడిన యేకభక్తిచే వృద్ధినొందు తీవ్రజ్ఞాన మనుకుఠారముచేత జీవోపాధియుఁ ద్రిగుణాత్మకంబైన లింగశరీరమును దునిమి పరమేశ్వరుని జేరియందు నాసాధనంబును వదలుము.అని తెలిపి పరమభక్తుఁడగు నుద్ధవునకుఁ గలిగిన శంకలఁ దీర్పఁగోరి మఱియు శ్రీకృష్ణుఁ డిట్లు బోధించెను.

## సత్త్వాదిగుణముల జయించుపద్ధతి.

* సత్త్వరజస్తమస్సులను మూఁడును బ్రకృతిగుణములే కాని యాత్మగుణములు కావు. సత్త్వగుణముచేత రజస్తమోగుణములను రెండింటి నడంచి యంతట నుపశమాత్మకమగు సత్త్వమున నితరసత్త్వమును బరిహరింపందగును. ఎందులకనఁగా సత్త్వముచేతఁ బురుషునకు నాభక్తిలక్షణమగు ధర్మముదయించును. సాత్త్వికపదార్థములనే గ్రహించుటంజేసి సత్త్వము వృద్ధినొందఁజాలు. దానిచే ధర్మము వృద్ధినొందును. సత్త్వమభివృద్ధినొందుటకుఁ గారణంబైన యత్యుత్తమధర్మము రజస్తమోగుణముల హరించుటయుఁ దన్మూలమగు నధర్మము

* ఈవిషయము పదుమూఁడవయధ్యాయమునుండి సంగ్రహింపఁ బడినది.

శీఘ్రంబ వానితోడనే నశించును. * శాస్త్రము, జలము, ప్రజలు, దేశము, కాలము, కర్మము, జన్మము, ధ్యానము, మంత్రము, సంస్కారము అను పదియు విషయభేదముచే గుణత్రయమునకుం గారణములగు. అందుఁ బెద్దలగువారు స్తుతించునది సాత్త్వికంబు. వారు దూషించునది తామసము. వారు మెచ్చుకొనక దూషింపకయు నుండునది రాజసమని యెఱుంగుము. సత్త్వవృద్ధికొఱకుసాత్త్వికంబులగునాహారాదులన్నియుఁ బురుషునకు సేవింప నర్హములు. దానిచేత ధర్మము గలుగును. ఆ యుత్తమధర్మముచేత దేహద్వయము తత్కారణగుణాపోహము నగు నాత్మాపరోక్షజ్ఞానము గలుగును వెదుళ్లరాపిడి గలిగిన యగ్ని యావనమును గాల్చి యుపశమించునట్లు త్రిగుణములు వైషమ్యము నొందుటవలనఁ బుట్టినశరీరము తనకు నాశ్రయములైన గుణములను మూఁడింటిని దనంతన యుత్పన్నంబగువిద్యచేఁ దొలఁగించి శాంతమగును. అన విని యుద్ధవుఁడు మహాత్మా! శ్రీకృష్ణా! మానవులుశబ్దాదివిషయములాపదలకు మూలము లని సాధారణముగా నెఱుంగుదురు. అట్టులయ్యును వారు శునకములవలె గాడిదలరీతిని,గొఱ్ఱియల చందమునను వానినే (శబ్దాదివిషయములనే) సిగ్గులేకయు దెబ్బలకోర్చియుఁ దిట్లకు జంకకయు ననుభవింతురు అట్లేల చేయుదురు? ఈశంకనుదీర్పుమాయని ప్రశ్నించెను. ఆ ప్రశ్నము నాలకించి శ్రీనివాసుం డిట్లు త్తరమిచ్చెను.

వివేకహీనునకు దేహాదులం దహమాత్మకమిథ్యాబుద్ధి మనస్సున వృద్ధినొందుకొలఁదిని నాయభిమానముచేత దుఃఖా

* ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మ చ జన్మ చ, ధ్యానం మంత్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవః. ౪. అని మూలము.

త్మకమగురజోగుణము మనస్సునఁ బొందుపడును. మనస్సారజో గుణదూషితము కాఁగా దానియం దప్పుడు సవికల్పకమగు సంకల్పము పొడము. దానగుణధ్యానము. దానంజేసి యాదుష్ట బుద్ధికినిర్భరమగు కామముగలుగు. అత్తఱిఁ బురుషుఁడు రజో వేగమున విమోహముగలవాఁడుగఁజేయంబడి యింద్రియము లకుం జిక్కువడి కామమునకులోఁబడి దుఃఖమునే ముందు కలి గించునవి యని తెలిసియుండియుఁ గర్మములను జేయును. రజ స్తమోపిహిత స్థచిత్తుఁ డయ్యును విద్వాంసుఁడు మాత్ర మల సుఁడు కాక మనస్సును నిరోధించి యందు సక్తుఁడు కాకయుం డును. ప్రమాదమునొందక యలసుఁడు కాక జితాసనుఁడై (ఎంతసేపు కూరుచుండినను శ్రమమునొందకుండునట్టి యభ్యాస విశేషముకలవాఁడై) శ్వాసముల జయించి (ప్రాణాయామపరా యణుఁడై) సమయమున నాయందు మనస్సును మెల్లఁగా నిలిపి సమాధికిఁ బ్రయత్నింపవలయును. అన్నివిషయంబులందును మనస్సు నిరోధించి చక్కఁగా నాపై నిలుపుటయే యోగము. ఆయోగమును మునుపు నాశిష్యులగు సనకాదిమునివతంసు లడుగఁగానుపదేశించితిని. అనినవినియుద్ధవుం డిట్టుప్రశ్నించెను.

శ్రీవాసుదేవా! ఏ కాలమున నేయవతారమున నీ వీయో గవిషయమును సనకాదుల కుపదేశించితివి? అద్దాని విన వేడుక యగుచున్నది. దానిని జెప్పుమా యన విని శ్రీకృష్ణుం డిట్లు బదులు చెప్పెను. ఉద్ధవా! వినుము. మున్నొక్కసారి బ్రహ్మ మానసపుత్త్రులగు సనకాదులు తెలియఁ దరముగాకయుండు యోగ' పరమగతిని దెలిసికొనఁగోరి తండ్రి పాలికింబోయి జనకా! నస్సు రాగాదివశమున విషయములం బ్రవేశించెడు ఆవిష

యములు వాసనారూపముచేత మనస్సును బ్రవేశించును. ఇట్లు సాగుచుండఁగా నావిషయములను దరింపఁగోరునట్టి ముముక్షువునకు వాని యన్యోన్యసంత్యాగం బెట్టులగును? ఎఱింగింపు మని ప్రశ్నించిరి. సకలభూతభావనుఁ డగు నాస్వయంభువు చాలసేపాలోచించికూడఁ గర్మవిక్షిప్తచిత్తుండు కాఁగా సర్వజ్ఞుఁడు కాఁడు కావున నాప్రశ్నబీజము నెఱుంగఁ జాలకుండెను తదీయప్రశ్నమునకు సదుత్తరంబు తెలిసికొనఁ గోరి నన్ను స్మరించెను. నేనును హంసరూపమును దాల్చి యాబ్రహ్మకడకుంబోయితిని నన్ను గన్నయంతనే బ్రహ్మాయు సనకాదులును నాపాదములకు నమస్కారములు చేసి తత్త్వమిదమిత్థమని తెలిసికొన నూహించి నీ వెవఁడవని ప్రశ్నించిరి. అపుడు నేను వారికిం దెలిపినవిధంబునే యిప్పుడు నీకుఁ జెప్పెదను.

ఓ విప్రప్రవరులారా! మీప్రశ్న మాత్మవిషయకమా, లేక తదుపాధియగు భూతసంఘవిషయకమా? ఆత్మవిషయకమే యనుదురేని పరమార్థరూపుఁడగు నాత్మకు నభేదంబగుటంజేసి యిందు మీప్రశ్న మెట్లు సరిపడును? నిర్విశేషుఁడగు నాత్మయందే జాతిగుణాదివిశేషంబుంబట్టి నేనుత్తరంబిత్తును! ఉపాధిభూతమగు భూతసంఘవిషయకమందురేని వినుఁడు. పంచభూతాత్మకత్వముచేతసమానములయి,పరమార్థముపందుఁ బరమకారణాత్మకత్వముచేత నభిన్నములగు దేవమానవాది దేహములందు నీవెవ్వండవు? అనుప్రశ్నము వాఙ్మాత్రారంభముగలదియై యనర్థకంబె యగును? మనస్సుచే వాక్కుచే నేత్రములచేనితరేంద్రియములచే వీనిలోనే దేనిచేతనైనను గ్రహింపఁబడుపదార్థ మేదియు నేనే కాని నాకంటె వేఱులేదని తత్త్వ

విచారముచేఁ దెలిసికొనుము. పుత్త్రులారా! గుణములయందు మనస్సు మనస్సునందు గుణములు నావేశించు నను నీరెండును మదాత్ముఁడైన జీవున కథ్యమగునుపాధియేకాని స్వరూపము కాదు. గుణసంస్కారముచేత మాటిమాటికి గుణములను ప్రవేశించు మనస్సు, మనస్సునంగలుగు గుణములు నను నీరెండును మద్రూపుఁడై తొలఁగింపవలయును. జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడు బుద్ధివృత్తులకుసాక్షియై తద్విలక్షణుఁడైన జీవుఁడుండును. బుద్ధికృతంబగు బంధము ఆత్మకు గుణవృత్తులను గల్పించును. కాఁబట్టి తురీయుఁడనగు నాలో నిలిచి సంసారబంధమును వదలవలయును ఆస్థితియందు గుణములకుఁ జిత్తమునకు నన్యోన్యత్యాగంబు పొసంగును. అహంకారకల్పితబంధమాత్మకు నవిద్యాదుల నావరణం బొనరించి యనర్థఫలహేతువగును. ఈవిషయ మిట్లేకదా యని యెఱింగి యట్టిది దుఃఖమని వేసరి తురీయావస్థితుండై బుద్ధ్యభిమానమును దానిచేఁ గలుగు భోగాభిలాషచింతను ద్యజింపవలయును. పురుషుఁడు మంచియుక్తులచే నానార్థవిషయకమతి వదలునంతకుఁ గర్మాదులయందుజాగరూకుఁడయ్యు నజ్ఞుఁడై స్వప్నమధ్యమున జాగరణ మెట్లో యట్లే స్వప్నములంబలె నన్నింటిని జూచుచుండును. దేహాదిభావములు మిథ్యలే కావునఁ దత్కృతములగు వర్ణాశ్రమాచారాదిభేదములు,స్వర్గాదిఫలములును, ...ర.ములును, స్వప్నముం గాంచువానికివలెఁ బరమాత్మకు మి...యగు. జాగరంబున క్షణిక బాల్యయౌవనాదిధర్మములు ...గిన దేహాద్యరముల నింద్రియములచే ననుభవించునతఁ స్వప్నముఁందు హృదయమున జాగరమునఁ జూచిన

వానితోఁ దుల్యములగు వాసనామయవిషయముల ననుభవిం చునతఁడును,మఱియు సుషుప్తియందు వానినెల్ల నుపసంహరిం చునతఁడును సర్వావస్థాసమన్వయముచేత విశ్వతైజసప్రాజ్ఞనామ ములంగాంచుచునవస్థాత్రయమునకు సాక్షియైనవాఁ డొక్కఁడే యగును. కాని పలువురు గాదని తెలియందగును.

* గుణకృతములగు నీమూఁడవస్థలును నాయందవి ద్యాకల్పితములే కాని తాత్త్వికంబులు గావని యీరీతి నిశ్చ యించి మీరనుమానప్రమాణమునను, సద్గురూపదేశమునను, దీవ్రజ్ఞానఖడ్గముచేత సర్వసంశయములకుఁ బ్రథావస్థానమగు నహంకారమును ఛేదించి హృదయసంస్థితుఁడగు నన్ను సేవిం పందగును. ఈ విశ్వమంతయు మనోవిజృంభితత్వము, దృష్ట త్వము, వినాశితత్వము (వీని హేతువులవలననిసారము.) నను నీమూఁడును హేతువులు కాఁగా స్వప్నము చందమున,గొఱవి చక్రమువలె విభ్రమ మాత్రంబే యగునని యూహింప వలయును. విజ్ఞానమొక్కటియే త్రివిధములగు గుణపరిణామ ములచేఁ జేయంబడు వికల్పముచేతఁ బెక్కుచందములం దోఁచుచుండును. అది స్వప్నమువలెనసత్యము. కాఁబట్టి దృశ్య మునుండి దృష్టిని మరలించి తృష్ణమాని వ్యాపారశూన్యుఁడై నిజసుఖానుభవమాత్రుండు కావలయును. ఆవశ్యకములగు నాహారాదులయందిట్టిది యొకానొకప్పుడు తోఁచుచుండి

* ఏవం విమృశ్య గుణతో మనసస్త్ర్యవస్థా మన్మాయయా మయి కృతా ఇతి నిశ్చితార్థాః, సంఛిద్య హార్దమనుమానసదుక్తితీక్ష్ణజ్ఞానాసినా భజత మాఖిలసంశయాధిమ్.అని మూలము.

నను మొదట నవస్తుభావమున విడిచియుండుటం జేసి మరల మోహమును గల్పింపఁజాలదు మఱియు దేహము పడునంత దనుక స్మృతిమాత్రమునఁ దోఁచును. సురాపానమదముచేఁ గన్నులుకానరానివాఁడు (వివేకహీనుఁడు) తాను గట్టుకొన్న వస్త్రము దైవికముగాఁ దనదేహమునందుండినను బోయినను దెలిసికొననిచందమున జ్ఞానసిద్ధిగలవాఁడు తనకు జ్ఞానమును సాధింప నుపయుక్తమగుదేహము నశించిన నుండినను, లేచి నను దెలియఁడు. దైవవశమునఁ గల్గినదేహము ప్రారబ్ధకర్మాంతముదనుకఁ బ్రాణేంద్రియములతో నుండును సమాధిపర్యంత యోగమున నారూఢుఁడగువాఁడు పరమార్థము నెఱింగి సపరివారంబగు నీదేహమును స్వప్నతుల్యముగా నెంచి కృష్ణుఁడగు లఁడు. విప్రులారా! సాంఖ్యయోగరహస్యమును మీకు నెఱిఁగించితిని. మీకు నెల్లధర్మము నుపదేశింపవచ్చిన శ్రీమహావిష్ణువుగా మీరు నన్నెఱుంగుఁడు. స్యాంఖ్యమునకు, యోగమునకు సత్యమునకు, (అనుష్ఠింపఁదగుధర్మము) ఋతమునకు (ప్రమీయమానధర్మము) తేజస్సునకు (ప్రభావము) శ్రీకీర్తిదమములకుఁ బరమాశ్రయము నేనే. నిర్గుణుఁడు నిరపేక్షుఁడు సుహృదుఁడు ప్రియుఁడాత్మయు నన్నుఁబొందు సామ్యాసంగాదిగుణములు గుణపరిణామరూపంబులు గావు. మఱి నిత్యములే యగును. అని నేను బోధింపఁగా సనకాదిమునులు సందేహములు తొలఁగిపోఁగా నిరుపమ మగుభక్తితో నన్ను నారాధించి వినుతించిరి నేను వానినెల్ల నాదరించి బ్రహ్మదేవుఁడు చూచుచుండ నాస్థానంబునకుం బోయితిని.

## భక్తియోగము ప్రధానము.

* అని శ్రీకృష్ణుఁ డుపదేశింపఁగా విని యుద్ధవుఁడు శ్రీహరి కిట్లు పలికెను. పరమేశ్వరా! బ్రహ్మవాదులు ప్రతిపాదించు శ్రేయస్సును సాధించువానిలో నన్నింటికిఁ బ్రాధాన్యము కలదా? లేక యందెద్దానికే నొక్కదానికి బ్రాధాన్యముకలదా? సర్వసంగములనువదలి నీపై మదినిల్పి ఫలాభిసంధిరహితముగా నొనరించు భక్తియోగము శ్రేయస్సాధనమని నిరూపింతువా. దయచేఁ దెలుపుమా యని ప్రశ్నింపఁగా విని యతనిసంశయము దీర్పఁగోరి శ్రీకృష్ణుం డిట్లుపలికెను. పూర్వకల్పాంతమందుఁగాలమున మదాత్మకమగు ధర్మమును బోధించు వేదమునశింపఁగా దానిని సృష్ట్యాదియందుఁ బద్మసంభవునకు నే నుపదేశించితిని. ఆపరమేష్ఠి తన ప్రథమపుత్త్రుఁడగు మనువునకుఁ జెప్పెను. ఆ మనువుమూలమున భృగ్వాదులగు మహాఋషు లేడుగురు గ్రహించిరి. వారినుండి తత్పుత్త్రులగు దేవదానవ గుహ్యక మానవ సిద్ధగంధర్వవిద్యాధరులు, చారణులు, యక్షనాగ కిందేవులు, కిన్నర కింపురుషాదులెల్ల సంగ్రహించిరి. రజస్సత్త్వ తమస్సులకు జన్మస్థానములగు వారిప్రకృతులునానావిధంబులుగా నుండు. అట్లగుటచే భూతములబుద్ధులు భేదములుగనుండును. తమతమప్రకృతిం బోలినరీతిని వారెల్ల వేదార్థముల నతివిచిత్ర మార్గముల సమన్వయింతురు. ప్రకృతివైచిత్ర్యమున మానవులబుద్ధులు భేదించుటయుఁ గొందఱు పారతంత్ర్యముచేఁ బాషండు లగుదురు. మన్మాయామోహితచిత్తులై కొందఱు

* ఈవిషయము పదునాల్గవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

*కర్మమునకుఁ దమయభిరుచికి ననుకూలమగునట్లుగా శ్రేయస్సు నానావిధంబగునని వక్కాణింతురు. మఱికొందఱు నిత్యనైమిత్తికకర్మము శ్రేయోమార్గమందురు. ఇంకను గొందఱు కీర్తిని సంపాదించుట ముఖ్యమని పలుకుదురు. ఇట్లే కొందఱు కామమును బ్రశంసింతురు. కొందఱు సత్యశమదమముల నుగ్గడింతురు. కొందఱైశ్వర్యమే పురుషార్థమని తలంతురు. కొందఱు నాస్తికులై త్యాగభోగముల నుద్ఘోషింతురు. కొందఱు యజ్ఞమును, తపమును, దానమును, వ్రతములను, యమములను, నియమములను మంచివని ప్రశంసింతురు వీనివలనఁ గలుగుఫలముల ననుభవించులోకములు వానిం జేయువారికి గమ్యములు. ఆయవి మోహావసానములు, శోకభూయిష్ఠములు, దుఃఖమునే ముందు గలిగించునవియు నైయుండు. మఱియు నత్యల్పానందమును గలిగించును. అవి యాద్యంతములు గలవియే. కావున నవి శాశ్వతానందము నీయఁజాలవు. నాపై మనస్సు నిలిపిననిష్కాముసకు సర్వప్రకారములచేతను బరమానందపరిపూర్ణరూపుఁడనగు నావలనం గలుగుసుఖము విషయాత్మకుల కెట్లు గలుగును. అకించనుఁడై యంతరింద్రియనిగ్రహముకలిగి శాంతుఁడై సర్వభూతసమచిత్తుఁడై మత్ప్రాప్తిసంతుష్టుఁడై యుండుమానవవర్యునకు సర్వస్థలములు సుఖమయంబులే యగు. నాయందే మనస్సునిలిపినవాఁడు సార్వభౌమత్వమునుగాని, పాతాళాధిపత్యంబు, నింద్రపదమును, తుదకు

* శ్రేయో వదంత్యనేకాంతం యథా కర్మ యథా రుచి. ౯. ధర్మమేకేయశశ్చాన్యే కామం సత్యం దమం శమం, అన్యే వదంతి స్వార్థం వై ఐశ్వర్యం త్యాగభోజనం. కేచిద్యజ్ఞం తపో దానం వ్రతాని నియమాన్ యమాన్. ౧౦. అని. మూలము.

బ్రహ్మలోకము నది యిది యని వచింపనేల కాని యోగసిద్ధులను ఫలముగా ముక్తినేనియుఁ గోరక నన్నే కోరును. పరమ భక్తుఁడవైన నీవెట్టులో యట్టులే నాకుఁ బుత్త్రుఁడైన విరించియు మత్స్వరూపభూతుఁడగు శంకరుఁడు భ్రాతయగు బలభద్రుఁడు భార్యయగు మహాలక్ష్మియు నాకుఁ బ్రియులుగారు.

ఉద్ధవా! వినుము. ఏవిషయమునందైన నపేక్షలేక శాంతుఁడై, సర్వభూతములయందు సుంతయు వైరముమాని సమదర్శనుఁడై (ఎల్లతావుల నన్నే చూచువాఁడై) యుండు మననశీలుఁడు సర్వదా వెంటనంటియుండును. అంతియికాక నాపాదపద్మపరాగముల నాతఁడు స్పృశించినదెల్లఁ బవిత్రమగుఁగాక యని యట్లే చేయుచుండును. నాయందే యనురాగముగలిగి మఱి దేనిని గోరక సకలప్రాణులయందును వాత్సల్యము గలిగి శాంతులైనమద్భక్తులు నిష్కామబుద్ధులు గావున వారుపొందు నిరతిశయసుఖ మిట్టిదని వారే యెఱుంగుదురు. కాని యితరు లెఱుంగఁజాలరు. మఱియొకరహస్యము నెఱింగింతు వినుము. ఉద్ధవా! నాభక్తుఁడు విషయములు తనను బాధించుచున్నను జితేంద్రియుఁడు కాకపోయినను సమమర్థభక్తిచేతవిషయములవలని పరిభవమునొందఁడు. *ప్రజ్వలించునగ్ని దారువులభస్మముచేయు

* యథాగ్నిస్సుసమిద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్, తథా మద్విషయా భక్తిరుద్ధవైనాంసికృత్స్నశః. ౧౯. నసాధయతిమాంధర్మో నసాంఖ్యం యోగ ఉద్ధవ, న స్వాధ్యాయ స్తపస్త్యాగో యథాభక్తిర్మమోర్జితా. ౨౦. భక్త్యాహమేకయా గ్రాహ్యశ్శ్రద్ధయాత్మా ప్రియస్సతాం భక్తిః పునాతిమన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్. ౨౧. ధర్మస్సత్యదయోపేతోవిద్యావాతపసాన్వితా, మద్భక్త్యపేతమాత్మానం నసమ్యక్ప్రపునాతిహి. ౨౨. కథం

నట్లు నాయందుఁగలభక్తిపాపరాసులనున్మూలించును ప్రౌఢభక్తి నన్ను సాధించు నట్లు ధర్మముగాని సాంఖ్యయోగములుగాని స్వాధ్యాయముగాని, తపస్సుగాని, త్యాగము (సన్న్యాసము) గాని నన్ను సాధింపఁజాలవు సాధుజనులకుఁ బ్రియుఁడను, ఆత్మయును గావున నేను భక్తి కొక్కదానికే లోఁబడుదును. అనఁగా భక్తిచేతనే గ్రాహ్యుఁడను. భక్తి శ్రద్ధాసమన్వితమే యైనయెడలఁ గుక్కమాంసము దిను చండాలుఁ నేని వానిజాతి దోషమునుండి పరిశుద్ధుని గావించును జుమీ. సత్యము దయ యుఁగలిగి యుండియు విద్యతోఁదపస్సుతోఁ గూడియుండియు నాభక్తియే లేకయున్నచో వానియాత్మ నదిచక్కఁగాఁ బరిశుద్ధము కావింపదని నమ్ముము. సత్యముగా భక్తికలిగినది నమ్ము

---

వినారోమహర్షం ద్రవతాచేతసావినా, వినానందాశ్రుకలయాశుద్ధ్యేద్భక్త్యావినాశయః. ౨౩. వాగ్గద్గదా ద్రవతేయస్యచిత్తంహసత్యభీక్ష్ణం రుదతిక్వచిచ్చ, విలజ్జఉద్గాయతినృత్యతేచ మద్భక్తియుక్తో భువనంపునాతి. ౨౪. యథాగ్నినా హేమ మలం జహాతిధ్మాతంపునస్సంభజతే చ రూపం, ఆత్మాచ కర్మానుశయం విధూయ మద్భక్తియోగేనభజత్యథోమాం. ౨౫. యథాయథాత్మాపరిమృజ్యతేఽసౌ మత్పుణ్యగాథాశ్రవణాభిధానైః, తథాతథాపశ్యతివస్తుసూక్ష్మం చక్షుర్యథైవాంజనసంప్రయుక్తం. ౨౬. విషయాన్ ధ్యాయతశ్చిత్తంవిషయేషు విషజ్జతే, మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే. ౨౭. తస్మాదసదభిధ్యానం యథాస్వప్నమనోరథం, హిత్వా మయి సమాధత్స్వ మనో మద్భావభావితం. ౨౮. స్త్రీణాంతత్సంగినాంసంగంత్యక్త్వాదూరతఆత్మవాన్, క్షేమే వివిక్తఆసీనశ్చింతయేన్మామతంద్రితః. ౨౯. న తథాస్య భవేత్ క్లేశోబంధశ్చాన్యప్రసంగతః, యోషిత్సంగాద్యథా పుంసో యథాతత్సంగిసంగతః.

అని మూలము.

ఎట్లనఁగా శరీరమున గగుర్పాటు కనబడవలయు. మనస్సు ద్రవింపవలయు. నేత్రములయం దానందాశ్రువులు గ్రమ్మ వలయు. ఈమూఁడుగుఱుతులు కలుగవేనిభక్తికలిగియున్న దని యెట్లు నమ్మవచ్చును. (అనఁగా నా నామము కథ? విన్నమాత్ర మున నీమూఁడుగుఱుతులు పొడసూపవలయుననియు, లేకున్న నది కపటభక్తియనియు నిందలిసారము.) భక్తియే లేనిచోఁ జిత్తశుద్ధికలుగు టెట్లు? వాక్కు గద్గదస్వరము కావలయు మనస్సు కరఁగిపోవలయు. ఏకాంతమున నొకప్పు డేడుపు, ఒకప్పుడు నవ్వుకనఁబడవలయు. ల లేక యొకప్పుడు పాడుచుండవలయు. మఱియొకప్పు డాడుచుండవలయు. ఒకప్పు డొడలెఱుంగకయుం డవలయు. ఈగుఱుతు లేవానియందుఁ బరికింపఁ గనఁబడునో వాఁడు నాభక్తుఁడు వానిచేత లోకము పవిత్రము చేయం బడును. (అనఁగా నాతనిచూపుచే స్పృశించుటచే జగము పవి త్రమగునని సారము) అగ్నిపుటముచే శోధింపఁబడినబంగారు మాలిన్యరహితమై నిర్మలస్వరూపమును బొందునట్లు నాభక్తిచే శోధింపఁబడినచిత్తము కర్మవాసనలం బాసి మద్రూపత్వము నొందునని నమ్ముము. ఉద్ధవా! నాపుణ్యకథల నాలకించుట కీర్తించుట యను సత్కార్యములచేతఁ జిత్తము పరిశుద్ధము కాఁగాఁ గాటుకనలవరించిన లోచనమువలెఁ దత్త్వమెఱింగి సూక్ష్మతమమగు జ్యోతిర్మయ మద్రూపముం గాంచును. ఎవ్వాఁడు విషయములనే చింతించుచుండునో వానిచిత్తము విషయాసక్తంబే యగును. సదా నన్నే ధ్యానించువాని చిత్తము నాయందే విలీనంబగును. కావున స్వప్నమనోరథంబు లెట్లో యట్లే అసద్విషయములను జింతించుట నిష్ఫలమనియు

నాయది మృషయనియు నిశ్చయించి దాని నిరసించి మద్భావమునఁ బవిత్రమగునట్లు చిత్తమును బరిశీలించి నాయందే నిలుచునట్లభ్యసింపుము స్త్రీలు, వారిసంబంధముగలవారు సహవాసమున కనర్హులని యెంచి వారికి దూరముగాఁ దానుండి యాత్మతత్త్వము నెఱింగి నిర్జనమై భయరహితమై మేలు కలిగింపఁజాలిన ప్రదేశమునందుఁ గూరుచుండి విసుగులేక నన్ను ధ్యానించుచుండందగు. స్త్రీలపొందువలనను, వారిసంబంధముగలవారి పొత్తువలనను గలుగుక్లేశములు ఇతరప్రసంగమువలనఁ గ్లేశముగాని బంధముగాని గలుగవు. అని పలికిన విని యుద్ధవుండు పరమానందభరితస్వాంతుఁడై యిట్లు ప్రశ్నించెను.

### ధ్యానయోగము.

కమలనయనా! నిన్నెట్టివానినిగా ముముక్షుని గా మోక్షేచ్ఛగలవాఁడు ధ్యానింపవలయునో ఆధ్యానప్రకారము నెఱింగింపుమాయని వినయవినమితశీర్షుడై ప్రశ్నింపఁగా నాతనికా ధ్యానపద్ధతి నుపదేశింపందలంచి శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను. *ఎత్తు

* సమ ఆసన ఆసీన స్సమకాయో యథా సుఖమ్, హస్తావుత్సంగ ఆధాయ స్వనాసాగ్రకృతే క్షణః. ౩౨. ప్రాణస్య శోధయేన్మార్గం పూరకుంభకరేచకైః, విపర్యయేణాపి శనైరభ్యసేన్నిర్జితేంద్రియః. ౩౩. హృద్యవిచ్ఛిన్న మోంకారఘంటానాదం బిసోర్ణవత్, ప్రాణేనోదీర్యతత్రాథ పునస్సంవేశయేత్స్వరం. ౩౪. ఏవం ప్రణవసంయుక్తం ప్రాణసంయమ మభ్యసేత్, దశకృత్వస్త్రిషవణం మాసాదర్వాగ్జితానలః. ౩౫. హృత్పుండరీకమంతస్థ మూర్ధ్వనాళమధోముఖం, ధ్యాత్వోర్ధ్వముఖమున్నిద్రమష్టపత్రం సకర్ణికం, కర్ణికాయాంన్యసేత్సూర్యసోమాగ్నీ నుత్తరోత్తరమ్. ౩౬. వహ్నిమధ్యే స్మరేద్రూపం మమైతద్ధ్యానమంగళమ్, సమం ప్రశాంతం సుముఖం దీర్ఘచారుచతుర్భుజం. ౩౭. అని మూలము.

గానుండక తగ్గుగా నుండక యాసనము ఉండవలయు. అట్టి సమానాసనముపయి యోగాసనము లగుపద్మాదిక ములం దేది తనకు సుఖముగా నుండునో దానిని విధిప్రకార మాశ్రయించి కూరుచుండవలయును. సాధకుఁడావల సమ ముగా శరీరమును నిలిపి రెండుచేతులు తొడలపై జ్ఞానము ద్రాపద్ధతిచే నునిచి నాసికాగ్రమునందు దృష్టినిలిపి (అనఁగా నేత్రములు నాసికాగ్రమునే చూచునట్లు మూసి వెలుపల దృష్టిపర్వకుండఁజేసి యనిసారము.) పూరకకుంభక రేచకక్రమం బునఁగాని, రేచక కుంభకపూరక కుంభక క్రమంబునఁగానిఇడా పింగళాఖ్యనాడీవివరరూపముగా నున్నప్రాణవాయు సంచార మార్గమునుబవిత్రముగాఁ జేయందగును అనఁగా నిడానాడిచే వాయువునుబీల్చి పింగళానాడిచే వదలవలయును. లేకపింగళా కృష్టవాయువు నిడానాడీమార్గమున విడువవలయును. నిర్జితేం ద్రియుఁడు కావలయును. మెల్లమెల్లనసీయభ్యాసమునుసాగింప వలయును. దీనికిఁ ద్వరపనికిరాదు. ఇట్లుమార్గములనుశోధించి మూలాధారచక్రమునుండి యవిచ్ఛిన్నమైసర్వదా ఘంటానాద ము ననుకరించుచున్న యోంకారమును (బ్రణవనాదమును) హృదయముననున్నదానిని బ్రాణవాయువుచేఁ బైకిలేఁపిద్వాద శాంతమనుస్థానముదనుకఁ గమలమునఁదూఁడువలె నెగఁబీల్చి (అంతదనుకఁజేర్చి యని భావము) మాత్రాతీతమగు నాచోటఁ బంచదశబిందుసంవేశనం బొనరించియద్దానినిబిందుశిరస్కమగు దానినిగ నొనరింపవలయును. ఇదియొకపక్షము. మఱేమనఁగా మూలాధారమునుండి మూర్ధాంతముదనుకఁ దామరతూఁడు వలె సూక్ష్మముగానుండి యెడతెగక సర్వదా ధ్వనించునోం

కారమును హృదయమునందుఁ బ్రాణవాయువుచే వ్యాపింపఁ జేసి మరల నోంకారమునందే ఘంటానాదతుల్యస్వరమును దాత్తనాదమును స్థిరముగ నునుపవలయును. ఈరీతిగాఁ బ్రణవ సంయుక్తముగాఁ బ్రాణాయామమును బ్రతిదినము కాలత్రయమునఁ బదిసారులు చేయుచుండఁగా నొక్కమాసములోపల నాయోగి వాయువును జయించినవాఁ డగును. ఇది ధ్యానించు పద్ధతి.

ఈరీతిగా వాయునిరోధము చేయఁజాలి దేహములోపల నూర్ధ్వనాళమై యధోముఖమై ముకుళించిన యరఁటిపువ్వుం బోలి వ్రేలుచుండును అట్టి హృదయపుండరీకము నూర్ధ్వ ముఖముగలిగి వికసించి యష్టపత్రములు గలిగి సకర్ణికమగు దానినిగా ధ్యానించి కర్ణికపైన వరుసగా సూర్యచంద్రాగ్ను లను భావించి వహ్నిమండలమునడుమ ధ్యానమునకు మంగళాశ్రయమగురూపముగలిగి సమమై ప్రశాంతమై దీర్ఘబాహు చతుష్టయముగలిగి సుందరగ్రీవములలార సుకపోలమై శుచిస్మితమై సమానములగుకర్ణములయందు ధరింపఁగా మిక్కిలి మెఱయుచున్న మకరకుండలములుగలిగి, కాంచనచేలమును దాల్చి నీలమేఘశ్యామాంగము మెఱయఁగా శ్రీవత్సలాంఛనము పొడసూప శ్రీనివాసుఁడై శంఖచక్రగదాపద్మవన మాలావిభూషితుఁడై కౌస్తుభరత్నకాంతులు వెలయఁగా నూపురములచే దివ్యపాదారవిందములు పరిఢవిల్ల, మెఱయు న్నముకుటము కటిసూత్రము కటకములు నంగదములు ంపఁగా సరా ంగసుందరుఁడై మనోజ్ఞతాస్థానమై ప్రసా

దసుముఖనయనములుగలిగి సుకుమారుఁడై వెలయు నన్ను ధ్యానించుచు సర్వాంగములయందు మనస్సు నిలుపవలయును. ఇంద్రియములను మనస్సుచేత నింద్రియార్థములనుండియీడ్చుకొని సారథియగుబుద్ధిచేత ధీరుఁడగువాఁడు సర్వాంగసుందరుఁడ నగు నాయందు నునుపవలయును. సర్వవ్యాపకం బగు చిత్తమును బరులపై వ్యాపింపకయుండ నిర్బంధించి సుస్మితాలంకారమగు నాముఖముననే యొక్కచో నిలిపి యుంచవలయును. ఆస్థితియం దితరాంగములను జింతింపరాదు. అందు లబ్ధపదంబగుచిత్తము నటనుండి యాకర్షించి సర్వకారణంబగు వ్యోమమునందు నిలిపియుంచవలయును. మరల దానిని వదలి నాస్వరూపముల ననుసంధానము చేయుచు దానిని వదలి శుద్ధబ్రహ్మమగు నాపై నారూఢుండై సాధకుఁడు ధ్యాతృధ్యేయవిభాగమునుగూడఁ జింతింపక యుపశాంతి నొందవలయును. అట్లు సమాహితచిత్తుఁడై సాధకుఁడు దీపాదులు సూర్యాది తేజస్సులు కలిసియున్నట్లు నన్నును దనను (సాధకుని) సర్వాత్ముఁడనగు నాలోనఁ జూచును. ఇట్లతితీవ్రమగు ధ్యానముచేత మనస్సు సమాహితముగావించు సాధకునకు ద్రవ్యజ్ఞానక్రియాభ్రమము లెల్లఁ జక్కఁగా శాంతినొందును. ఇంద్రియములఁ దనవశమున నుంచుకొనఁగలిగి వాయునిరోధముచేయ నభ్యసించి చిత్తము నిశ్చలతఁగాంచఁజేయుచు సాధకుఁడు నాపైఁ జిత్తము నిలుపవలయును. అట్టి భక్తునకుఁ బరమపదము ప్రాపించుటకు విఘ్నములుగా సిద్ధులెల్ల లభించును. అన విని యుద్ధవుం డిట్లు ప్రశ్నించెను

## యోగసిద్ధులు లభించుపద్ధతి.

*అవ్యయా! శ్రీకృష్ణా! ఎట్టిధారణచేత నెట్టిసిద్ధి యెట్లు లభించును? సిద్ధు లెన్ని గలవు? వానిఁ దెఱంగు నాకుం దెలుపుము. వినఁగోరుదు. నీవు యోగులకు సిద్ధుల ననుగ్రహించువాఁడవుకదా. అనిన విని శ్రీకృష్ణుం డిట్లు తెలిపెను. ఉద్ధవా! వినుము. ధారణాయోగవిద్యను జక్కఁగా నెఱింగిన పెద్దలు సిద్ధులు పదునెనిమిదియని తెల్పిరి అం దెనిమిదిసిద్ధులు మత్ప్రాప్తి ప్రధానములు. తక్కినపదియు సత్త్వోత్కృష్టతయే హేతువులుగాఁగలవి. †అణిమయు మహిమయు లఘిమయు నను దేహసిద్ధులు మూఁడు. సకలప్రాణీంద్రియములతోడఁ దత్తదధిష్ఠాతృదేవతారూపమున సంబంధ మనంబడుప్రాప్తి యనుసిద్ధియులరు. శ్రుతదృష్టపదార్థంబులు ప్రచ్ఛన్నము లైయున్నను భోగదర్శనసామర్థ్యసిద్ధి యనంబరఁగునది ప్రాకామ్యసిద్ధి యనంజెల్లు. మాయాప్రేరణాత్మక మగునది యీశిత యనుసిద్ధి కలదు. విషయభోగాసంగాత్మకమైనది వశితాసిద్ధి చూపట్టు. వలచిన సుఖముల నెఱవేఱునట్లుచేయు నష్టమసిద్ధియును గలదు. స్వాభావికములు సత్యుత్తమములునగు. క్షుత్పిపాసాదిరాహిత్యము, దూరశ్రవణము, దూరదర్శనము, మనోవేగగతి,

*ఇది పదునైదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని తెలియవలయు.

† అణిమామహిమామూర్తేర్లఘిమాప్రాప్తిరింద్రియైః, ప్రాకామ్యం శ్రుతదృష్టేషు శక్తిప్రేరణమీశితా. ౪. గుణేష్వసంగో వశితాయత్కామస్తదవస్యతి, ఏతా మే సిద్ధయస్సౌమ్య అష్టావౌత్పత్తికామతాః. ౫. అని మూలము.

కామరూపప్రాప్తి, పరకాయప్రవేశము, స్వచ్ఛందమరణము, నప్సరసలతోడఁ గ్రీడించుటయు, సంకల్పానురూపప్రాప్తియు, నప్రతిహతాజ్ఞ యనునివి పదిసిద్ధులు సత్వోత్కర్ష హేతుకములు. త్రికాలజ్ఞత్వము, శీతోష్ణాదిద్వంద్వానభిభవము, పరచిత్తాదిపరిజ్ఞానము, జలాగ్నివిషసూర్యాదిస్తంభనము, అపజయములేకుండుట యను నీయైదును క్షుద్రసిద్ధులు గలుగును. ఇయ్యవి యుద్దేశమున యోగధారణసిద్ధులు ఏధారణచేత నెట్టు లేదేది కలుగునో తత్ప్రకారము చెప్పెద. వినుము.

భూతసూక్ష్మోపాధియగు నాయందు భూతసూక్ష్మాకారంబై నమనస్సునిలిపి ధ్యానించునట్టితన్మాత్రోపాసకుఁడుమదీయమగు నణిమయను సిద్ధింబొందు. మహత్తత్త్వోపాధియు నాకాశాది భూతోపాధియునగు నాయందుఁ బ్రత్యేకము మహత్తత్త్వాకారమగుమనస్సు నిలిపి ధ్యానించుసాధకుఁడు మహిమ యనుసిద్ధింబొందును. భూతపరమాణూపాధియగు నాయందుఁ జిత్తము నిలిపియుండుసాధకుఁడు కాలపరమాణూపాధిరూపమగు లఘిమయనుసిద్ధిం బడయు. వైకారికాహంకారోపాధి యగు నాయందు నిశ్చలముగా మనస్సు నిలుపుయోగి మచ్చిత్తుండై సర్వేంద్రియాధిష్ఠాతృత్వరూపంబగు ప్రాప్తి యనంబరఁగు సిద్ధినొందు. క్రియాశక్తి ప్రధానమగు మహత్తత్త్వ ముపాధిగాఁగల నాయందు మనస్సు నేకాగ్రముగా నిలుపువాఁడు మహత్తత్త్వోపాధియగు నాకుఁ గలసర్వోత్కృష్టమగు ప్రాకామ్యసిద్ధిం బ్రాపించును. త్రిగుణమాయేశ్వరుఁడు కాలవిగ్రహము గలవాఁడు నగు నాయందు మనస్సు నుంచుయోగి జీవోపాధి చోదనాలక్షణంబగు నీశిత్వసిద్ధినిం బొందఁగలఁడు. తురీ

యాఖ్యుఁడు భగవచ్ఛబ్దవాచ్యుఁడు నారాయణుఁడు ననంబ
రఁగు. నాపయి మనస్సు నునుచు యోగి మద్ధర్ముఁడై వశిత్వసిద్ధిం
గాంచఁగలఁడు. నిర్గుణబ్రహ్మంబగు నాయందుఁ బరిశుద్ధచిత్తము
నిలిపెడుసాధకుఁడు సర్వకామసమాప్తిమూలమై పరమానంద
లక్షణమగు నష్టమసిద్ధిం బడయంగల్గు. శ్వేతద్వీపాధిపతియు,
శుద్ధుఁడు ధర్మస్వరూపుఁడు నగు నామీఁద మనస్సు నిశ్చల
ముగా నిలుపునాతఁడు శుద్ధాత్ముఁడై యనూర్మిమత్త్వమను
సిద్ధినొందు. ప్రాణసమష్టిరూపుఁడగు నాయందు మది నాదమును
దలంచుజీవుఁ డాయాకాశమున జ్ఞాతయై భూతములవగు నానా
విధవాక్కుల నాలకించుచు దూరశ్రవణసిద్ధింగాంచు అపరి
చ్ఛిన్నుఁడైన యాదిత్యునందు నేత్రమును, నేత్రమునం దాది
త్యునిగూర్చి యీయుభయసంసక్తిం జేసి నన్ను మనస్సునఁ
దలంచువాఁడు సూక్ష్మదృష్టిచే విశ్వమెల్లం జూచుచు దూర
దర్శనసిద్ధిం గాంచు మనస్సును దేహమును దదనువర్తనము
గలవాయువుతో నాయందుఁ బొందించి ధారణచేసినయెడలఁ
దద్ధారణాప్రభావమున మనోవేగ గమనాఖ్యసిద్ధి లభించును.
మనస్సు నుపాదానకారణముగా గ్రహించి యేయే దేవతాది
రూపముగాఁ గోరునో యాయాయిరూపముల నాయోగి
వర్యుఁడు మదీయమగుయోగధారణామహత్త్వమునం జేసి
పొందుచుఁ గామరూపసిద్ధిం బడయును ఉద్ధవా! తా నెందుఁ
జొరఁదలంచునో యాపరకాయమును ధ్యానించుచుఁ దనదేహ
మునువదలి ప్రాణప్రధానమగు లింగశరీరోపాధియై యాతఁడు
గుమ్మెద యొకపుష్పమునుండి యింకొకపుష్పముమీఁదికిఁ బోవు

నట్లు ఆదేహమును జేరంబోవుచుం బరకాయప్రవేశసిద్ధి నల వఱచుకొనును.

పాదమూలముచేత గుదస్థానమును జిక్కఁబట్టి ప్రాణమును క్రమక్రమముగాహృదయవక్షఃకంఠశిరస్సులలోఁజొనిపి యందందు నిలుపుచు బ్రహ్మరంధ్రమునందు నెవ్వఁడు దేహమును వదలునో యాసాధకుఁడు బ్రహ్మలోకాదిస్థానములం బ్రవేశించుచు స్వచ్ఛందమృత్యుసిద్ధి నొందును. దేవతోద్యానము లోనగురమ్యస్థలములయందు విహారముచేయఁబోవుచూహగలవాఁడు నామూర్తిరూపంబైన శుద్ధసత్త్వమును ధ్యానించునేని సత్త్వాంశజనితలగు దేవతాకాంతలు తన్ను సేవించుచుండఁగా దేవక్రీడానుదర్శనసిద్ధినిబొందును. ఏమానవుఁడు నాయం దాసక్తిగలిగి సత్యసంకల్పుఁడ నగు నాయందే చిత్తమునిలిపి యేసమయమున నేరీతి సంకల్పించునో యాసమయమున నట్టులే యాసంకల్పమున కనుగుణమగుఫలమును గాంచుచు యథాసంకల్పసిద్ధిని బొందును. సర్వమునకు నియామకుఁడను, స్వతంత్రుఁడ నగు నాస్వభావమును బొందుపురుషుఁడు తనయాజ్ఞ కెందుఁగాని యడ్డములేక యప్రతిహతాజ్ఞాసిద్ధిం గాంచును. నాయందునిచిన భక్తిచేతఁ జిత్తశుద్ధిని బడసి ధారణాయోగమును దెలిసినయోగికి జన్మమృతిసహితంబై త్రైకాలికి యనంబరఁగుచుఁ బరులచిత్తము నెఱుంగంజాలిన సిద్ధి గలుగు. ఇదియే త్రైకాలికసిద్ధి యని చెప్పంబడునది.

ఉద్ధవా! నాయోగమునఁ బ్రశాంతచిత్తముగలసాధకుఁడు యోగమయంబగు శరీరమునకు జలజంతువులకు నుదక

మెట్లో యాలాగున నగ్ని మొదలగు వానివలన నేబాధయుఁ గలుగఁజాలదు. కాఁబట్టి యద్వంద్వత్వసిద్ధి కలుగును. అంతియ కాక యాతఁడు జలస్తంభనము లోనగుసిద్ధులనెల్లం బడయం గలఁడు. శ్రీవత్సాదివిభూషితమదవతారములను ధ్వజాతపత్ర వ్యజనంబులతోఁ దలంచుసాధకుఁ డపరాజితసిద్ధి గాంచు. యోగధారణలమూలమున నన్నీచందమున నుపాసించు యోగికి మున్ను వివరించిన సిద్ధులన్నియుం జేకూరు. జితేంద్రియుఁడై జితశ్వాసుఁడై యంతరింద్రియనిగ్రహముగలిగి మదీయధారణయందు నాసక్తిఁ బూనుయోగి కెట్టిసిద్ధియైన దుర్లభంబే కాదని విశ్వసింపుము. * ఉత్తమయోగమునకుఁ బ్రయతించి నన్నే పొందఁగాంక్షించువానికి నీసిద్ధులన్నియుఁ గాలక్షేపకారణంబులై విఘ్నములవంటి వగునని మహానుభావులు చెప్పుదురు. జన్మౌషధితపోమంత్రములవలనఁ గలుగు సిద్ధులన్నియు యోగమునం బొందవచ్చునుగాని మదీయసాలోక్యాదిసిద్ధి యన్యదుర్లభము సర్వసిద్ధులకును, సాంఖ్యయోగ ధర్మములకును, బ్రహ్మవాదులకును నేను హేతువును, భర్తను ప్రభుఁడను, చతుర్విధములగు భూతములలో మహాభూతములుండునట్లే నేను సర్వదేహులలోన నావృతుండనై బాహ్యా

* అంతరాయాన్ వదంత్యేతాన్యుంజతో యోగముత్తమం, మయా సంపద్యమానస్య కాలక్షేపణహేతవః. 33. జన్మౌషధితపోమంత్రై ర్యావతీరిహసిద్ధయః, యోగేనాప్నోతి తాః సర్వా నాన్యైర్యోగగతిం త్యజేత్. 34. సర్వాసామపి సిద్ధీనాం హేతుః పతిరహం ప్రభుః, అహం యోగస్య సాం— ధర్మస్య బ్రహ్మవాదినామ్, యథా భూతాని భూతేషు బహిరంత ం తథా. 35. అని మూలము.

భ్యంతరములయందు వర్తింతును. అని తెలుపుటయు నుద్ధవుఁ డిట్లు ప్రశ్నించెను.

## శ్రీహరి యాత్మవిభూతులమహిమము నెఱిఁగించుట.

* శ్రీకృష్ణా! ఆద్యంతములులేక యనావృతంబై సర్వ ప్రాణులకు జన్మస్థితిలయకారణంబైన పరబ్రహ్మంబవునీవె. అకృత పుణ్యులకుఁ దెలిసికొనఁ శక్యమేకాని నిన్ను వేదార్థవేత్తలు పరమార్థమున నానాభూతములయందు నారాధింతురు. మహా మును లేయేభావములయందు నిన్ను నుపాసించి జ్ఞానసిద్ధిం గాంతురో యావిషయము నాకు నెఱింగింపుము. భూతాత్మ రూపా! భగవంతా! సర్వభూతములలో నీవు గూఢరూపమున వర్తింతువు. నీ వాభూతములనెల్లఁ బరికింతువు. కాని యా భూతములు నీమాయచే మోహితములగుటంజేసి నిన్నుం జూడఁజాలవు. మూఁడులోకములయందుఁ గలుగు నీవిభూతు లను జక్కనెఱిఁగింపుము. పరమతీర్థభూతమగు నీదివ్యపాదార విందద్వంద్వమునకు నమస్కరింతు. అని ప్రార్థింపఁగా భగవం తుఁడు శ్రీకృష్ణుఁడు భక్తున కిట్లుపదేశించెను.

ఉద్ధవా! ప్రశ్నములమార్గము నెఱుఁగువారిలో నీ వగ్రగణ్యుఁడ వనవచ్చును. వినుము బదులు వచింతును. పూర్వకాలమునఁ గురుక్షేత్రమునందు మహాభారతయుద్ధా రంభ మగుతరుణమున నర్జునుఁడు మోహావేశమునఁ దన వారిం జంపఁదలఁపక యిట్లే ప్రశ్నించెను. దానికి బదులుపల్కి తిని. నాయుపదేశమున మరల సంశయించి నీవలెనే నావిభూ తులం దెల్పుమని ప్రశ్నించెను. ఆసమయముననాపార్థున కవా!

* ఇది పదాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

నిం దెల్పితిని. ఇపుడు నీకు నెఱిఁగింతును. అవధానమున నాల కింపుము. నేను సర్వభూతములకు సుహృదుఁడను. ఈశ్వరుఁడను. ఆత్మను. సర్వభూతములు నేనే. ఎల్లభూతములు పుట్టుటకు బ్రదుకుటకు విలయమందుటకుఁ గారణము నేనే. గతిమంతులకు గతియు నేనే. గణింపఁబడువానిలోఁ గాలంబు నేను. గుణముల సమత్వము నేను. గుణవంతులగుణము నేను. గుణంబుల తొలికార్యము నేను. మహత్తులలో మహత్తత్త్వంబు నేను. సూక్ష్మములలో సూక్ష్మరూపుఁడగుజీవుఁడు నేను. దుర్జయములలో మనస్సు నేను. వేదాధ్యాపకులలో హిరణ్యగర్భుఁడను. మంత్రములలో వర్ణత్రయాత్మకమగు నోంకారము నేను. అక్షరములలో అకారంబను. ఛందస్సులలో గాయత్రిని. సురలలో నింద్రుఁడను. వసువులలో హవ్యవాహుఁడను. ఆదిత్యులలో విష్ణువను. రుద్రులలో నీలలోహితుఁడను నామముగలవాఁడను బ్రహ్మర్షులలో భృగుమహర్షిని. రాజర్షులలో మనువును నేను. దేవర్షులలో నారదుఁడను. ధేనువులలోఁ గామధేనువను. సిద్ధేశ్వరులలోఁ గపిలుఁడను. పక్షులలో గరుడుఁడను. ప్రజాపతులలో దక్షుఁడను పితృదేవతలలో నర్యముఁడనువాఁడను. దైత్యులలోఁ బ్రహ్లాదుఁడను. నక్షత్రౌషధీశులలో సోముఁడను. యక్షరాక్షసులలోఁ గుబేరుఁడను. గజములలో నైరావతమను. యాదోనాథులలో వరుణుఁడను. ప్రతాపవంతులు దీప్తిమంతులు నగువారిలో సూర్యుఁడను. మానవులలో రాజును. తురంగములలో నుచ్చైశ్శ్రవంబను. ధాతువులలోఁ గాంచనము నేను. దండించువారిలో యముఁడను. సర్పములలో వాసుకిని నాగేంద్రులలో

నసంతుఁడను. శృంగిదంష్ట్రిజంతువ్రాతములలో మృగేంద్రుఁడను. ఆశ్రమములలో సన్న్యాసంబను. వర్ణములలో బ్రాహ్మణవర్ణంబను. తీర్థప్రవాహములలో గంగను నేను. జలాశయములలో సాగరము నేను. ఆయుధములలో ధనుస్సను. ధానుష్కులలోఁ ద్రిపురాసురసంహారకుఁడను. నివాసస్థానంబులో మేరుభూధరమను. దుర్గములలో హిమాలయంబను. వనస్పతులలో నశ్వత్థవృక్షంబను. ఓషధులలో యవలు నేను. పురోహితులలో వసిష్ఠుఁడను. బ్రహ్మవేత్తలలో బృహస్పతిని. సేనాపతులలో స్కందుఁడను. సన్మార్గప్రవర్తకులలో బ్రహ్మదేవుఁడను. యజ్ఞములలో బ్రహ్మయజ్ఞము నేను. వ్రతములలో నహింసావ్రతము నేను. శోధకులలోపల వాయ్వనలసూర్యజలవాగాత్ముఁడ నగుశోధకుఁడను నేను. యోగములలో సమాధియోగమను. విజిగీషువులగుసాధనములలో నీతిని నైపుణములలో నాత్మానాత్మవివేకవిద్యను. ఖ్యాతి భేదవాదులలో (అఖ్యాతి, అన్యథాఖ్యాతి, శూన్యఖ్యాతి, అసత్ఖ్యాతి, అనిర్వచనీయఖ్యాతి, అని ఖ్యాతిభేదములనువాదించు తార్కికులలో నని యర్థము) వికల్పము నేను. స్త్రీలలో శతరూప నన౯బడు స్త్రీ నేను. పురుషులలో స్వాయంభువుఁ డనుమనువును నేనే. మునులలో నారాయణమునిని. బ్రహ్మచారులలో సనత్కుమారుఁడను. ధర్మములలో నభయదానధర్మంబు నేను. అభయస్థానములలో సంతర్నిష్ఠను నేను. గుహ్యములలో మౌనము సూనృతము నేను. మిథునములలో మిథునజనకదేహార్థద్వయోపలక్షితుఁడగు ప్రజాపతిని నేను. అప్రమత్తులలో సంవత్సరము నేను. ఋతువులలో వసంతర్తువను. మాసములలో

మార్గశీర్ష మాసంబను. నక్షత్రములలో నభిజిన్నామకంబను. యుగములలోఁ గృతయుగము నేను. ధీరులలో నసితదేవలుఁ డనువాఁడను నేను. వేదవిభాగకారులలోఁ గృష్ణద్వైపాయనుండను. విద్వాంసులలో శుక్రుఁడను. భగవంతులలో వాసుదేవుఁడను విద్యాధరులలో సుదర్శనుఁడను. రత్నములలోఁ బద్మరాగంబు నేను. సుందరములగువస్తువులలోఁ దామరమొగ్గను నేను. దర్భజాతులలోఁ గుశనామకము నేను హవిస్సులలో నావు నేయి నేను. వ్యవసాయవంతులలో ధనాదిసంపత్తు నేను. కితవులలోఁ (ద్యూతాదులలో జయించితి నను వారు) ఛలముచేతఁ గలుగునాగ్రహంబు నేను. తితిక్షువులలో క్షమాగుణంబు నేను. సత్త్వవంతులలో సత్త్వంబు నేను. బలవంతులలో నోజస్సహస్సులు నేను. భాగవతులలో భక్తిచేఁ జేయఁబడుకర్మము నేను. భాగవతులకుఁ బూజార్హములగు వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ నారాయణ హయగ్రీవ వరాహ నారసింహ వామనాఖ్యమూర్తులలో వాసుదేవాఖ్యమూర్తిని నేను. గంధర్వులలో విశ్వావసుఁడను. అచ్చరలలోఁ బూర్వచిత్తిని నేను. పర్వతములలో స్థైర్యము నేను. భూమిలో గంధగుణంబు నేను. ఉదకములలో మధురరసము నేను. తేజస్సులలో విభావసుఁడను నేను. సూర్యచంద్రనక్షత్రములలోఁ బ్రభ నేను. ఆకసములో శబ్దము నేనే. బ్రహ్మణ్యులలో బలిని నేను. వీరులలో నర్జునుఁడను. భూతముల సృష్టిస్థితిలయములు నేను. ద ంద్రియవ్యాపారములును వానియర్థ ..,హణశ _యు నేను. పంచతన్మాత్రంబులు నహంకారమహ

త్తులు ననుసప్తప్రకృతివికృతులు నేను. *పంచభూతములు, నేకాదశేంద్రియములు, ననుషోడశకళలుగల పురుషుండను నేను. ప్రకృతి నేను. త్రిగుణములు నేను. పరబ్రహ్మము నేను. వీనియొక్క పరిగణనంబు, సలక్షణమగు జ్ఞానము నేను. జీవేశ్వరాత్ముఁడు గుణగుణిరూపుఁడు సర్వాత్మకుఁడు సర్వమునగు నన్ను విడిచినదేభావమును లోకములందుఁగలుగదు. సర్వము నేనే యగుదును. కాలమునందుఁ బరమాణువులనైన లెక్కింపఁగలను. కాని నేను సృజించినబ్రహ్మాండ వ్రాతమునఁ గల్గుభూతజాలముల లెక్కపెట్టుటనాకేశక్యము కాదు. తేజము, శ్రీ, కీర్తియు, నైశ్వర్యము, హ్రీ, త్యాగము, మనోనయనాహ్లాదకతయు; భాగ్యము, బలము, తితిక్ష, విజ్ఞానము, నను నీమొదలగు నుత్తమగుణజాలము లెందెందుఁ గనఁబడునో యవియెల్ల మదంశములే యని తెలిసికొనుము. నావిభూతులను సంగ్రహించి చెప్పితిని. ఇవన్నియు వాఙ్మాత్రమున నారంభింపఁబడిన మనోవికారమాత్రములుగాని పరమార్థములు గావు. మనోవాక్ప్రాణేంద్రియముల నాజ్ఞలో మెలఁగునట్లు చేసికొని సాత్త్వికోత్కర్షమున బుద్ధిని నిగ్రహించినయెడల మరల నీవి సంసారమార్గము నాశ్రయింపవు. బుద్ధిచే వాఙ్మనస్సులఁ జక్కఁగా నియమింపఁగా నియతింబూని చేయు వ్రతములు, తపస్సు, జ్ఞానము ననునివి పచ్చికుండలో నీరువలె స్రవించును. కావున నాయందు దాసక్తిగలవాఁడవై మనస్సును, ప్రాణములను నిగ్రహింపుము. అవ్వల నాభక్తితోఁగూడిన

* పృథివీవాయురాకాశ ఆపోజ్యోతిరహం పుమాన్, వికారః పురుషోఽవ్యక్తం రజస్సత్త్వం తమః పరం. 32. అని మూలము.

బుద్ధిగలవాఁడవై ధన్యుఁడ వగుదువు. అని పలుకుటయు నితాంతభక్తిభావముగలయుద్ధవుఁ డిట్లు ప్రశ్నించెను.

భక్తిలక్షణధర్మము.

*శ్రీవాసుదేవా ! పూర్వము నాకు వర్ణాశ్రమాచారవంతులకును, అవిలేనియెల్లరకును భవద్భక్తిసాధనమగుధర్మం బుపదేశించితివి కాదా. ఏరీతి దాని ననుష్ఠించినమానవులకు నీమీఁద ఆస్వధర్మమున భక్తికలుగును. ఆయది నాకుఁ దెలుపుమా. అంతియగాక మున్ను నీవు హంసరూపమునఁ బరమసుఖాత్మకమగు ధర్మము నిరూపించితివి. కాని యాధర్మము చాలకాలము జరగుటచేఁ బ్రచారముగాకున్నది. మూర్తిమంతములగు వేదముల వెలయు బ్రహ్మాదేవునిసభలోనైన నిన్ను మించినధర్మకర్తయు ధర్మరక్షకుఁడును,ధర్మబోధకుఁడును గలుగఁడు. ధర్మమునకుఁ గర్తవు, త్రాతవు, ప్రవక్తవు అట్టి నీ వీభూలోకమును వదలినతర్వాత నింకెవ్వఁడు నష్టమగునట్టి ధర్మమును జెప్పువాఁ డుండును ? కాఁబట్టి సర్వధర్మవేత్తవగు నీవు భవదీయభక్తిసాధనమగు నాధర్మ మెవ్వాని కేరీతివిధింపఁబడునో యాప్రకారమును నిరూపింపుము. అని యడిగిన శ్రీకృష్ణుఁ డత్యాదరంబున నుద్ధవున కిట్లు బదులుచెప్పఁబూనెను.

ఉద్ధవా! నీ విపు డడిగినవిషయము ధర్మవిరుద్ధము గాక ధర్మమునకుమిగులసమ్మతమైవర్ణాశ్రమాచారవంతులగునరులకు మిక్కిలి శ్రేయస్కరంబు నైనది. కావున దానిందెలిపెద. అవహితుఁడవు కమ్ము. కల్పాదియందుఁ దోఁచుకృతయుగమునందు మానవులవర్ణము హంసాహ్వాయమయ్యెను. అందు జనులు

* ఇది పదునేడవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

పుట్టుక చేతనే కృతకృత్యు లైరి. కావున నాయుగము కృతమను
పేరుగల దయ్యెను తొలుత నోంకార మొక్కటియే వేదంబు.
వృషరూపధరుండ నగు నేను ధర్మంబగుదును. మానవులు
తపోనిష్ఠగలవారలగుచు విముక్తపాపులై హంసరూపుఁడ నగు
నన్ను నారాధింతురు. ఆమీఁద: త్రేతాయుగమునందు నా
హృదయమునుండి త్రయీవిద్య (వేదము) యుద్భవించెను.
హోతయు, నధ్వర్యువు, ఔద్గాత్రములనువానిచే మూఁడు
రూపములుగల యజ్ఞము నైతిని. అపుడు వైరాజపురుషుని
ముఖబాహూరుపాదములనుండియాత్మాచారలక్షణములతోడ
విప్ర, క్షత్రియ, వైశ్య, శూద్రులు ప్రభవిల్లిరి. నాజఘనము
నుండి, హృదయమునుండి, వక్షస్థలమునుండి, శీర్షమునుండి
వరుసగా గార్హస్థ్యము, బ్రహ్మచర్యము, వనస్థత్వము, సన్న్యా
సము నను నాశ్రమము లుద్భవిల్లెను. జన్మస్థానములనుఁ దగి
నట్టులు నరులకు వర్ణాశ్రమంబుల నీచోత్తమమధ్యమప్రకృతు
లేర్పడియెను శమము, దమము, తపము, శౌచము, సంతోషము,
క్షాంతి, ఆర్జవము, మద్విషయకభక్తి, దయ, సత్యము, అను
నివి బ్రాహ్మణప్రకృతులు తేజస్సు, బలము, ధైర్యము,
శౌర్యము, తితిక్ష, ఔదార్యము, ఉద్యమము, స్థైర్యము,
బ్రహ్మణ్యత్వము, ఐశ్వర్యము అనునివి క్షత్రియప్రకృతులు.
ఆస్తికత, దానమందు నాసక్తి, యదంభము, విప్రసేవ, అర్థ
వృద్ధియెడ నతుష్టి యనునివి వైశ్యప్రకృతులు మాయా
శూన్యమగు గోబ్రాహ్మణగోపరిచర్యయు లబ్ధసంతోషము అను
నివి శూద్రప్రకృతులు. అశౌచము, అనృతము, చౌర్యము,
నాస్తికత్వము, నిష్కారణకలహము, కామము, క్రోధము, తృష

అనునివి యంత్యజప్రకృతులు. అహింస, సత్యము, అస్తేయము, అకామము, అక్రోధము అలోభత్వము, భూతప్రియహితచింత యనునివి సర్వవర్ణసాధారణధర్మములు.

### బ్రహ్మచారిధర్మములు.

ద్విజుఁడు గర్భాధానాదిసంస్కారములచే వరుసగా నుపనయనసంస్కారముచేతను రెండవజన్మమునొంది గురుకులమున నివసించి యంతఃకరణశుద్ధిగలిగి మితహితభాషణములఁ గావించుచు, వేదమును బఠింపవలయును. ఆస్థితియం దా బ్రహ్మచారి మౌంజిని, కృష్ణాజినమును, దండమును, నక్షసూత్రమును, జన్నిదమును, గమండలువును ధరింపవలయు. జడలు ధరించుటుచితము. ఏలనఁ గేశసంస్కారములు చేయవలనుపడమి నట్లొనరింపఁదగు దంతధావనము కాష్ఠమునఁ జేయరాదు. వస్త్రము లుదుకరాదు. వేడుకకైనను జిత్రరక్తవర్ణములుగల యాసనమునఁ గూరుచుండరాదు కుశల ధరించియుండవలయును. స్నానము, భోజనము, హోమము, జపము నను వానినొనరించునపుడు, దేహబాధలఁ దీర్చుకొనుతరుణమునందును సంభాషింపరాదు. బాహుమూలములయందు మొలయందును గలకేశములను గాని నఖములను గాని త్రుంపరాదు బుద్ధిపూర్వకముగా రేతోవిసర్జనము చేయుటుచితము కాదు. అట్లు కారణాంతరమున జరగునేని వెంటనే జలముల మునింగి ప్రాణాయామము చేసి గాయత్రిని వేయిపై నెనిమిదిమారులు జపింపవలయును. సాయంప్రాతఃకాలములయందు మౌనము దాల్చి విశుద్ధాంతరంగుఁడై జపించి సమాహితుఁడై అగ్ని సూర్యాచార్యగోవిప్రగురువృద్ధ దేవతల నారాధింపవలయును.

*ఆచార్యుని నన్నుగా భావించి యేతఱింగాని తిరస్కరింపరా దు ఆచార్యుఁడు సర్వదేవమయుఁడుకదా. ఇరుసంజలయందును భిక్షాన్నము దెచ్చుకొని గురువునకు నివేదించి తదనుమతిం గొని భుజింపందగును. ఎయ్యది లభించినను గురువు ననుమతి నొందియే యుపయోగింపవలయును. దాసునిచందమున గురు వును సేవింపవలయును. శయ్యాసనస్థానాదులనాతిదూరముగాఁ జేతులుజోడించిసేవింపవలయును. ఈవిధముగా నిరంతరముగా నానియమమును సాగించుచు భోగాసక్తి వదలి విద్యాపూర్తి యొపుడగునో యంతదనుకగురుకులమునందు వసింపవలయును. బ్రహ్మచారి వేదపఠన ప్రభృతికర్మఫలమగు బ్రహ్మలోకము నొందఁ దలంచునేని నిష్ఠంబూని స్వాధ్యాయనిమిత్తమై శరీర మును గురువు సధీముచేయవలయును. బ్రహ్మవర్చస్సుగలిగి యనఘుఁడగునా బ్రహ్మచారి†యగ్నియందును, గురువునందును, సర్వభూతములయందును, సర్వవ్యాపకుఁడనై పరమాత్మనగు నన్ను నభేదబుద్ధి నారాధింపవలయును. స్త్రీలనువాంఛమైదర్శిం చుటస్పృశించుటసల్లాపనులుసాగించుటవేడుకమాటలజరపుట మొదలగుదుష్కార్యములు వదలవలయును. శౌచము,ఆచమ నము,స్నానముసంధ్యోపాసనము,నాపూజనము, తీర్థములసేవిం చుట, జపము,ముట్టఁదగనివారిని ముట్టకుండుట,భక్షింపఁదగని పదార్థములఁదినకుండుట,సర్వభూతములయందు నేననుభావము

* ఆచార్యం మాం విజానీయాన్నావమన్యేత కర్హిచిత్, నమర్త్య బుద్ధ్యాసూయేత సర్వదేవమయోగురుః. ౨౬. అని మూలము. † అగ్నౌ గుర్వాత్మని చ సర్వభూతేషు మాం పరమ్, అపృథగ్ధీరుపాసీత బ్రహ్మవర్చ స్వ్యకల్మషః. ౩౧. అని మూలము.

గలిగియుండుట, మనోవాక్కాయసంయమము గలిగియుండుట యను నీనియమములు సర్వాశ్రమములకుసాధారణధర్మములు. ఈరీతిగా బ్రహ్మచర్యవ్రతమునవలంబించినబ్రాహ్మణుం డగ్నివలెం దేజరిల్లుచుఁదీవ్రమగుతపముచేత దుష్టాంతఃకరణమునుదహించి నిర్మలుఁడై నాయందు భక్తిగలిగియుండును

బ్రహ్మచారి గృహస్థాశ్రమము స్వీకరింప నిష్టపడునేని వేదాధ్యయనాదులందీర్చి గురువునకు యథాశక్తి దక్షిణ నొసంగి తదనుజ్ఞంగొనిసమావర్తనంబొనరింపవలయును. *ఆస్థితి యందు బ్రాహ్మణుఁడు ఇచ్ఛానుసారము నాయాశ్రమము బూని వరుసగా నాయాశ్రమమునుండి యింకొకయాశ్రమమును గాని గ్రహింపవచ్చును. అంతియకాని యేయాశ్రమము గ్రహింప మానుటకానిపైయాశ్రమము గ్రహించినపిదప మరలి దానికిం బూర్వమగునాశ్రమము మరలస్వీకరించుటకానితగదు. ద్వితీయ మగుగృహస్థాశ్రమమును గ్రహించినవాఁడుమరల బ్రహ్మచర్యా శ్రమమునకు రారాదని భావము. ఇది నియమము.

## గృహస్థాశ్రమధర్మములు.

గృహస్థాశ్రమమునకుఁ బోవఁదలంపుగొన్నచో నతఁడు తనకు సర్వమగుసమవర్ణమునంబుట్టి తనకంటె వయస్సునఁ జిన్న దియై శాస్త్రోక్తలక్షణములు గలిగినకన్యను వివాహముచేసికొన వలయును. ఉత్తమవర్ణముకలవాఁడు అధమవర్ణమునఁ బుట్టిన కన్యకను బెండ్లియాడవచ్చును. ద్విజాతులకెల్ల యజనాధ్య యనదానములుధర్మములగును. యజ్ఞముచేయించుట, వేదము

* ఆశ్రమాదాశ్రమం గచ్ఛే న్నాన్యథా మత్పరశ్చరేత్. 32. అని మూలము. అనాశ్రమీ ప్రతిలోమం చ నాచరేదిత్యర్థః అని వ్యాఖ్య.

చెప్పుట, ప్రతిగ్రహించుట యను నీమూఁడును బ్రాహ్మణునకు మాత్రమే తగినధర్మములు. ఇవి మూఁడును వృత్తికొఱకు నిర్ణయింపఁబడినవి. ఇందును దానమును గ్రహించుట తపస్సునకు బ్రహ్మతేజమునకు యశస్సునకు హానికరమనుశూహ గలిగెనేని దానినివదలి యాజనాధ్యాపనములను రెండింటితోడనే వృత్తి సాగింపవచ్చును. ఆరెండునుగూడ దీనత్వాదిదోషభూయిష్ఠము లనుతలంపు గలిగినయెడలశిలావృత్తి (వరిగోసిన పిదప వెన్నులు రాలినచో వాని నేఱుకొని జీవించుట)చే జీవించుట యుత్తమము. విప్రునకు శరీరముండుట నీచమగుకామముకొఱకుఁగాక కష్టసాధ్యమగుతపస్సు మొదలగుధర్మముల సాధించుటకును బరలోకమున నపారసుఖార్థమునగు. శిలావృత్తిచేతనైన, ఉంఛవృత్తి( రాలినగింజలనేఱికొని తెచ్చిజీవించుట) చేనైనజీవించుచుఁ బరితోషముగలిగి యతిథిపూజ మొదలగుధర్మమును నిష్కామత్వమున నాచరించుచు నెల్లయెడల నాపై మనస్సునిలిపి గృహస్థితుండయ్యును బేరాశంబూననివాఁడు శాంతి నొందఁగలఁడు. దారిద్ర్యమునఁ గష్టములపాలగుచుండియు నాయందుభక్తిగల బ్రాహ్మణు నుద్ధరించువారల నేనే యాపత్సముద్రమునుండి నౌకవలె నుద్ధరింతును.

భూపాలుఁడు తనప్రజలను తండ్రి తనసంతానమును బోషించునట్లు, గజరాజు తన్ను సేవించుగజములం బోషించు చందమునను, కష్టములనుండి యుద్ధరించి ధీరుఁడై తన్నుఁదానే యుద్ధరించుకొనందగు. ఈవిధముగఁ బ్రవర్తనము సాగించు రాజు తనపాపజాలముల నీలోకమున నశింపఁజేసి సూర్యతేజస్సుగల విమానమెక్కి స్వర్గలోకమున నింద్రునింగూడి భోగ

ముల ననుభవించును. వ్యాపారమునఁ గష్టనష్టముల పాలగు వైశ్యుఁడు విక్రయార్హము లగువస్తువులనే విక్రయించి యానష్టమునుండి దప్పించుకొనవలయును. ఆపద్ధర్మముగా వైశ్యునకు క్షత్రియులధర్మమగు ఖడ్గమును ధరించుటయు నర్హమే యగును. అంతియగాని శ్వవృత్తి (నీచవృత్తి) యగు నీచసేవన మనునది యర్హముగాదు. ఆపత్కాలమున రాజునకు వేఁటయు, వైశ్యవృత్తియు, బ్రాహ్మణవృత్తి యనంబడు యాజనాధ్యాపనములు గ్రహింపఁదగునేకాని నీచసేవనం బెప్పుడైనను గ్రహింపరాదు. ఎట్టియాపత్కాలమునందును వైశ్యునకు శూద్రవృత్తియు, శూద్రునకు దారములు పేనుట చాపలల్లుట మొదలగు ప్రతిలోమజాతుల వృత్తియు నంగీకరింపఁదగును. ఆయాపద పోఁగా మరల నావృత్తినే పూనరాదు. స్వవృత్తినే చేకొనవలయు.

బ్రహ్మయజ్ఞమున ఋషులను, శ్రాద్ధములఁ బితరులను, యజ్ఞముల దేవతలను, బలిహరణమునభూతములను, అన్నాదుల త మనుష్యులనుదృప్తిచేయవలయును. వీరినెల్లమద్రూపులనుగా భావింపవలయును. ఆప్రయత్నముచేత నాత్మవృత్తిచే లభించిన పరిశుద్ధంబైన ధనముచేతఁ * దాను బోషింపఁదగిన వారల కించుకంతయుఁ గష్టముకలుగకయుండ యజ్ఞములచే నన్నారాధింపవలయును. గృహస్థువయ్యు భార్యాపుత్త్రప్రభృతులయందు మమత నునుపఁగూడదు తత్త్వముఁ బరిశీలించి యెఱింగి దృష్టమగు నీలోకంబంతయు, నదృష్టమగుపరలోకము

* యదృచ్ఛయోపపన్నేన శుక్లేనోపార్జితేన వా, ధనేనాపీడయన్భృత్యాం యజ్ఞైశ్చరన్క్రతూన్. ౫౦. అని మూలము.

నశ్వరంబనియు నెఱుంగందగును. నిద్ర ననుసరించియుండు స్వప్నము నిద్రవదలఁగా నెట్లో యారీతిగా ప్రతిశరీరమందును భార్యాపుత్త్రాప్తబంధుసంగమము దేహము నశింపఁగా నశించు నని విమర్శించి గృహమున బాటసారిచందమున నుండుచు మమత్వాహంకారములు మానినమానవుఁడు సంసారరశ్మి బద్ధుఁడు కాఁడు. గృహస్థువుల కర్తవ్యములగుకర్మములచే నన్ను భక్తిమీఱ నారాధించుచు నిచ్ఛగలుగునేని యాయాశ్రమ మందే యుండు టొప్పు. వానప్రస్థాశ్రమమునైన గ్రహింప వచ్చునుదానియందునిచ్ఛపొడమదేనిసన్న్యాసాశ్రమమునైన నంగీకరింపవచ్చును. గృహమునందేయాశవెలయఁగా పుత్త్రధనైషణలుతన్ను బాధింపఁగాఁ గామినీలోలతంగాంచి కార్పణ్యము నకులోనై యుండుమూర్ఖుఁడు(అజ్ఞాని)మమతాహంకారములచే బంధింపంబడును. మూఢుఁడగుగృహస్థువువీరు నాతల్లిదండ్రులు, ముదుసలులు, బిడ్డలతో శ్రమంపడుభార్యకు దిక్కుకనఁబడదు. నేనులేకున్న వీరెట్లు బ్రదుకుదురు? అయ్యో యని యిట్లు చింతించుచు గృహాభిమానముచే మనస్సు కలవిలంపడఁగాఁ దృప్తియనునదియే లేక వారినిగుఱించియే దుఃఖించుచు నతి తామసీయోనియందు జన్మించును. అని బోధించి మూఁడవదగు వానప్రస్థాశ్రమధర్మముల బోధింప నెంచి యిట్లుపలికెను.

## వానప్రస్థాశ్రమధర్మములు.

* ఉద్ధవా! ఇఁక వానప్రస్థాశ్రమధర్మముల వినుము. వనమున నివసింపఁగోరువాఁడు భార్యను యుక్తవయస్సువచ్చిన పుత్త్రుల కప్పగించి కాని యామె యందుల కంగీకరింపకయున్నఁ

* ఈవిషయము పదునెనిమిదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

దనతోఁగూడఁగాని పిలుచుకొనిపోవలయును. అటవికింబోయి మూఁడవదగు తనయాయుర్భాగమును శాంతముగాని యట సాగింపవలయును. ఆస్థితియం దామానవుఁడు ఆహారము కొఱకు భక్షణార్హములయి వనమునఁగల కందమూలఫలము లను దినుచుండవలయును. నారచీరలుగాని, తృణనిర్మితములు గాని, ఆకులచే నిర్మింపఁబడినవి కాని, జింకచర్మములుగాని యాతని కపుడు కట్టుకొన నర్హములగు. క్షౌరము తగదు. రోమనఖశ్మశ్రువపనము తగదు. స్నానము దేహమలక్షాళన మునకుఁ గాదని యతఁ డెఱుంగవలయును. దంతధావనము పనికిరాదు పుక్కిలించియుమియుటయే దంతధావన మనఁబడు. మూఁడువేళల స్నానముచేయుచు భూశయ్యంబరుండి గ్రీష్మ కాలమునఁ బంచాగ్నిమధ్యమందుండి తప మొనరింపవలయు. (నాలుగుదిక్కులనగ్నులమండఁజేసి వానినడుమనుండి సూర్యుం గాంచుచుఁ దప మొనరించుటే పంచాగ్నిమధ్యమ మనునది) భోరున వర్షించుకాలమున దానికింజంకక యుదకములనడుమను శీతకాలమునందు (మంచుగురియుతఱిని) కంఠముదనుక నీట మునిఁగియు నుండి తాఁబూనినతపము చేయవలయును.

అగ్నిపక్వమగుదానిని భుజింపవలయును. గాలపక్వమగు దానినిగడ్డిగింజలనేఱికొనితెచ్చియులూఖలముమూలముననగాని చేతఁగాని పైఁగలపొట్టులేక యుండఁజేసికాని, దంతములతోఁ నాపనిచేసికానివిధివిహితాహారమును గ్రహింపవలయును కాల ముదేశము నెఱింగి యితరులకుఁ దనమూలముననే బాధలునుగ లుగకయుండఁ దానేపోయి యాహారవస్తువులనార్జింపవలయు కొఱ కితరులను శ్రమంపఁజూపరాదని యెఱుంగవలయును.

తెచ్చినయాహారమును రేపటికని దాఁచియుంచరాదు కాలాంతరమునఁదెచ్చిదాఁచియుంచి భుజింపరాదు. * అడవినిగలవస్తువులను గైకొని వానిచేఁ జరువును బురోడాశము సిద్ధము చేసియాయాకాలములఁ జేయఁదగుననిశాస్త్రమువిధించిన యాగ్రయణాదుల నొనరింపవలయును. శ్రౌతపశుబంధముదూష్యంబగుఅగ్నిహోత్రదర్శపూర్ణమాసచాతుర్మాస్యములనువన్యవస్తువులచేతనే చేయఁదగునని వేదవాదులు తెలుపుదురు. ఈవిధిగాఁ దపంబుచేసి శరీరము కృశింపఁగాఁ దపోమయుఁడనగు నన్ను (శ్రీకృష్ణుని) నారాధించి ముక్తింబడయఁదగు. ముక్తికభ్యంతరమునుగలిగించునవియుండినచో వరుసఁగా ఋషిలోకమునకుఁ బోయి యందు నన్నుంగాంచు. ఇట్లు శ్రమచే సాధింపఁబడిన తపస్సును నిశ్శ్రేయసస్సాధనంబగుదానిని తుచ్ఛములగు కామములకుగా వ్యయించునేని వానికంటె నవివేకుఁ డెవ్వఁడుండు? జరాభారమున శరీరము కంపమొందుచుండఁగానీ చెప్పిననియమముల ననుష్ఠింపఁజాలకపోయినయెడల నాతండు త్రేతాగ్నుల నాత్మారోపణపద్ధతి నవలంబించి యాకార్యమును జక్కఁదీర్చి నామీఁదఁ జిత్తము నిలిపి యగ్నిలోఁ బడవలయును. ఇవి వానప్రస్థాశ్రమోచితధర్మములు. ఇఁక సన్న్యాసాశ్రమధర్మముల ననువదించెద. ఆలకింపుము.

## సన్న్యాసాశ్రమధర్మములు.

ఉద్ధవా! చక్కఁగా నీధర్మముల మదిని నిలుపుకొనుము. కర్మఫలరూపములగు బ్రహ్మలోకముదనుక నుండు

*వన్యైశ్చరుపురోడాశా న్నిర్వపేత్కాలచోదితాన్, నతుశ్రౌతేన పశునా మాం యజేత వనాశ్రమీ. ౭. అని మూలము.

స్వర్గాదులన్నియు మీఁదట దుఃఖమునే కలిగించునవి. కావున నావిషయమెఱింగి గాఢతమమగు వైరాగ్యము నొందుమహనీయుఁడు అష్టశ్రాద్ధపూర్వకముగాఁ బ్రాజాపత్యేష్టి చేసి తనకుఁ గలవస్తువ్రాతమునెల్ల ఋత్విక్కునకొసంగి ప్రాణోపాధియగు నాత్మయం దగ్నుల నారోపించిఉన్నవని భావించి) సన్న్యాసము నంగీకరింపవలయును. * సన్న్యాసము తీసికొనుబ్రాహ్మణుఁడు తమపదము నతిక్రమించి పరమపదము నొందునని యసూయపడి, దేవతలు భార్యాదుల మనస్సులం బ్రవేశించి విఘ్నమును గలిగింతురు. సన్న్యాసము విధిమీఱ నంగీకరించినవాఁడు కట్టఁ దలఁచుకొన్నయెడలఁ గౌపీనముమాత్రము ధరింపవలయు. దండము కమండలువుతప్పఁ దక్కినవెల్ల వదలవలయును. కాఁబట్టి యాపత్సమయము కానితఱి గ్రహింపఁదగినవస్తువులు లేవు. ముందు దృష్టిసారించి యాచోటున నడుగుపెట్టిన భూతహింస లేదని యెఱింగియే యడుగుపెట్టవలయును. వస్త్రమునఁ బరిశుద్ధముచేసిన (వడియగట్టిన) జలమును ద్రాగవలయును సత్యశుద్ధముగాఁ బలుకవలయును. మనస్సుచేఁ దాలోచించియే కార్యముచేయఁ బూనవలయును †వాక్కునకు మౌనము దండము, దేహమునకు ననిచ్ఛ దండము. చిత్తమునకుఁ బ్రాణాయామము దండము. ఈదండములు లేక వెదురుకఱ్ఱమాత్రము ధరించినంతనే యతి కాఁడు. కుసూలధాన్యకులు, కుంభీధాన్య

* విప్రస్య వై సన్న్యసతో దేవా దారాదిరూపిణః, విఘ్నం కుర్వంత్యయం హ్యస్మానాక్రమ్య సమియాత్పరమ్, అని మూలము.

† మౌనానీహానిలాయామా దండావాగ్దేహచేతసాం, న హ్యేతే యస్య సంత్యంగ వేణుభిర్న భవేద్యతిః. ౧౭. అని మూలము.

కులు, త్ర్యైహైహికులు, అశ్వస్తనికులునని నాల్గువిధములుగా
నొప్పుబ్రాహ్మణులలోఁ దన్నుఁ దాఁ బొగడుకొనువాఁడు, నెల్ల
ప్పు డితరులం బొగడుచుండువాఁడు, పతితుఁడు తప్పఁ దక్కం
గలవారల గృహములకు ముందుగాఁ దెలుపక యేపోయి లభిం
చినదానిని సంతుష్టుఁడై తెచ్చుకొని గ్రామము వెలుపల నీటిపట్టు
లకుంబోయి యందుఁ గూరుచుండి యాభిక్షాన్నమును గడిగి
కొని మౌన మవలంబించి విష్ణుబ్రహ్మార్థభూతములకుఁ బంచి
పెట్టి మిగిలినదానిని దినవలయు. సర్వసంగములు మాని నియ
మితేంద్రియుఁడై యాత్మతోఁ గ్రీడించువాఁడై యాత్మారా
ముఁడై సమదర్శనుఁడై యొంటరిగా నీభూమిని దిరుగుచు
నిర్జనస్థానమున నివసించుచు మద్భావమునఁ బరిశుద్ధాశయము
గలవాఁడునై యద్వితీయుఁడై పరమాత్మయగు నాతో నభేద
మున మునియై తలంచుచుండవలయును ఇంద్రియవ్యాపార
ములు బంధకారణములగు. వానినియమించి జ్ఞాననిష్ఠనొందుట
ముక్తికారణంబగు. కావున నీవిషయములఁ బరిశీలించి యరిష
డ్వర్గముల జయించి సర్వకామములయందు నించుకే నాసక్తి
లేక యాత్మసుఖలాభమునొంది మద్భావముననే సంచరించు
చుండవలయును. పుణ్యదేశములు, పవిత్రకాననములు, మునుల
యాశ్రమములును దర్శించుచు భూమిని తిరుగుచు భిక్షార్థము
పురములను, గ్రామములను, గొల్లపల్లియలను, సాధుజన
సమూహ ముండుతావును బ్రవేశింపవలయును. ముఖ్యముగా
వానప్రస్థులుండు నాశ్రమములకుం బోయి యందు భిక్ష
గ్రహింపందగు. శిలోంచవృత్తిచే నార్జింపఁబడిన వానప్ర[illegible]ల
యన్నము మోహమును దొలఁగించి చిత్తశుద్ధిని గల్గించును.

కనఁబడునదియంతయు నశించును. కావున నీజగమంతయు నస త్యమని పరికించి యైహికాముష్మిక భోగసాధనకృత్యములను ద్యజించి చిత్తమును దేనియందు నాసక్తినొందనీయక మమత్వ మునకు స్థానమగు నీజగమును, మనోవాక్ప్రాణసహితంబయి యహంకారమునకు స్థానమగు నీశరీరమును బరమాత్మయం దణుమాత్రమే యగునని స్వప్నాదిదృష్టాంతతర్కముచేత నిశ్చ యముచేసి వానిం బరిత్యజించి మరల వాని నొక్కసారియేఁ దలంపక విరక్తుండగుచు * జ్ఞానమందే నిష్ఠగలిగిగాని, నిరపే క్షుఁడైకాని, నాభక్తుఁడైగాని, దండకమండల్వాది చిహ్న ములతోఁగూడిన యాశ్రమములను ద్యజించి విధిచోదనలకు లక్ష్యభూతుఁడుగాక సంచరింపవలయును. అందుఁ బరమహంస యనఁబడు యతి విద్వాంసుఁడయ్యు బాలునివలెఁ గ్రీడించును. నేర్పరియయ్యు జడునివలె వర్తించును. పండితుఁడయ్యు వెఱ్ఱివానివలె మాటలాడును వేదార్థవిశారదుఁడయు నియమరహితమగు నాచారమును గైకొను. అట్టిసన్న్యాసి కాస్థితియందు వేదవిషయమున వాదించుకోరికయుఁ దగదు. పాషండమతమున నను రాగము గూడదు. తర్కమున నిష్ఠయుఁ గూడదు. శుష్కవాదవివాదములయం దొకపక్షము నవలం బింపరాదు. మానవుల కెవరికింగాని తాను జంకరాదు. ఎవరి కింగాని తాను భయము గలిగింపరాదు. దురుక్తులాడినను వాని నోర్వవలయును ఎట్టివానినేని అవమానింపఁగూడదు. పశువువలెనే దేహము నుద్దేశించి యెవ్వనితోడను వైరము

* జ్ఞాననిష్ఠో విరక్తో వా మద్భక్తోవానపేక్షకః, సలింగా నాశ్రమాం స్త్యక్త్వా చరేదవిధిగోచరః. ౙ౦. అని మూలము.

పూనరాదు. చంద్రుఁడు నానావిధ జలాశయములయందుఁ బ్రతి బింబించులాగున నాత్మయొక్కఁడే తనయందును సకలభూత ములయందును వర్తించుననియు భూతములన్నియు నేకాత్మ కములనియు విచారింపవలయును. సమయమున నన్నము లభిం పనిచో విషాదము నొందరాదు. దొరకినంతనే సంతోషింప రాదు. లాభమునందు నలాభమునందు దైవతంత్రము లని తలంచి యా రెండింటి విషయమున మోదఖేదముల నొందక శాంతిగలిగియుండు టుచితము. ప్రాణమును నిలుచు టకుమాత్రమే యాహారము గొనవలయును. దానంజేసి తత్త్వ విచారము చేయుట సుకరంబై యుండు. విజ్ఞానము ముక్తిసాధ నము. యదృచ్ఛాలబ్ధంబగునన్న ముత్తమమైనం గాకున్నను గ్రహింపవలయును. వస్త్రము శయ్యలోనగు వానియందు లభిం చినదాని గ్రహింపవలయును స్నానము, శౌచము, ఆచమ నము మొదలగునియమములన్నియు విధివిహితములు గావున శాస్త్రమును గౌరవింపందగును. నేను విలాసార్థ మెన్నియో కార్యములు చేయునట్లే యతి ప్రతికార్యమును స్వలాభాపేక్షం గాక యాదృచ్ఛికముగఁ జేయవలయు అతనికి ఖేదప్రతీతి యంతయు మదీయజ్ఞానముచేతనే తొలఁగును. యత్కించిత్తు కలిగినను అది దేహపాతముదనుకనే యుండును ఇది పండితుఁ డగువానికి సన్న్యాసలక్షణము.

మీఁద దుఃఖమును గలిగించు కామములందు విరక్తుఁడై తత్త్వవిచారము చేయఁజాలనివాఁడు సన్న్యసించి మహాదర మున గురువునకు శుశ్రూషలొనరించి యసూయవదలి పట్టు దలంగొని బ్రహ్మజ్ఞానము గలుగునంతదనుక గురువునే యారా

ధించుచుండవలయును. ఇంద్రియములజయింపక యత్యాస బుద్ధిగలవాఁడై జ్ఞానవైరాగ్యశూన్యుఁడై జీవికకొఱకు సన్న్యసించువాఁడు దేవతలను దన్నును దనలోనున్న నన్నును వంచించి పరిపక్వముగాని కర్మముకలవాఁడగుచు నైహికాముష్మికములను రెండింటికిం జెడును. సన్న్యాసికి ముఖ్యములగు ధర్మములు శాంతి అహింసయను నీ రెండే యని యెఱుంగుము. తపస్సు దర్శనము వానప్రస్థులధర్మములు. భూతరక్షణ యములు గృహస్థువునకు ధర్మములు. గురుశుశ్రూష బ్రహ్మచారి ధర్మము. బ్రహ్మచర్యము, తపశ్శౌచములు, సంతోషము, భూతదయ, యనునవి ఋతుకాలములయందే సతిని బొందఁగోరు గృహస్థువునకు ధర్మములు. నన్నుపాసించుట సర్వాశ్రమములవారికిని ధర్మము. ఈప్రకారము స్వధర్మమున నిరతుఁడై నన్నే సేవించునాతఁడు సర్వభూతవిషయమునందు నన్నే భావించుచుండువాఁడు స్వల్పకాలముననే నాభక్తిని బడయఁగలఁడు. అపాయశూన్యమగు నాభక్తిచేత సర్వలోకవిభుఁడు సృష్టిస్థితిలయములకుఁ గారణబ్రహ్మము నగునన్ను దర్శింపఁజాలు. ఇట్లు స్వధర్మానుష్ఠానమునఁ బరిశుద్ధాంతరంగుఁడై జ్ఞానవిజ్ఞానసంపన్నుఁడై విరక్తుఁడై నాగతి నెఱింగి నన్నే పొందును. *నాభక్తితోఁగూడి శ్రేయస్సులను గలిగించు వర్ణాశ్రమధర్మాచారపద్ధతి యిదియే. స్వధర్మముననే యాసక్తిగల నాభక్తుఁడు

* వర్ణాశ్రమవతాంధర్మ ఏష ఆచారలక్షణః, స ఏవ మద్భక్తియుతో నిశ్శ్రేయసకరః పరః. ४२. ఏతత్తేఽభిహితం సాధో భవాన్ పృచ్ఛతియచ్చ మాం, యథా స్వధర్మసంయుక్తో భక్తో మాం సమియాత్పరం. ४३. అని మూలము.

నన్నుం బొందఁగలఁడు. ఆవిధమెల్ల నీప్రశ్నమునకుఁ దగు నుత్తరంబగును.

## జ్ఞానికిఁ గర్మాభావవిషయము.

* శాస్త్రజ్ఞాన మనుభవమే యవధిగాఁ గలది. అట్టి శాస్త్రజన్యజ్ఞానముగలిగి యాత్మతత్త్వము నెఱింగిన యపరోక్ష జ్ఞానవంతుఁడు ఈద్వైతమును, అది నివర్తించుసాధనమును నాయందు మాయామాత్రమే యని తత్సాధనంబగుజ్ఞానమును వదలుకొనును. జ్ఞానికి నేనే యిష్టుఁడను ఫలము. ఫలసాధనము స్వర్గాపవర్గములు నగుదును. నాకంటె వేఱొకటి ప్రేమాస్పద వస్తు వాతనికి లేదు. జ్ఞానవిజ్ఞానసంపన్నులు మదీయోత్తమపద మును దెలిసికొనఁజాలుదురు జ్ఞానమున నన్నుఁ దలంచుటం జేసి జ్ఞాని నాకుఁ బ్రియతముఁడు. జ్ఞానకళచే నేశుద్ధి లభిం చునో యట్టిశుద్ధిని దపస్సు దీర్థములు జపదానములు తక్కుం గలపవిత్రకర్మము లేవియుఁ జేయంజాలవు ఉద్ధవా! ఆకార ణముచేత జ్ఞానపర్యంత మాత్మ నెఱింగి జ్ఞానవిజ్ఞానసంపన్నుఁ డవై భక్తిభావనగలవాఁడవై నన్ను సేవింపుము. మునులు జ్ఞానవిజ్ఞానయోగముచేఁ బరమాత్మనాత్మయం దారాధించి సర్వ యజ్ఞనాథుఁడ నగు నన్నుఁ బొందఁగల్గిరి. ఉద్ధవా! నిన్నాశ్ర యించియుండిన యాధ్యాత్మికప్రభృతులగు మూఁడుశరీరముల వికారము లాద్యంతదశలయందు లేక మధ్యదశలో గానం బడును. కావున మాయమాత్రంబె యగును. కాఁబట్టి యా వికారమునకుఁ గలుగుజన్మాదులు అధిష్ఠానభూతుఁడవగు నీకుఁ గలుగవని నమ్ముము రజ్జుసర్పభ్రాంతియందు భ్రాంతికి ముందును

* ఇది పందొమ్మిదవయధ్యాయమునుండి గ్రహింపవలయును.

భ్రాంతివదలిన తర్వాతను గలుగురజ్జుజ్ఞానమే వస్తుగతింబట్టి యూహింపఁగా మధ్యదశయందును గలుగునుగాని సర్వ భ్రాంతిమాత్రము సత్యముకానివిధమున నుత్పత్తికి ముందును నాశమునకుఁ దరువాతను నిలుచు బ్రహ్మస్వరూపమే మధ్యా వస్థయందును గలుగునుగాని వికారస్వరూపముసత్యముగాదు. అనిన విని యుద్ధవుం డిట్లు ప్రశ్నించెను.

విశ్వమూర్తీ! విశ్వేశ్వరా! శ్రీకృష్ణా! వైరాగ్యవిజ్ఞాన సంయుక్తమయి పురాణమగువిశుద్ధజ్ఞానము బ్రహ్మాదులచేత వెదకఁబడు నీభక్తియోగమును విశదీకరింపుము పరమేశ్వరా! ఆధ్యాత్మికమని, ఆధిభౌతికమని, ఆధిదైవికమని పిలువఁబడు తాపత్రయముచేతఁ గొట్టఁబడి భయంకరసంసారమార్గము నందుఁ బరితపించువాఁడనగునాకు నమృతమును గురియు నీపాదరవిందద్వంద్వమను నాతపత్రము (గొడుగు) తప్ప వేఱొకశరణము కనఁబడకయున్నది. సంసారకూపమునందుఁ జిక్కి కాలమనుసర్పముచేతఁ గఱవఁబడి శ్రమంపడుచు తుచ్ఛ ములు నత్యల్పకాలికములునగుసుఖముల నాసించుచుఁ బేరాశ వదలఁ జాలని యీదాసునిం గరుణించి ముక్తిని బోధించు వాక్యామృతధారలఁ దడుపుచు నుద్ధరింపుము. అని ప్రార్థిం పఁగా నాతని యుత్కంఠ నెఱింగి శ్రీకృష్ణుఁడు సంశయములఁ దొలఁగించుమార్గమున నిట్లు పలికెను.

ఉద్ధవా! పూర్వము మేమెల్ల వినుచుండగనే రాజగు యుధిష్ఠిరుఁడు ధర్మవేత్తలలో నుత్తముఁడగు గాంగేయుని ప్రశ్నించెను. భారతమహాయుద్ధము చెల్లినపిదప బంధుమిత్రా -లఁ బొలియించుటచే మనస్సు కలవిలంపడఁగా ననేకధర్మ

ములు గాంగేయునివలన నెఱింగి తరువాత మోక్షధర్మములను ధర్మరాజు ప్రశ్నించెను. మేము వినుచుండఁగా భీష్ముఁ డుపదేశించిన యామోక్షధర్మములనే నీకు నిపుడు బోధించెదను వినుము. ఆగాంగేయోపదేశము జ్ఞానవిజ్ఞానవైరాగ్యశ్రద్ధాభక్తులతో నిండినది. కావున వాని నీకు బోధించిన నీసంశయములు తొలఁగును. కావున శ్రద్ధగలిగి వినుము. ప్రకృతిపురుషులు, మహదహంకారములు, పంచతన్మాత్రలు నను నీయెనిమిదియుఁ బదునొకండింద్రియములును ద్రిగుణములు పంచమహాభూతములును గలిసి యిరువదియెనిమిదితత్త్వములు బ్రహ్మ మొదలుకొని స్థావరముదనుకఁ గార్యములం దనుగతములై యుండునని దేనిచే నెఱుంగఁదగునో, ఈభావములందు నేకమై పరమాత్మతత్త్వ మనుగతమై యుండునని దేనిదేనిచే నెఱుంగఁదగునో, మఱియుఁ గార్యకారణాత్మకమైన ప్రపంచమెల్లఁ బ్రధానకారణాత్మకమే యగును గాని దానికి వేఱుగాదని దేనిచే నెఱుంగఁదగునో, యదియే మదీయజ్ఞానమని యెఱుంగుము. ఇదియే నానిశ్చితము మొదట దానిచే నేకాత్మకములగు భావములం గనుంగొనియు, పదంపడి యది సమంజనము కాదనియు వియన్నియు సర్వమునకుఁ బ్రధానకారణంబగు పరబ్రహ్మమే యని చూచుట విజ్ఞానంబనం బడును. త్రిగుణాత్మకములగు భావము లుత్పత్తిస్థితిలయములు గలవి. కావున నాదిమధ్యాంత్యములయందుఁ గార్యమునుండి కార్యాంతరమునం దేది సమన్వితంబగునో దాని ప్రళయమున నేది శేషించునో యదియే సత్తు అని తెలియుము. * వేదవాక్యము, పటాదికార్యము, తంతువులు

* శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యా మనుమాన శ్చతుష్టయం, ప్రమాణేష్వన

లోనగునవి వ్యతిరేకించుటఁ గన్పట్టకుండునను ప్రత్యక్షము, మహాజనులు చెప్పుటవలనఁ బ్రసిద్ధముగునైతిహ్యము, విమతము కనఁబడుచుండుటచేత శుక్తిరజతజ్ఞానమ్మువలె మిథ్యయగునను ననుమానము, అను నీ నాలుగుప్రమాణములచేత బాధితము కాఁబట్టి మిథ్యయగువికల్పముచేత, నాతఁడు విరక్తుండగును అంతియ కాదు కర్మములన్నియుఁ బరిణామము కలవి. కాఁబట్టి బ్రహ్మలోకముదనుక నుండులోకములన్నియు దృష్టమెట్టిదో యట్లే దుఃఖదాయకములనియు, నస్థిరములనియు, జక్కఁగా నిశ్చయించియతఁడువిరక్తినొందును. నిష్కల్మషస్వాంతుఁడవగునో యుద్ధవా! భక్తియోగము నింతకుఁ బూర్వమే తెలిపితిని. దానియందు నీకత్యంతప్రీతి యుండునని తలంతును. కాఁబట్టి నాయందు భక్తికుదురుటకుం గలకారణమును మరలఁ జెలుపుదును. అవహితుఁడవు కమ్ము.

* నాకథ లమృతధారలవంటివి. అట్టివానిపై శ్రద్ధయు, నెల్లవేళల నన్ను సంకీర్తనముచేయుటయు, నాపూజయిందాస్థయు, నన్ను వినుతించుటయు, నాసేవయం దాదరము, సర్వాంగాలింగితభూతలుండై నాకు నమస్కరించుటయు, నాభక్తుల నారాధించుటయు, సర్వభూతములయందు నన్నే భావించుటయు, నాకొఱకే సర్వప్రయత్నము లొనరించుటయు, నా యనంతకల్యాణగుణములఁ బ్రశంసించుటయు, మనస్సు నా

వస్థానాద్వికల్పాత్స విరజ్యతే. ౧౭. అని మూలము. *శ్రద్ధామృతకథాయాం మేశశ్వన్మదనుకీర్తనం, పరినిష్ఠా చ పూజాయాం స్తుతిభిస్తవనం మమ. ౨౦. దరః పరిచర్యాయాం సర్వాంగైరభివందనం, మద్భక్తపూజాభ్యధికా సభూతేషు మన్మతిః. ౨౧. అని మూలము.

యందే యునుచుటయు, సర్వకామముల వదలుటయు, నాసేవ శాంతిని సంతర్వీరోధులగు కామక్రోధాదులఁ ద్యజించుటయు, భోగములను సుఖములను వదలిపెట్టుటయు, యజ్ఞములను, దానములను, హోమములను, భోజనములను, వ్రతములను, దపస్సును, నాకొఱకే చేయుటయు నను నీధర్మములను ఆత్మార్పణంబునను వానిచే మనుజులకు నాపై భక్తి కుదురును. సత్త్వబహుళంబై శాంతంబై యుండుచిత్తము నాత్మార్పితముగాఁ జేసి ధర్మమును, జ్ఞానమును, వైరాగ్యము, నైశ్వర్యమును బొందినమానవశ్రేష్ఠునకు నింక లభింపనియర్థం బెయ్యది కలదు? చిత్తము దేహాదివికల్పములపై నాసక్తింబొంది యింద్రియములకు లోఁబడి మలినమై యసత్యార్థనిష్ఠం గాంచునేని దానిచేత నధర్మాదులు గలుగునని నీవు తెలియందగు. నాయందు భక్తిని గల్గించునది ధర్మము. ఏకాత్మదర్శనము జ్ఞానమనంబడును. గుణసంబంధము వదలుట వైరాగ్యమగును. అణిమాదిసిద్ధు లైశ్వర్య మనంబడు.

## యమాదులలక్షణములు.

అని తెలుపుటయు నుద్ధవుం డాపలుకులచే సమ్మోదము నొంది మరల నిట్లు ప్రశ్నించెను మహాప్రభూ! గోపాలకృష్ణా! యమనియమము లెన్నివిధములుగ నుండును ? శమదమంబులన నెట్టివి? తితిక్షాధృతులన నెట్టిలక్షణములుగలవి? దానము తపము శౌర్యము నను నివెట్టివి? సత్యము, ఋతము, శౌచము, త్యాగము లనువానికి గుఱుతులేవి? ఇష్టధనం బెట్టిదని చెప్పంబడును? యజ్ఞదక్షిణ లెట్టివి ? పురుషునకు బలంబేది ? దయయన నేది? లాభ మేది? ఉత్తమవిద్య యెట్లుండును ? హ్రీ

యనున దెట్టిది? మండనం బేది ? సుఖదుఃఖము లెట్లుండును? పండితుం డెట్టివాఁ డగును? ఎట్టివాఁడు మూర్ఖుఁడు ? మార్గమన నెట్టిది? ఉన్మార్గ మెట్టిదగును? స్వర్గనరకము లెట్టివి? ఎట్టివాఁడు బంధువు? ఎట్టిది గృహము? ఆఢ్యుఁడు? దరిద్రుఁడు, కృపణుఁడు, ఈశ్వరుఁడుఎట్టివారు? మహానుభావా! నా యీ ప్రశ్నములకు నుత్తరమును, వీనికి విపరీతములగు నశమాదులనుం దెల్పుము. వానిం దెలిసికొనఁగోరుచున్నాఁడను. అని యడుగఁగా భగవంతుఁడగు శ్రీకృష్ణుఁ డుద్ధవునిం గాంచి యిట్లు బదులిడెను.

అహింసయు, సత్యము, దొంగిలింపకుండుటయు, నిస్సంగత్వము, హ్రీ, ధనాదుల నార్జింపకుండుటయు, ఆస్తికత్వము, బ్రహ్మచర్యము, మౌనము, స్థిరత్వము, క్షమయు, భయముకుండుటయు నను నీపండ్రెండును యమము లనంబడును. బాహ్యశౌచము,ఆభ్యంతరశౌచము, జపతపములు, హోమము, శ్రద్ధయు, ఆతిథ్యము, నాపూజయుఁ, దీర్ఘయాత్రయు, నితరుల కొఱకు పాటుపడుటయు, తుష్టియు, గురుశుశ్రూషయునను నీపండ్రెండును నియమము లనంబడును. ఈ యమ నియమములను జక్కఁగా భజించినయెడల నట్టిపూరుషులకు నెల్లయర్థములుసిద్ధించును. నాయందునిష్ఠగలుగుటయేశమము. ఇంద్రియసంయమనము దమము. దుఃఖసహనము తితిక్ష. జిహ్వోపస్థలవర్తనము నడంచుట ధృతి. భూతద్రోహమును అనఁగా దండనమును వదలుటదానము. కామత్యాగము తపస్సు. ఆఁకలిదప్పులు మొదలగుస్వభావములకు లోఁబడకయుండుటయే శౌర్యము. బ్రహ్మవిషయక సమాలోచనమే సత్యము చూచిన దానినిమఱుగుపఱుపక చెప్పుటఋతము. కర్మాసంగముశౌచము.

సర్వకర్మ ఫలముల వదలుట త్యాగము. మానవుల కిష్టధన మధర్మము. *పరమపురుషుఁడనిపరమేశ్వరుఁడని ప్రఖ్యాతినొందిన నేనే యజ్ఞము. జ్ఞానోపదేశమే దక్షిణ ప్రాణాయామము బలము. నాదగు నీశ్వరభావమే భాగ్యము. మద్భక్తి యుత్తమలాభము. ఆత్మయందు భేదవిధ్వంసనము విద్య. అకార్యమునందేవ గలుగుట హ్రీ యనంబడు. నిరపేక్షత్వాదిగుణములు మండనము సుఖదుఃఖానుసంధానమే సుఖము గ్రామ్యసుఖాపేక్ష దుఃఖము. బంధమోక్షముల నెఱిఁగినవాఁడు పండితుఁడు. దేహాదులయం దహంభావముకలవాఁడే మూర్ఖుఁడు. † నన్ను బోధించు నివృత్తిమార్గమే సన్మార్గము చిత్తవిభ్రమమే యున్మార్గము (చెడుత్రోవ.) సత్త్వగుణోదయమే స్వర్గము తమోగుణము వృద్ధియగుటయే నరకము ‡మద్భూ్రిపుఁడగుగురువే బంధువు. మానవదేహమే గృహము. గుణవంతుఁడేఆఢ్యుఁడు. (సౌధములుగలవాఁడు) అసంతుష్టుఁడు దరిద్రుఁడు. ఇంద్రియవశుఁడు కృపణుఁడు. గుణములయందాసక్తమతిగానివాఁడే యీశ్వరుఁడు. (రాజుగాఁడు) గుణములయం దాసక్తికలవాఁడే యనీశ్వరుఁడు. (అసమర్థుఁడు) వీనికి విరుద్ధములగునవియెల్ల నశేమాదులు. ఉద్ధవా! మిత్రమా! నీ వడిగినవిషయముల

---

*యజ్ఞో౽హం భగవత్తమః. అని మూలము. భగవత్తమః=పరమేశ్వరః. అహమేవయజ్ఞః మద్బుద్ధ్యా యజ్ఞో౽నుష్ఠేయః అని వ్యాఖ్య.

† పంథామన్నిగమ స్స్మృతిః అని మూలము. మాం నితరాం గమయతి యోనివృత్తిమార్గస్సతు పంథాస్సమార్గః. అని వ్యాఖ్య.

‡బంధుర్గురురహం సఖే అనిమూలము. గురురేవ బంధుః న భ్రాత్రాదిః స చాహమేవ. అని వ్యాఖ్య.

కన్నింటికి బదులుచెప్పితిని. విశేషించి భాషింపనేల? సుఖము గుణములని, దుఃఖములే దోషములని యూహించుట దోషము. వానిని రెండింటిని దోషములుగా నూహించి వానిని వదలుటయే గుణము. అని హితోపదేశము చేయఁగా విని యుద్ధవుం డిట్లు మరలఁ బ్రశ్నించెను.

భక్తిజ్ఞానక్రియాయోగములు.

* మహాత్మా! సర్వేశ్వరా ! పరమేశ్వరుఁడవగు నీశాసనమే వేదమని యెఱింగితిని. ఆవేదము విధినిషేధములఁ దెలుపుచున్నది. విధించుకర్మములు గుణములనియు నిషేధించుకర్మములు దోషములనియు నెఱుంగఁదగియుండెడు. అంతియకాక యావేదము వర్ణాశ్రమభేదమును, బ్రతిలోమానులోమజాతివికల్పమును, ద్రవ్యదేశము వయస్సు కాలము ననువీనిని స్వర్గనరకములను నపేక్షించెడు. గుణదోషభేదదర్శనమే లేనిచో విధినిషేధలక్షణంబగు వేదమయమగు నీవచనము మానవులకు మేలుగలిగించెడిని? స్వర్గమోక్షాదులయందును, సాధసాధనములయందును, బితృదేవమానవులకు నీవచనమగు వేదమే నేత్రమనవలయును. గుణదోషభేదదర్శనము నదే తెలుపుచుండు. వానియపవాదముకూడ దానినుండియే తెలియవచ్చుచున్నది. ఈవిషయమున భ్రాంతి కలుగుచున్నదే. ఆభ్రాంతి తొలంగుమార్గ మేది? నాకుఁ దెలిపి కృతకృత్యునింజేయుమా యని ప్రార్థించెను. ఆప్రశ్నమును జక్కఁగా నాలకించి యాపురుషోత్తముఁ డాతనిభ్రాంతిని బాప నెంచి యిట్లు బదులుచెప్పెను.

* ఈవిషయ మిరువదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

ఉద్ధవా! నీప్రశ్నము నా కత్యంతసంతోషమునే కలిగించెను. కావున భ్రాంతి దొలంగ వచించెద. ఆలకింపుము. *మానవులకు మోక్షము లభించుటకు జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగమునను నీమూఁడుపాయములు గలవని మున్నె బోధించితిని. ఆమూఁడుపాయములుతప్ప వేఱొక్కటి యేదియు నెక్కడను గానరాదు ఆమూఁడింటియందును గర్మములయందు నిర్వేదంబునొందినట్టిసన్న్యాసులకు జ్ఞానయోగముతగినదికర్మములయెడ నిర్వేదంబునొందక యాసక్తిఁగొనిన ఫలకాములకుఁ గర్మయోగ ముచితము. కర్మములయెడ నిర్వేదమొందకయు, ఫలములయం దత్యంతాసక్తినొందకయు, దైవవశమున నాకథాదులయందు శ్రద్ధగల్గియు నుండువారికి భక్తియోగము తగినది కర్మములయెడ నిర్వేదముగాని నాకథాదులయందు శ్రద్ధగాని కలుగునంతవఱకుఁ గర్మములు కర్తవ్యము లనియే యెఱుంగవలయును. స్వధర్మనిరతుఁడై ఫలములను గోరక యజ్ఞములను జేయుచుఁ గామ్యములు నిషేధింపఁబడినవియు నగు కర్మముల నాచరింపనివాఁడు స్వర్గమునుగాని నరకమునుగాని పొందఁడు. ఆస్వధర్మనిరతుఁడు ప్రయత్నము లేకయే విశుద్ధ జ్ఞానమునుగాని నిర్మలమద్భక్తినిగాని పొందఁజాలును. † స్వర్గ

---

* యోగా స్త్రయో మయా ప్రోక్తా నృణాం శ్రేయోవిధిత్సయా, జ్ఞానం కర్మ చ భక్తిశ్చ నోపాయోఽన్యోఽస్తి కుత్రచిత్. ౬. నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు, తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినాం. ౭. యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్, ననిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్యసిద్ధిదః. ౮. అని మూలము † స్వర్గిణో ప్యేతమిచ్ఛంతి లోకం నిరయిణ స్తథా, సాధకం జ్ఞానభక్తిభ్యాం ముభయం తదసాధకం. ౧౨. అని మూలము.

వాసినరకవాసులు జ్ఞానభక్తులను సాధకంబగుమర్త్యలోకమును గోరుదురు స్వర్గనరకలోకములు రెండును తత్సాధకములు గానోపవు. నరుఁడు నరకవాసము నెట్లు కోరఁడో యట్లే స్వర్గవాసము నపేక్షింపరాదు. పునర్దేహప్రాప్తికి సాధనంబగునుగాన మానవుఁడు నరకమునుగూడఁ గోరఁదగదు. ఈమానవశరీరము పురుషార్థములను నాల్గింటిని సాధించునదియే. కాని మరణధర్మకంబని యూహించి యాదేహము చెడిపోకమునుపే పురుషుఁడు ప్రమాదంపడక మోక్షార్థమై ప్రయత్నముచేయవలయును దయలేక యమునివలె నొకఁడు తాను గూడుకట్టుకొనియుండు వృక్షమును ఛేదించుచుండఁగా నందుండు పక్షి భయములేక నివసింపఁదగిన వేఱొకవృక్షము నకుం బోవురీతిని, ప్రమత్తుఁడు కానివాఁడు రేయింబవళ్లు తన యాయుస్సు తగ్గుచుండుట నూహించి భయమూనఁ దనువు కంపింపఁగా సర్వసంగములను వదలి యాశలమాని పరతత్త్వమిట్టిదిగదా యని పెద్దలవలనఁ దెలిసికొని శాంతినొందు. ఉద్ధవా! * నేను సంసారభూరివారాశిని దాటించు నావవంటి మానవునిశరీరము ననుకూలవాయువునై నడిపించుచుండఁగా నతిదుర్లభమగు దానిని దైవవశమున నెన్నియో సత్కర్మముల మూలమునఁ బొందియు నాసంసారసాగరమును దాఁటనివాఁడే యాత్మఘాతుకుఁ డనంబడును. కర్మములయందు నిర్వేదంబు నొంది తత్ఫలములయందును విరక్తినెపుడు కాంచునో యాక్ష

* నృదేహమాద్యం సులభం సుదుర్లభం ప్లవం సుకల్యం గురుకర్ణధారం, మయానుకూలేన నభస్వతేరితం పుమాన్ భవాబ్ధిం న తరేత్స హా. ౧౭. అని మూలము.

ణామునందే యింద్రియముల జయించి ఆత్మవిషయకవృత్తివితతి నచలంబుగా మనంబును యోగిధరింపవలయును. పరిభ్రమించు చున్నమనస్సు ధరింపఁబడియు స్వేచ్ఛగాఁ ద్వరగాఁ బరుగిడుచు స్థిరతగాంచకుండునేని యలసుఁడుగాక దాని ననుసరించుచుఁ జక్కనియోగమార్గముచేత నాత్మవశముచేసికొనఁదగుంగాని మనోగతిని నిలుపఁ బూన నేల యని యుపేక్షింపరాదు.

ప్రాణేంద్రియములను జయించి సాత్త్వికబుద్ధిం గైకొని నిర్మలుఁడై మనస్సును స్వాధీనముగనుండ నభ్యసింపవలయును. ఆత్మవశముకాని గుఱ్ఱమును మెల్లమెల్లగాఁదనయిష్టానుసారము పోవునట్లు చేసికొనునేర్పఱివలె సాధకుఁ డనువృత్తిమార్గమున మనోనిగ్రహము చేసికొనుటయే యుత్కృష్టయోగమని యెఱుంగుము. ఎల్లభావములకు ననులోమక్రమమున నుత్పత్తియుఁ బ్రతిలోమక్రమమున నాశముగలుగునని తత్త్వవివేకమున నిశ్చయించిన మనస్సు నిర్మలంబగును. విషయములయందు నిర్విణ్ణుఁడై విరక్తుఁడై సద్గురువు నుపదేశముచేత మార్గము నెఱింగినవాఁడు నగు పూరుషుని మనస్సు చక్కఁగా నాలోచించుటంజేసి దేహాదులయందుఁ గలయభిమానమును వదలును, వేఱొకమార్గమున నాకార్యము ఫలింపదు. యమనియమాదియోగమార్గములమూలమునను,పదార్థద్వయశోధనవిద్యవలనను, నాయర్చనోపాసనాదులవలనను, బరమాత్మస్మృతి కలుగునుగాని వేఱొకమార్గమునఁ గలుగదు. యోగి ప్రమాదవశమున నింద్యమగుకర్మము నొకప్పుడుచేసినను, ఆతఁ డభ్యసించుయోగమే యానింద్యకర్మమును గాల్చివైచును. ఆతఁడు వానికి జంకి కృచ్ఛ్రచాంద్రాయణాదులు చేయం బని

లేదు. పూరుషులకుఁ దమతమయధికారముమీఁద నిష్ఠగుణము-
అది లేకుండుట యేదోషము ఇయ్యదియే గుణదోషవినిశ్చయమని
యెఱుంగుము. విషయములయందుఁ బ్రవర్తించుటస్వభావము
గనే యపవిత్రము. కాబట్టికర్మాచరణము ప్రధానముకాదు. కర్మ
ములెల్ల నొకపర్యాయమే వదలవలయునని విధించినచో నెల్లర
కది సుకరము గాదు. కావున వేదములు చక్క నూహించి
యీకర్మము చేయఁదగినది. ఈకర్మము నిషిద్ధము అని బోధిం
చుచుఁ గర్మములనెల్ల నాచరింపవలయు నన్నయాశకుఁ బోవ
నీయక కర్మములసంగ్రహమునే విధించుచున్నవి. అట్లు కావునఁ
గ్రమముగాఁగర్మములనువదలుటయే వేదములయభిప్రాయము.

ఉద్ధవా! నాకథలయందు శ్రద్ధ మిక్కుటముగాఁగలిగి
కర్మములవిషయమున నాసక్తిగలవాఁడు కాక కర్మములన్నియు
దుఃఖాత్మకములే యని తలపోసి తెలిసికొనికూడ వానిఫలము
లను వదలనేరక మిణుకరించు వాఁడు నిరంతరము విషయములు
దుఃఖమును భావికాలమునఁ గల్గించునవని యెఱింగి వానిని
దూఱుచునైన వానిననుష్ఠించుచు భక్తిశ్రద్ధలుగలిగి దృఢనిశ్చ
యమున భగవంతుఁడనను నన్నే యారాధింపవలయును.
మున్ను నేఁజెప్పినభక్తియోగము ప్రకారము సంతతము నన్నే
సేవించుసాధకునకు హృదయగతుండ నగుదు. వానిపాపము
లెల్ల నశించును. సర్వాత్మకుఁడ నగు నన్ను దర్శించినయెడల
మనోగతాహంకారము నశించును. వానికింగల సర్వసందేహ
ములు రూపుమాయు. వానికర్మములెల్లఁ బ్ర[illegible]ణతంగాంచు
కర్మతపోజ్ఞానవైరాగ్యయోగదానధర్మములఫలమువను
[illegible]యుంగల శ్రేయోదాయకములగు మార్గములఫలము

నను మానవుఁడు పొందులాభము నెల్ల నాభక్తుఁడు భ_
యోగమునఁ గష్ట మించుకంతయు లేక పొందఁగలఁడు.
అంతియగాక స్వర్గమునే నపవర్గమునేని మోక్షమునేని
పొందవలయునని కోరునేని నాదయవలన వానిం బొందును.
సాధువులై ధీరులై యేకాంతభక్తులు నగువారలకు నాత్యంతి
కంబగు కైవల్యమును వారు కోరకయున్నను నేనేయొసంగెద
నన్నను వారు దానింగోరరు. నిరపేక్షత్వమే యుత్తమపురుషా
ర్థమునకు సాధకమని సాదువులు భాషింతురు. అట్టులగుటఁ
బ్రార్థనముకాని దానికిం గారణమగు నపేక్షయు లేనివారికే
మద్భక్తి చక్కఁగాఁ గుదురును. సర్వభూతసమచిత్తులై సాధు
వులై బుద్ధ్యతీతుఁడనగు నన్నుఁ జెందిన యేకాంతభక్తులకు
విహితప్రతిషిద్ధకర్మములవలనఁ గలుగుపుణ్యపాపము లంటవు.
ఉద్ధవా! నే నుప్రకారముగా బోధించినమార్గముల నవలం
బించి యాచరించువారు కాలమాయావిరహితమై పరబ్రహ్మా
త్మకంబగు నాదివ్యపదమును బొందుదురు. అని తెలిపి శ్రీ
కృష్ణుఁడు మరల నిట్లు బోధించెను.

### దేశకాలాదులవగు గుణదోషములు.

* ఉద్ధవా! నాచే నింతకుమున్ను నిరూపితములగు
భక్తిజ్ఞానకర్మమార్గములను మూఁడింటిని వదలి కేవల మస్థిర
ములగుప్రాణములచే నీచములగు భోగములను సేవించువారు
సంసారమునందే పడియుందురు విశేషించి యందే తిరుగుచుం
దురు. అందఱకును దమతమవర్ణాశ్రమముల కనురూపమగు
నధికార మనఁబడు నాయాయిధర్మమునందు నిష్ఠగలిగియుండుట

* ఇది యిరువదొకఁడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

గుణమనియు, అది లేకుండుట దోషమనియుఁ జెప్పఁబడినది. ఇదియే గుణదోషనిశ్చయము. పదార్థము లేక రూపము లైనను ఈవస్తువు యోగ్యమైనదియా? కాదా? యనుసందేహ మూలమున దానిస్వాభావికప్రవృత్తి నెఱుంగుటకు నాదేశ కాలాదివస్తువు లన్నింటియందును దానియోగ్యతాయోగ్య తలు వివరింపఁబడుచున్నవి ధర్మార్థము శుద్ధి యశుద్ధియు, వ్యవ హారార్థము గుణదోషములు, శరీరయాత్రసాగించునిమిత్తము శుభాశుభములు, ననునీయాచారమును ధర్మాధారరూపమగు దానిని గర్మజడులగువారలకు నేనే మన్వాదిరూపములం దాల్చి బోధించితిని. జీవునితోఁగూడినపంచభూతములు బ్రహ్మాదిస్థావ రాంతభూతములకు శరీరారంభకములగును. భూతములకెల్లఁ బురుషార్థములు సిద్ధించుకొఱకు సర్వశరీరములు పాంచభౌతిక త్వాదిధర్మములయందుఁ దుల్యములై యుండినను సమానములు కాని నామరూపములు వేదములయందే కల్పింపఁబడినవి. కర్మ సంగ్రహార్థమే దేశకాలభావఫలనిమిత్తాధికారులకునుగుణదోష ములు రెండును విధింపఁబడినవి.

దేశములలోపలఁ గృష్ణమృగముసంచరింపనిది, బ్రాహ్మణ భక్తి శూన్యమైనది యశుచియగును. అందుఁగూడ మ్లేచ్ఛ బహుళం బయ్యేనేని మఱింత యపరిశుద్ధమగును. ఊషరదేశ మశుద్ధమే ద్రవ్యసంపత్తిలేకగాని రాష్ట్రవిప్లవాదులఁగాని కర్మానర్హమగునది యశుద్ధము. ద్రవ్యాంతరసంసర్గమువలనను, బ్రాహ్మణాదివచనమునను, సంస్కారమునను గాలమహాత్వాల్ప ములను ద్రవ్యమునకు శుద్ధియు నపరిశుద్ధియుఁ గలుగు. మఱియు శ చేత నశక్తిచేత బుద్ధిచేతసమృద్ధిచేత ద్రవ్యమునకు

శుద్ధ్యశుద్ధులు గలుగును. ద్రవ్యాశుద్ధియు దేశమునవస్థననుస రించి పాపమునుగల్గించును. ధాన్యములకు, దారువులకు, నెమ్ముక లకుఁ, దంతువులకు, రసలోహచర్మములకును బార్థివంబులకును మఱొకద్రవ్యముతో సమ్మేళనామేళనముల శుద్ధియగును. అమేధ్యలిప్తమగు ద్రవ్య మావాసన యడంగునంతదనుక తూళ నాదులచే శోధించిన శుద్ధమగును. స్నానదానతపోవస్థావీర్య సంస్కారకర్మములచేత నాస్మరణము చేత నాత్మ పరిశుద్ధమగును. పరిశుద్ధునకే కర్మాచరణమున నధికారము కలదు. గురుముఖము నుండి విజ్ఞానము కలుగనదియే మంత్రమునకు శుద్ధి. ఫలముల నాకర్పించుటయే కర్మములకు శుద్ధి. దేశకాలములకు ద్రవ్య మంత్రములకుఁ గర్మమునకుఁ గర్తకు శుద్ధిగలిగిన ధర్మంబగు. అట్టిశుద్ధితప్పిన నధర్మంబగు. ఒక్కచోట గుణముకూడ దోష ముగామాఱును. శాస్త్రవిధానబలముచేత నొకప్పుడు దోషము గుణముగా మాఱును. గుణదోషము లిట్టివని నిశ్చయించు శాస్త్రమువిషయము మొదలగువానిభేదముచేత గుణదోషను లను మార్చుచుండును. నిందింపందగి యేకరూపమగు మద్య పానము లోనగుకర్మము జాతిభ్రష్టులకును గర్మభ్రష్టులకును బాతకము కాదనవచ్చును. విషయసంగతి సన్న్యాసికి నింద్య మేయైనను గృహస్థునకు నింద్యము కాదు. పై నెక్కియున్న వాఁడు క్రిందఁబడునుగాని పండుకొనియున్న వాఁడు పడుట యెట్లు? మానవుఁ డేయేవిషయమునందు నివృత్తిమార్గము నవలంబించునో యాయావిషయమునుండి విముక్తుండగును. ఇయ్యది శోకమోహభయములఁ బోఁగొట్టుచు మానవులకు మేలు గలిగించుధర్మ మనంబడును. విషయములు మిగుల

మంచి వసుభావ మెప్పుడు కలుగునో యప్పుడు వానితో మనుజులకు సంగము కలుగును సంగమునఁ గామముకలుగు. దానఁ గలహముకలుగు. ఆకలహమునఁ గ్రోధము పొడచూపు. దానిచే మోహము వెలయు. అద్దానిచే నిది కార్యము, ఇది యకార్యము ననుపరిజ్ఞానము చెడును. అట్టి విస్మృతుఁడు మూర్ఛితునితో, మృతునితో సమానుఁడై శూన్యప్రాయుండే యగును. విషయములయందుఁ గలచుక్కన చేతఁదన్నునితరుల నెఱుంగక వృత్తిజీవికచే బ్రదుకుచుఁ దోలుసంచివలెఁ బ్రాణవాయువును భరించువాఁడు స్వార్థభ్రష్టుఁడగును మోక్షము పరమపురుషార్థమని నిర్దేశించుటచేతనే స్వర్గాదిఫలములు కర్మమూలములని తెలుపఁబడినవి. ఔషధమునందు నిచ్ఛగలుగుటకై చక్కెర లోనగువస్తువులంబోలె మోక్షమునం దిచ్ఛ గలుగఁ గర్మఫలములు చెప్పఁబడినవని యెఱుంగునది.

జన్మమాత్రముననే యాత్మ కనర్థమును గల్పించు కామములయందుఁ బ్రాణములందును స్వజనులయందును సంసక్తులగుచు స్వార్థమేదియో యని తెలిసికొనఁజాలక సంసారకూపము నందే పడి యదియే పురుషార్థమనుకొనుచుఁ దిరుగుచుండునవి వేకులను మరల నందే ప్రవేశింపుఁడని వేదములు బోధించునా? ఇది వేదతాత్పర్యమని యెఱుంగక కొందఱు కొలఁదికాలము ఫలమును గల్పించుచు మనోహరముగానున్న ఫలశ్రుతిని పరమఫలశ్రుతినిగా సమన్వయింతురు. పుష్పములు మాత్రము కలిగి ఫలముల నీయనిచెట్టువలె నాసమన్వయముండునని యెఱుంగు ..గు వేదవేత్త లట్లు పలుకరు. కాముకులై కృపణులై కావు నని వేరాశగలిగి యుండువారలవాంతరఫలమే పరమఫలమని

భావించి యగ్నిసాధ్యములగు కర్మములయందుఁ గలయభినివే
శముచేత వివేకరహితులై ధూమమార్గగతియే పరమార్థగతి
యని యూహించి యాత్మతత్త్వం బించుకే నెఱుంగరు.
ఉద్ధవా! సఖా! చీఁకటి కన్నుల నాచ్ఛాదింపఁ జెంతనున్న ద్రవ్య
మును గానని తెఱంగునఁ గర్మమే యాయుధమని యెంచిన
ప్రాణతృప్తి చేయఁగోరువారు జగత్తునకుఁ గారణమును జగదా
త్మకుఁడనగు నేను హృదయమున నివసించినను దెలిసికొనఁ
జాలరు. * దురవగాహమగుట స్పష్టముగా నుండని నామతము
నెఱుంగక విషయలంపటులై వ్యర్థముగాఁ బశువులహింసించు
వారు పరలోకమునం దాపశువులచేతనే హింసింపఁబడుదురు.
హింసపై ననురాగము కల్గినయెడల యజ్ఞకర్మమునందప్పు
వేటొకప్పు డది చేయందగదని యభ్యనుజ్ఞామాత్రమే వేద
బోధితంబని తెలిసికొనినయెడలఁ గర్మాసక్తియే కలుగదు. హిం
సయే వేడుకగాఁ గలమూఢులు తమసుఖార్థము పశువులను
హింసించి దేవయజ్ఞములను బితృభూతాధీశ్వరుల నారాధిం
తురు. అసత్యము స్వప్నోపమము శ్రుతుల కింపు నగుపరలో
కము నైహికభోగములకుం గోరువారు నావవర్తకుఁ డొకఁడు
వేరాశంగొని సముద్రమును దాఁటఁగోరి నావ పగిలిపోవఁగాఁ
బూర్వసమార్జితద్రవ్యముతోడ సాధనమును బోఁగొట్టుకొన్న
యట్లు పూర్వపుణ్యములం బోఁగొట్టుకొనుదురు.

*తే మే మతమవిజ్ఞాయ పరోక్షం విషయాత్మకాః, వృథా పశూన్
విహింసంతి హింసంతే ప్రేత్య తైస్తుతే. ౨౯. హింసాయాం యది రాగస్స్యాత్
యజ్ఞ ఏవ న చోదనా, ఇతి వేదధ్వనిం శ్రుత్వా న ప్రబుధ్యంతి కర్మసు. ౩౦.
హింసావిహారా హ్యాలబ్ధైః పశుభిస్స్వసుఖేచ్ఛయా, యజంతే దేవతా
యజ్ఞైః పితృభూతపతీన్ ఖలాః. ౩౧. అని మూలము.

రజస్సత్త్వతమోనిష్ఠులై వానినే సేవించువారు దేవేం ద్రాదుల నారాధింతురు. కాని యభేదదృష్టిచేత నన్ను నారా ధింపరు. యజ్ఞములమూలమున నింద్రాదుల నారాధించి తత్ఫల ముగా స్వర్గమున సుఖమనుభవించి దానిచివరన సద్వంశమున జన్మించి మహాసౌధాదులయందు సుఖింతుమని వాస్తవమగు వేదతాత్పర్య మెఱుంగఁజాలక చంచలచిత్తులై దురహంకారు లగువారలకు నావార్త యించుకే రుచింపదు. కర్మము, బ్రహ్మము, దేవతలను గుఱించినవిషయములు గలవేదములు బ్రహ్మాత్మప్రతిపాదనపరములే యగును. మంత్రములింద్రియాతీ తపరమాత్మబోధకములు. పరోక్షమే నాకుఁ బ్రియమైనది. పరి శుద్ధాంతఃకరణులకే యయ్యది తెలియంబడుంగాని యనధికా రుల కది యించుకయుఁ దెలియ శక్యము గాకయుండు. శబ్ద బ్రహ్మము దుర్బోధము. అందుంగూడఁ బ్రాణమయము పరాఖ్యము, మనోమయము పశ్యంత్యాఖ్యము, ఇంద్రి యమయము మధ్యమాఖ్యము. మఱియు నది యనంతపారంబు. సముద్రముతెఱంగున గంభీరము. సూక్ష్మరూపుఁడు, అపరిచ్ఛి న్నుఁడు, నిర్వికారుఁడు,అనంతశక్తియుక్తుఁ డనఁబడు నేను సర్వ భూతాంతర్యామినై యధిష్ఠింపఁదామరతూఁడులయందు దార ములవలెభూతములయందు నాదరూపముచేత మతిమంతులకు గోచరించును. సాలెపురుఁగు తనహృదయమునఁగలతంతువులను ముఖముమార్గమున వెలికిఁ ద్రోయునట్లు ప్రాణోపాధియగు హిరణ్యగర్భరూపుఁడు వేదమూర్తి, యమృతమూర్తియు నగు పరమేశ్వరుఁడు నాదోపాదానవంతుఁడై హృదయాకాశము

నుండి వర్ణములను గల్పింప సంకల్పించుమనస్సు నిమిత్తము
గాఁగా హృదయగతంబై సూక్ష్మమునగు నోంకారమునుండి
యురస్సు కంఠము లోనగుస్థానములసంగతిచేత వ్యక్తములగు
స్పర్శములనియు, స్వరములనియు, నూష్మములనియు, నంత
స్థములనియుఁ జెప్పంబడు (కకారాదివర్గములను, అచ్చులను,
శషసహలను, యరలవలను,) చు వైదికలౌకికభాషావిస్తృతిం
గాంచి యొకదానికంటె నొక్కటి యెక్కువగా నాలుగక్షరముల
వంతు మిక్కిలిగానుండు ఛందస్సులచేతఁ బరిగణింప శక్యము
గాక యనేకమార్గములుగల వైఖరి యనఁబరఁగు వాక్కును
బుట్టించి తానే దాని నుపసంహరించును. ఆఛందస్సు గాయత్రి
ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు, జగతి,
అత్యృష్టి, యతిజగతి, విరాట్టు లోనగు పేరులు గలదగును.

ఆవైఖరీ వాగ్రూపమగు వేదము కర్మకాండమున నెద్దాని
విధించు దేవతాకాండమున మంత్రవాక్యములమూలమున నే
దానిబోధించు, జ్ఞానకాండమునందు దేని ననువదించినిషేధార్థ
మును వికల్పించు నను నీవేదవాక్కులతాత్పర్యము, నుద్ధవా!
నేనుదప్ప నింకొక్కఁడెవ్వఁడునెఱుంగఁడు. కర్మకాండమునందు
వేదము యజ్ఞరూపమున నన్నే విధించును. దేవతాకాండమున
నాయాయిదేవతారూపమున నన్నే దెలుపును. జ్ఞానకాండము
నందు మొదట నాకాశాదిప్రపంచమును వికల్పించి పిదప దాని
నపవాదముచేయుచుఁ దుదకు నన్నే బోధించును సర్వంబు
నేనే యని నమ్మును. అన్య మేదియుఁ గానఁగాదు. పరమార్థ
రూపుఁడను నేనని తలంచి నన్నే యాశ్రయించి భేదము
మాయామాత్రమని దాని మానుచుఁ దుదకు సుప్రసన్న

మగును. ఇదియే సర్వవేదపరమార్థమని తెలిసికొనుము. అని బోధింప నుద్ధవుం డిట్లు ప్రశ్నించెను.

తత్త్వసంఖ్యాభేదస్వరూపము.

* బ్రహ్మాండనాయకా! మహాప్రభూ! ఋషులు తత్త్వము లెన్ని యని లెక్కించిరి? నీవు తొమ్మిది, పదునొకండు, అయిదు, మూఁడు (ఇరువదెనిమిది యని) అని తెల్పితివి, కొందఱు మునులు తత్త్వము లిరువదా ఱందురు. మఱికొంద ఱిరు వదియై దందురు. ఇంకను గొంద ఱేడందురు. మఱియుఁ గొందఱు తొమ్మిదందురు. ఒక్కకొంద ఱాఱే యందురు. మఱి యొక్క కొందఱు నాలు గందురు. పదునొకం డనియుఁ బదు ఁడనియుఁ బదునాఱనియుఁ బదుమూఁ డనియు, నిట్లు కొందఱు కొందఱు పలుకుదురు. మహానుభావు లగుఋషులు తత్త్వ ముల నిట్లు భేదములుగా గణించుట యేప్రయోజనము ను. శించియో తెలియదు ఆవిషయము నీవే నాకుఁ దెలుపుము అని ప్రశ్నింపఁగా విని శ్రీకృష్ణమూర్తి యిట్లుబదులు చెప్పెను.

†బ్రహ్మజ్ఞానసంపన్నులు చెప్పినపక్షములన్నియు యు కనుకూలములే యగును. మదీయ యగుమాయను గ్రహించి భాషించునట్టిఋషులకు దుర్ఘట మేదియుండును? నీవు ప్రశ్నించి నట్లు సంఖ్యావ్యత్యయము విరోధము గాదు. వానియన్నింటికి సమాధానము వివరింతును. చక్కఁగా నాలకింపుము. ఆవిధ మెట్టిదో తెలిపినపిదప నీ కీసంశయమే కలుగదు. పెక్కుభేద

* ఇది యిరువదిరెండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

†యుక్తం చ సంతి సర్వత్ర భాషంతే బ్రాహ్మణా యథా, మాయాం మదీయా ముద్గృహ్య వదతాం కిన్ను దుర్ఘటం. ౫. అని మూలము.

ములుగల యీవివాదమునకు నంతరంగకరణవృత్తిని మరూప
మునఁ బరిణమించి యతిక్రమింప రాకయుండు మదీయసత్త్వాది
శక్తులే హేతువని తెలిసికొనుము. వాని పరస్పరసంయోగ
విశేషంబున వివాదముల కాస్పదంబగు నీభేదము గలిగినది.
ఆభేదము వివాదము ఈ రెండును శమదమంబు లుదయింపఁగా
నుపశమించును. మరలఁ జూడఁ జూపవు ఈతత్త్వములు కార్య
ములని కారణములనియుండును కార్యతత్త్వములకుఁ గారణ
తత్త్వమునందు సూక్ష్మరూపమున ప్రవేశంబుగలుగు మృత్తి
నందు ఘటమువలె నని యెఱుంగుము కార్యతత్త్వమునందుఁ
గారణతత్త్వములనుగతత్త్వముప్రవేశించును. ఘటమునందు
మృత్తికవలెనని యెఱుంగుము. ఇట్లు కార్యకారణతత్త్వము
లకుఁబరస్పరానుప్రవేశము వక్తృవివక్షాధీనముగ బహుభేదము
లుగఁ గల్పించుటచేత నాతత్త్వములసంఖ్యలందు భేదత్వము
సిద్ధించెను. ఇట్లు ఒకతత్త్వమునందు నన్యోన్యతత్త్వము ప్రవే
శించునట్లు కల్పింపనదియుక్తమే యనవలయును. కాఁబట్టి వాది
వివక్షాధీనముగా నీతత్త్వముల కన్నింటికిఁ గార్యకారణత్వము
న్యూనాధికసంఖ్యానము యుక్తికి ననుకూలముగ నుండెను.
అదెట్లు? అందు వేని వినుము.

* జీవుఁ డనాద్యవిద్యాయుక్తుఁడు. అట్టి జీవునకుఁ దనం

---

* అనాద్యవిద్యాయుక్తస్య పురుషస్యాత్మవేదనం, స్వతో న సంభవే
దన్య స్సర్వజ్ఞో జ్ఞానదో భవేత్. ౧౧. పురుషేశ్వరయోరత్ర నవైలక్షణ్య
మస్తివై, తదన్యకల్పనాపార్థా జ్ఞానం చ ప్రకృతేర్గుణః. ౧౨. ప్రకృతిర్గుణ
సామ్యం వై ప్రకృతేర్నాత్మనో గుణాః, సత్త్వం రజస్తమ ఇతి స్థిత్యుత్పత్త్యం
తహేతవః. ౧౩. అని మూలము.

తనే యాత్మజ్ఞానము కలుగదు. కాఁబట్టి సర్వజ్ఞుఁడగు పర - శ్వరుఁడు వేఱు జీవుఁడు వేఱు. అను భేదము కల్పింపఁబడిన యెడల నిరువదాఱుతత్త్వములు గలవనుపక్షము చెల్లును. జీవేశ్వరు లిరువురును జిద్రూపులు కావున విలక్షణులు కారు. కావున వారిరువురకు భేదము గలదని కల్పించుటపార్థమని కల్పించుపక్షమున నిరువదైదుతత్త్వములు అన్నపక్షము నిలుచును. సత్త్వగుణము జ్ఞానము గావున నది ప్రకృత్యంతర్భూతము కాఁబట్టి దానిని బ్రత్యేకతత్త్వముగా గణింపఁదగదు. ప్రకృతి యనఁగా గుణసామ్యముకదా. స్థితికి నుత్పత్తికి లయమునకుఁ గారణములగు సత్త్వరజస్తమోగుణములు ప్రకృతిధర్మములే యగుంగాని యకర్తయగు నాత్మధర్మములు కావు. సత్త్వమయమగుజ్ఞానము, రజోమయంబగుకర్మము, తమోమయంబగు నజ్ఞానము నను నీమూఁడును బ్రకృతియం దంతర్భూతంబు లగును. గుణసంక్షోభమునకుఁ గారణము కాలము గావున నది యీశ్వరాంతర్భూతమగును. స్వభావము సర్వశక్తులుగల మహత్తత్త్వమునం దంతర్భూతమగును. అనియిట్లు కల్పింపందగును. ఇట్లు తత్త్వంబులు కొన్ని యితరతత్త్వములయందు నంతర్భూతంబులని తలంచి గణించినచోఁ దత్త్వసంఖ్య యల్పంబగుటయు, ప్రత్యేకముగా లెక్కించినఁ దత్త్వసంఖ్య యధికమగుటయు సమంచితమగు.

పురుషుఁడు, ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పంచభూతములు నను తొమ్మిదితత్త్వములని చెప్పంబడియెను. శ్రోత్రము, చర్మము, దృక్కు, నాసిక, నాలుక యనుజ్ఞానేంద్రియము లైదును, వాక్కు, హస్తములు, పాయు,పాదోపస్థలను

కర్మేంద్రియము లైదును, జ్ఞానకర్మేంద్రియాత్మకమగు మనస్సు నివి పదునొకండుతత్త్వము లగును. శబ్దస్పర్శరూపరసగంధము లైదును, సత్త్వరజస్తమోగుణములు మూఁడనియు నేఁ బరిగణనము చేసితిని. జ్ఞానేంద్రియములవిషయములగు శబ్దాదుల వలెఁ గర్మేంద్రియవిషయము లగుగమనవచనాదులు కర్మేంద్రియములకు ఫలంబులై వాని యంతర్భూతము లగునుగాని వేఱుతత్త్వములుగా గణింపఁబడరాదు. కార్యవికారములు పదునాఱు, మహదాదులగుకారణము లేడును, దనకు రూపములై యుండ సృష్ట్యాదియందుఁ బ్రకృతిగుణములచే సృష్టిమొదలగు నవస్థలం గాంచుచున్నది. పురుషుఁడు పరిణామవిహీనుఁడై నిమిత్తభూతుఁడై చూచుచుండును. కాఁబట్టి పరిణామవిహీనుఁ డగుపురుషుఁ డన్యుఁడు. మహదాదులు పురుషునివీక్షణముచేత నొక్కదానితో నొకటికలిసి వికారము నొందుచుఁ బ్రకృతిశక్తిచేత నండమును బుట్టించును.

పంచభూతములు జీవుఁడు ద్రష్టకు దృశ్యమునకు నాధారభూతుఁ డగుపరమాత్మయునని లెక్కించుపక్షమునఁ దత్త్వము లేడు అనుపక్షంబు వెలయును ఆసప్తతత్త్వములనుండియే దేహేంద్రియములు ప్రాణము గలుగుచున్నవి. అవి కార్యము లనంబడును. ఒక్కతత్త్వముకూడ నింకొకతత్త్వమును వదలియుండుట కానరాదు. కాఁబట్టి మహాభూతము లైదు. ఆత్మయొక్కఁడు. అని కల్పించినపక్షమునఁ దత్త్వము లాఱు అను పక్షము నిలుచును. ఆపక్షమునందు జీవాత్మపరమాత్మలకు భేదములేదు. ఆత్మ ఆత్మసంభూతములగు నాతత్త్వములచే నీజగమును బుట్టించి యందుఁ దాను బ్రవేశించును. తేజస్సు

జలము, అన్నము (భూమి) అను భూతములు మూఁడును ఆత్మ యొక్కఁడును అని కల్పించినయెడల నాలుగే తత్త్వములగును అన్నపక్షము ప్రవర్తించును. ఆపక్షమునందు వాయువునకు, నాకాశమునకుఁ దక్కిన మూఁడుభూతములలో నం. ర్భావము కల్పితము. ఆతత్త్వముల నాల్గింటినుండి యీప్రపంచము కల్గినది. ఇంద్రియములు పదియు మనస్సంయుతుఁడగు నాత్మయు నని కల్పించినయెడలఁ బదునొకండుతత్త్వము లగు నన్నపక్షము నెక్కొను. భూతము లైదు. తన్మాత్ర లైదు ఇంద్రియము లైదు మనస్సు, ఆత్మయు నని కల్పింతురేని పదునేడుతత్త్వము లన్నపక్షము పొడసూపును. ఈపక్షమునందుఁ గర్మేంద్రియముల కైదింటికి జ్ఞానేంద్రియము లైదింటియందు నంతర్భావము గలదు. మనస్సునకు నాత్మయం దంతర్భావము కలుగునట్లు కల్పించినయెడల సప్తదశతత్త్వపక్షమే షోడశతత్త్వపక్షమగును. తన్మాత్రలంగూడిన భూతములైదు. ఇంద్రియము లైదు. మనస్సు, జీవుఁడు, పరమాత్మయు నని కల్పించినచోఁ దత్త్వములు పదమూఁడగు నన్నపక్షము తలసూపును.

ఈరీతిగా మహర్షులు పలువిధములఁ దత్త్వసంఖ్య లెక్కించిరి. యుక్తియుక్తము లగుటచేత నవియన్నియు న్యాయనిబద్ధములే యగును. కావున విద్వాంసుల కేదియు నశోభనము కాదు. అని పలుక నుద్ధవుం డిట్లు ప్రశ్నించెను. మహాత్మా! ప్రకృతిపురుషుల కిరువురకు జడాజడస్వభావముచే వైలక్షణ్యమున్నను, వారి కవినాభావసంబంధము (ఒకటినివదలి యింకొక రుండకుండుట) గలుగుటంజేసి భేదము నరాకుండును. ప్రకృతియం దాత్మయు నాత్మయందుఁ బ్రకృ

తియుఁ గనంబడెడు. ఈవిషయమున నాకేదో సంశయము పర్వ తాకృతిం దోఁచుచున్నది. పుండరీకాక్షా! నీవు సర్వజ్ఞుఁడవు. నీతిశాస్త్రవేత్తలలో నిపుణుఁడవు. కావున నీనిపుణవాక్కులచే నా యీసంశయమును దొలఁగింపుము. నీయనుగ్రహము గలిగినజీవులకు జ్ఞానము గలుగును. నీమాయవలన జ్ఞానము భ్రంశమగును. నీమాయాగతిని నీవే యెఱుంగఁగలవు. కానియితరు లెఱుంగఁజాలరు. దయచే భగవంతా! నా యీసంశయములను దొలఁగింపుమా యని ప్రార్థించెను ఆప్రశ్నము నాలకించి శ్రీహరి యుద్ధవునియందుఁగల మైత్రిపెంపున నిట్లు బదులు చెప్పెను.

## ప్రకృతిపురుషవివేకము.

ఉద్ధవా! ప్రకృతియుఁ బురుషుఁడు ననుభేదము నిత్యసిద్ధము. అధిభూతములోనుగా సృజింపఁబడిన యివియన్నియు స్థూలమార్గమున నానా వికారములుగలవగు. గుణక్షోభమునఁ జేయఁబడినవని యెఱుంగుము. గుణమయంబగు నామాయ, గుణయోగముచేత నానాప్రకారముల భేదమును, భేదబుద్ధులను బొందుచున్నది. నానావికారములు గలిగియున్నను స్థూలమార్గముచేత నాధ్యాత్మాధిదైవతాధిభూతములనఁగాఁ ద్రివిధములుగ నగును. ఆధ్యాత్మమగు దృక్కు అధిభూతమగు రూపము నేత్రగోళకములఁ బ్రవేశించి యధిదైవంబగు సూరబింబమును బరస్పరాపేక్షప్రకాశముచే సిద్ధించును ఆకాశముననున్న మండలాత్మకుఁ డగుసూర్యుఁడో స్వతస్సిద్ధుండగు ఈయధ్యాత్మాదులకుఁ గారణమై యేకరూపుఁడై వీనికి వ్యతిరిక్తుఁడై యున్నయాత్మ స్వతస్సిద్ధమగుప్రకాశముచేతఁ

ప్రకాశించుచుండు. ఈరీతిగానే యితరేంద్రియాదివిషయంబు ననుసమన్వయింపందగు. అదియెట్లో వివరింపుమందువేని వినుము. *త్వక్స్పర్శవాయువులు, శ్రవణశబ్దదిక్కులు, జిహ్వారసవరుణులు, నాసాగంధాశ్వినులు, చిత్తచేతయితవ్యవాసుదేవులు, మనోమంతవ్యచంద్రులు, బుద్ధిబోద్ధవ్యబ్రహ్మలు, అహంకారాహంకర్తవ్యరుద్రులు, అని యధ్యాత్మాదుల కన్యోన్యసిద్ధి యూహింపందగును. కాలమునఁ బ్రధానమూలకమగు మహత్తత్త్వమునంగల్గి గుణక్షోభమును గావించునహంకారము వైకారికతామసరాజసభేదముచే ముత్తెఱంగులై మోహమయంగు భేదమునకుఁ గారణంబగును ఉన్నది- లేదు, అనుభేదమయమగు వివాదముకూడ నాత్మాజ్ఞానవిలసితము. అది ఉపాసమయ్యును స్వరూపభూతుఁడను నన్నెఱుంగఁజాలని బహిర్ముఖులకు నివర్తింపదు. అనిన విని యుద్ధవుఁ డిట్టు లడిగెను. జలజాక్షా! ఇట్టి బహిర్ముఖులు తమతమ కర్మములచేత నెట్లు నానాజన్మములం బొంది నశింతురు? ఆవిధ మెఱింగింపుము. ఆత్మజ్ఞానశూన్యుల కాయర్థము దురవగాహంబు. సామాన్యముగా మానవులు మాయామోహితులై దీని నెఱుంగఁజాలరు అని ప్రార్థింపఁగా శ్రీకృష్ణుఁ డిట్లు బదులుపల్కెను.

ఉద్ధవా! చక్కఁగా నాలకింపుము, కర్మమయమగు మనస్సు ఇంద్రియపంచకముంగూడి లోకంబులం గ్రమ్మరుచుండు. పరమాత్మ యవ్యయుఁడు. అట్లయ్యు నహంకారమున దాని ననుసరించును. కర్మతంత్రమగుమనము కనిన, వినిన, విష

* త్వగాద శ్రవణాదిచక్షుర్జిహ్వాదినాసాది చ చిత్తయుక్తమ్. అని మూలము.

యములం దలపోయుచు నందుఁ బోడమి పూర్వవిషయముల యందు విలీనము కాఁగా మానవునకుఁ బూర్వాపరవిషయముల యనుసంధించుజ్ఞానము చెడును. కర్మములచే నుపస్థాపితము లగు దేహములయం దత్యంతాభిమానముచేత మనస్సు పూర్వానుసంధానవిస్మృతిం గాంచును. అదియే కారణవిశేష మునఁ దదభిమానిజీవునకు మృత్యువగును. స్వప్నమనోరథము లెట్టివో యట్లే సర్వభావములచే దేహాత్మాభిమానమే జీవునకు జన్మంబని తెలియంగును స్వప్న వాంఛలయందుఁ బూర్వస్మృతి యుడిగి యప్పుడప్పుడు కలుగునట్లు భావించురీతి నిందుంగుండఁ బూర్వవిస్మృతి కలుగును మనస్సునకు నుత్తమశరీరమున నభి నివేశముచేత నాత్మయందు నాయభిమానమునం జేసి వాస్త వము కాకయున్నను నుత్తమమధ్యమాధమ భేదంబు తోఁచును. ఇట్టి యాత్మస్వప్నమునందు బహుదేహములం గల్పించి పెక్కు రూపములు గలవాఁడుగఁ దోఁచురీతిని బాహ్యవిషయముల నాభ్యంతరవిషయములను గాంచును. భూతములు ప్రతిక్షణ మున జన్మమృత్యులంబొందునుగాని కాలమత్యంత సూక్ష్మమగు టంజేసి వానిభవనము, అభవనము. వివేకశూన్యునకుం దోఁ పకయుండును.

అగ్నియందు మున్దున్న జ్వాలలు పోయి వేఱుమంటలు కలుగుటయుఁ బ్రవాహములయందుఁ బూర్వమున్న నీరుపోయి క్రొత్తనీరు వచ్చుటయుఁ దెలియబడక యుండును. అట్లే వృక్ష ములయందుఁ గాయలు ప్రతిక్షణము పక్వమగుచుండుటయుఁ గాంచఁదరము కాదు. ఈరీతి గానే సర్వభూతములయందుఁ గాల కృతములగు బాల్యాద్యవస్థలు సూక్ష్మములుగానఁ దెలియఁ

బడక యుండును. *సాదృశ్యము ననుసరించి యాదీపమే యిది యనియు నాప్రవాహజలమే యిది యనియుఁ దోఁచుచుండును. అట్లే యాపురుషుఁడే యీతండను పెక్కుశరీరములు గల మనుష్యులయందుఁ బ్రత్యభిజ్ఞభావము వివేకశూన్యులకుం గల్గుచుండును. ఆత్మకర్మమున నజ్ఞానులకు వాస్తవముగా జన్మము మరణము గలుగవు. మహాభూతతేజోరూపముచేతఁ గల్పాంతమువఱకు నుండునగ్నికి దారువుతోఁగూడికయు నెడఁబాటు నెట్లో యట్లే జీవునకు జన్మము మరణము భ్రాంతిచేఁ గల్పింపఁబడినవి. † శరీరమునకు రేతోనిషేకము, గర్భము, బాల్యము, కౌమారము, యౌవనము, మధ్యవయస్సు, ముదుసలితనము, మృత్యువు నను నీయవస్థలు తొమ్మిదియుఁ గలుగుచున్నవి. అందు బాల్యమైదేండ్లవఱకు, పదాఱువర్షముల వఱకుఁ గౌమారము, నలువదివత్సరములదనుక వయస్సు, అఱువదివత్సరముదనుక వయోమధ్యమము, పిదప జర, ఆయురంతమున మృత్యువు నని వానిపద్ధతులు, దేహము నాశ్రయించిన మనోరథమయములగు నీయవస్థలనుగుణసంయోగముచేత నొక్కండొక్కయెడ గ్రహించును. వివేకముగలవాఁడు వానిని వదలును. వీనిని గ్రహించుట వదలుట యనునవికనఁబడవుకాని తనకుఁగల్గుజననమును, దనపుత్త్రునిజన్మమును బట్టియుఁ

* సోఽయం దీపోఽర్చిషాం యద్వత్స్రోతసాం తదిదం జలం, సోఽయం పుమానితినృణాంమృషాగీర్ధీర్మృషాయుషాం. ४౬. మృషా యంఃషాప్ మృషా వ్యర్థమేవాయుర్యేషాం తేషామవివేకినాం భవతి. అనివాఖ్యా. †నిషేకగర్భజన్మాని బాల్యకౌమారయౌవనమ్, వయోమధ్యం జరామృత్యురిత్యవస్థార్నవ. ४౭. అని మూలము.

దనచావునుదండ్రిమరణమునుబట్టియుననుమానప్రమాణమును
దెలిసికొనవలయును. కాని తనజన్మమృతులను ఆసమయమునఁ
దానుమోహగ్రస్తుఁడై యుండుటఁ గనుఁగొనఁజాలఁడు. దేహ
మునకుంగల్గు నీయవస్థలం గాంచు సాక్షిమాత్రము తా
నుత్పత్తివినాశములఁ బొందఁడు. బీజమునఁ బుట్టుకయు ఫలపా
కమున వినాశము నోషధులకుం గల్గుచుండఁ జూచుపురుషుఁ
డాయోషధులకు విలక్షణుఁ డైనట్లు శరీరజన్మమరణములం
గాంచి సాక్షియగునాత్మ శరీరవిలక్షణుండే యగును. ఈరీ
తినే ప్రకృతికంటెఁ దాను వేఱని వివేకములేనిమూర్ఖుఁడు
విషయములు సత్యములని భ్రాంతిఁబొంది సంసారమును బొంది
సత్త్వమున దేవర్షిజన్మమును, రజోగుణమునసురమానవజన్మ
మును దమోగుణమునఁ దిర్యగ్జన్మంబును గాంచి కర్మములందుఁ
దిరుగుచుండును. ఆటపాటలం గావించువారింజూచి వాని
ననుసరించునట్లు అనీహుఁడయ్యు, నాత్మబుద్ధిగుణములం గనుం
గొని యవశుఁడై వాని ననుకరించునని యెఱుంగవలయును.
నీరు కదలినయెడల నొడ్డుననుండుచెట్లు కదలునట్లు, కన్నులు
తిరిగినచో భూమి తిరుగునట్లును దోఁచుచుండును. అట్లే మనః
కల్పితములగుగుణములు సత్యములు గావు. మనోరథములచేఁ
గల్పింపఁబడినవిషయములును స్వప్నమునఁ గాంచినవిషయముల
వలె నాత్మునకు విషయానుభవసంసారము మిథ్య యగును
విషయములనే చింతించుచుండినయెడల నొకప్రయోజనము
లేకున్నను స్వప్నమునం దనర్థాగమ మెట్లో యట్లే యాత్మకు
సంసారనివృత్తి కలుగదు. అనఁగా స్వప్నము సాగుచుండఁగా.

నందుఁ బొడసూపు దేశాంతరగమన శిరోనికృంతనాదులగు ర్థము లెన్నియో నివర్తింపక యనుసరించుచునే యుండు భావము. కాఁబట్టి యుద్ధవా! భేదమునఁ గల్పింపఁబడినభ్రాంయెల్ల నాత్మాజ్ఞానప్రతీతంబని యరసిన యసదింద్రియములవిష యానుభవమునకుఁ బూనవలదు. దుర్వృత్తు లాక్షేపించినను, అవమానించినను, అసూయపడినను, గొట్టినను, అడ్డగించినను, వృత్తినిరోధం బొనర్చినను, ఉమిసినను, మూత్రమువదలినను, బరిభవించినను, ఇట్లే యెన్నియో యపకృతులం గావించినను దుదకు నీపరమేశ్వరనిష్ఠకుఁ బ్రచ్యుతిం గల్గింపఁబూనిన *సకలకష్టములనొందియు శ్రేయస్సునుగోరువాఁడువాని నన్నింటికి నోర్చుకొని తన్నుఁదానే యుద్ధరించుకొనవలయును.

అని శ్రీకృష్ణుం డుపదేశింపఁగా నుద్ధవుఁడు వక్తలలో మేటివగునో పరమేశ్వరా! స్వభావ మన్నింటిలో బలవత్తముకదా. కావున దుర్జనులు చేయుపరిభవము భాగవతధర్మనిష్ఠులగుచు నీపాదారవిందముల నాశ్రయించి కృతకృత్యులశాంతాత్ములకుఁదప్ప నితరులు విద్వాంసులైనను సహింపఁజాలరని నమ్మెదను. ఈవిషయము నావంటి మూఢుల కెట్లు తెలియఁదరమో యట్లు వివరింపుము. అని ప్రశ్నింపఁగా భగవంతుఁడాతనిప్రశ్నరీతికి సంతోషించి శంకలు తీర్ప నెంచి యిట్లు బదులు చెప్పెను.

---

* శ్రేయస్కామః కృపణగత ఆత్మనాత్మాన ముద్ధరేత్. అని మూలము.

భిక్షుగీత హరి యుద్ధవున కుపదేశించుట.

* ఉద్ధవా! బృహస్పతికి శిష్యుఁడవుకదా. కావుననే చక్కఁగాఁ బ్రశ్నించితివి సంశయములడంగ సమాధానమును దెల్పెద. ఆలకింపుము. దుర్మార్గులు పలుకుతులువమాటలకు నెవనిమనస్సు కలంగునో యామనస్సునకు సమాధానము గల్గఁజేయుసాధు వీలోకమున లేఁడని నమ్ముము. నీచులదురుక్తులు మర్మముల బాధించునట్లు తీవ్రబాణములుకూడ బాధింపనేరవని నమ్ముము. దుష్టులచే నవమానింపఁబడి స్వకీయకర్మవిపాకమును ధైర్యమునం దలంచుకొని యొక్కభిక్షువు చెప్పినపిహితము కలదు అది భిక్షుగీత యనంబడు. ఆయితిహాసము నీవిషయమున కుదాహరణంబనందగు. దాని బోధించెదను. సమాహితచిత్తమున నవధరింపుము.

అవంతి యనుదేశమునందు మిక్కిలి ద్రవ్యముగలబ్రాహ్మణుఁడు గలఁడు. ఆతఁడు కృషివాణిజ్యము లోనగువృత్తులచే జీవింపఁగోరి చేయుచు వానిచే దారపుత్రదేవప్రభృతులఁ బీడించుచుఁ †కదర్యుఁడై పరమలోభియై మహాకాముఁడై కోపముగలవాఁడై జ్ఞాతుల నతిథులను వాక్కుచేనైన నాదరింపక ధర్మమే యెఱుంగనియింట నేభోగములులేక తన్నునుంగూడ సేవింపకయుండెను. దుశ్శీలుఁడై సర్వజనబాధకుఁడై యుండునాతని విషయమున నాగ్రహించి భార్యాపుత్రపుత్రికాభృత్యబాంధవు లెవ్వరుంగూడ వానికిం బ్రియంబుచేయకయుఁ

*ఇది యిరువదిమూఁడవ యధ్యాయము ననుసరించి వ్రాయఁబడినది.

† ఆత్మానం ధర్మకృత్యం చ పుత్రదారాంశ్చ పీడయన్, దేవతాఽతిథిభృత్యాంశ్చ స కదర్య ఇతి స్మృతః, అని స్మృతి.

గోరకయు నుండిరి. వానిధనములు నిరుపయోగములుగా రక్షిం
పఁబడుచుండెనేకాని యెవ్వరికి నుపయోగింపఁబడినవి కావ
య్యెను. కావున వాఁ డుభయలోకములకు భ్రష్టుఁడయ్యెను.
అట్టులగుటంజేసి దేవతలు, ఋషులు, పితరులు, భూతములు,
మానవులు నను పంచమహాయజ్ఞదేవత లాగ్రహించిరి. వారి
యలుకకుం గారణము వారియజ్ఞభాగములు చేరకపోవుటయే
కదా. వా రాగ్రహించినందున వానిపుణ్యముధ్వంసమయ్యెను.
ఆతఁడు బహువిధకష్టములపాలై యార్జించిన యాద్రవ
మంతయు నతివేగముగా నశించెను. అందుఁ గొంతమాత్రము
జ్ఞాతులచే నపహృతమయ్యెను. దొంగలు కొంత గ్రహించిరి.
దైవము కాలము కొంత హరించెను. మిగిలినదంతయు మ
కొందఱకు రాజునకుం జిక్కెను. ఈవిధముగా ధనమెల్లం బోవు
టయు ధర్మకామములు లేకుండుటయు జనులెల్ల నుపేక్షించు
టయుఁ గారణములుగా నాతఁడు నిరంతరచింతాక్రాంతుఁడై
కన్నులనుండి ధారలుగా బాష్పకణములు ప్రవహింప గద్గద
కంఠుఁడై విలపించెను. కొంతకాలమున కాయవస్థయం దాతనికి
దైవవశమున విరక్తి పొడమెను. దాన నాతఁ డిట్లు పలికెను.

* అయ్యో! నిరర్థకముగా నే నాత్మకుఁ దాపంబును

* న చాహోదమహో కష్టం వృథాత్మామేనుతాపితః, న ధర్మాయ న కామాయ యస్యార్థాయాస ఈదృశః. ౧౪. ప్రాయేణార్థః కదర్యాణాం సుఖాయ కదాచన, ఇహ చాత్మోపతాపాయ మృతస్యనరకాయచ. ౧౫. యశో యశస్వినాం శుద్ధం శ్లాఘ్యాయే గుణినాంగుణాః, లోభస్స్వల్పోఽపి తాన్ హంతి శ్విత్రం రూపమివేప్సితం. ౧౬. అర్థస్య సాధనే సిద్ధఉత్కర్షే రక్షణేవ్యయే, నాశోపభోగఆయాస స్త్రాసశ్చింతా భ్రమోనృణాం. ౧౭.

దెచ్చుకొంటిని. ఇన్నిపాట్లు సంపాదించిన ద్రవ్యమువలనఁ గల్గిన యాయాసము నాకు ధర్మమునకుఁగాని కామమునకుఁగాని కాక చెడినది సాధారణముగాఁ బరులఁ బీడించువారి ద్రవ్యము సుఖముకొఱకుఁగాదు. మఱి యీలోకమున నాత్మకుఁ దాపంబుగల్పించుటకును, బరమందుఁ బాపానుభవమునకు నది యగును. శ్లాఘ్యము లైనగుణములుగల సాధువులయశస్సు పరిశుద్ధమైనది. లోభము కొంచెమున్న నయ్యది కుష్ఠురోగము రూపము నడంచునట్లు నిర్మలగుణంబులనెల్లఁ జెఱచును. అర్థమార్జించునపుడును, ఆర్జించినదానిరక్షించునపుడును, ఆయాసమును గల్పించును.వ్యయించునపుడు భయమును బుట్టించును. నశించునపుడు చింత గల్గించును. అనుభవించునపుడు భ్రమమును బుట్టించును. దొంగతనము, హింస, అనృతము, దంభము, కామము, క్రోధము, స్మయము, మదము, భేదము, విరోధము, అవిశ్వాసము, స్పర్థ, స్త్రీ, జూదము, మద్యవ్యసనములు నను నీపదునైదు అనర్థంబులు ద్రవ్యవిషయముననే మానవులకుఁ బొసంగు. కావునఅర్థమనుపేరుగలయనర్థము శ్రేయస్కాముఁడగువాఁడు దూరముగనుండ బాఱఁదోలవలయును సోదరులు, దారలు, జననీజనకులు, మిత్రులు స్నేహముచేత నొక్కటియే ప్రాణముగ నుండువారలైనను అత్యల్పద్రవ్యమాత్రమునఁ బగవారగుదురు. అల్పద్రవ్యమునకై స్పర్థలు గలిగించు

స్తేయం హింసానృతం దంభః కామః క్రోధ స్స్మయోమదః, భేదో వైరమవిశ్వాస స్సంస్పర్థావ్యసనాని చ. ౧౮. ఏతే పంచదశానర్థా హ్యర్థమూలా మతా నృణాం, తస్మా దనర్థమర్థాఖ్యం శ్రేయోర్థీ దూరత స్త్యజేత్. ౧౯.
అని మూలము.

కాని సౌహార్దమును బోఁగొట్టుకొని కోపప్రయత్నములచేతఁ ప్రాణములనైన వదలుదురు. మానవదేహమును దేవతలుకూడఁ గోరుదురు. అట్టి జన్మమునందుంగూడ విశేషించి దుర్లభమగు బ్రాహ్మణజన్మ మెత్తియు దానినైన బహూకరింపక స్వప్రయోజనమును బోఁగొట్టుకొనుమానవులు నరకకూపమునం బడుదురు. స్వర్గమునకు నపవర్గమునకును ద్వారమగు నీమానవలోకమునందుఁ బుట్టియు నెవ్వఁడు సర్వాపదలకు మూలమగుధనమున నాసక్తుండగును? దేవర్షి పితృదేవతలకు, భూతములకు, జ్ఞాతులకు, బాంధవులకు, నాత్మకుఁ బంచిపెట్టక యక్షులరీతిని ద్రవ్యమును సేకరించి యొకచో జేర్చువాఁ డధఃపతితుం డగును.

వివేకులకు ముక్తిసాధనములగు ధనవయస్సులు బలంబును నిష్ఫలమగు ధనకాంక్షచేతఁ బ్రమత్తుఁడనగు నాకుం జెల్లెను జరాభాగముగల నేనిత్తఱి నేమి సాధింపఁగలను? నిరర్థకమగు ద్రవ్యవాంఛచేతఁ బండితునకుంగూడ సర్వకాలము క్లేశముకలుగఁగా నెవ్వనిదో మాయ యొండుండవలయు. ఇది నిక్కము. ఆమాయచేతనే యీ లోకము మోహమొందుచున్నది. మృత్యువునకుం జిక్కినట్టివానికి ధనములుగాని, ధనదాతలుగాని, కామములుగాని, కామప్రదాతలుగాని, జన్మమును గల్గించుకర్మములుగాని నే యుపకారము చేయఁగలుగును? సర్వదేవతామయుఁడగు శ్రీమన్నారాయణుఁడు నిశ్చయముగా నాయందుఁ గరుణగలవాఁ డయ్యెడు. కావుననే యాత్మ సంతరణమగు నీనిర్వేదంబు నాకుంబొడచూపె. నే నింకఁ గాలమించుకంతయేని మిగిలియుండు నేని

అఖిలధర్మముల నాచరించువిషయమున నేమఱక యాత్మ
తుష్టిం బొంది యవశిష్టకాలమున దేహమును శోషింపఁజేసె
దను. లోకత్రయాధిపతులందఱు నాయందు దయగలవార
లగుదురు. పూర్వము ముహూర్తకాలముననే ఖట్వాంగమహా
రాజు బ్రహ్మపదమును బొందెనని పెద్దలు పలుకఁగా విన్నవాఁ
డను. అని తనమనంబునఁ జింతించి యాయవంతిదేశబ్రాహ్మ
ణుఁడు అహంకారాదులఁ బరిత్యజించి శాంతమూని మనన
శీలుఁడై భిక్షువై యింద్రియప్రాణముల జయించి భూమి నంత
టను దిరుగుచు సర్వసంగముల వదలి భిక్షార్థము నగరములకు
గ్రామములకుఁ బల్లియలకు సిగ్గువదలి ప్రవేశించుచుం
డెను. ఇట్లు వచ్చిన యావృద్ధభిక్షునిం బొడఁగాంచి దుర్జ
నులు దర్పాతిరేకమునఁ బెక్కురీతుల నవమతిం గల్పిం
చిరి. అందుఁ గొందఱు దండమును దీసికొనిరి. కొందఱు
కమండలువును హరించిరి. కొంద ఱాసనమును లాగికొనిరి.
కొందఱు జపమాలిక నీకేలరా యని హరించిరి. మఱికొందఱు
బొంతను గుడ్డ నూడఁబీకిరి. కొంద ఱాతనికిఁ దమరు తీసి
కొన్నవానిని మరల నిచ్చునట్లు చూపి మరల దీసికొనిరి.
నదీతీరమున భిక్షాన్నము దినుచుండఁగాఁ బాపబుద్ధు లగు
కొంద ఱాభిక్షుకుని శిరస్సున నుమిసియు మూత్రంబుఁబోసియు
నవమానించిరి. మౌనమున నాభిక్షుకుఁడు పలుకకుండెను.
కొందఱు పలుకరించిరి. అంతకును మాటలాడకపోవఁగాఁ
గొందఱు ప్రహరించిరి. వీఁడు దొంగయని కొందఱు విదళింప
సాగిరి కొందఱు వీనిం గట్టివేయుఁడని పలుకఁ గొందఱు కట్టి
వేయుదురు. ధర్మధ్వజుఁడు (ధర్మము చిహ్నముగాఁగలవాఁడు)

లగుదేవమనుష్యతిర్యగ్జన్మసంసారములు గలుగును. సంకల్ప-
ల్పాత్మకంబైనమనస్సుతోఁడ నియంతృత్వమున వర్తించియు
జీవసఖుండగుపరమాత్మ విద్యాశక్తులు ప్రధానములుగఁ గ
వాఁడుకనుకతిరోహితముకాని జ్ఞానముచేత సాక్షియై యుండు
ను. ఇఁక జీవుఁడో తనయందు సంసారమును గల్పించుమనసు-
నాత్మభావమున గ్రహించి తద్గుణసంగముచేతఁ గామముల నను
భవించిబద్ధుండే యగును. దానము, నిత్యనైమిత్తికమగు స్వ
ర్మము, నియమము, యమము, వేదపాఠము, సకలకర్మములు
వ్రతములు లోనగువాని కన్నింటికి మనోనిగ్రహమే ఫలము
కానివేఱొండు కాదు. మనోనిగ్రహమే యుత్తమయోగమగు
ఎవ్వానిమానసికము సమాహితమగుచు శాంతియుతమగున
యాతనికి దానాదులచే నగుకార్య మేది? ఎవ్వానిమనస్సు
నిగ్రహము గాంచక చెడునో యతనికి దానాదులవలన నేమి
లాభము గలదు? దేవతలు మనోవశులే మనస్సు ఎవ్వానికిని
గాని వశముకాదు. యోగులకుంగూడ మనస్సు భయము గ
గించునంతదియే. కావున బలవంతులలో నదియే బలవంతమ
గును. ఎవ్వఁ డట్టి బలవంతమగుమనస్సును వశపఱచుకొనునో
వాఁడు దేవదేవుఁడే యనంబడును. మర్మావయవముల నొంచు
చు జయింపఁ దరముకాని యాపరానివేగముగల శత్రువం
టిదై స్వేచ్ఛఁగాఁ దిరుగుమనస్సు నిగ్రహింపఁజాలక కొందఱు
మానవులతోఁడ నిరర్థకమగు వైరముఁ బెట్టుకొని యందుఁ
గొందఱు మిత్రులని, శత్రువులని, యుదాసీనులని యేర్పఱ
చుకొని మిక్కిలి యజ్ఞులగుచున్నారు. మనోమాత్రకల్పితమగు
హాముందు మమత్వము అహంకారము ననువానిని బెట్టి

మూఢబుద్ధులై నేనని, పరుఁడని భ్రాంతిచేత దుష్పారంబగు సంసారమునందుఁ బరిభ్రమింతురు. నరులు సుఖదుఃఖహేతువు లగుదురన్నచో నాదుఃఖము పార్థివములగు దేహములకేకాక యాత్మకు దాన నేమగును? తననాలుకను దానే కొఱికికొని దుఃఖముకలుగఁగా నపుడు ఎవ్వానిపై నాగ్రహింపవలయును? దుఃఖమునకు దేవత కారణమన్నయెడల నాదుఃఖము వికారములకేకాక యాత్మకు వానిచే నేమగును? తనయవయవములలో నొకదాని నొకటి బాధించునేని వాని కన్యుఁడగుపురుషుఁ డెవ్వానిపై నలుకఁ బూనందగును? ఆత్మయే సుఖదుఃఖములకుం గారణమగునన్నచో నది నిజస్వభావంబే కాన నితరుల మాట తలంపనేల? ఆత్మభిన్నము మిథ్యయేగాన సుఖదుఃఖనిమిత్తము లేకపోవుటంజేసి యెవ్వానిపైఁ గ్రుధ గ్రుమ్మరింపందగును? దుష్టస్థానములందున్న గ్రహములే సుఖదుఃఖహేతువులని కల్పించినయెడల జన్మమున కాశ్రయంబగు దేహమునకేకాక యది జన్మమే లేని యాత్మ కెట్లు కలుగును? ఆకాశభాగమున నుండు గ్రహములు పాదదృష్టి, అర్ధదృష్టి, త్రిపాదదృష్టి, పూర్ణదృష్టి, యనుభేదములచే గ్రహములనే బాధించునని జ్యోతిశ్శాస్త్రవేత్తలు నిర్ణయింతురు. ఆగ్రహములకు దేహమునకును వేఱగువాఁ డిందెవ్వానిపైనఁ గోపమునందగును? ఇవన్నియుఁ గాఁజాలవు. కర్మమే సుఖదుఃఖములకుఁ గారణమన్నపక్షమున నట్లగునేని యది యొకవస్తువునకు జడత్వమో యజడత్వమో కలిగినయెడలం దగియుండును. దాన నాత్మకేమి? శరీరము జడమగు. కావున నాశరీరమునకుఁ బ్రవృత్తి కలుగదు ఆత్మ నిర్వికారుఁడు పరిశుద్ధజ్ఞానస్వరూపుఁడు కాఁబట్టి సుఖదుఃఖ

ముల నాపరమాత్మ స్పృశింపఁడు. సుఖదుఃఖమూల మనందగిన కర్మము కలుగదు. ఇందెవ్వనిపై నలుకఁ బూనందగును? ఇఁకఁ గాలమే సుఖదుఃఖములకు హేతువనికల్పింపరాదా యన్నచో దాన నాత్మకేమి? ఆత్మయే కాలాత్ముఁడు. అగ్నికిఁ దనయంశమగు మంటవలనిబాధయు, మంచునకుఁ దనశైత్యమువలని శ్రమము కలుగదుకదా. అట్లే పరమాత్మకుఁ దనయంశమగు కాలమువలని బాధ కలుగనే కలుగదు. అంతియగాక యాపరమాత్మను సుఖదుఃఖాదికములగు ద్వంద్వములు బాధింపఁజాలవు. ఇందెవ్వనిపై నిందమోపవచ్చును? సంసారమును బ్రకటించు నహంకారమునకుంబోలెఁ బరులకుం బరుండగు నాపరమేశ్వరున కొక్క కాలమందుంగూడ నొక్క దానిచేతంగూడ ద్వంద్వపీడ కలుగదు. ఈవిషయమును జక్కఁగాఁ దెలిసినయాతఁడు భూతములకు భయంపడక యుండును. శ్రీగోవిందచరణారవిందములను సేవించి నేను బూర్వులగు మహామునులు గ్రహించిన యీపరమేశ్వరనిష్ఠనే యాశ్రయించి దుష్పారంబగు నీసంసారమహాసాగరమును దాఁటుదును. అని యీరీతిగా ద్రవ్యనాశముచేత విరక్తుఁడైన యాభిక్షుకుఁడు పుడమియెల్లం దిరుగుచు నీచులు తన్నెంతగా నెన్నివిధములుగాఁ బీడించినను మనస్సునం దాయాసపడక స్వధర్మమందే నిష్ఠగలిగి యీగీతములను బలికెను. ఆత్మవిభ్రాంతితప్ప వేఱొక్కటియు మానవునకు సుఖదుఃఖముల నీయఁజాలునది లేదు. శత్రుమిత్రోదాసీనకల్పనాత్మకమగు సంసారమంతయు నజ్ఞానకృతంబుకానిచేటుకాదు. కాఁబట్టి యుద్ధవా! నాయందే మనస్సునునిచి చాంచల్యమును నిరోధింపుము. ఇదియే యోగసారము.

భిక్షుగీతంబగు నీబ్రహ్మనిష్ఠను మానవుఁ డెవ్వఁడు సమాహి
తుఁడై మనస్సున నిలిపియుఁ బఠించియు వినియు ద్వంద్వముల
వలనికష్టములఁ గాంచును? ఎవ్వానికే నాబాధ లుండవని
నమ్ముము. అని తెలిపి జలజలోచనుఁడు మఱియు ని ట్లనియె.

### శ్రీహరి యుద్ధవునకు సాంఖ్యమును దెల్పుట.

* సఖా! ఉద్ధవా! కపిలాదులగు పూర్వమహర్షులు నిర్ణ
యించినసాంఖ్యము నీకు నుపదేశింతును. దాన నీసంశయములు
కొన్ని తొలంగును. అంతియగాక దానిని జక్కఁగా నెఱింగిన
యెడలఁ బురుషుఁడు భేదము హేతువుగాఁగల సుఖదుఃఖాది
రూపమగు భ్రాంతిని వదలును కావున సాంఖ్యము బహూత్త
మమైనది. దాని జక్క మది నిల్పుము. ప్రళయకాలమునందు
వికల్పశూన్యమగు పరబ్రహ్మమునందే దృశ్యప్రపంచమెల్ల విలీ
నంబయి యుండును. ఆదియందుఁ గృతయుగంబున వివేకసంప
న్నులగు మానవులకు భేదజ్ఞానములేదు. కాన వారికి బ్రహ్మై
కత్వమే కలిగియుండెను. అత్తఱి నాబ్రహ్మము వాక్కునకు
మనస్సునకు గోచరంబగునట్లు మాయాయోగమున ద్వివిధ
ముగా నయ్యెను. అందొక్కరుఁడు కార్యకారణాత్మకప్రకృ
తిగా నయ్యెను. రెండవది అన్యతమాభావజ్ఞానరూపుఁ డగు
పురుషుఁడుగా నయ్యెను. ఉద్ధవా! నే నాతరుణమున సంక్షో
భింపఁ జేయఁగాఁ బురుషు ననుమతిచేత నాప్రకృతివలన సత్త్వర
జస్తమస్సులను మూఁడుగుణములు పొడసూపెను ఆగుణత్ర
యమువలన క్రియాశక్తి జ్ఞానశక్తులు ప్రధానముగాఁగల మహా
త్తత్త్వ ముదయించెను. దానివలన జీవునకు భ్రాంతి గలిగింప

* ఇది యిరువదినాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

హేతువగుచువైకారికమని తైజసమని తామసమని భేదత్రయ
మున మువ్విధములగు నహంకారము కలిగెను. ఆయహం
కారమేతన్మాత్రములకు. ఇంద్రియములకు,మనస్సునకు, మఱియు
నింద్రియముల కధిష్ఠాత లగు దేవతలకుంగూడ హేతువై చిద
చిన్మయంబై యుండును. తన్మాత్రములునిమిత్తములుగాఁగఁదామ
సాహంకారముచేఁ బంచమహాభూతము లుదయించెను. తైజ
సాఖ్యంబగు రాజసాహంకారముచేత నింద్రియము లుద్భవిల్లె.
వైకారికాఖ్యంబైన సాత్త్వికాహంకారమున మనస్సును, పదు
నొకండింద్రియముల కధిష్ఠాతృదేవతలును బుట్టిరి. మహాదా
దులునా ప్రేరణముచేత నొకదానితో నొకటి కలిసికొనివై రాజ
రూపుఁడ నగు నాకు నివాసంబగునండంబును గలిగించెను

ఉదకమునందున్న యాయండమునందు నే నుద్ధవా!
లీలావిగ్రహమున నారాయణుండనై యుండితిని. విశ్వకారణ
భూతంబై నానాభియందుఁగలిగినపద్మమునందు నలుమోములు
గలబ్రహ్మ పుట్టెను. ఆపద్మజుఁడు తపస్సొనరించి నాయనుగ్రహ
మునకుం బాత్రుఁడై రజోగుణప్రధానుఁడై సకలలోకములను
పాలకులతోడఁ బుట్టించెను. అందు దేవతలకు స్వర్గలోకము,
భూతములకు నంతరిక్ష మనుపేరుగల భువర్లోకము, మానవులు
లోనగు వారికి భూలోకమును, సిద్ధులను దేవతాంతర్భూతు
లకు మహర్లోకము, అసురులకుభుజంగములకు నతలవితలములు
మొదలుగాఁగలయధోలోకములు నివసింప నర్హములయ్యెను.
త్రిగుణాత్మకములగు కర్మములకు స్వర్గమర్త్యపాతాళములే
గమ్యములని యెఱుంగవలయు. యోగము తపస్సు సన్న్యా
స నమునవి కలవారలకు స్వచ్ఛములగు మహర్జనస్తపస్సత్య

లోకములు గమ్యములగు. భక్తియోగము నభ్యసించు వానికి వైకుంఠము శరణము. నాదగు కాలశక్తిచేతఁ గర్మఫల ప్రదుఁడైన పరమేశ్వరుఁడు నిమిత్తముకాఁగా సత్యలోకము దనుక నుండు నుత్తమలోకములను స్థావరాంతములగు నీచ గతులను మానవులు పొందుదురు. అణువు, బృహత్తు, కృశము, స్థూలము నగుభావములన్నియుం బ్రకృతిపురుషోభయవ్యాప్తం బులేకాని వేఱుగావు. దేని కేది మొదలు తుదియు నగునో యదియే మధ్యంబునగు. ఆదియందు నంత్యమునందు సువర్ణ మని మృత్తికయని వ్యవహారమున్నను మధ్యదశయందుఁ గుండ లాదులని ఘటాదులని వ్యవహారము కలుగునట్లు, ఆద్యంతా వస్థలయందు బ్రహ్మస్వరూపమే యున్నప్పటికి మధ్యావస్థ యందు వికారస్వభావముగల జగత్తు వ్యవహారమాత్రముఁ గలిగెను. దీని నుపాదానకారణముగాఁ గైకొని కారణమగు మహదాదిభావము కార్యమైన యహంకారాదిభావమును బుట్టించును. అందాకారణమే యథార్థము. ఎద్ది యాద్యంత ములు తానే యగునో యయ్యదియే సత్యంబగును. ఈజగ త్తున కుపాదానమని ప్రఖ్యాతంబగు ప్రకృతియు, దాని కధి ష్ఠాతయగు పురుషుఁడును, గుణములసంక్షోభముచేత నభివ్యం జకమగుకాలమును ఈమూఁడును బ్రహ్మస్వరూపుఁడ నగు నేనే యగుదును.

పరమాత్మ నగు నాదృష్టిగలుగునంతకు స్థితికంతమగు దనుక జీవభోగార్థంబగు విస్తారప్రపంచము జనకసుతాదిరూప మున విచ్ఛిన్నములేక ప్రవర్తించును. కాలాత్మకుఁడ నగు నేను వ్యాపింపఁగా లోకకల్పవికల్పకంబగు బ్రహ్మాండమెల్లఁ

బంచత్వరూపమగు సర్గమును విభాగార్థమున సమర్థమగున
దేహము దనకు వృద్ధింగూర్చు నన్నమునందు లయించును
ఆయన్నము, బీజమందు లయించును. ఆబీజము భూమియందు
లయించును. భూమి గంధమునందును, గంధము జలమందును
జలము రసమందును, రసము తేజస్సునందును, తేజస్సు
రూపమునందును, రూపము వాయువు నందును, వాయువు
స్పర్శమునందును, స్పర్శ మాకాశమునందును, ఆయాకాశము
శబ్దతన్మాత్రమందును, శబ్దము తామసాహంకారమందును వరు
సగా లయించును. ఇంద్రియము లాత్మకారణమందు లయిం
చును. మనస్సునకు నింద్రియాధిష్ఠాతృదేవతలకు సాత్త్వికా
హంకారమునందే లయము గలుగును. అహంకారము మహా
త్తత్త్వంబున విలీనంబగు. ఆమహత్తత్త్వము గుణములయం
దును, గుణములు ప్రకృతియందును, బ్రకృతి యవ్యయంబగు
కాలమందును లయించు. ఆకాలము మాయాప్రవర్తకుఁడగు
పరమపురుషునందును, ఆపురుషుఁ డాత్మయందునులయించును.
ఆత్మ విశ్వము నుత్పత్తికి లయమునకు నధిష్ఠానంబై యవధియై
నిరుపాధికుఁడై యుండును. కాఁబట్టి యాత్మనిష్ఠుండే యగును.
దానికివేఱు లేదు గనుక వేఱొకదానియందు లయమొందఁడు.
ఈప్రకారము విమర్శించువాని మనస్సునందు భేదనిమిత్త
భ్రాంతి యెట్లు పొడసూపును. ఒకప్పుడు కారణాంతరమునఁ
గలిగినట్లైన సూర్యుఁ డుదయింపఁ జీఁకటిపోలెఁ దొలఁగుఁ
గాని క్షణమైన నిలువదు. పరాపరదర్శనుండ నగు నేను బ్ర
లోమానులోమప్రకారములచేత సంశయగ్రంథిభేదనంబైన

యీసాంఖ్యవిధానము బోధించితిని దీనిం జక్కఁగా మదినిలు పుము. కృతకృత్యుండ వయ్యెదవు.

## గుణవృత్తిభేదములు.

* పూరుషవరా! ఉద్ధవా! పురుషుఁడు గుణవిభాగము నందు దేన నెట్టివాఁడగునో యాప్రకారము చెప్పెదను చక్కఁగా నాలకింపుము. శమము, దమము, తితిక్ష, వివేకము, తపము, సత్యము, దయ, స్మృతి, తుష్టి, త్యాగము, అస్పృహ, శ్రద్ధ, హ్రీ, దానము, ఆర్జవము, వినయము మున్నగునవి సత్త్వవృత్తులు కామము, వ్యాపారము, మదము, తృష్ణ, స్తంభము, ధనాశతోఁజేయు దేవతాప్రార్థనము, భేదబుద్ధి, విషయభోగము,ఉత్సాహము, స్తోత్రప్రియత్వము, హాస్యము, ప్రభావప్రకటనము, బలోద్యమము అనునివి రజోగుణవ్యా పారములు క్రోధము, లోభము, అనృతము, హింస, యాచించుట, దంభము, కలహము, శ్రమము, శోకము, మోహము, విషాదము, ఆర్తి, నిద్ర, ఆశ, భయము, జడత్వము అనునవి తమోగుణ వ్యాపారములు. త్రిగుణములకు సంబంధించిన వృత్తులు ప్రత్యేకముగా సాధారణపద్ధతిని జెప్పఁబడినవి. ఇంక గుణము లొకదానితో నింకొకటి కసినపుడు కలుగువానిం జెప్పెద. ఉద్ధవా! కడునియమమున వీని నాలకింపవలయుఁ జుమీ! నేను. ఇది నాది. అనువ్యవహారము మనోమాత్రేంద్రియప్రాణజన్యము. కాన గుణత్రయసంయోగమున నది కలిగినది. ధర్మార్థకామములయందు నిష్ఠయు శ్రద్ధారతిధనములను గలిగించును. కానవేగుణసంయోగమునఁ బుట్టినదనవలయును.

* ఇది యిరువదియేనవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

ప్రవృత్తికి లక్షణమగు కామ్యధర్మమునందును, నిత్యనైమిత్తిక ధర్మములందును నిష్ఠగలుగుపక్షమున నదియుంగూడఁ ద్రిగుణమయమే యగుట గుణసన్నిపాతమునుండి కలిగినదే యగును. శమాదులుగలవానిని సాత్త్వికుఁడనియుఁ గామాదులుగల వానిని రాజసుండనియుఁ గ్రోధాదులుగలవానిని దామసుండనియు నూహింతురు. అది న్యాయమే. ఫలాభిసంధి మాని స్వకర్మములచేత నన్ను నిష్ఠతో నారాధించుపురుషుఁడైనను గాంతయైనను సత్త్వవృత్తిగలవారినిగాఁ దలంపవలయును.

ఫలాభిసంధిగలిగి నన్ను స్వకర్మములప్రకార మారాధించువారు రాజసులనియే భావింపవలయు. పరహింసకొఱకు నన్ను సేవించువారు తామసులనియుఁ దలంపంజను. సంగమున భూతజాలములకు బంధమును గలిగించునట్టిచిత్తభవములగు సత్త్వాదిగుణములు జీవునకుఁ గలుగునవియేకాని పరమాత్మ నగునాకుం గలుగవు. సత్త్వము రజస్తమస్సులను గెలుచునో యతని కది స్వప్రకాశకమైనిర్మలమైశాంతమై ధర్మజ్ఞానాదులు గలిగినసుఖమును గల్గించును. రజోగుణము సత్త్వతమోగుణములకంటె మించియుండునెడల సంగమునకు భేదమునకుం గారణంబై ప్రవృత్తియే స్వభావముగాఁగలిగి, యది యశస్సును, శ్రీని, కర్మమును గల్గించును. తమోగుణము సత్త్వరజస్సుల నోడించునేని వివేకభ్రంశకమై ఆవరణాత్మకమై జడమైశోకమోహములను, నిద్రాహింసల, నాశనుగలిగించును. చిత్తనైర్మల్యము నింద్రియోపరమము నను నివి యెప్పుడు గలుగునో యప్పుడు దేహమునందు భయము లేకుండుట మనస్సునకసంగము నను వానిం గలుగఁజేయునట్టి మత్పదంబగుసత్త్వగు

ణము వృద్ధియాయెనని గ్రహింపవలయు. చిత్తచాంచల్యము. ఇంద్రియోపరతి లేకుండుట కర్మేంద్రియము లెక్కుడు వికారమును గలిగియుండుట యనునీలక్షణములు పొడసూపినపుడు. మనోభ్రాంతికిఁ గారణంబగు రజోగుణ ముద్రేకించియున్నయట్లూహింపందగు. చిత్తము తిరోహితమై చిదాకారపరిణామ మందుసమర్థము కాక మనోలయమునుగ్లానినిగావించుపక్షమునఁ దమోగుణము వృద్ధియయ్యెననియు నెఱుంగవలయును. *సత్త్వ రజ స్తమోగుణములు, వృద్ధియైనయెడల వరుసగానాధిదైవిక కార్యములకుఆధ్యాత్మిక కార్యములకు, ఆధిభౌతిక కార్యములకు నుత్కర్షము(వృద్ధి) కలుగును సత్త్వమునజాగరము కలుగును. రజస్సున స్వప్నములు తోఁచును. తమోగుణమున సుషుప్తి కలుగును.తురీయావస్థయే యాత్మతత్త్వం బని తెలియవలయు. సత్త్వము వృద్ధికాఁగా జనులు వేదనిష్ఠులగుచు నూర్ధ్వలోకములనెల్లఁ గాంతురు. రాజసులు మధ్యమలోకములను గాంతురు. తామసులు పాతాళాద్యధోలోకములం బొందుదురు. సత్త్వ ముద్రేకమైనపుడు మృతినొందువారు స్వర్గమునఁ కరుగుదురు. రజస్సు పెరిఁగినతఱిఁ జచ్చువారు నరలోకమునకుం బోవుదురు తమస్సు వృద్ధికాఁగా మరణించువా రధోలోకములకుఁ జనుదురు. నిర్గుణులెల్ల భగవంతుఁడనగు నాపదమునే పొందుదురు. †నన్నుఁ బొందఁగోరియు, నేఫలములను

* విధమానే గుణే సత్త్వే దేవానాం బలమేధతే, అసురాణాం చ రజసి తమస్యుద్ధవరక్షసామ్. ౧౯. సత్త్వా జ్జాగరణం విద్యాద్రజసస్స్వప్నమాదిశేత్, ప్రస్వాపం తమసో జంతోస్తురీయం త్రిషు సంగతమ్. ౨౦. అని మూలము. †మదర్పణం నిష్ఫలం వా సాత్త్వికం నిజకర్మ తత్, రాజసం.

గోరకయుఁ జేయునిజకర్మము సాత్త్వికమనంబడును. ఫలసంకల్ప కృతము రాజసమగు. హింసాదంభమాత్సర్యాదికృతకర్మము తామసం బనందగు. దేహాదివ్యతిరిక్తమగు నాత్మవిషయకజ్ఞానము సాత్త్వికమగు. దేహాదివిషయకజ్ఞానము రాజసము. ప్రాకృతజ్ఞానము తామసము. మన్నిష్ఠమగుజ్ఞానము నిర్గుణము. సాత్త్వికనివాసము వనమగును. రాజసనివాసము గ్రామము. తామసనివాసము జూదమాడుతావు. నిర్గుణావాసమే నానికేతనమని యెఱుంగుము. ఉద్ధవా! ఆసక్తిలేనికర్త సాత్త్వికుఁ డనంబడు. రాగాంధుఁడగు కర్త రాజసుఁడు. స్మృతిభ్రష్టుఁడగు కర్త తామసుఁడు నిర్గుణుఁడగుకర్త మదుపాశ్రయుఁడు అధ్యాత్మశ్రద్ధ సాత్త్వికశ్రద్ధ, కర్మశ్రద్ధ రాజసము, అధర్మాసక్తి తామసశ్రద్ధ, మత్సేవాశ్రద్ధ నిర్గుణశ్రద్ధ యగును. ఇఁక నాహారముల విషయము వినుము.

* హితము, శుద్ధము అనాయాసమున లభించునదియు సాత్త్వికాహారము. ఇంద్రియప్రియమగునది రాజసాహారము.

---

ఫలసంకల్పంహింసాప్రాయాది తామసమ్. ౨౩. కైవల్యం సాత్త్వికం జ్ఞానం రజోవైకల్పికంతు యత్, ప్రాకృతం తామసం జ్ఞానం మన్నిష్ఠం నిర్గుణం స్మృతం. ౨౪. వనం తు సాత్త్వికోవాసో గ్రామోరాజస ఉచ్యతే, తామసం ద్యూతసదనం మన్నికేతంతు నిర్గుణమ్. ౨౫. సాత్త్వికః కారకోఽసంగీ రాగాంధోరాజసస్స్మృతః, తామసస్స్మృతివిభ్రష్టో నిర్గుణో మదుపాశ్రయః. ౨౬. సాత్త్వి క్యాధ్యాత్మికీ శ్రద్ధాకర్మశ్రద్ధాతురాజసీ, తామస్యధర్మేయాశ్రద్ధా మత్సేవాయాంతు నిర్గుణా. ౨౭. అని మూలము.

* పథ్యంపూతమనాయస్తమాహారం సాత్త్వికం స్మృతం, రాజసం ప్రియప్రేష్ఠం తామసం చార్తిదాశుచి. ౨౮. అని మూలము.

అశుచియు శ్రమములనుగల్గించునదియు నగునది తామసాహా
రము. ఆత్మానుభవమునఁ గల్గినసుఖము సాత్త్వికమగు. విషయ
ములవలనఁగలుగునది రాజససుఖము. మోహామువలనను, దైన్య
మువలనను గలుగుసుఖము తామసము. మదుపాశ్రయసుఖము
నిర్గుణము. ద్రవ్యము దేశము ఫలము కాలము జ్ఞానము
కర్మము కర్త శ్రద్ధ యవస్థ ఆకృతి నిష్ఠ యనునివి యన్ని
యును ద్రిగుణాత్మకములు. ప్రకృతి పురుషాధిష్ఠితములైన
దృష్టశ్రుతబుద్ధి చింతితభావములన్నియు గుణమయములని
తెలియవలయును. గుణకర్మనిబంధనములై పురుషునకు సంసార
మును గల్పింప హేతువులైన యీచిత్తజన్యగుణములను
జయించినయతఁడు భక్తియోగముచేత ముక్తి కర్హుఁడగును.
కాఁబట్టి జ్ఞానవిజ్ఞానసంభవకారణమగు నీనరదేహమునుబడసి
విచక్షణుఁడు గుణసంగమునువదలిపెట్టి నన్ను సేవింపవలయును.
ప్రమత్తుఁడుగాక నిస్సంగుఁడై జితేంద్రియుఁడై తగువిద్వాం
సుఁడు మొదట సత్త్వగుణమును సేవించిరజస్తమస్సులనోడించి
యుపశమస్వరూపమగుసత్త్వమున నాసత్త్వమును గెలిచి గుణ
నిర్ముక్తుఁడై జీవత్వకారణమగు లింగశరీరమును వదలి నన్నుఁ
బొందఁడు. వాసనాసంభవములగు గుణములను, లింగశరీర
మును, బరిత్యజించినజీవుఁడు బ్రహ్మాత్ముఁడై నాచేతఁ బరిపూ
ర్ణుఁడై విషయభోగమునను దత్స్మరణమున నంతర్బహిస్సం
చారము వదలును. * నాస్వరూప మెఱుంగుటకు సాధనమగు
మానవజన్మమెత్తి భక్తిలక్షణంబగు మదీయధర్మము నాశ్ర

* ఇది యిరువదాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

యించినయంతఁడు తనలో నియంతృరూపమున వర్తించి యున్న పరమానందస్వరూపుఁడనై పరమేశ్వరుఁడనగు నన్నుఁ బొందును. ఆమహాత్ముఁడు జ్ఞాననిష్ఠచేత గుణమయమగు జీవో పాధినివదలి మాయామాత్రములగు పైవస్తువులుగానిగుణము లయందు వర్తించియు మాయావస్తుగుణసంగముం బొందఁడు. శిశ్నోదరతృప్తిపరులైన యసాధువులతోటిసంసర్గమునొక్కప్పుడైనఁ జేయంగూడదు. అట్టి వాని ననుసరించువాఁడు గ్రుడ్డి వాని ననుసరించునంధునివలె! గాఢతమంబునం బడిపోవును.

## పురూరవసునిగీతము నుద్ధవునకు శ్రీహరి తెల్పుట.

పూర్వ మూర్వశీవియోగమున మోహపరవశుఁడై యాశోకము తగ్గగాఁ బుణ్యకీర్తియైన పురూరవసుఁడు పలికిన గీతము నుదాహరించెద. అది నీకెంతయు నుపయోగించును. దాని నాలకింపుము. తొల్లి పురూరవుఁడు తన్ను వదలియూర్వశి పోవఁబూనఁగా నెఱింగి దానివెంట దిగంబరుఁడై వెఱ్ఱి వానివలెఁ దిరుగుచు దుష్టమనస్సుగల యో ప్రియురాలా! యని పేర్కొనుచు మతిచెడి నీచములగు కామములచేఁ దృప్తి పడక దినములు వారములు పక్షములు మాసములు వత్సర ములు వచ్చుచుం బోవుచు నుండుట తెలిసికొనఁజాలక తన మన స్సూర్వశీవశమున నుండఁగాఁ దిరిగి తిరిగి తుదకు విర క్తుఁడై యాపురూరవశ్చక్రవర్తి తనలో నిట్లు తలపోయఁదొడ గెను. *అయ్యో! కామము తుచ్ఛమైనను నామనస్సును

* అహో మే మోహవిస్తారః కామకశ్మలచేతసః, దేవ్యాగృహీత కంఠస్య నాయుఃఖండా ఇమేస్మృతాః. ౭. నాహం వేదాభినిర్ముక్త స్సూర్యో వాభ్యుదితోఽముయా, ముషితో వర్షపూగానాం బతాహాని

క్షోభింపఁజేయఁగా నాత్రిప్పలకు లోఁబడితిని. నామోహ
మెంత విస్తారమైనదే! ఇంకేమందును? దేవాంగనామణి
యూర్వశి నాకంఠమును బిగ్గఁబట్టుకొనఁగా నహోరాత్రరూప
ములగు నాయాయుఃఖండములు గడచుచున్నవని యూహింప
నైతిని. నేను విహరించుచుండ సూర్యునియుదయాస్తసమయ
ములను బరికింపనైతిని. ఊర్వశి వంచింపఁగా ననేకవత్సరవా
సరములు గడచుట తెలియఁజాలకుంటిని సార్వభౌముఁడ
నయ్యు రాజశేఖరుఁడనయ్యు నొక్కయంగనకుఁ గ్రీడాహరి
ణంబ నైతిని. నాయాత్మయం దొదవినమోహము నేమందును?
పరివారముతోఁగూడి చక్రవర్తినగు నన్నొక్కగడ్డిపోఁ
చగా భావించి పరుగిడునాఁడు వానిపిఱుందన దిగంబరుఁడనై
పిచ్చివానిరీతిఁ బలవించుచుం బరుగెత్తితిని. గార్దభము వలెఁ
గాలఁ దన్నినను దాని లెక్కింపక యంగనవెంటఁ బరుగెత్తు
వాని కెవ్వనికైనఁ బ్రభావముగాని తేజముగాని, యైశ్వర్య
గతాన్యత. ౮. అహోమ ఆత్మసమ్మోహో యే నాత్మా యోషితా
కృతిః, క్రీడామృగశ్చక్రవర్తీ నరదేవశిఖామణిః. ౯. సపరిచ్ఛదమా
త్మానం హిత్వా తృణమివేశ్వరం, యాంతి స్త్రియం చాన్వగమం నగ్న
ఉన్మత్తవద్రుదన్. ౧౦. కుతస్తస్యానుభావస్స్యాత్తేజఈశిత్వమేవ వా, యో
ఽన్వగచ్ఛం స్త్రియం యాంతీం ఖరవత్పాదతాడితః. ౧౧. కిం విద్యయా
కిం తపసా కిం త్యాగేన శ్రుతేన వా, కిం వివిక్తేన మౌనేన స్త్రీభిర్యస్య మనో
హృతం. ౧౨. స్వార్థస్యాకోవిదం ధిఙ్మాం మూర్ఖం పండితమానినం, యో
ఽహమీశ్వరతాం ప్రాప్య స్త్రీభిర్గోఖరవజ్జితః. ౧౩. సేవతో వర్షపూగాన్మే
ఊర్వశ్యా అధరాసవమ్, న తృప్యత్యాత్మభూః కామో వహ్నిరాహుతిభిర్య
థా. ౧౪. పుంశ్చల్యాపహృతం చిత్తం కోన్వన్యో మోచితుం ప్రభుః, ఆత్మా

ముగాని యెట్లు కలుగును? స్త్రీలకుఁ జిక్కినవానికి విద్యయుఁ దపస్సు, త్యాగము శ్రుతమౌనములు నేకాంతసేవలవలన నే ఫలము? ఈశ్వరుఁడనయ్యుఁ బశుగార్దభములవలెఁ గామిలకుఁ జిక్కినమూర్ఖుఁడను, బండితమ్మన్యుఁడను, స్వప్రయోజనానభిజ్ఞుఁడనగు నన్నుఁ గాల్పనే! ఆయూర్వశీయధరామృతమును బెక్కువర్షములు తనివి సనక యాస్వాదించిన నాదగుమనంబున బొడసూపినకామము, అగ్నియాహుతులచేతంబలె నొక్కనాఁటికిం దనియదు. ఆత్మారాముఁడగుపరమేశ్వరుఁ డొక్కఁడు తప్ప నింకెవ్వఁడుగాని కులటయగుదానిచే హరింపఁబడుచిత్త

---

రామేశ్వరమృతే భగవంత మధోక్షజమ్. ౧౫. బోధితస్యాపి దైవ్యా మే సూక్తవాక్యేన దుర్మతేః, మనోగతో మహామోహో నాపయాత్యజితాత్మనః. ౧౬. ౧౬. కిమేతయా నోపకృతం రజ్వా వా సర్పచేతసః, ద్రష్టుస్స్వరూపావిదుషో యోఽహం యదజితేంద్రియః. ౧౭. క్వాయం మలీమసః కాయో దౌర్గంధ్యాద్యాత్మకోఽశుచిః, క్వ గుణాస్సౌమనస్యాద్యా హ్యధ్యాసోఽవిద్యయా కృతః. ౧౮. పిత్రోః కిం స్వన్నుభార్యాయాస్స్వామినోఽగ్నేశ్శ్వగృధ్రయోః, కిమాత్మనః కిం సుహృదామితి యో నావసీయతే. ౧౯. తస్మిన్ కళేబరేఽమేధ్యే తుచ్ఛనిష్ఠే విషజ్జతే, అహో సుభద్రం సునసం సుస్మితం చ ముఖం స్త్రియః. ౨౦. త్వఙ్మాంసరుధిరస్నాయుమేదోమజ్జాస్థిసంహతౌ, విణ్మూత్రపూరే రమతాం క్రిమీణాం కియదంతరం. ౨౧. తథాపి నో విషజ్యేత స్త్రీషు స్త్రైణేషు చార్థవిత్, విషయేంద్రియసంయోగాన్మనః క్షుభ్యతి నాన్యథా. ౨౨. అదృష్టాదశ్రుతాద్భావాన్నభావఉపజాయతే, అసంప్రయుంజతః ప్రాణాన్ శామ్యతి స్తిమితం మనః. ౨౩. తస్మాత్సంగో న కర్తవ్యః స్త్రీషు స్త్రైణేషు చేంద్రియైః, విదుషా మప్యవిస్రబ్ధషడ్వర్గః కిము మాదృశామ్. ౨౪.

మూలము.

మును దప్పింపఁగలుగునే? తుద కాదేవకాంతయే యెన్నియో హితోక్తుల బోధించినను జితేంద్రియుఁడు కాక దుష్టబుద్ధినగు నామనోమోహావేశము తొలఁగిపోవదయ్యెఁగదా! రజ్జువును గాంచి సర్పమని భ్రమపడి స్వరూప మేదియని పరికింపనివానికి రజ్జు వెట్టులో యాలాగే యాసుందరిచేసిన యపరాధ మేది యున్నది? నేనే నాస్వరూపమేమని యారయంజాలక యింద్రియవశుఁడనై భ్రష్టుఁడనైతిని. దుర్గంధము లోనివానిచే నిండి యపరిశుద్ధమై మలినమై కనఁబడు నాఁడుదానిశరీర మెక్కడ? సౌమనస్యాదిగుణము లెక్కడ? అజ్ఞానమున నున్నట్టి తలంపు కలిగెను. ఈశరీరము జనకభావముచేతఁదల్లిదండ్రులకుఁ గాని, సుఖము గలిగించుకతన భార్యకుఁగాని, లోఁబడుటచే స్వామికిఁగాని, తుదకు దహించుటచే నగ్నికిఁగాని,భక్షణార్హంబగుట కుక్కలు గ్రద్దలు లోనగుదానికిఁగాని, శుభాశుభ భాగిత్వమున నాత్మకుఁగాని, యుపకారము చేయుటంజేసి మిత్రములకుఁగాని, యింక నెవ్వరికైనంగాని సొమ్మగునుగాని యిది యిట్లగునని నిర్ణయింపందోఁపదు. అట్లు నీచతమమై యపవిత్రమగు దేహముపై నక్కటా! పంకజాయతనేత్ర సుందరమగు మోము కోమలసుస్మితములఁ గ్రాలుచుండునని పురుషుండు దగులును చర్మము మాంసము రక్తము నరములు మేదస్సు మజ్జాస్థులు, విణ్మూత్రములు నను వానికూడికయగు శరీరముచే విహరించువారలకుఁ బురుఁగులకు నేమిభేదము గలదు? కావున వివేకవంతునకు స్త్రీసంగతియు, స్త్రీసంబంధముగలవారితోఁటి సంబంధము నను నీరెండును బరిత్యజింపఁదగినవియే. విషయేంద్రియముల సంయోగముచే మనస్సు కలవిలపాటొందునుగాని

వినఁబడక చూడఁబడక యుండుపదార్థములవలన మనస్సు క్షోభము కలుగదు. ఇంద్రియములను వశపఱచుకొనియుంఁ వానిమనస్సు నిశ్చలంబై శాంతి నొందును. అట్టులగుట సంబంధము, అదిగలవారితోఁటి సంబంధముకూడ దూరము వదలిపెట్టఁదగినవి.

విద్వాంసులకును, షడింద్రియకూటము నమ్మఁదగి కాదని పెద్దలు పలుకుచుండఁగా నిఁక నావంటివానిమాటఁ జెప్పవలయునా. అని యీవిధముగాఁ దనలోఁ దానూహించి యాపురూరవుం డూర్వశీలోకమునువదలి జ్ఞానముచే మోహమును బడఁగొట్టి తనలో నాత్మయగు నన్నుఁ గాంచుచు శాంతుఁడయ్యె. కాఁబట్టి యోయుద్ధవా! మతిమంతుఁడు దుస్సంగతిం బరిహరించి సాధుసంగతి గలిగియుండవలయును. సాధుజనులు సదుపదేశమునఁ దన్నాశ్రయించినవారి మనోవ్యాసంగమును బోఁగొట్టుదురు *దేనియందు నపేక్షమాని నాయందే సంతతము చిత్తముంజేర్చి ప్రశాంతులై సమదర్శనులై మమకారములేక నిరహంకారులై శీతోష్ణాదిద్వంద్వ

* సంతోఽనపేక్షామచ్చిత్తాః ప్రశాంతాస్సమదర్శినః, నిర్మమా నిరహంకారానిర్ద్వంద్వానిష్పరిగ్రహాః. ౨౭. తేషు నిత్యం మహాభాగ మహాభాగేషు మత్కథాః, సంభవంతి హితా నృణాం జుషతాం ప్రపునంత్యఘం. ౨౮. తా యే శృణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చాదృతాః, మత్పరాశ్శ్రద్దధానాశ్చ భక్తిం విందంతి తే మయి. ౨౯. భక్తిం లబ్ధవతస్సాధోః కిమన్యదవశిష్యతే, మయ్యనంతగుణే బ్రహ్మణ్యాత్మానందానుభవాత్మని. ౩౦. యథోపశ్రయమాణస్య భగవంతంవిభావసుం, శీతం భయం తమోఽప్యేతి సాధూన్ సంసేవతస్తథా. ౩౧.=అని మూలము.

ముల నోర్చి ప్రతిగ్రహమును మానియుండువారు సాధువు లనంబడుదురు. ఆమహాత్ములు పాడుచున్న నాకథలు తమ్ము సేవించువారికలుషములం బాపును. ఆసత్కథలను భక్తిశ్రద్ధలుగలిగి విన్నను వానిం బాడినను వాని మన్నించినను వారు నాయందు భక్తికలవా రగుదురు. సంశయములేదు. అనంతగుణుండనియు, నానందానుభవాత్ముండనియు, బ్రహ్మస్వరూపుండనియు వినుతింగాంచు నాపై భక్తిగలుగునట్టులాచరించువారలకు నింకొకటి సాధింపవలసిన దేమున్నది? సూర్యు నగ్నిని సేవించువారికి శీతము భయము నంధకారము లేనట్లు నన్నారాధించి శరణుచొచ్చువారలకు జాడ్యము సంసారతాపము నజ్ఞానము నుండవు. భయంకరమగు సంసారసముద్రమునందు మునుంగుచుం దేలుచు నుండువారలకు నోడరీతి బ్రహ్మవేత్తలైన శాంతులు రక్షకులు. ప్రాణికోటి కన్నము జీవనము. ఆర్తలగువారికి నేను రక్షకుడను. పరలోకమునకుం బోవువారికి ధర్మము ధనము. సంసారతాపభీతులకు సాధువులే దిక్కు. సాధువులు హృదయమునంగల యజ్ఞానాంధకారమును దొలంగింప జ్ఞానమయము లగునేత్రముల నెన్నింటినో యిత్తురు. సూర్యుండు బాహ్యపదార్థములను జూడ రెండుకన్నులనే యిచ్చును. కనుక సజ్జనులు దేవతలును బంధువు లగుదురు. వారు నాకాత్మ. నేను వారుగా నమ్ముము. వారికి నాకు నించుకే భేదములేదు వేనే వారగుదు. ఇట్లు వీతసేనునికుమారుండగు నాపురూరవసుండు స్త్రీలయొక్కయు వారికి లోంబడినవారి యొక్కయు సంబంధమునుండి విముక్తుండై యాత్మారాముండై యీభూమియందు స్వేచ్ఛమెయిం జరించుచుండెను.

## భగవంతు నారాధించుమార్గము.

* పరమేశ్వరా! నీయారాధనరూపమగు క్రియాయోగము నాకు నుపదేశింపుము. ఇయ్యది మానవులకు నిశ్శ్రేయసకరము. నారదుఁడు వ్యాసుఁడు, అంగిరస్సుతుం డగు బృహస్పతియుఁ జెప్పిరి. నీ వుపదేశించినదానిని విని బ్రహ్మ భృగుప్రభృతులకుఁ దెలిపెను. శంకరుఁడు పార్వతికి నెట్లుపదేశించిరి? ఇది యన్నివర్ణములవారికిని, విశేషించి స్త్రీశూద్రులకును యమై యుత్తమమై శ్రేయస్సు నొసంగుమార్గమని నాభావము. కర్మబంధములకు విముక్తి నొసంగెడునద్దానిని భక్తుఁడనై నీయందే యాసక్తుఁడనగు నాకుఁ దెలుపుమా యని ప్రశ్నించెను. ఆప్రశ్నమును విని పరమేశ్వరుం డిట్లు బదులు చెప్పెను.

ఉద్ధవా! ఇంతయని వచింపరానిమహిమముగల నాయారాధనపద్ధతికిఁ బరిమితియుండదు. సంగ్రహముగ నాను పూర్విగాఁ జెప్పెద. ఆసక్తిమెయి నాలకింపుము. † వైదికమని తాంత్రికమని, మిశ్రమని నాపూజాపద్ధతి మూఁడుప్రకారములుగా నుండును. ఈమూఁడింటిలో నెవని కేది యభిమతమగునో వాఁడు దానిచే నన్నారాధింపవచ్చును. ‡ బ్రహ్మ

* ఇది యిరువదేడవయధ్యాయమునుండి కైకొనఁబడినది. † వైదికస్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః, త్రయాణా మీప్సితేనైవ విధినామాంసమర్చయేత్. ౭. అని మూలము.

‡ యథా స్వనిగమేనోక్తం ద్విజత్వం ప్రాప్య పూరుషః, యథా యజేత మాం భక్త్యా శ్రద్ధయా తన్నిబోధమే. ౮. అర్చాయాం స్థండిలేఽగ్నౌవా సూర్యేవాప్సుహృదివా ద్విజే, ద్రవ్యేణ భక్తియుక్తోఽర్చేత్స్వగురుం మమాయయా. ౯. అని మూలము.

క్షత్రియవైశ్యులు తమతమకులోక్తపద్ధతిచే ద్విజసంస్కారము పొంది శ్రద్ధాభక్తులుగలిగి నన్నుఁ బూజింపవలయు. దానిమార్గమును వినుము. ప్రతిమయందుఁగాని, స్థండిలమందుఁగాని, అగ్నియందుఁగాని, సూర్యునియందుఁగాని, జలమునందుఁగాని హృదయమందుఁగాని, బ్రాహ్మణునియందుగాని భక్తిగలిగి కపటములేక ద్రవ్యమున నాత్మగురువునగు నన్ను నారాధింపవలయును. తొలుదొలుత దంతధావనాదికార్యముల యథావిధిం జేసి శరీరశుద్ధికొఱకు మృత్తికగ్రహించి వైదికతాంత్రికమంత్రములచేస్నానముచేసి సంధ్యోపాసనము లోనగువైదికకర్మములు నిర్వర్తించి సర్వకర్మములను బావనములుగాఁజేయు నాపూజకు విధిగా సంకల్పింపవలయును. శిలాదారులోహమృచ్చందనాదులలో దేనిచేనైనఁ జేయఁబడినదిగాని, చిత్రమయము, సికతామయము, మనోమయము, మణిమయము ననఁబడు నెనిమిదివిధములుగాఁ బ్రతిమ యుండును. మఱియు నాప్రతిమ చలమనియు, నచలమనియు రెండువిధములుగ నుండును. స్థిరముగ నుంచుప్రతిమయందుఁ బూజగావించుతఱి నావాహనోద్వాసనములు కలుగవు. చరప్రతిమయం దర్చనముచేయుతఱి నా రెండింటిలో నెదియో యొకటిమాత్రము గలదు. స్థండిలమున నా రెండు నుండును. మృన్మయచిత్రప్రతిమలయం దభిషేకము నిషిద్ధము. వానియందు మార్జనముమాత్రమే చేయందగు. మంగళవస్తువులనేకరించి నన్నారాధింపవలయును. *భోక్తుఁడగువాఁడు దొరకినపదార్థములతోఁ బూజించుటయో, యాపదార్థములను మనస్సునందు సంకల్పించుకొనియో నన్నారాధించిన

* భక్తస్య తు యథాలబ్ధైర్హృది భావేన చైవహి. అని మూలము.

నాకు సంతృప్తియగు. ప్రతిమయందు స్నానాలంకారము నొనరించుట నాకు సంతోషమును గలిగించును. స్థండిలమున బూజించునెడల నాయాదేవతల నాయామంత్రములచే స్థాపించుట యుత్తమము. దాన నే సంతోషింతును అగ్నియందాజ్యహోమము ప్రశస్తము. సూర్యునియం దావహింపఁ జేసి పూజించునపు డుపస్థానము సర్ఘ్యముముఖ్యములు. జలమందుఁ దర్పణాదులచే నారాధించుట మేలు. * నాభక్తుఁడగు వాఁడు శ్రద్ధమెయి నీరుమాత్ర మర్పించినను నా కత్యంతసంతోషము గలుగును. గంధము, పూవులు, ధూపదీపనైవేద్యములు శ్రమించి సంపాదించి యర్పించునేని నాకుఁ బ్రీతిగల్గునని విశించి చెప్పవలయునా? పరిశుద్ధాంతఃకరణుఁడై మొదటనే పూజాద్రవ్యముల నేకరించి యుంచుకొని దర్భాసనమునఁ గూరుచుండి తూర్పుగాఁగాని, యుత్తరముగాఁగాని ముఖముండునట్లుచేసి పూజింప స్థాపించినయాప్రతిమ కెదురుగాఁ గూరుచుండి తొలుత నంగన్యాసకరన్యాసములను జేసి మూలమంత్రముచేత నాప్రతిమయందు న్యాసము నొనరించి (ప్రతిమను స్పృశించి) తొలుదినమునఁ బూజించియున్నపుష్పాదులం దీసివైచి శోధించి కలశమును బ్రోక్షణార్థమగు జలపాత్రమును జందనపుష్పాదులగువస్తువులను, సంస్కారమున శుద్ధములుగా నొనరించి ప్రోక్షణీయోదకములచే దేవపూజాస్థానమును బూజావస్తువులను బ్రోక్షింపవలయును. తనను బ్రోక్షించుకొనవలయును. పాద్యార్ఘ్యాచమనీయార్థముగాఁ బాత్రముల

* శ్రద్ధయోపహృతం ప్రేష్ఠం మమభక్తేన వార్యపి, గంధోధూపస్సుమనసో దీపోఽన్నాద్యం చ కిం పునః. ౧౭. అని మూలము.

మూఁడింటి నునుచుకొనందగు. వానినిఁగలశోదకములనిండింప వలయును. పాద్యపాత్రమునందు దూర్వాకమలశ్యామాకాదు లుంచవలయును. అర్ఘ్యపాత్రమునందు గంధపుష్పాక్షతాదు లునుపందగు. ఆచమనీయపాత్రమునందు జాతీలవంగ తక్కో లాదులనిడవలయు. వీనినెల్ల శ్రీచందనాదులఁ బూజింపవలయు. హృదయశీర్షశిఖామంత్రములచేతను గాయత్రీమంత్రముచేత నభిమంత్రింపవలయు. కోష్ఠవాయువుచే శోషింపఁజేయఁబడి యాధారగతమగునగ్నిచేఁ గాల్పఁబడి లలాటస్థానగత చంద్ర మండలామృతమునఁ దడుపఁబడి యాపంస్కారత్రయమునఁ బరమపావనమై తనశరీరమునందు నాత్మమనసపంకజంబున నుండు నట్టియుఁ బ్రణవపంచమాంశమైనట్టియు నాదమునకుఁబైనఁ దప స్సిద్ధుల ధ్యానించునట్టి శ్రీమన్నారాయణమూర్తిని దలంప వలయు. ఆత్మయగు శ్రీమహావిష్ణువుకళ తనయమృతమయపిండ మున వ్యాపించినంతఁ దన్మయుఁడై సాధకుఁడు ప్రతిమలోనగు నర్చామూర్తులయందు నంగన్యాసమున నావాహనస్థాపనము ద్రలచేత నన్నావేశింపఁజేసి పూజ కారంభించి పాద్యమర్ఘ్య మాచమనీయము లోనగు నుపచారవిధులను గల్పింపందగు. అందుఁ గర్ణికాకేసరములచే నుజ్జ్వలమగుచున్న యష్టదళమగు కమలము నాసనముగా వేదతంత్రముల నుభయఫలసిద్ధికొఱకుఁ గల్పింపందగును. ఆపీఠమున కాగ్నేయాదులగు నాల్గుమూలల యందు ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము నను వానిని నాలుగుకాళ్లుగను; తూర్పు మొదలగుదిక్కులయందు నధర్మము, నజ్ఞానము, అవైరాగ్యము, అనైశ్వర్యము నను వానిని గాత్రములుగ; నడుమ గుణత్రయమును బట్టికలుగను

భావించి విమలాదులగుశక్తులఁ దొమ్మండుగురను భావించి కర్ణికాకేసరములయందు సోమసూర్యాగ్ని మండలమును గల్పింపందగు. శంఖచక్రగదాఖడ్గ శరచాపహాలముసలాయుధము లను భగవంతున కష్టదిక్కులయందును భావించి శ్రీవత్సము కౌస్తుభము వనమాలయు నురంబున నుండునట్లు తలంచి యంగావరణపూజ చేయవలయును.

నంద, సునంద, ప్రచండ, చండ, మహాబల, బల, కుముద, కుముదేక్షణు లనుపేరుగలపార్షదుల నెనిమిదిదిక్కులందును, గరుత్మంతుని ముందును, దుర్గావినాయక వ్యాసవిష్వక్సేనులను దానికోణములందును, (మూలలయందును) గురువులను వామపార్శ్వమునందును, ఇంద్రుఁడు లోనగులోకపాలురను దూర్పు మొదలగుదిక్కులందును దేవున కభిముఖముగను, ఆయాయిస్థానముల నునిచి ప్రోక్షణాద్యుపచారముల చేత సంస్కరించి పరివారదేవతలఁ బూజింపవలయును. తరువాతఁ బరాత్పరు నారాధింప మొదలుపెట్టవలయును. ఐశ్వర్యము గలిగియున్నయెడల శ్రీచందనాద్యమాల్యవస్తువుల చేతఁ బరిమళముగలవిగాఁ జేయంబడినయుదకములచే, స్వర్ణఘర్మానువాకమును, మహాపురుషవిద్యను, బురుషసూక్తమును, రాజనాదిసామములను బారాయణముచేయుచు నభిషేకమను నుపచారము నొనరించి వస్త్రముపవీతము, ఆభరణములు, పత్త్రములు, కుసుమములు, మాల్యములు, చందనచర్చలు లోనగువానిని బ్రీతిపురస్సరముగా నలంకరింపవలయును. సాభక్తుఁ డగువానికి నుచితములగు నుపచారములు చేసిన ఫలము గలుగును. పాద్యమాచమనీయము గంధము, పుష్పా

తధూపదీపములు సమర్పించి గుడపాయసఘృతంబులను, చక్కిలములు అపూపములు, కుడుములు లోనగుభక్ష్యములు, స్వాదుతరాన్నము, మిక్కిలి విభవముగలిగిన నివేదనం బొన ర్పందగును.

పవిత్రదినములయందు విశేషించి యభ్యంగముద్వర్త నము దర్పణదర్శనము, దంతధావనాభిషేకాదులు సమర్పింపం దగు. భాగ్యము కలిగియున్నయెడల నిత్యము వీని నొనరింప వలయును. స్వగృహ్యసూత్రమునఁ జెప్పఁబడినట్లు మేఖలావర్త వేదు లేర్పఱచినకుండమునందు (హోమార్థము త్రవ్వినగోతి యందు) మండునగ్నిని స్థాపించి పాణిపరిసమూహనముచేసి పరి స్తరణప్రోక్షణంబులు గావించి వ్యాహృతులను సమిధలవై చుట యనుపద్ధతిగల యన్వాధానమును జరపి యగ్నిహోత్రునకు నుత్తరభాగంబున హోమద్రవ్యముల నునిచి ప్రోక్షణి యనఁ బడుపాత్రమునఁ గలజలముచేత హుతవహునందు నన్నా వాహానముచేసి పుటమువెట్టినబంగారువంటి శరీరచ్ఛాయగలిగి శంఖచక్రములు, గదాపద్మములు ధరించి మెఱయుచున్న నాల్గుబాహువులుకలిగి శాంతమూర్తి యలరుచుండఁ బీతాం బరమును ధరించి కిరీటము, కడియములు, మొలత్రాఁడు, భుజ కీర్తులు లోనగుభూషణములచేత నలంకరింపంబడి, శ్రీవత్సము, కౌస్తుభము, వనమాలయు నురోభాగమున ననుపమానప్రకా శము దిక్కులవెదఁజల్లుచుండ నలరు సకలజగదాధారు నానం దమయుని నన్నుఁ బూజింపవలయును ఇట్టి చిహ్నములుగల నన్ను మనము నేకాగ్రముగ నొనరించి ధ్యానింపవలయును. పిదప నాజ్యముచేఁ దడపఁబడిన యెండుకట్టెల నాయగ్నిలో

నునిచి ప్రజాపతి నింద్రు నుద్దేశించి యుత్తరదక్షిణపరిధులు
మొదలుగా నగ్నినడుమ ఘృతము గాఱుచుండ నాఘారహో
ముల నాగ్నేయసౌమ్యములైన భాగములందు హోమము
చేసి మూలమంత్రముచేతను, బురుషసూక్తమను పదాఱు
మంత్రములయవదానంబుచేత నాజ్యముచేఁ దడపఁబడినహవి
స్సుతోహోమముచేసి విధిననుసరించి ధర్మాద్యాహుతులు వైచి
హోమము ఫలియింప స్విష్టకృత్తనఁబడు నాహుతిని వైచి
యాహోమాగ్నియం దున్ననన్నుఁ బూజించి సాష్టాంగనమ
స్కారంబుచేసి పార్షదులకు బలియిడి పిదప నాహోమస్థానము
నుండి పూజాస్థానంబునకుంబోయి శ్రీమన్నారాయణమయంబగు
బ్రహ్మమును సంస్మరించుచు మూలమంత్రమును యథాశక్తి
యథావకాశముగా జపించి యాప్రతిమ కాచమనీయము సమ
ర్పించి యుచ్ఛిష్టము (నైవేద్యముపెట్టినది) విష్వక్సేనునకు
నర్పించి శేషము తన కాహారమునిమిత్త ముంచుకొనవల
యును. పరిమళమిళితతాంబూలమును సమర్పించి పుష్పముల
దోసిటంబట్టుకొని పూజచేయవలయును. ఆమీఁద భగవత్క
థాగేయములఁ బాడవలయును. నృత్యముచేయవలయును.
నాచేసిన యద్భుతకార్యముల నభినయింపందగు. నాకథలఁ
బాడుచుండఁగా నాలకించియుఁ దాను బఠించియు ముహూర్త
కాలము నిర్వ్యాపారవృత్తి ధ్యానించి పిదపఁ బురాణస్తోత్ర
ములను భగవంతుఁడ నగునన్ను వినుతించుచు నోదేవాది
దేవా! అనుగ్రహింప నర్హుఁడవు. అని వేఁడుచు శిరస్సు నా
పాదములు సోఁక నమస్కరింపవలయును. ఆకాలమునందుఁ గుడి
యెడమచేతులచే నుత్తరదక్షిణపాదములను బట్టుకొనవలయు

నని శాస్త్రము తెల్పెడిని. అంతఁ బూరుషోత్తమా! కరుణాసము ద్రుఁడా! సంసారము దుస్తరంబని భయంపడి నీమఱుఁగు చొచ్చిన నన్నుఁ గాపాడుమని ప్రార్థించి నే నొసంగిననిర్మాల్య మును భక్తియు నాదరము వెలయ గ్రహించి శిరంబున ధరిం పందగు. ఉద్వాసించుతఱిఁ బ్రతిమయందుఁ గలతేజస్సును ఆత్మ మనఃపంకజగతజ్యోతిస్సునఁ బ్రతిష్ఠింపుమా యని నన్నుఁ బ్రార్థింపందగు. *ప్రతిమాదులలో దేనిపై నెవ్వనికి శ్రద్ధకలు గునో దానియందే యాసాధకుఁడు మనస్సునిలిపి నన్నుఁగా భావించి పూజింపవలయును. సర్వాత్మకుఁడనగు నేను సర్వ భూతములయందును దనయందు నుందుదును. ఇట్టు వైదిక తాంత్రికపూజావిధానముల నన్నుఁ బూజించునతఁడు తన కిష్టములగు నుభయసిద్ధులను నాయనుగ్రహమునఁ బొందును. నిత్యపూజలకుఁ బర్వోత్సవములకు మహోత్సవములకుఁ దగిన క్షేత్రాదు లిచ్చి నాకు మందిరము గట్టించి నా ప్రతిమ నందుఁ బ్రతిష్ఠించి మనోహరములైనతోఁటలు వేయించవలయును. నిత్యపూజనునొండె, పర్వోత్సవములనునొండె, మహోత్సవము లనునొండె, ఎడతెగక యవి సాగుటకై క్షేత్రములు పురములు గ్రామములు లోనగువాని నొసంగువారు నాసాలోక్యమును బొందుదురు. ప్రతిమాప్రతిష్ఠాపనముచేయువారు సార్వభౌమ త్వముం బడయుదురు. మందిరము నిర్మించువారు ముల్లోకముల కధిపతులగుదురు. పూజ మొదలగుకార్యము లొనరించువారు

* అర్చాదిషు యదా యత్ర శ్రద్ధామాం తత్ర చార్చయేత్, సర్వ భూతేష్వాత్మని చ సర్వాత్మాహ మవస్థితః. ౪౬. అని మూలము.

బ్రహ్మలోకము నొందుదురు. ఈ ప్రతిమామందిర పూజ గావించువారు మత్సామ్యము నొందుదురు.

ఫలములఁ గోరక భక్తియోగము నభ్యసించువారు (అనఁగా భక్తిగలిగి నన్ను నారాధించువారు) భక్తి యోగ సిద్ధిని బడయుదురు. తనచే * నీయఁబడినదిగాని, యితరుల నీయఁబడినదిగాని దేవబ్రాహ్మణవృత్తులను హరించువాఁడు పెక్కుసంవత్సరములు మలభక్షణము చేయుచుండును. దానము గాని దాని నపహరించుకార్యముకాని చేయువాఁడు, చేయించువాఁడు, నాకార్యములకుఁ దోడ్పడువాఁడును, వానియందు భాగముగలవారు గావున వానిఫలములను సమానముగా ననుభవింతురు. ఆఫలము వారికిఁ బరలోకమునం దభివృద్ధి చెందుచుండును.

సంగ్రహముగా జ్ఞానయోగమును హరి యుద్ధవున కుపదేశించుట.

† అని యిట్లు తను నారాధించుమార్గమును దెలిపి పరమకారుణికుఁడౌట శ్రీకృష్ణుఁ డుద్ధవునకు సంగ్రహించి, మున్ను తెలిపిన జ్ఞానయోగమునే మరలఁ దెలుపువాఁడై యిట్లుపదేశించెను. ‡ ఉద్ధవా! ఈ ప్రపంచమెల్లఁ

* యస్స్వదత్తాం పరైర్దత్తాం హరేత సురవిప్రయోః, వృత్తిం ప్రజాయతే విడ్భుగ్వర్షాణామయుతాయుతమ్. ౫౨. కర్తుశ్చ సారథేర్హేతో రనుమోదితురేవ చ, కర్మణాం భాగినః ప్రేత్య భూయో భూయసి తత్ఫలం. ౫౩. అని మూలము. † ఇది యిరువదియెనిమిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

‡ పరస్వభావకర్మాణి న ప్రశంసేన్న గర్హయేత్, విశ్వమేకాత్మకం పశ్యన్ ప్రకృత్యా పురుషేణ చ.౧.పరస్వభావకర్మాణి న ప్రశంసతి నిందతి, ఆశు భ్రంశతే స్వార్థా దసత్యభినివేశితః. ౨. అని మూలము.

ప్రకృతిపురుషులతో నేకాత్మకం బై యుండుటం జేసి మానవుఁడు పరుల స్వభావమును గాని కర్మములను గాని భూషింపరాదు. దూషింపరాదు. మిథ్యాభూతమగు ద్వైతమునఁ గల యభిమానముచేత నితరస్వభావములను గార్యములను నిందించువాఁడు సత్వరంబ స్వార్థమునుండి (జ్ఞాననిష్ఠాలక్షణమునుండి) భ్రష్టుఁడగును. రాజసాహంకార కార్యములింద్రియము లగును. అయ్యది నిద్రచేఁ బరవశమైనపిదపఁ బిండస్థుఁ డగుజీవుఁడు మనోమాత్రమున స్వప్నమును, మనస్సు లయించినతర్వాత నష్టచేతనుఁడై మృత్యువుతో సాటి యగుసుషుప్తిని బొందునట్లు ద్వైతాభిమానమునవిక్షేపలయములను బొందును. ద్వైతమవస్తువగును. అట్టిదానియందు భద్రములు కొన్ని కలవని, యభద్రములు కొన్ని గలవని యీచింతయేల? కర్మేంద్రియములకు జ్ఞానేంద్రియములకుంగూడ నేదిగమ్యమో యదియంతయు నసత్యమే. ప్రతిబింబము ప్రతిధ్వనియు శుక్తిరజతాదిభ్రమము నసత్యములే యైనను క్రియావంతములే యగునట్లు దేహాదిభావములెల్ల సత్యేతరములయ్యు మృత్యువు దనుక భయమును మాత్రము కలిగించుచుండును. పరమాత్మ తన్నుఁదానే జగదాకారమున సృజింపఁదగు రూపమున సృజించును. పాలనార్హరూపమునఁ బరిపాలించును. సంహరణార్హమగు రూపమున సంహరించును కావున సృజ్యాదివ్యతిరిక్తమగు నాత్మస్వరూపంబుకంటె భావాంతరము కలుగదు. అధ్యాత్మాదిరూపమై మూఁడువిధములుగా నున్న యీప్రతీతియు నాత్మయందుఁ బ్రమాణశూన్యమే యగు. గుణమయమగు నీత్రివిధప్రపంచము మాయాకృతంబె యని నిశ్చయింపుము. నాచే జెప్పఁబడు నీజ్ఞానవిజ్ఞానము నెఱింగిన

పండితుఁడు భానునివలె సమదర్శియై యితరులను దూషింపఁ వినుతిచేయఁడు. ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, ఆనుభవము ననునాలుగింట నుత్పత్తినాశములు కలది యంతయు నసత్యంబని తెలిసికొని పండితుఁడు సర్వసంగముల మాచరించును.

అని యుపదేశింపఁగా విని యుద్ధవుఁడు. భగవంతా ద్రష్టయు స్వప్రకాశుఁడు నగునాత్మకు, దృశ్యము ప్రకాశ్యమునగు శరీరమునకు సంసారము సంభవించునా? అది యేనాటికిఁ గలుగ నవకాశమే లేదు. పరమాత్మ నాశరహితుఁడు గుణశూన్యుఁడు, పరిశుద్ధుఁడు, స్వయంప్రకాశుఁడు నగుచు నగ్నివలె విరాజిల్లుచుండును. శరీరమున్న దానికి విలక్షణమయి దారువుచందమునఁ బ్రకాశ్యంబై యుండెడిని జడము నగును. ఆజడమునకు జడపదార్థమునకు నీరెండింటికి సంసారము చెల్ల నవకాశము కలదనవచ్చునా? ఇట్టులుండ నీసంసారమిందు దేనికో తెలియఁజాలకయున్నాను. అనిప్రశ్నింపఁగా నాలకించి పరాత్పరుండు శ్రీకృష్ణుఁడిట్లు బదులుచెప్పెను.

ఉద్ధవా! ఆత్మదేహేంద్రియ ప్రాణములతో సంబంధమెంతవఱకుండునో యంతదనుక మిథ్యయే యయ్యును సంసారమాయ వివేకముచేతఁ గలిగినట్లు తోఁచెడిని. కలలోననర్థము లెట్లు కలుగునో యట్లే కార్యములేకయున్నను విషయములను జింతించుచుండు నాత్మకు సంసారము వదలుట సరిపడదు. నిదుర నొందువానికి స్వప్నము విశేషించి యనర్థములఁ గలిగించునది యే యైనను మేలుకొనినపిదప నామోహామునే కలుగనీయదు. -నర్థములు మిథ్యాభూతములనియే తోఁచునుగదా. అహం

కారమునకే శోకము హర్షము భయక్రోధములు లోభమో
హములు మదము జన్మము నాశము గలుగునుగాని యాత్మకవి
కలుగవు. *దేహేంద్రియాదులపై మమకారము గలిగి లోపల
నుండుజీవుఁడే గుణకర్మమయమూర్తిచే నొప్పి సూక్ష్మము
లగు నుపాధులచే సూత్రమనియు మహత్తత్త్వమనియు నింక
నెన్నియోమార్గముల వ్యవహరింపంబడుచుఁ బరమేశ్వరాధీ
నుఁడై సంసారమునం దిరుగుచుండు అనేకరూపముల నిరూ
పింపఁబడుచు నిర్మూలమై తగుమనోవచః ప్రాణాహంకారమును
సద్గురుసేవ యనెడివాఁడికత్తిచే ఛేదించి ముని తృష్ణాశూన్యుఁడై
భూతలంబునఁ దిరుగుచుండును.

వేదము తపము (స్వధర్మము) స్వానుభవము, ఉపదే
శము, తర్కము (అనుమానము) అనువానిమూలమున నిశ్చ
యింపఁబడిన యాద్యంతముల సిద్ధమైనది యేదో యదే మధ్య
మున నుండును. అదియే జగత్ప్రకాశకము. జగత్కారణము.
తదాత్మకమే యీజగత్తు తద్వ్యతిరిక్తము లేదు. అను బ్రహ్మ
వివేకమే జ్ఞానము. దీని కుదాహరణమును వినుము. కడియ
ములు కుండలములు లోనగు నాభరణములు చేయుటకు
ముందును, మరల వానిఁ గరఁగించినతర్వాతను గారణాత్మ
కమైన బంగారు వానిమధ్యావస్థయందును సత్యంబగునట్లు
జగత్తు పుట్టుటకు ముందును, ప్రళయమునకుఁ దర్వాతను గార
ణాత్మకుఁడ నగు నేనే (శ్రీకృష్ణుఁడనే) ఆయుత్పత్తినాశము
లకు నడుమనుగూడ సత్యస్వరూపుఁడనై యుందును. మధ్య

* సూత్రం మహానిత్యురుద్దైవగీత స్సంసార ఆధావతి కాలతంత్రః. ౧౭. అని మూలము. కాలతంత్రః పరమేశ్వరాధీనః. అని వ్యాఖ్య.

దశయందు బంగారమునకుఁ గటకములని కుండలములు మఱియు నెన్నియో పేరుల వ్యపదేశము గలుగునట్లే నా గూడ మధ్యావస్థయందు వివిధవిశ్వవ్యపదేశము కలుగును.

*జాగరాద్యవస్థలు మూఁడింటికి మూలమగుమనస్సు ఆయవస్థలకుఁ గారణమగు గుణత్రయమును, కార్యకా కర్తృరూపము లనఁబడు నాధ్యాత్మాధిభూతాధిదైవం లును, ఈరీతిగా ముత్తెఱంగులుగనున్న యీజగమంతయు దురీయస్వరూపముతో నన్వయవ్యతిరేకముల ననుగతంబ యుండు. తురీయము సత్యము. ఉత్పత్తికి ముందు లయమున బిదప లేనివస్తువు మధ్యావస్థయందును గలుగదు. కలుగు చెప్పుట వ్యవహారమాత్రమే యని యెఱుంగుము. †ఉద్భవా అన్యజాతము, పరప్రకాశితమును దత్కారణమేయగునుగా యన్యము గాదనియే నామతము. అవిద్యమానమయ్యును వికా రసంఘము రజోగుణోద్రేకమున బ్రహ్మ కార్యభూతమై త చును. ఆబ్రహ్మ మెట్టిదనఁగా, స్వతస్సిద్ధము స్వతఃప్రకాశము నగుచు నుండును. ఇంద్రియములు, తదర్థములగు తన్మాత్రము మనస్సుభూతములు, వీనిభేదమునవిచిత్రంబగు నీజగమంత్రయు బ్రహ్మంబె యగునని యూహింపుము.

ఈవిధమున బ్రహ్మ మిది నిర్ధారణముచేయుటకుఁ గా ణములైన వేదప్రత్యక్షానుమానైతిహ్యములచేతను దేహ

---

* విజ్ఞానమేత త్త్రియవస్థమంగ గుణత్రయం కారణ కార్యకర్తృ, సమన్వయేన వ్యతిరేకతశ్చ యేనైవ తుర్యేణ తదేవ సత్యమ్. ౨౧. అని మూలము. †భూతం ప్రసిద్ధం చ పరేణ యద్యత్తదేవ తత్స్యాదితి మే మనీషా. ౨౨. అని మూలము.

ధ్యాస నిరాకరణముచేతను ఆత్మసంశయములను దొలఁగించు కొని యాత్మానందమునఁ బరితుష్టుఁడై సర్వేంద్రియోపరతి నొందవలయును. (ఇంద్రియతృప్తికర కార్యములు గావింపక యుండవలయు) దేహము పృథివీమయము. కావున నది యాత్మ గాదు. ఎట్లు? ఘటమువలె. ఇంద్రియములు సాధనము లగుటం జేసి యవియు నాత్మ గాదు. దేవతలు వైకారికులు గాన మనస్సువలె నాత్మభూతులు గారు. ప్రాణము వాయువు గాన బాహ్యానిలమువలె నాత్మ గాదు. మనసు అన్నమయమగుటం జేసి శరీరమువలెనే యాత్మ కాదు. బుద్ధి తైజసమగుట నేత్రముం బోలి యాత్మ కాదు. అహంకారమో పరిణామముకలది గావున శరీరమురీతి నాత్మ కాదు పంచమహాభూతములు (భూమి మొదలగునవి) జడములుగాన దేహములవలెనే యాత్మ కావు. ఉద్ధవా! నాస్వరూపము చక్కఁగాఁ దెలిసినవారికి గుణాత్మకములగు నింద్రియములు సమాహితములైన నేమి ఫలము? విక్షేపవంతములైనచో హానివలన నష్టమేమి? మేఘము లాచ్ఛాదించినను, విడిపోయినను సూర్యునకు దానఁ గలుగు లాభనష్టము లేవియుండును? వాయువు లోనగువానియొక్క శోషణాదిగుణములచేత, ఋతుధర్మములగు శీతోష్ణాదులచేతను, ఆకాశమునకు సంగమెట్లు కలుగదో యట్లే యహంకారమునకుఁ బరుఁడై యక్షరుఁడైన పరమాత్మకుఁ ద్రిగుణమయములగు సంసారహేతువు లంటవని నమ్ముము. అట్లులైనను దృఢతమ భక్తియోగముచేత మనోమాలిన్యమును విషయానురక్తియుఁ దుదముట్ట నశించును. అవి సమగ్రముగా నశించువంతదనుక మాయాకల్పితగుణములందు సంగము వదలుకొనఁదగి

నదే నిశ్శేషముగు వఱకుఁ జికిత్స చేయంబడని రోగము పెక్కుసా
రులు పొడసూపుచు బాధించుచుండునట్లు అపక్వకషాయకర్ములై
పర్వసంగములుగల మనస్సుమాత్రము యోగసిద్ధిం బడయ-
వానిని బాధింపక వదలదు.

* దేవతలు చూడలేనివారు గావున మానవాద్యా
కారములచేఁ గాముకులఁ బుట్టించి పనుప వారువచ్చి విఘ్న
ములు కల్పింపఁగాఁగు యోగులు పూర్వాభ్యాసబలముచేత మఱల
యోగవిద్యనే సాధింపఁబూనుదురు. కాని జన్మాంతరమందును
గర్మములచెంతకుం బోరు. ఎవ్వండైనఁ బ్రోత్సహించినచో
దేహము తాను బతసమునొందుదాఁకఁ గర్మములను జేయు
చుండును. వికారముల నొందుచుండును. అట్టిదేహముగల
వాఁడయ్యును విద్వాంసుఁ డాత్మసుఖానుభవముచేఁ దృష్ణం
బాఱఁదోలి తత్సంగతి నొందక యుండఁగలఁడు. ఆత్మనిష్ఠగల
వాఁడు, తనదేహము నిలుచుండినఁ, గూరుచుండినను, నడ
చుచుండినను, శయనించినను, మూత్రోత్సర్గంబొనరించినను,
ఆహారమును గొనుచుండినను, స్వాభావికములగు దర్శనస్పర్శ
నాదికార్యములు చేయుచుండినను దెలియకయేయుండు. తెలిసి
కొన్నను నీచేంద్రియార్థము నానాత్వమున స్వప్నమురీతి
మిథ్యయే యనెడు ననుమానప్రమాణమున బాధితంబని
యూహించి స్వప్నమునుండి మేలుకొన్నవాఁడు సంస్కార
మాత్రమున నూహింపనగుచుఁ దనంతనే యదృశ్యమగు

* కుయోగినో యే విహంతాంతరాయై ర్మనుష్యభూతై స్త్రిదశోప
సృష్టైః, తే ప్రాక్తనాభ్యాసబలేన భూయో యుంజంతి యోగం న తు కర్మ
ం. అని మూలము.

స్వప్నపదార్థమును బోలెం బండితుండు పరమార్థముగా దాని గ్రహింపండని నిశ్చయింపుము. బద్ధావస్థయందుం జిత్రముగ నుండు దేహేంద్రియాద్యజ్ఞానము ఆత్మాధ్యాసబలమునం దెలిసికొనంబడిన యాత్మజ్ఞానము చేత నివృత్తంబగు. (తొలంగు.) అజ్ఞానమవిద్యారోపితముగదా. అట్టి యజ్ఞానమే బంధము. అది నివృత్తించుటయే మోక్షము కావున మోక్షము క్రియాజన్యఫలమనం గూడనిది. కాంబట్టియే యాత్మకా బంధమోక్షములవలన వికారిత్వము కలుగదు * సూర్యుం డుదయింపంగానే మానవుల నేత్రములకుం దమోవినాసము కలుగంగా ఘటాదిదర్శనంబు గలుగుచందమున జ్ఞాన ముదయింపంగానే యవిద్య దూరమగును. దాన స్వతస్సిద్ధమగు నాత్మస్వరూప స్మృతి తనంతనే కలుగును. అదియే మోక్షమని పెద్దలందురు. ఆయాత్మ స్వయంప్రకాశకుండు, జన్మరహితుండు, అప్రమేయుండు, మహావిభూతిమంతుండు, సకలానుభవములుగలవాండు, సజాతీయవిజాతీయభేదశూన్యుండు ఇట్లు వెలయుచుండును. ఈయాత్మ చేతనే కాదా మనుష్య వాగాదీంద్రియములు ప్రాణములు కార్యకరణక్షమములగును కేవలాత్మయందు భేదముకలదనుటయే యాత్మపమ్మోహ మగుచున్నది. ఆత్మను వదలినచో నాభేదము కలదనువాదము నిరాధారమగును. నామరూపములచే గ్రహింపందగి పంచభూతాత్మకమగు ద్వైతమబాధితంబనియు, వేదాంతార్థములు క్రత్వర్థకర్మప్రతిపాదనపరత్వముచేత నర్థవాదములే యగుననియుం

* యథాహి భానోరుదయో నృచక్షుషాం తమోనిహన్యాన్నతు సద్విధత్తే, ఏవం సమీక్షా నిపుణా సతీమే హన్యాత్తమిస్రం పురుషస్య బుద్ధేః. ౩౧. అని మూలము.

గావున ద్వైతమే సత్యమనియుఁ బండితమ్మన్యులు (మూర్ఖులు) తలంతురు. పండితులుమాత్ర మట్లు భావింపరు. ఇఁక వారితాత్పర్య మేమనఁగా వేదాంతవాక్యములకు విధ్యేకవాక్యత్వము లేదు కర్తృత్వభోక్తృత్వములు లేక పరమానందరూపాత్మక ప్రతిపాదనము కర్మవిశేషమునకు లేదు. కావుననే వేదాంత వాక్యములర్థవాదములు కావు. నామరూపాత్మకత్వము, గ్రాహ్యత్వము, పంచభూతాత్మకత్వము, ననునవి కారణములుకాఁగా ననుమాన ప్రమాణమునను, వేదవాక్యప్రమాణమునను, ద్వైతమబాధితముకాక బాధితమేయగును. పండితమ్మన్యులదగు నా ప్రతీతి నిష్ప్రయోజకము. యోగము పరిపక్వము గాకయున్న యోగికి నడుమనడుమఁ గలుగునుపద్రవములచేత దేహపీడ కలుగును. అత్తరుణమున సోమసూర్యాగ్ని యోగధారణచేతఁ దాపశైత్యాదులగుబాధలకును, వాయుధారణతోఁగూడిన యాసనంబులచేత వాతాదిరోగములకుఁ దపస్సు మంత్రౌషధములు ననువానిచేత సర్పాద్యుపద్రవంబులకు, నాధ్యానాదులచేతఁ గామాదులకును యోగేశ్వరానువర్తనంబుచేత దంభమానాదులకును, ఇంకనుగల శుభయోగములచేత నశుభోపద్రవములకును, బరిహారము చేయందగియుండు. * కొందఱు యోగులు వివిధోపాయములను దేహమునందు వినియోగించి ముదుసలితనము లోనగునుపద్రవములు లేకయుండ దేహ

* కేచిద్దేహ మిమం ధీరాస్సుకల్యం వయసి స్థితం, విధాయ వివిధోపాయైర్యోగం యుంజంతి సిద్ధయే. ౪౨. న హి తత్కుశలాదృత్యం తదాయాసో హ్యపార్థకః, అధ్రువత్వాచ్ఛరీరస్య ఫలస్యేవ వనస్పతేః. ౪౩. అని మూలము.

మును గాపాడుకొనుచు యోగము నభ్యసింతురు. అద్దానిని ప్రాజ్ఞులు సుంతయు నాదరింపరు. దేహము శాశ్వతముగా నిలుచుటకై చేయుపరిశ్రమము లన్నియు నిరర్థకములు. వృక్షము స్థిరము. దానిఫల మస్థిరము. అట్లే యాత్మ శాశ్వతుఁడు. దేహము నశ్వరము. యోగమును సేవింప శరీరము సమర్థమేయైనపక్షమున బుద్ధిమంతుఁడగు మానవుఁడు మత్పరమగుయోగమును వదలి శరీరమును నమ్మరాదు. నన్నే యాశ్రయించి నిస్పృహుఁడై స్వసుఖానుభవముగలిగి యోగాభ్యాసనిరతుఁడై తగుయోగి యెన్నివిఘ్నములు వచ్చినను వానివలన నభిహతి నొందఁడు. ఈమాటసత్యము. అని పలుకుటయు నుద్ధవుఁ డిట్లు ప్రశ్నించెను.

భక్తియోగమును మరలసంగ్రహించి యుద్ధవునకు శ్రీహరిచెప్పుట.

* అచ్యుతా! ఎవనికి మనస్సు వశమున నుండదో యట్టి వానికి నీ వుపదేశించిన యోగచర్య యనుష్ఠింప శక్యమగునది కాదు ఇదియే నాయూహ. కావున నింతటి యాయాసము నొందనక్కఱలేనియట్లు సిద్ధించునుపాయ మాలోచించిసులువుగా నే గ్రహించునట్లుపదేశింపుము. † పుండరీకనయనా! సాధారణముగా లోకమున యోగులు మనోనిగ్రహవిషయమున మిగుల శ్రమంపడుచు దానిని గ్రహింపఁజాలక క్లేశములపా

* ఈవిషయము ఇరువదితొమ్మిదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది. † ప్రాయశః పుండరీకాక్ష యుంజంతో యోగినో మనః, విషీదంత్యసమాధానాన్మనోనిగ్రహకర్శితాః. ౨. అథాత ఆనందదుఘం పదాంబుజం హంసాశ్శ్రయేరన్నరవిందలోచన, సుఖం ను విశ్వేశ్వర యోగకర్మభిస్త్వన్మాయయామీ విహతాన మానినః. ౩. అని మూలము.

లగుదురు. కాఁబట్టి నిరుపమానందసంభృతమగు నీపాదారవింద మును సుఖముగా నాశ్రయించినవివేకులు (సార మిది యసార మిది యని యెఱింగినవారు) నీమాయకుఁ జిక్కి పరితపింపరు. అవశీకృతమనస్కులో యోగకర్మములచే నిహతులగుచు నీప దాంబుజముల నాశ్రయింపక మేము యోగనిపుణులమని కర్మ కుశలులమని మదించి చెడుదురు. అనన్యగతికులైన దాసజను లకు నీవు స్వాధీనముగ నుండువనుటలో నచ్చెరు వేది గలదు? లోకపాలకులు తమతమముకుటములు నీపాదారవిందములు సోఁక మ్రొక్కి సేవించుచుండ నలరునీవు శ్రీరామావతారము నందు వానరులతోడ మైత్రి యొనరించితివికదా! అఖిలాత్మ కుఁడవై సర్వప్రియుఁడవై సర్వేశ్వరుఁడవై యాశ్రితులకుసర్వా ర్థముల నొసంగుచు నుండునిన్ను నీవు దాసులకు నొనరించిన యుపకారమిట్టిదని తెలిసినపండితుఁ డెవ్వఁడు సేవింపక వదలఁ జాలును? అంతర్యామిరూపమున లోపలను, గురుస్వరూపమున వెలుపలను శరీరులయమంగళములను దొలఁగించి నీయసమా నాత్మప్రజ్ఞను బయలుపఱచి నీవు చేయుమహోపకృతిని సంతస మున స్మరించుపండితులు బ్రహ్మకున్నంత యాయుస్సున్న నందైన దానికి బదులుచేయఁజాలుదురా.

*అని యీరీతిఁ దనయందు ననురక్తచిత్తుఁడై యుద్ధవుం డడుగుటయుఁ బ్రపంచలీలానిమిత్తము స్వీయశక్తియోగమహి మమున బ్రహ్మవిష్ణుశివరూపములనుధరియించిన యాపరమాత్మ చిఱునవ్వు మోముదమ్మి నాట్యముసలుపఁగా నుద్ధవునిం గాంచి

* గృహీతమూర్తిత్రయ ఈశ్వరేశ్వరో జగాద సప్రేమమనోహర .. అనిమూలము.

యిట్లు పలికెను. భక్తవర్యా! పరమశుభకరములగు నాధర్మము
లను వివరించెదను. నీవు వాని నాకర్ణింపుము. తృప్తినొందు
దువు. నాధర్మములను శ్రద్ధతో నవలంబించువారు జయింపఁ
దరముగాని సంసృతిసాగరమును జయింతురు. నన్నే తలంచుచు
నాపై సంకల్పస్వభావమగుమనస్సును, అనుసంధానస్వభావ
మగుమనస్సును, అనుసంధానస్వభావమగుచిత్తము నునిచి
నాధర్మములయం దాత్మనిరతిగలిగి క్రమక్రమముగా నా
కొఱకై సర్వకర్మములను జేయవలయును. నాయందు భక్తిగల
సాధువులుండు పవిత్రప్రదేశములను సేవింపవలయును. దేవా
సురమానవులలో నాభక్తు లెవ్వరుగలరో వా రేకర్మముల
నాచరింతురో వాని నెఱింగి యాచరింపవలయును ఒక్కఁడుగాఁ
గాని పెక్కండ్రంగలిసికాని నృత్తగీతప్రముఖరాజోపచార
ములచేత నాకు సంవత్సరయాత్రాదిమహోత్సవములు చేయు
చుండవలయును. పాపవిముక్తమనస్కుఁడై సర్వభూతముల
యందును దనయందును ఆకాశమువలె లోపలవెలుపల నావ
రణమునుసదియే లేక వ్యాపించియున్న నన్నుఁ జూచుచుండవల
యును. ఇదియే జ్ఞానదృష్టి. అద్దాని నాశ్రయించి యెల్లభూత
ముల నన్నుగా నర్చించుచు * బ్రాహ్మణునందును, చండాలుని
యందును, బ్రాహ్మణస్వత్వమును హరించినపాపాత్మునందును,
బ్రాహ్మణున కుపకార మొనరించిపుణ్యాత్మునందును, సూర్యుని
యందును, మిణుఁగురునందును, సర్వభూతహితునియందును,
సర్వభూతద్రోహియందును సమదృష్టిగలిగి యుండునతఁడే పండి

* బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేర్కే స్ఫులింగకే, అక్రూరే క్రూరకే
చైవ సమదృక్పండితో మతః. ౧౪. అని మూలము.

తుఁడు. మానవులయం దెవ్వఁడు నాభావమును భక్తిశ్రద్ధలు
గలిగి సంభావించుచుండునో యాపురుషునకు శీఘ్రమే స్పర్ధ
యు, నసూయయుఁ, దిరస్కారము, అహంకారములు నశిం
చును. *తాఁ యుభగవత్కార్యము కసూయపడి తన్ను నవ్వు
చున్న బంధువులను, శరీరాభిమానము సిగ్గును బోఁద్రోలి సర్వ
భూతాంతర్యామి యీశ్వరుఁ డనుబుద్ధిచేత శునకములకుఁ
జండాలురకు గోవులకు గాడిదలకు నమస్కరింపవలయును.
సర్వభూతములయందును నాభావము చక్కఁగాఁ గుదురుకొను
దనుక మనోవాక్కాయవ్యాపారముల నీరీతి నుపాసింపం
దగును. అట్లుపాసించువానికి వరుసగా సర్వము బ్రహ్మస్వరూప
ముగాఁ గనఁబడుచుండు. అన్నింటియం దీశ్వరదర్శనమునఁ గలి
గినజ్ఞానముచేత నిట్లు చూచుచుండువాఁడు బంధముక్తుఁడై
సర్వోపరతి నొందును. † సర్వభూతములయందు నేనే యున్నఁ
వాఁడనని మనోవాక్కాయవృత్తులచేత నాభావము కలిగియుం
డుటే సమస్తసులభోపాయములయందుఁ జక్కనియుపాయము.
ఇదియే నాసమ్మతము. సఖా! ఎవ్వఁడు నిష్కాముఁడో వానికి
నాధర్మముల నాచరింప మొదలుపెట్టుటయందు సుంతయు
విఘ్నము కలుగదు. ఈధర్మము నిర్గుణముగ నాచే నిశ్చితం
బయ్యెను. నిష్ఫలప్రయత్నముగల ధర్మమైనను గాంక్షమాని
భగవంతునియందు సమర్పింపఁబడినపక్షమున నది ధర్మంబే

---

*విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ దైహికీం, ప్రణమేద్దండవ
ద్భూమావాశ్వచండాలగోఖరం, ఈశ్వరో జీవకళయా ప్రవిష్టో భగవానితి.
౧౬. అని మూలము. †అయం హి సర్వకల్పానాం సధ్రీచీనో మతో మమ,
మద్భావ స్సర్వభూతేషు మనోవాక్కాయకర్మభిః. ౧౯. అని మూలము.

యగు. నాకుఁ బ్రీతిని గల్గించును. నిరర్థమగు నాయాసమును గల్గించునదియయ్యు నది లోకమున భయము శోకము మొదలగువానిని పలాయనము మొదలగు క్లేశములను గలిగించును గదా. అసత్యమగు మానవదేహమునందు సత్యము, అమృతము నగు నారూపమును గాంచుటయే బుద్ధిమంతులగువారి బుద్ధియు నేర్పరుల నేర్పు నగును.

సాధుమతీ! దేవతలకుంగూడ దుర్గమంబగు నీబ్రహ్మవాదమును సంగ్రహరూపమునను భావము విస్తరించియు నీకుఁ దెలిపితిని. విస్పష్టములగుయుక్తులుగలుగ జ్ఞానయోగమంతయు నీకు నుపదేశించితిని. దీని నేపురుషుఁ డెఱుంగునో వాఁడు సంశయములు వదలి ముక్తుఁడగును. నే నీకు విస్తరించిన యీ ప్రశ్నోత్తరములను జక్కఁగా వినునతఁడు శాశ్వతమగురహస్యము నగుపరబ్రహ్మమును బొందును. ఈయుపదేశమును నా భక్తులకు బోధించుబ్రహ్మవిద్యాప్రదునకు నేను నాత్మదానము చేయుదును. పరమపవిత్రమగు నీవిషయమును బఠించువాఁడు జ్ఞానదీపసహాయమున నన్నుం గనఁబఱచి దినమునకు దినము పావనత నాపాదించు. నిశ్చలమనస్సుతో శ్రద్ధతో దీని విన్న మానవుఁడునాయందుఁ బరమభక్తిగలిగి కర్మబంధవినిర్ముక్తుఁడగును. సఖా! ఉద్ధవా! బ్రహ్మవిషయము చక్కఁగాఁ దెలిసినదియా? నీమనమునఁ గలశోకమోహములు విడిపోయెనా? నీ వీయుపదేశమును దాంభికునకు, నాస్తికునకు, మూర్ఖునకు, విననిచ్ఛగింపనివానికి, భక్తిహీనున్యనకు, దుర్వినీతునకు, దెలుపకుము. ఈచెప్పినదోషములు లేనివానికి బ్రాహ్మణప్రీతిగలవానికి నీయందుఁ బ్రేమముగలవానికి సాధువునకుఁ బరిశుద్ధుఁడగువా

నికిఁ జెప్పందగును. స్త్రీలకు శూద్రులకు భక్తికలిగినయెడల
వచింపందగు. జిజ్ఞాసువులు (నన్నెఱుంగఁగోరువారు) దీనినెఱిం
గినయెడలఁ దెలిసికొనఁదగినవిషయములు వేఱేవియు నుండవు.
అమృతపానముచేసినవానికి మఱొకపానకము త్రాగవలయు
నన్నయూహయైనం గల్గునా? కలుగదుకదా!

జ్ఞానకర్మయోగ వార్తాదండధారణములయందునరులకుఁ
గలధర్మార్థ కామమోక్షము లనఁబడు పురుషార్థములు నేనే
యని నమ్మును. *మనుష్యుఁడు సర్వకర్మములను వదలి నా
కర్పణముచేయఁగా నతనికి మేలుచేయ నేను బూనియుందును.
అత్తఱి నతం డమృతత్వమునొంది యాత్మభూతుండగును. అని
యీరీతి నాపరమాత్మ యోగమార్గముల నన్నింటిని జక్క
బోధింపఁగా నుద్ధవుం డుత్తమశ్లోకుఁడగు నాశ్రీకృష్ణపరబ్రహ్మ
మాటల నాలకించి యానందబాష్పపరిపూర్ణనేత్రుఁడై ప్రీతి
బాహుళ్యముచేత డగ్గుత్తికతోఁ గొంతవడి యూరకుండి
యవ్వల ధైర్యముచేతఁ బ్రణయమునఁ దాఱుపాఱగు చిత్త
మొకతెఱంగుగావించుకొని తనను సఫలమనోరథునిగా భావిం
చుచుఁ దనమస్తకము భగవత్పాదాబ్జములు సోఁకునట్లు నమ
స్కారము శాస్త్రసమ్మతముగా నొనరించి దోసిలొగ్గి శ్రీహరి
కిట్లు విన్నవించెను.

బ్రహ్మకుఁ దండ్రివగు నోపరమేశ్వరా! నన్నాశ్రయించి
వదలకయున్న మోహాంధకారము తమసాన్నిధ్యమహిమమున

---

* మర్త్యో యదా త్యక్తసమస్తకర్మా నివేదితాత్మా విచికీర్షితో మే,
దామృతత్వం ప్రతిపద్యమానో మయాత్మభూయాయ చ కల్పతే వై. ౩౪.
మూలము.

దూరముగాఁ బరుగెత్తినది. సూర్యసన్నిధి నున్నవానికి శీతాంధకారభయములు గలుగవుకదా. అయినను బరమకారుణికుఁడగు నాలో జ్ఞానదీపము వెలిఁగించితివి. కృతజ్ఞుఁడగువాఁ డెవ్వఁడుగాని నీపాదద్వంద్వముకాదని యొండొకనిని శరణమని యాశ్రయింపఁదలంచునా? వృష్ణ్యంధకులమీఁదను, దాశార్హసాత్త్వతులమీఁదను సృష్టివర్ధనంబగు నాత్మమాయచే దృఢముగ వ్యాపింపఁజేయఁబడిన నాకుఁ గలస్నేహపాశమును నీ వాత్మజ్ఞానఖడ్గధారను దునిమితివి. మహాయోగీశ్వరా! నీకు నివే నమస్కారములు. నీపాదారవిందములమీఁద నెడతెగని భక్తి కుదురునట్లు నన్ను శాసింపుము. అని ప్రార్థించుటయు నా శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పలికెను.

## ఉద్ధవుఁడు శ్రీహరియనుమతిని బదరికాశ్రమమున కరుగుట.

ఉద్ధవా! నాయాజ్ఞచొప్పన బదరికాశ్రమమునకుం బొమ్ము. అది నాయాశ్రమము. అందుండి నాపాదతీర్థమగు నభ్రతటినీపావనోదకముల స్నానాచమనాదు లొనరించి పరిశుద్ధుఁడవై యలకనందానదీసందర్శనముననే సకలకల్మషవిరహితుఁడవై నారచీరలు ధరించి వన్యములగు పదార్థములుమాత్రముపయోగించుచు సుఖస్థితిం గాంచి నిస్పృహుఁడవై ద్వంద్వదుఃఖములకు నోర్చి సుశీలమే యలంకారముగా నుండ నింద్రియములజయించి పరమశాంతుఁడవై నీవ్రాహించినట్లే చిత్తము ప్రవర్తిల్లునట్లు చేసికొని జ్ఞానవిజ్ఞానములం గలిగి నాయుపదేశించినజ్ఞానమును నిరంతరము చింతించుచు నాపైననే వాఙ్మనస్సుల నునిచి నాధర్మముల నాచరింప నాసక్తికలిగి సత్త్వరజస్తమోగుణములగతులకు లోఁబడక వానికెల్లఁ బరుండనగు.

నన్నుఁ బొందుము. అని యీగతి భవసాగరము నవలీలదాఁటఁ దగినమార్గము నుపదేశించువారలలో శ్రేష్ఠుండగు నాపుండరీకాక్షుండు సంప్రీతి నాజ్ఞ యీయఁగా నుద్ధవుం డాదేవదేవునకు ముమ్మాఱులు ప్రదక్షిణముచేసి పాదపద్మములుసోఁకఁ దలనుజేర్చి నమస్కరించి భగవంతు నుపదేశమున శీతోష్ణాది ద్వంద్వములకు లోఁబడనివాఁ డయ్యును నాపరమకరుణాత్ముని వదలిపోవఁజాలక యెట్లో పయనముసాగింప నిశ్చయించి యరుగుచు నాసమయమునఁ గన్నులనుండి బాష్పవారి ధారగాఁ గాఱుచుండఁగాఁ బ్రేమాతిశయశీతలచిత్తుఁ డగుచు శిరస్సున నాబ్రహ్మాండనాయకుని పాదుకల ధరించి యెన్నియోసారులు నమస్కరించి యాకార్యమునఁ దృప్తినొందక శ్రీహరి పొమ్మని యానతీయఁగా బదరికాశ్రమమునకుం బ్రయాణము సాగించెను.

ఈవిధమున మహాభాగవతులలో మేటియగు నాయుద్ధవుఁడు భగవంతుని నాత్మసంస్థితునిగాఁ జేసికొని బదరికాశ్రమమునకుం బోయెను. అందు జగదేకబాంధవుఁడగు నాలక్ష్మీనాథునియాజ్ఞరీతి నించుకయేఁ దప్పకుండఁ దపంబొనరించి శ్రీహరి పదమునొంద నర్హుఁడయ్యెను. యోగీశ్వరారాధితచరణసరసిజుండగు ముకుందుఁడు పరమభాగవతశిఖామణియగు నుద్ధవునకు నుపదేశించిన యానందసముద్రమనందగు భక్తియోగసంకలితమగు నీజ్ఞానామృతమునే మానవులు శ్రద్ధయు భక్తియుం గలిగి సేవింతురో వారెల్ల ముక్తులగుదురు. ఉద్ధవుఁడు ముక్తుఁ డగునని వేఱుగాఁ జెప్పవలెనా? తుమ్మెద పుష్పరసమునుబోలె నివృత్తిమార్గము నవలంబించువారలకు సంసారపరితాపమును

దీర్చుటకుఁ వేదములనుండి జ్ఞానవిజ్ఞానసారమగు నమృత ముద్ధరించియుఁ బ్రవృత్తిమార్గావలంబకులకు జరామరణాదిభయము దొలఁగింప సముద్రమునుండి యమృతము నుద్ధరించియు నాయాయధికారులకుఁదగినట్లు తన్నాశ్రయించినవారికిఁ గోర్కెల నొసంగిన శ్రీపరమకరుణానీరధి పురుషోత్తముఁడు సర్వాద్యుఁడు వేదకర్తయునగు శ్రీమన్నారాయణమూర్తికి నమస్కరింతునని శుకయోగి పరీక్షిన్మహారాజునకుం దెలిపెను.

మహాశయులారా! శ్రీభాగవతమున నేకాదశస్కంధమునుండి వ్రాయఁబడిన యీయమూల్యవిషయ రత్నమును దనివిచనఁ గాంచితిరి. చక్కఁ బఠింపఁదగినది. దీనిసారమును దెలుపఁబూనిన దీనికంటెఁ బెద్దదగును. కానఁ గొలఁదిపంక్తులలో ముగింప నెంచితిని. బ్రహ్మాదులు ద్వారకానగరమున కరుదెంచి భగవంతుని శ్రీకృష్ణుని మానవలోకనివాస మింకఁ జాలు. గోలోకమున కరుదెమ్మని ప్రార్థించిరి. మానవలోకమున నింకనుండి చేయఁదగు కార్యజాల మెద్దియని శ్రీహరియు నంతకు ముందే యాలోచించెను. బ్రహ్మాదులును దమరభ్యర్థించిన కార్యము ముగియఁగా మరల స్వస్థానమనఁదగు దివ్యపదము నలంకరింపుమా యని ప్రార్థించుట యుక్తమే. కర్మసిద్ధాంత రహస్య మిదియే. ఎవ్వరెవ్వరికర్మముల ననుసరించి వారివారికి నిగ్రహానుగ్రహరూపమగు ప్రసాదము నొసంగి శ్రీహరి కృతకృత్యుఁ డయ్యెను. నిగ్రహముకూడఁ బ్రసాదమేనా యని కొందఱకుం దోఁచు. అది వాస్తవముగా ననుగ్రహమే. పరాత్పరునిచే నిగ్రహింపఁబడుటయన్నఁ దత్పాపనివృత్తిగావింపఁబడుటయే యని యర్థము. భక్తున కేపదమో యాపదమే యతనికిం

గల్గును. భగవంతుని నిగ్రహానుగ్రహములకుఁ బాత్రులగు వారు పొందుపద మొక్కటియే యగు. సంశయము లేదు. ఎల్లరు తపస్సు లోనగువాని నొనరించి శ్రమపడుటకంటె భగవంతుని దూషించి యతనిచేఁ జావరాదా యనుదురేమో యీ ప్రశ్నము చక్కఁగా నాలోచించి చేసినది కాదనవచ్చును. ఎట్టి కర్మమున కెట్టిఫలమో యట్టులొసంగక యెల్లరకు నొక్క ఫలమిచ్చుట భగవంతునికార్యము కారాదు. కర్మస్వరూపుఁడు తానేయయ్యు నాసిద్ధాంతము నతిక్రమించిన స్వోక్తివ్యాఘాత దోషమున కుదాహరణభూతుఁడు కాకపోవునా. ఈ విషయమున నెంత యోజించినను గర్మసిద్ధాంతమే బలవత్తమమనియు నాయాయికార్యముల నాయాయిజీవులచే నదియే చేయించుచుండుననియుఁ దేలుచున్నది. అంతకంటె వేఱేదియు నూహింప బ్రహ్మాదులకైన నవకాశము లేదు.

బ్రహ్మాదు లేల వచ్చిరి? అన్న దొకప్రశ్నము. రాఁబోవునది కలికాలము. ద్వాపరయుగాంతమైనది. కలి యడుగిడ నుంకించుచున్నది. సర్వేశ్వరుఁ డుండునంతదనుక దానికిఁ బ్రవేశించు నవకాశము దొరకదు. దుష్కర్ములనే విశేషించి యొనరించుప్రాణికోటులు పుట్టుచున్నవారు వారికర్మప్రవృత్తి సాగవలెను. దాని కడ్డుపడుటకు భగవంతునకు శక్తిలేదా యనరాదు. కర్మానుభవములుతప్పవన్న తనయాజ్ఞ యప్రతిహతముగా సాగవలయును.

1. "యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్."

ఆ వాక్యము భగవదుపదిష్టమే కదా! అట్టి కట్టడి

కలికాలమున శ్రీహరి భూలోకమునరూపమును దాల్చియుండఁ
గూడదనియే బ్రహ్మాదులు ద్వారక కరుదెంచి శ్రీహరికి విన్న
వించిరి. భగవంతుఁడు నంగీకరించెను.

బ్రహ్మాదు లరుదెంచి శ్రీకృష్ణుని రమ్మనుటయు శ్రీహరి
నేను వచ్చె యూహించితిననుచు వీర్యమదమత్తమగు నీయదు
వంశము దుష్పథములం బ్రవర్తిల్లును. గాన లోకులకు బాధ
కలుగును. దీనిని నుదముట్ట సంహరించి నేను మర్త్యలోక
మును వదలిన నీవంశము వారు బాధింపకయుండ జగము మనఁ
గలదని పలుకుటయుఁ బిదపఁ గృష్ణుఁడు యాదవులనెల్లం బిలిచి
బ్రాహ్మణశాపమును దలంచి ప్రభాసతీర్థమున కరిగినమేలని తెలు
పుటయు వారెల్ల రట్లే యని యంగీకరించుటయు నెఱింగి
యుద్ధవుఁడు భావికార్యగతుల నాలోచించి శ్రీహరి యింక
లోకాంతరమున కరుగును యదువంశము నశించును. ద్వారక
సముద్రమున మునుంగును. అని నిశ్చయించి పరమేశ్వరునికడ
కరిగి స్వామీ! బ్రాహ్మణశాపమున నశింపకయుండ నీవంశము
నుద్ధరింపఁజాలియు నీ వామార్గమున నాదృతింగాంచక యీ
మర్త్యలోకమును వదలిపోవఁబూనితివి. నేను నీపాదపద్మముల
వదలియుండఁజాలను. నన్నుం బిలుచుకొనిపొమ్మాయని పాద
ములపైఁబడి యంగలార్చెను. ఉద్ధవుఁ డిట్లు ప్రార్థింపఁగా
శ్రీహరి యతని కంతవేగముగ ముక్తిగలుగుమార్గము లేదని
యూహించి యతనికర్మము ననుసరించి కొంతకాలము తపం
బొనరించి యొందటో తనతత్త్వ ముపదేశించి పిదప ముక్తి
నొందుపద్ధతి కలదని తలంచి తత్త్వము నుపదేశించెను. దీనిం
బట్టి యాలోచింపఁగా

శ్లో. "కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః,
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.
కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః." ౧౭

"గహనా విషమా, దుర్జ్ఞేయా" అని శంకరభాష్యము.

అను నీగీతావాక్యమున భగవంతుఁడు స్వాభిప్రాయము నెంత చక్కఁగాఁ దెలిపెనో స్పష్టమగును. ఉద్ధవుఁ డత్యంత భక్తుఁడు. శ్రీహరియే పెక్కుతావుల నాతని జెలికాఁడా యని సంబోధించెనుకదా. అట్టి యాంతరంగికమిత్రుఁడే యైనను తత్కర్మము వెంటనే ముక్తికిం గొనిపోవఁజాలదనియుఁ, దచ్చిత్తము పరిపక్వమగుటకుఁ దపశ్చర్య యవసరమనియు నాలోచించియే సర్వజ్ఞుఁడు కావున శ్రీహరి యతనిమనస్సు పరిపక్వమగుటకుఁ దగినయుపదేశము చేసెను. మిత్రుఁడు శిష్యుఁడు నగువాని నుద్ధరింపకపోవుటకుం గారణము కర్మమార్గము దుర్భేద్యమని తా నాజ్ఞాపించినవిషయము సిద్ధాంతము చేయుటకే కాక మతేమగును?

తొలుదొలుత హరి యుద్ధవునకు జ్ఞాన ముపదేశించుచునందుఁ బ్రధానముగా సమదర్శనుఁడవై తిరుగుమనెను.

శ్లో. "త్వం తు సర్వం పరిత్యజ్య స్నేహం స్వజనబంధుషు,
మయ్యావేశ్య మనస్సమ్యక్సమదృగ్విచరస్వ గామ్."

అనువాక్యమే పైయర్థమును దేటపఱచెడిని.

భూప్రదక్షిణమున ననేకలాభములు గలవు. బహువిధ జీవు లగపడుదురు. వారివారిం జూచినపుడు సమదృష్టి

స్థిరముగా నున్నదా లేదా యని పరీక్షించుకొనవచ్చును. వికారాకృతులం దిలకించినపుడును, సుందరతమాకారములఁ బరికించినపుడును సమముగా దృష్టి నిలుపవలయును అది లేదేని సమదర్శనుఁ డెట్టులగును?

"సర్వత్ర సమదర్శనః"

అనికదా భగవంతుని యాశయము. అది లేకపోయినచో నెన్నికర్మములు చేసిన నెన్నితత్త్వము లుపదేశరూపమునఁ బడసినను వ్యర్థములే యగునుగదా. ఇంద్రియనిగ్రహము ప్రధానమని తెలిపెను అది దొరకనిచో మనస్సునఁ గల భేదము తొలఁగ నవకాశమే లేదు.

శ్లో. "జ్ఞానవిజ్ఞానసంయుక్త ఆత్మభూతశ్శరీరిణాం,
ఆత్మానుభవతుష్టాత్మా నాంతరాయై ర్విహన్యసే."

అను భగవద్వాక్య మాయుపదేశసార మనవలయు. జ్ఞాన మనఁగా వేదతాత్పర్యనిశ్చయము విజ్ఞానమనఁగా దానియర్థానుభవము. ఇవి కలుగవలయును. అనఁగా స్వేచ్ఛ ననుసరించి ప్రవర్తింపక వేదవిహితమగుమార్గము నాశ్రయించి దాని యర్థముచొప్పునఁ బ్రవర్తించి యనుభవమున నది సరిపడునట్లు చేసికొనవలయుననియే పైయుపదేశవాక్యసారము. ఏసమయమున కేది యుక్తమని తోఁచునో యదియే యుత్తమమార్గమనుకొని ప్రవర్తింపరాదనియు, వేదము భగవదాజ్ఞారూపము కాన దాని ననుసరించినఁగాని భగవత్కరుణకుఁ బాత్రుఁడు కాఁజాలఁడని దానిభావము.

ఉద్ధవునకు శ్రీహరి క్రమముగా నాత్మతత్త్వప్రాప్తిసాధనముల నెఱిఁగించి బద్ధముక్తులలక్షణములు వివరించిసాధులక్షణ

భక్తిలక్షణముల విస్తరించి సత్సంగమహిమమును దెలిపి కర్మానుష్ఠానావశ్యకత్వము నుద్ఘాటించి, విద్యోదయప్రకారము తేటపఱచి, భక్తియోగము ముఖ్యమని బోధించి, ధ్యాన యోగలక్షణము తెల్లముగావించి, యోగసిద్ధుల మనోగమ్య ములుచేసి, ఆత్మభూతులను నిరూపించి, యాశ్రమధర్మముల నెఱుకపఱచి, జ్ఞానికిఁ గర్మాభావమని యెఱుకపఱచి, యమాదు లను, భక్తిజ్ఞానక్రియాయోగములను, ద్రవ్యాదిగుణదోషము లను,తత్త్వసంఖ్యాభేదనిర్ణయమును,ప్రకృతిపురుషవివేకమును, సాంఖ్యమును, గుణవృత్తిభేదములను, భగవదారాధనవిధాన మును, జ్ఞానభక్తియోగసంగ్రహవిషయముల నూది చెప్పెను. ఈవరుస ననుసరించియే యెల్లరు ప్రవర్తింపవలయునని కాదు. ఈవిషయములు తెలియఁదగినవి. ఇందెవ్వాని కెద్ది కర్మానుసా రము మదినాటునో యద్దాని నాశ్రయింపవలయును.

ఈయుపదేశమునఁ బెక్కుతావుల భగవదారాధన క్రమము చెప్పఁబడినది. అందు

"గృహీతమూర్తిత్రయ ఈశ్వరేశ్వరో
జగాద సప్రేమమనోహరస్మితః."

అనుభావ మనేకపర్యాయములు తెలుపఁబడినది. బ్రహ్మ విష్ణు శివరూపములను సృష్టిపాలనసంహార కార్యములకొఱకు ధరించువాఁడని దానిభావము. ఈముగ్గురు తత్స్వరూపులని కదా దానిసారము. ఆతఁ డెవ్వఁడు? పరబ్రహ్మము, సర్వశబ్ద వాచ్యము, సర్వాధారము,సర్వవ్యాప్తము, దానియంశము బ్ర. వి. శంకరులు. అని శ్రీమద్భాగవతమే బోధించుచుం గా విష్ణువే శంకరునికంటె శ్రేష్ఠుఁడని యేల నడుముగట్టు

కొని కలహమునకుఁ బూనవలయునో తోఁపకున్నది. ఆవాద మునకంటే నీచమగువాద మేమున్నది? శ్రీకృష్ణుఁడే

"విసృజ్యస్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాంచదైహికీం,
ప్రణమే ద్దండవద్భూమావాశ్వచండాలగోఖరమ్.
ఈశ్వరో జీవకళయా ప్రవిష్టో భగవానితి."

అని బోధించెనుగదా. దీనిభావ మేమి? కుక్కలకు, వానిం దినుచండాలునకు, గోవులకు. గాడిదలకు లజ్జమాని దేహా భిమానమునువదలి భేదదృష్టింబాటింపక సాష్టాంగనమస్కారము చేయవలయును. ఏభావమున? భగవంతునికళ యందున్నదని. అనఁగా సర్వత్ర వ్యాపించినతత్త్వ మొక్కటి కలదని యెఱిం గినవారికి భేదభావము కలుగదనియేకదా సారము. ఇట్టులుం డఁగా శివకేశవులలోఁ దారతమ్యము కలదనువారికి శ్రీహరి వాక్య మేమాత్ర ముపయోగించునో తెలియకున్నది. సర్వము హరిమయ మనవచ్చును. సర్వము శంకరమయ మనవచ్చును. ఎట్లు పొసఁగును? అనరాదు. ఈరెండునామములు నాపరమా త్మకుఁ గలవన్ననిశ్చయమున్న వారి కావేరు నభేదమున బుద్ధి భేదము కలుగఁబోదు. సర్వనామములు భగవంతునకుఁ జెల్ల వనువారి కాభేదము తప్పక కలుగును. వారలపై నా శ్రీహరికిఁ గృప కలుగదనుట నిశ్చయము.

"అయం హి సర్వకల్పానాం సధ్రీచీనో మతో మమ,
మద్భావస్సర్వభూతేషు మనోవాక్కాయ కర్మభిః."

అని సులభమగు నుపాయమును శ్రీకృష్ణుఁడు తెలిపెను. ఏది యాసులభోపాయము? సర్వభూతములయందు నేనే యున్న వాఁడనని మనోవాక్కాయవృత్తులచేత నాభావము కలిగి

యుండుట. మాటలచే నీభావము తెలిపిన లాభములేదు. దేహవ్యాపారములచేఁ దేటపఱచినంతనే లాభములేదు. మనో వృత్తిచేతంగూడఁ దెలుపవలెను. అనఁగాఁ ద్రికరణశుద్ధిగా సర్వస్థలములయందుఁ బరమాత్మ యున్నవాఁడని తదితరము లేదని యొఱింగిననే భగవంతునికరుణ కలుగును. లేకయున్న సున్నయే. మాటలవలన లాభము భోజనమే కాని వేఱొకటి దొరకదు. ఇది మూటికి ముమ్మాటికి సత్యము.

ఇఁక నిందు యోగవిషయము వి షించి కలదు. దాని సార మేమనఁగా యోగాభ్యాసమునకు ఫలము ముక్తియే కాని వేఱొండు కాదు. అన నదియే ఆవిషయమును బోధించుచు లోకమునఁ గొందఱుకు యోగులు వేషధారులై పర వంచకులై తిరుగుచుందురు. వారు స్వార్థపరులు. (సాపాటు రామన్నలు) వారిమాటలకు లోఁబడరాదు అని వారి తెలి పెను. వాస్తవముగా లోకమున నిపుడు పెక్కండ్రు యోగులు కలరు. వేదాంతులు కలరు. వారు పరవంచకులగుట సత్యము. అర్థార్జనమునకై పెక్కువేషములఁ దిరుగుచుఁ బామరులం ర్చుకొని ముక్తిప్రదాత లగుచుందురు. అట్టివారిమాటలకు లోఁబడువారు,

"రెంటికిం జెడిన రేవణ్ణ నాదున నీరజేక్షణా"

యున్నట్లే యగుదురు. యోగి సర్వదా భగవంతునిపై మదిఁ జేర్చి తద్ధ్యాననిరతుఁడై యుండుంగాని పామరులగు శిష్యు లను జేర్చుకొని తిరుగుచుండఁడు. "సర్వసంగవినిర్ముక్తః" అన్న గవద్వాక్యమే యీభావమునకుఁ బ్రమాణము. పరిపక్వజీవుఁడు దొరకినచో నాతని కుపదేశించునుగాని "యుపదేశించెదను

రండు. ముందు దక్షిణతెండు అది చూచినఁగాని నాకుఁ బైపని తోఁపదు" అని యుద్ఘోషింపఁడు కావున నట్టివారిని గాంచి మోసపోవువారు పామరులే యనక తప్పదు.

## భగవదారాధనక్రమము.

దీనింగూర్చి యించుక వినుఁడు.

"అర్చాయాంస్థండిలేఽగ్నౌ వాసూర్యేఽప్సుహృదివాద్విజే,
ద్రవ్యేణ భక్తియుక్తోఽర్చేత్స్వగురుంమామమాయయా."

నన్నారాధించుమార్గము లివి. ప్రతిమయందో, భూమినలికి చక్రాకారమండలమో కమలాకారమండలమో యలరించి దానియందో, అగ్నియందో, సూర్యునందో, జలమునందో, హృదయమునందో, బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగు బ్రాహ్మణునిం బ్రార్థించి యతనియందో, తనకుగురువగు నన్నుఁ గపటములేని భక్తితో నారాధింపవలయునని. ఇవియే యర్చారూపములని భగవంతుని భావము. దీనిసార మేమి?

"అర్చాదిషు యదా యత్ర శ్రద్ధామాం తత్ర చార్చయేత్,
సర్వభూతే ష్వాత్మని చ సర్వాత్మాహమవస్థితః."

అన్నభావమే కాదా. ఎవ్వనికిఁ బూర్వోక్తములగు ప్రతిమాదులయం దెప్పు డెద్దానియందు శ్రద్ధ గుదురునో యందు నన్నుఁ బూజింపవలయును. సర్వాత్మకుఁడ నగునేను సర్వభూతములయందు దనయందు నుందును. అని పై భగవద్వాక్యమునకుఁదాత్పర్య ము అనఁగా నేమనవునకేయర్చారూపమందు భక్తిశ్రద్ధలు కుదురునో యందుఁబూజించిన నేనుదృప్తుఁడ నగుదునని హరి యాశయము. దీనిచేఁ బ్రతిమాదులు నిమిత్తమాత్రములే యనియు భావనయే ప్రధానమనియు సారము. విగ్రహ

ములను బూజించుటయు నందొకటి దేవాలయములే కట్టి యందే శిలామయమూర్తిని నిలిపి దానినే పూజింపవలయునన్నది దుర్వాద మనవలయును. దేవాలయములు పామరులకొఱకు నిర్మింపఁబడినవి. ఆవిధానమే ముక్తిదాయకముకాని వేఱొకటి కాదనుట మంచివాదముకాదు నిరాకారుఁడు సర్వాకారుఁడు నగుభగవంతు నేకాకారముగా ధ్యానించు టుచితముకానికర చరణాదివిభూషిత ప్రతిమయందే భావించు టుత్తమముకాదు. మానసికార్చన ముత్తమోత్తమమని మహాత్ము లనువదింతురు అదియే నిజమగుపూజ. పూజకు భక్తిప్రధానముకాని వస్తువులు కావు.

"భక్తస్య తు యథాలబ్ధైర్హృదిభావేన చైవహి." ౧౧.స్కం.౧౮.

భక్తుఁ డగువాఁడు దొరకినవస్తువులతో విధియుతముగాఁ బూజింపవచ్చును. లేదా ఆపదార్థములను మనస్సునందే భావించి పూజింపవచ్చును. భక్తిప్రధానముకాని పూజాద్రవ్యములు ప్రధానములుకావు. అనియే దీనిసారము. ఈభావమునే శ్రీహరి గీతాశాస్త్రమునందు.

"పత్రం పుష్పం ఫలం తోయం యోమేభక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస సి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం. ౨౭
శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః,
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి. ౨౮
సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః,
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవసమంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః." 30. భ.అ.

అని యుపదేశించెను. భక్తిప్రధానమని వస్తుసంభారము ప్రధానము కానేకాదని చేయుకర్మమునంతయు నా కర్పించిన వాఁడు నాకుఁ బ్రియుఁడగునని, బాహ్యాచారము లనవసరములని,మనఃపరిశుద్ధిప్రధానమనిగీతాభిప్రాయము.నిర్జితేంద్రియుఁడు భక్తిచేఁ బత్రమో ఫలమో జలమో యేదో యొకటి సమర్పించిన నది పరమపావనమని గ్రహింతునని హరి పలికెఁగదా. ఆభావమే పై నాయూహనుస్థిరపఱచుచున్నది. ఈయారాధనాపద్ధతి నుపదేశించువైఖరింబట్టి పరిశీలింపఁగా భగవంతుని గనుఁ మార్గములలో భక్తిగలిగి సర్వగతునిగాభగవంతు నెఱుంగుట యనునదియే యని తేలెడిని. మఱియొక్కవిశేషము గలదు.

"యథా స్వనిగమేనోక్తం ద్విజత్వం ప్రాప్య పూరుషః,
యథా యజేత మాం భక్త్యా శ్రద్ధయా తన్నిబోధ మే."ర

తమతమ లోక్తమగుపద్ధతిచే సంస్కారమునొందిన బ్రహ్మక్షత్రియ వైశ్యులు, నన్నెట్లు శ్రద్ధగలిగి పూజింపవలయునో, యామార్గముం దెలిపెదనని హరి పలికెను. బ్రహ్మ క్షత్రియ వైశ్యులను ద్విజాతివారు పూజించుపద్ధతివేఱు అనియు, ద్విజత్వములేనిశూద్రు లారాధించుపద్ధతివేఱు అనియు భావము. ఫలము సమానమనియే సారము కులధర్మములను వదలరాదని శ్రీహరి యాజ్ఞయని మనము నిశ్చయింపవలయును. దానిచే భగవంతునిదృష్టిలో నొకజాతిఎక్కుడనివేఱొకజాతిఁ తక్కువయనిభావము కాదు. సర్వవర్ణములకుఁ బూజ సమానము కాదని యీవిధితాత్పర్యము. తొలుదొలుత జాత్యుచితధర్మములనాచ

శించుచు భగవంతు నారాధించి తదనుగ్రహమునకుం బాత్రుఁడై యెపుడు సర్వసమత్వమలవడునో సమలోష్టాశ్మకాంచనత్వము సిద్ధించునో యప్పుడు సర్వదర్శనుఁడు కావలయుననియు నట్టివానికిఁ గులధర్మములుగాని యితరములగు విధినిషేధములుగాని యక్కఱ - దనియు నట్టిస్థితియం దాభక్తుఁడు సర్వమును భగవంతునిగానే చూచుననియు నీయుపదేశసారతమార్థమని యెఱుంగవలయును. అట్టిజ్ఞానికిఁ గర్మాభావమే యని యుపదేశించెను. ఆయుపదేశమునే ప్రధానమని యెల్లవారును గ్రహింపరాదు. అట్టి యోగ్యతగలిగినపక్షమున నాయుపదేశము పనికి వచ్చునని గ్రహింపరాదు.

"జ్ఞానవిజ్ఞానయజ్ఞేన మామిష్ట్వాత్మాన మాత్మని,
సర్వయజ్ఞపతిం మాం వై సంసిద్ధిం మునయోన్వగన్." ఽ

అనికదా యాయుపదేశకాలమున భగవంతుఁడు పల్కెను. ఆస్థితియందు ప్రపంచధర్మముల ననుసరింపవలసిన యవసరమే యాజ్ఞానికి నుండదు. సర్వ మాజ్ఞానిచూపున కాపరమాత్మరూపముగనే తోఁచును. అతని ధర్మములను మనము కూడ ననుసరించునెడల నన్నివిధములను దత్సమానులము కావలయును. అట్టియోగ్యతలేక యతనిధర్మముల నవలంబింతుమేని యధఃపతితుల మగుదుము. ఎంతదనుక సర్వసమత్వ మలవడదో యంతవఱకు వర్ణాశ్రమధర్మము లాశ్రయింపఁదగినవే యైయుండును. వదలినవాఁడు భగవత్కారుణకుం బాత్రుఁడు కాఁడు. భగవంతుఁ డుద్ధవునకు సాంఖ్యమును బోధించెను. దాని నించుక యరయుదము

సాంఖ్యము మోక్షకారణము కాదని కొందఱందురు.

కాని దానినుండియే భేదబుద్ధి తొలంగు నుపాయ మెఱుంగఁ దగియుండును.

శ్లో "యద్విజ్ఞాయ పుమాన్ సద్యో
జహాత్యద్వైకల్పికం భ్రమమ్." ౧.

అని పరమాత్మ తెల్పెను. భేదనిమిత్తమగుభ్రాంతి సాంఖ్యమునఁగాని తొలఁగదు. భ్రమాత్మకజ్ఞానము నశించినఁగాని పరిశుద్ధజ్ఞాన మలవడదు. దానిప్రకాశమునఁగాని భగవత్తత్త్వనిధి కనఁబడదు కావున సాంఖ్య ముత్తమోత్తమము. సాంఖ్యము నెఱింగినవారు భేదవాదమును దాఁటుదురు. పరమాత్మతత్త్వ మిద్ది యని కనుంగొన నర్హులగుదురు.

శ్రీకృష్ణుఁ డీరీతిగా సమస్తధర్మము లుపదేశించి యుద్ధవునకు దృఢభక్తిజ్ఞానములు కల్పించి బదరికాశ్రమమునకుం బొమ్మని యాజ్ఞ చేసెను ఏల? అనునది యొకప్రశ్నమే యగును. బదరికాశ్రమము హిమాలయమున నున్నది. అందుండువారు శీతాదిబాధల నోర్చుకొనవలయును. అంతియగాక నిర్మానుష్యభాగమగుట నిస్సంగత్వ మలవడ నది యవకాశ మొసంగును. విశేషించి యందుఁ దపస్సిద్ధు లుందురు. సత్సంగతి యన్నింటికంటె నుత్తమమని పెద్దలంగీకరించిరి ఏకాంతవాసము సత్సంగతియు నొక్కొక్కటియే భగవత్కరుణకుఁ బాత్రునిగాఁ జేయుననఁగా నిఁక నా రెండునుగూడిన నడుగనేల? మఱియొక్క విశేషము కలదు. ఆశ్రమములెల్లఁ దపోనిరతులగు మహాత్ముల ◦ _స్సునఁ బవిత్రములుగాఁ జేయఁబడినవి. అందు నివసించి యించుక తపోనిరతి నవలంబించినను ఫలము విశేషముగా లభించును. అందుఁ దపోవిఘ్నము గలిగించుభూతకోటి యుం

డఁజాలదు. ఏవిఘ్నము లేక తపస్సుసాగుట ముఖ్యముకదా. "శ్రేయాంసి బహువిఘ్నాని" యన్నమాట సుప్రసిద్ధమగు టయేకాక యనుభవైకవేద్య మగుచున్నది. కావుననే యం దుల కరుగుమని వారి యాజ్ఞాపించెను. ఆయాశ్రమము నాకుఁ జక్కని యానందమును గూర్చునదియనియుఁ బలికెను. ఆమాట చేతనే మనస్సున కొకవిశ్వాస ముదయించును. దానఁ దపో నిరతి దృఢపడును. అదియేకదా కావలసినపని. ఆవిషయ మెఱింగియే భగవంతుఁ డాజ్ఞాపించెను. ఇట్టు లీయుద్ధవోప దేశము పురుషార్థదానక్షమమై యున్నది. దీనిని జక్కఁగా నెఱింగి యిం దేయంశమునైన ననుష్ఠానమునకుం దెచ్చుకొను వారు కృతకృత్యు లగుదురు.

మహామతులారా! శ్రీకృష్ణోపదేశానంతరమున సాగిన కథ యేమని విచారింపవలయును. శ్రీకృష్ణచరిత్రములు చాల వఱకుఁ బూర్తియైనవి. ఇంక భగవంతుఁడు గోలోకమున కరుఁ గదలంచినకథ వ్రాయవలయును. దాని కించుకముందు శ్రీరా ధామాధవులమాహాత్మ్యమును బరికింపవలయు. మానవులకుఁ దరణోపాయ మద్దానినుండియే కలుగును. కాన దాని నించుక వ్రాసెదను. ఇంకను బెక్కుస్తోత్రము లున్నవి వానినెల్లఁ దడువ నవకాశము లేదు. చరిత్రమునకు సంబంధించినవిషయ ములనే వ్రాసెదను. మన్నింతురుగాక.

### సిద్ధాశ్రమమున శ్రీరాధాదర్శనము.

*రాజా! సిద్ధాశ్రమమాహాత్మ్యము నాలకింపుము. అది

* ఈకథ గర్గసంహితయందుఁగల ద్వారకాఖండమునఁ బదాఱవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగునది. నారదముని యీ ను తెలుపువాఁడనియుం స్మరించునది.

యుత్తమోత్తమము. దానిని స్మరించినంతనే పాపము లడంగును. ఆయాశ్రమమును స్మరించినంతనే శ్రీకృష్ణునితో వియోగము కలుగదు. అట్టి సిద్ధాశ్రమమాహాత్మ్యమును బెద్దలు పెక్కురీతులం దెలుపుచుందురు. ఏమానవులుగాని దానిదర్శించినంతన విష్ణుసాలోక్యముగల్గుభాగ్యము నొందుదురు. దానిని స్పృశించినంతనే విష్ణుసామీప్యము గల్గును. అందు స్నానము చేసిన సారూప్యసిద్ధిగల్గును. అందు నివసించినయెడల సాయుజ్యసిద్ధికలుగు. శ్రీహరికి రాధికకు శాపకారణమున వియోగము గ-గియుండినతరుణమున రాధాంబిక యాక్షేత్రమాహాత్మ్యము విని యందు నత్యంతపావనమగు తీర్థరాజమున స్నానము చేయఁదలంచెను. వైశాఖమాసమున సూర్యగ్రహణము రాఁగా నాసుసమయమున రాధ కదళీవనముననున్నది. కానఁ బ్రయాణముచేయఁగోరెను. గోపికలంగూడి కదలెను శ్రీదాముని శాపము ముగియవచ్చెను. అత్తఱి శిబికనెక్కి యానర్తదేశములయందుఁ గలసిద్ధాశ్రమమునకుఁ బ్రయాణముచేసెను. భగవంతుఁడావిషయము నెఱింగి పదాఱువేల గోపికలంగూడి ముందే యందుఁ బ్రవేశించెను. రాధిక ననుసరించి యుద్ధవీరులగుయాదవు లెందఱో పోయిరి. సిద్ధాశ్రమమున కరిగి యారాధాదేవి విధివిహితముగా స్నానముచేయ నుపక్రమించెను. ఆమెతోడ నాపుణ్యతీర్థమున స్నానముచేయఁగోరియున్న ద్వారకానగరవాసులెల్ల నందుఁ జేరిరి. కాని వారినెల్లఁ బోవకుండ శస్త్రపాణులగుభటు లాజ్ఞ పెట్టిరి. స్త్రీలెల్ల జలములందిగిరి. కొందఱందు స్నానముచేయవచ్చినదేవి యెవ్వరుకయని యడుగసాగిరి. ఏలన నారాధాజన్మరూపము లత్యద్భుత

ములుగా నుండెను. ఈదేవి యేమహాపురుషుని భార్యయగు? ఏయదృష్టవంతుని కుమారితా? యని గుసగుసలుపోవసాగిరి. కొందఱు శ్రీకృష్ణునికడంజేరి మహాత్మా! నీవు సర్వజ్ఞుఁడవు. నీవెఱుంగనివా రీభువనముల నెందైన నుందురా? ఈ దేవి వృత్తాంతము నెఱిఁగింపుమని కోరిరి. వారి ప్రశ్నము నాలకించి భగవంతుఁ డిట్లు చెప్పెను.

ఈదేవి వృషభానునిపుత్త్రిక, సుప్రసిద్ధిఁగన్న రాధిక యనఁబరఁగును. వ్రజేశ్వరి యనియు గోపికాధీశ్వరి యనియు, నీమెనే పిలుతురు స్నానార్థ మీతీర్థమునకు వచ్చెను. ఆమెకు స్నానముచేయునపుడు సందడిగలిగినట్లు తోఁపకుండఁ జేయ భటులు మిమ్మడ్డుచున్నవారు. ఆమెమాహాత్మ్యమత్యద్భుతము. అని శ్రీహరి తెలుపఁగా విని మానినీమణి యనఁబరఁగు సత్యభామ శ్రీహరితో నిట్లుపలికెను. ఆమె సపత్నులలోఁ దాను క్తైమురాలనని రూపసంపదగలదాననని యూహించుకొను స్వభావము కలది. శ్రీకృష్ణా! ప్రాణేశా! రాధయే రూపవతి యగునా. నేనుగాదా. రూపౌదార్యగుణములుగలదాన నని నన్నెందఱో భూషించిరి శతధన్వుఁడు నామూలమునఁగదా చే హతుఁడయ్యెను. అక్రూరకృతవర్మలు నాకై నీవు భయ పెట్టఁగాఁ బాఱిపోయిరి. స్యమంతకమణి నాయింట నుండును. దానిమహిమ మెల్లరకుఁ దెలిసినదియేకదా. దానిని నాతండ్రి కదా యొసంగెను. దాన నాసౌధ మెంత సంపత్సమృద్ధముగ నున్నదో నీవెఱుంగవా? నాయందుఁగల ప్రేమమునఁగదా వు నన్ను గరుత్మంతునిపైఁ గూరుచుండజేసి నరకాసుర యుద్ధమును గాంచునిమిత్తము ప్రాగ్జ్యోతిషపట్టనమునకుం

గొనిపోయితివి. నాదయచేతఁగదా యాపురమునుండి నీకు భార్యలు, పెక్కండ్రు వచ్చిరి. ఛత్రము కుండలము లట నీకు దొరకలేదా. దానికిం గారణము నేనే కాదా. శ్రీకృష్ణా! నాకోరికను ఫలింపఁజేయఁగోరికదా నీ వైరావతసమానము లగు గజములను దెచ్చితివి. నాకైకదా శతమఖునితో విరోధముగొంటివి. నాయింటఁ బారిజాతమును నిలిపితివి. నీవు లోఁబడినది నాపాతివ్రత్యమును గోరియేకదా. సర్వద్రవ్యము లతో నిన్ను నారదమునికి దానమిచ్చితినే, అది నాయందు. నీకుఁ గలప్రీతిచేఁగాదా. కావున నాసమానతంగాంచు నంగ నామణు లెవ్వరును లేరనియే తలంతును. రూపౌదార్యముల నాకు నీడుచేయఁగలవారు గలరా? ఈరాధ యేపాటిది? రుక్మిణీ! నీకంటె రాధ యెక్కుడని హరి పలుకుచున్నవాఁడు. అని హెచ్చరించి తక్కుంగలహరిపత్నులఁ బురికొలిపెను. సత్యభామ యీరీతిఁ బ్రోత్సహింపఁగా స్త్రీస్వభావమున వారెల్ల శ్రీహరిం గాంచి యిట్లు ప్రశ్నించిరి.

శ్రీకృష్ణా! మున్ను రాధామాహాత్మ్యమును బెక్కుసారులు వర్ణించుచుండఁగా వింటిమి. నీ కత్యంతప్రియురాలని యెఱింగితిమి. అట్టి యాయుత్తమాంగనను జూడఁగోరెదము. వ్రజేశ్వరికదా యారాధ. నీయెడఁబాటున మిగుల ఖిన్నురాలై స్నానార్థ మరుదెంచిన యాపురంధ్రీమణిని దర్శింపఁగోరుదు మనిరి. హరియు నట్లే యగుఁగాక యని యాయష్టపత్నుల తోను, బదాఱువేలభార్యలతోను బయనము సాగించెను. అత్తఱి రాధిక బంగారుశిబిక నెక్కి దాసీగణముకొలువ స్నానాము వచ్చుచుండెను. స్నానఘట్టమునకు సమీపమున నా

శిబిక యుండెను ఆమెస్థానమునకు వచ్చుటెఱింగియే యెవ్వారిని రాకయుండ భటులు శస్త్రపాణులై నిలిచి యెవ్వారిని దీర్ఘజలముల దిగక యుండ నడ్డుచుండిరి. రాధిక యత్తఱి మానసమున శ్రీకృష్ణునంఘ్రికమలయుగళమును ధ్యానించుచుఁ దద్గతమానసయై యుండెను. దూరమునుండియే యారాధికను గృష్ణపత్నులు రుక్మిణీసత్యభామాప్రభృతులు దర్శించిరి. ఆదేవీ రూపమును గాంచినంతనే మోహితలై మూర్ఛనొందిరి. సూర్యరశ్ములచే నక్షత్రములవలె రాధాతేజస్సులచేతఁ బరాభవమునొంది యేమియుం దోఁపక తమలోఁ దమ రిట్లు చెప్పుకొనఁబూనిరి. అక్కలారా! ఈరూపము త్రిలోకములఁ గని విని యెఱుంగము. విన్నప్పుడే యభిప్రాయమునొందితిమో చూచినప్పు డట్టిభావమే పొందుచున్నాముకదా. ఏమి యీరూపము? అని పలుకుచు శ్రీకృష్ణునింగూడి రాధాపరిసరమునకుంబోయిరి. వారినేత్రములా రాధారూపమునందే లగ్నములై మరలి రాఁజాలవయ్యెను.

## రాధాకృష్ణసమాగమము.

* శ్రీకృష్ణమూర్తి పట్టపురాణులంగూడి వచ్చుచుండుటం దిలకించి గోపికలెల్ల జయజయనినాదము లొనరించిరి. త్వరపడి రాధిక సమీపించి దోసిలొగ్గి నేత్రకమలములనుండి యానందబాష్పకణములు జాలువాఱ రత్నసింహాసన మొసంగి సంతోషమున నిట్లు పలికెను. పరమేశ్వరా! నీయాగమనమున నాజన్మము ధర్మము సఫలము లైనవి. సిద్ధాశ్రమస్థానము

* ఇదియు గర్గసంహితద్వారకాఖండమునందలి పదునేడవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

సఫలమైనది. లోకముల జయించినకంసుఁడు నీవలన భీతుఁ
డయ్యెను. నామాటచొప్పున శంఖచూడుఁడు నీచే హతుఁ
డయ్యెను. నాయందుఁ గలప్రీతిచే వ్రజమున వైభవముచూపఁ
బడినది. శక్రునకు మానభంగముకూడఁ జేయఁబడినది. నాకా
రణముననే ప్రజరక్షణార్థము గోవర్ధనపర్వత మెత్తఁబడినది.
స్వేచ్ఛానురూపముగా రాసవిహారము సాగినది. ఇదంతయు
నీవొనరించిన నరలోకవిడంబనము. నాసహాయమున నిన్నియు
సాగించితివి!

అని పలుకుచుఁ జంద్రానన యనుచెలి పురికొలుప
నారాజపత్నులనెల్ల బహూకరించెను. రుక్మిణిని జాంబవతిని,
భామను, సత్యను, భద్రను, లక్ష్మణను, గాళిందిని, మిత్రవిం
దను, బహూకరించి వారిం గలిసి తక్కుంగలహరిపత్నుల
నాదరించెను. వారి నాలింగనాదులందనిపి రాధికయిట్లుపలికెను.
చంద్రుఁ డొక్కఁడే. చకోరములసంఖ్యములు. సూర్యుఁ డొకఁ
డు. పెక్కునేత్రములు. శ్రీకృష్ణచంద్రుఁ డొక్కఁడు. భక్త
రాండ్రమగు తోఁబుట్టువులమగు మనము పెక్కండ్రము.
పద్మములసారమును భృంగ మెఱుంగును. రత్నప్రభావమును
బరీక్షకుఁ డెఱుంగును. విద్యాప్రభావంబును విద్వాంసుఁ
డెఱుంగును. కావ్యమహిమమున గవీంద్రుఁ డెఱుంగును.
వేలకువేలు జనులుండఁగా రసప్రభావమును రసికుఁడే యెఱుం
గును. ఓరాజకన్యకలారా! కృష్ణప్రభావము నాలాగే కృష్ణ
భక్తుఁడే యెఱుంగును.

రాధికసంభాషణముల నాలకించి భీష్మకునిపుత్రికయగు
రుక్మిణీదేవి సపత్నులంగూడి యిట్లు బదులుచెప్పెను. ఓవృష
భానుపుత్రీ! రాధాదేవీ! నీవు ధన్యురాలవు.

నీభక్తిభావమున నీ శ్రీహరి వశంగతుఁ డయ్యెను. శ్రీకృష్ణుని కథల నుల్లోకముల నుండువారు వినుతించుచుండఁగా నా శ్రీహరి నీవార్తలనే మాకెల్లఁ జెప్పుచుండును. నీహరి భావలక్షణమును వింటిమి అట్లే చూడఁ గంటిమి. ఇది చిత్రముగాఁ దోఁపకున్నది. మాశిబిరములకు రమ్ము. నిన్నుఁ దోడ్కొని పోవుటకే యిచ్చటికివచ్చితిమి. అని ప్రార్థించి యాదేవిం దోడు కొని తనశిబిరమునకు వచ్చెను. ఎల్లరంగూడి యాదేవి సాదరంబుగా గారవించెను. ఇష్టాలాపాలాదుల నారాత్రి కొంత గడపి వారివారిని శిబిరములకుం బంపి తానుహరికడకరిగెను.

శ్రీహరి శయనించి పలుకకుండెను. ఏల నిదురింపలేదని రుక్మిణి హరి నడిగెను. కొంచ మూరకుండి చిఱునవ్వున నిట్లు భాషించెను. ఆరాధిక ప్రత్యుత్థానాదులచే నిన్ను బహుమానించెనుగదా. నీయందు విశేషించి దయగలదయ్యెంగాదే. ప్రతిదిన మారాధ శయనింపఁబోవుచుఁ బాలుత్రాగును. నేఁ డామె పాలు త్రాగదయ్యెను. అందువలన నాకన్నులు నిద్రాసుఖ మనుభవింపఁజాలకున్నవి. నాకు నిద్రపట్టకుండుటకు హేతు విదియే. అని శ్రీహరిపలుకఁగాఁ జెంతనున్నసపత్నులం బిలిపించి వారింగూడి పరమాదరమున నుష్ణదుగ్ధములం గైకొని రాధాసమీపమున కరిగెను- రాధికకు నుష్ణములై శర్కరామిళితములగు దుగ్ధములం ద్రావించెను. తాంబూలమిచ్చెను. సత్యభామాదులంగూడివచ్చి శ్రీహరి కావృత్తాంతము నెఱింగించెను పిదప శ్రీకృష్ణపాదారవిందములను సేవించెను. అత్తఱి శ్రీహరి రాధాభక్తిని వెల్లడింపఁబూని యెల్లరు చుండఁగా నిట్లుపలికెను. రుక్మిణీ! నాపాదారవిందములు

రాధాహృదయారవిందమున విరాజిల్లుచుండును. రేయింబవళ్లు ప్రశ్రయపాశబద్ధమై కదలకున్నవి. అన్నమాట లాలకించి రుక్మిణ్యాదులు శ్రీహరికి రాధపైఁ గలప్రీతికి విస్మయమొందిరి. రాధాసమానురాలు మనలో నొకతుకయు లేదని నిశ్చయించిరి.

## సిద్ధాశ్రమమున రాసోత్సవము.

*శ్రీహరికి రాధికపైఁ గలయధికప్రీతి నెఱింగి రాజపుత్రికలెల్ల రాసోత్సవమును దర్శింపఁగోరి యిట్లు శ్రీహరిని బ్రార్థించిరి. మహాత్మా! నీభక్తి గలుగుటం జేసి యీగోపికలెల్ల ధన్యలే యగుదురు. రాసోత్సవమున నిన్నుంగూడి విహరించు నదృష్టముగలవారలైరికదా. మాధవా! బృందావనమున నే విధి ననుసరించి రాసోత్సవ మొనరించితివో యావిధానమును జూడఁగోరుచున్నారము. నీ వంగీకరించిన నాభాగ్యము కలుగును. రాధికయు గోపికలు వ్రజాంగనలు మేమును గలిసి రాసోత్సవ మొనరింతము. మామనోరథమును జగన్నాథా! పూర్ణమగునట్టు లొనరింపుము. రాసక్రీడ జరగనిచో మా వాంఛలు నెఱవేఱవు. ఆప్రార్థన మాలకించి వారి నా రాసోత్సవమున మోహపరవశలనుగాఁ జేయ నెంచి శ్రీహరి నవ్వుచు నిట్లు పలికెను.

కాంతామణులారా! రాసేశ్వరి యగు రాధిక రాసోత్సవమునఁ బాల్గొన నిష్టపడునేని సాగుఁగాక. ప్రార్థించి తెలిసికొనుఁడు, అనుమాట శ్రీహరి వదనాంబుజమునుండి వెడలఁగనే రుక్మిణీ ప్రభృతి రాజపత్నులు రాధను గాంచి నమస్కరించి

* ఇదియుం బదునెనిమిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

ప్రార్థించిరి. వ్రజసుందరీ! రాసేశ్వరీ ! శ్రీహరిప్రియా ? రాధా దేవీ! రాసోత్సవమును జూడఁగోరుదుము. మావాంఛలు ఫలింపఁజేయుమా. నీవేకదా రాసేశ్వరి వగుదువు మామనోరథములఁ దీర్పుమా అనిప్రార్థించుటయు, సోదరీమణులారా!*రాసేశ్వరుఁడు శ్రీహరియగు పరాత్పరుఁడు. సజ్జనకృపాళువు. అట్టి శ్రీహరింగూడి రాసోత్సవమున విహరింప మీకు మనస్సుగలదేని రాసోత్సవము సాగుఁగాక. నిరుపమానసేవావిశేషముల చేతను, బరమభక్తిచేతను భగవంతుని వశపఱచుకొనుఁడు. అని రాధ పలికెను. ఆమాట లాలకించి యెలరు నాహరిని వేఁడిరి. శ్రీమాధవుఁడును బూర్ణిమాత్రియామయందు సిద్ధాశ్రమమునఁ బ్రదోషకాలమునందు రాసోత్సవమున కారంభించెను. ఆరాసక్రీడయందు రాధామాధవు లొక్కచో నిలువంబడిరి. వారి దాంపత్య మద్వితీయమై నేత్రోత్సవదాయకమైయుండెను. ఎందఱు గోపకన్యకలో ఎందఱు రుక్మిణ్యాదిరాజకన్యకలో యందఱుగా శ్రీహరిరూపములం దాల్చి నిలిచెను. వేణు మృదంగాది వాద్యములు చెలరేఁగెను. కలకంఠులెల్ల నిరుపమకలస్వనములఁ బాడఁజొచ్చిరి. కాంతామణులమంజీర మృదుమహితనాదములు, మొలనూలు గజ్జలధ్వనులు కలిసి ఘోరుకొనియెను. అత్తఱి నాగోపాలబాలకుఁడు కోటికందర్పుల మీసడించులావణ్యముకలిగి పూలమాలికలువెలయఁ గుండలమండితుఁడై పీతాంబరమునుదాల్చి కిరీటకటకాంగదములు

* రాసేశ్వరస్య పరమస్య సతాం కృపాళో రంతుం మనో యది కవేత్తు తదాత్రరాసః, శుశ్రూషయా పరమయా పరయాచ భక్త్యా సంపూవశీకురుత ప్రియేష్టాః. అని మూలము.

వెలయ నిరుపమాన తేజం బలరారఁగా రాసేశ్వరియగు రాధి కంగూడి పాడ నారంభించెను. తా రాగణంబులం గూడినచం ద్రునింబోలి కనఁబడుచుండెను. ఆ రాసోత్సవము త్రియామయం దంతయు సాగినను క్షణకాల మట్లు తోఁచెను. రుక్మిణీప్రభృతి రాజపత్నులమనోరథములు ఫలించెను. పరిపూర్ణులైై పరాత్ప రులైై పురుషోత్తముఁడగు శ్రీకృష్ణుని దర్శించి రాసోత్సవాంత మున నిట్లు ప్రార్థించిరి

మహాత్మా! నీమనోహరరూపము నీ రాసమండపమునందుఁ జూడనోచితిమి. బ్రహ్మానంద మనుభవించితిమి. మహర్షుల వలె మేము నున్న వారము. ఈలాటియుత్సవము వేఱొక్కటి కలదని వినియుండలేదు. కలుగఁబోదు. ఇందుఁ గోట్లకొలఁది గోపికలున్న వారు. పదాఱువేలపత్నులు గలరు. మా చెలికత్తె లసంఖ్యాకలు గలరు. ఎనమండ్రు పట్టపురాణులు గలరు. బృందా వనమునందు నిట్టి యుత్సవము సాగియుండునా యని తోఁచె డిని. అనుటయు నాహరి రాధికను బ్రశ్నింపుఁడు. మీమనో రథముల నామెయే తీర్చును. అనుటయు వా రారాధికను రాసోత్సవమునుగూర్చి ప్రశ్నించిరి. ఆమెయు నిట్లు పలికెను. సోదరీమణులారా! బహుకాంతాగణ సమన్వితమయిసాగుట నీ రాసోత్సవము బృందావనప్రవృత్త రాసోత్సవమునకంటె మిన్నయే యనఁదగదు. బృందావనము నిరుపమానము. బహు విధభూరుహాలతా సంకీర్ణము. ప్రేమభారాసతలతామండితము. మధుమత్తమధువ్రతము. ఇది సిద్ధాశ్రమము. దాని కిదిసాటి యనరాదు యమునానదీమాహాత్మ్యము వర్ణనాతీతము. మాధ వీలతామండపములు పుష్పభారావనతలతామండితములు

వర్ణింప శక్యములా? ప్రేమభరమున మధురస్వరములఁ గూయు
పక్షుల వినుతింపఁదరమా? లోలాళిపుంజములగు నికుంజములు
దివ్యమందిరములుగ నందుండ వానిఁ బొగడఁగలవా రెవ్వరు?
పద్మపరాగములంగొని శరీకశముల వెదఁజల్లుచు మందమంద
గమనంబున వీచు నాబృందావనవాతపోతముల పిండుఁగొం
డాడ ననువుపడునే? మహోన్నతశృంగములు మనోహరము
లుగా వెలయు నలరు గోవర్ధనమహీధర మిట్టిదని నిర్ణయించి
వర్ణింప సాధ్యమే? అట్టిబృందావనరాసోత్సవ మనన్వయాలంకా
రమును కుదాహరణము. చల్లగాలి వీచుచుండ జలశీకరములు
సోఁకుచుండ యమునాపులినతలము సుఖాకర మనక తప్పునా?
వేణువును దాల్చి బర్హిబర్హాభిమండితుఁడై వనమాలావిభూషి
తుఁడై యలరు శ్రీకృష్ణుని బృందావన రాసోత్సవశృంగార
మనుపమానము కాదా.

అని యిట్టులాబృందావనమున మున్ను సాగిన రాసవి
హారమును రాధిక వర్ణించుచుండఁగా, రుక్మిణీప్రముఖకాంతా
మణు లచ్చెరువందిరి. మే మధికముగా శ్రీహరికిఁ బ్రియలమను
గర్వమును వదలిరి. అంత శ్రీహరి సిద్ధాశ్రమమున రాసోత్సవ
మునుండి విరమించి రాధంగూడి గోపీబృందము సేవించుచుం
డఁగా భార్యలంగూడి ద్వారకానగరమును బ్రవేశించెను.
రాధాదేవి శతవర్షములు వియోగార్తిఁ గుందుచున్నందున
నాయార్తి పాయఁగా నామెచెంత నుండెను. ఇది సిద్ధాశ్రమ
ప్రవృత్తరాసోత్సవము. ఈచరిత్రము సర్వపాపహరము శ్రద్ధ
గాఁ బఠించుటమాత్రము చాలదు. ఆశ్రీహరిని రాసవిహారోచి

తవేషుని ధ్యానించి మనస్సున నిలుపవలయు. దాననే సకలాభీష్టములు సిద్ధించును.

మహాశయులారా! ఈరాసోత్సవమున నొకరహస్యము కలదు. రాసోత్సవ మనఁగా శ్రీకృష్ణు నారాధనక్రమముల యందు నొకపద్ధతి. కొందఱు శ్రీహరి సర్వావతారములఁ బూర్వాదులఁ బూజింతురు అదియే వారిఁ దరింపఁజేయఁజాలును. కొందఱు భగవన్మంత్రమును జపింతురు. అదియే వారి నుద్ధరించును. కొందఱు మంత్రముచేత హోమముచేయుదురు. అనఁగాఁ దేజోరూపమును ధ్యానింతురని సారము. అదియే వారిని గడతేర్చును. కొందఱు మంత్రబీజముల సర్వాంగముల యందు విన్యసింతురు. న్యాసఖండమున నావిధి కలదు. అదియే వారి హరిపాదములకడకుం జేర్చును. కొంద ఱా శ్రీకృష్ణుని వర్తనములుగల గేయములఁ బాడుచు నృత్యము సల్పుదురు. అదియే వారల ముక్తులనుగాఁ జేయును. ఈమార్గములలో నెవరి కేది యుత్తమమని తోఁచునో వారు దాని నాచరింపవచ్చును. అన్నియు సమానఫలముల నేయొసంగును భక్తిదృఢముగా నెలకొనిననే యీమార్గములలో నేదియేని ఫలము నిచ్చును. లేకున్న శూన్యమే. 'యావత్తైలం తావద్వ్యాఖ్యాన' మ్మనున్యాయము తప్పునా? ఇందలిరహస్యము దృఢభక్తి కలిగి యున్నచో నేమార్గమున భగవంతు నారాధించినను ఫలించుననునదియే కాని యింకొక్కటి లేదు. ఇఁక ననంతరకథల నాలకింపుఁడు.

## శ్రీకృష్ణమాహాత్మ్యము.

* నారదముని బదరికాశ్రమమునకుంబోయి నారాయణ మహర్షినీ దర్శించెను. బదరీవనమున నాయాశ్రమ మున్నది. పరమపావనతరువరము లందున్నవి. పుంస్కోకిలములు కుహూ నాదములు చేయుచుండును. దుష్టమృగములు కొన్నికలవు గాని యవి పరమసాధువులుగా నుండెను. మహర్షి ప్రభావమున భయ మనునదియే లేక యాయాశ్రమము పరమశాంతమై యుండెను. మహారణ్యమునడుమ నదియున్నను ప్రవేశింప సాధ్యముగాకయున్నను స్వర్గమునకంటె మనోహరముగా నుండెను. దానిచుట్టును మహర్షులయాశ్రమము లనేకము లున్నవి. చందనతరువరములే విశేషసంఖ్యాకములు గలవు. పారిజాతవనములు చుట్టునున్నవి. నారదముని నారాయణముని నిని జూచినపుడాముని మహర్షులనడుమఁ గూరుచుండి యధ్యాత్మరహస్యములఁ దెలుపుచుండెను. యోగులలో యోగి గురువులలో గురువు. పరమమై బ్రహ్మమై స్వరూపమై ఈశ్వరుఁడై యున్న శ్రీకృష్ణుని జపము చేయుచుండెను. ఆనారాయణ మునివర్యుం గాంచి నారదుఁడు వినీతుఁడై సాష్టాంగనమస్కారము లాచరించెను. నారదుం గాంచినంతన లేచి యాలింగనమొనర్చి పరమాశీర్వాదముల నొసంగి స్నేహభావమునఁ గుశలప్రశ్నము గావించి యాతిథేయసత్కారము లాచరించి యుచితాసనమునఁ గూరుచుండఁజేసెను. మార్గాయాసము తొలంగ నారదముని సనాతనుఁడై భగవంతుఁడై సర్వవేదవేదాంతముల

* ఇయ్యది బ్రహ్మవైవర్తపురాణమున బ్రహ్మఖండమున నిరువది తొమ్మిదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

నెఱింగిన నారాయణమహామునిం గాంచి యిట్లు ప్రశ్నయ మునఁ బ్రశ్నించెను. మహాత్మా! జ్ఞానము నెఱుంగఁగోరి వచ్చి తిని. నామనస్సు మిగులఁ జంచలమై నిగ్రహింపఁ దరముగాక యున్నది. మనస్సు పురికొలుపఁ బ్రాక్సుకృతవశమున నీపాదా రవిందములఁ గాంచ వచ్చితిని ధన్యుఁడనైతిని ఇప్పుడు జ్ఞాన విశేషము నెఱింగి సఫలమనోరథుఁడనుగాఁ గోరివచ్చితిని. ఏచోట శ్రీకృష్ణోపాఖ్యానము వినంబడునో యాచోటు సేవిం పఁదగినది. జన్మమృత్యుజరాబాధల నపహరించుననియు, బ్రహ్మా విష్ణు శివ మహేంద్రాదులు నిరంతరము ధ్యానించుచుండు నదియు, మహర్షులు మననము చేయుచుండునదియు నగు శ్రీకృష్ణ చరితము వినఁ గోరుచున్నాఁడ. ఎవరినుండి సృష్టి వెలసెను? సర్వేశ్వరుం డెవ్వఁడు? సర్వవ్యాపకుం డెవఁడు? సర్వకారణకా రకుఁ డెవ్వఁడు? అట్టిపరమాత్మకు రూప మెద్ది? కర్మ మెట్టిది? చక్కఁగా విచారించి చెప్పి నన్నుఁ గృతార్థుని జేయుము. నీ వాగమృతమును గ్రోలఁ గోరియే యిచ్చటికి కేతెంచితిని. అను నారదునిప్రశ్నము నాలకించి నవ్వుచు భగవంతుఁడు నారా యణమహర్షి భవసాగరతరణక్షమ మగుసత్కథను వచియింప నారంభించెను.

## భగవన్నుతి.

* నారదమునీ! నీప్రశ్నము నుత్తర మిచ్చెదను భగవ ద్వినుతియే యందులకు సమర్థమగును. అందుఁ బ్రతిపాద్య

శ్రీనారాయణకృతకృష్ణస్తుతిః.

లంబోదరో హరిరుమాపతిరీశ శేషబ్రహ్మాదయస్సురగణా మనవో

* ఇదియుఁ బూర్వోక్తపురాణఖండమునఁ గల ముప్పదియవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

వస్తువు శ్రీకృష్ణపరమాత్మయే యగును. తన్మయమే దేవతావ్యూహము. ప్రపంచమెల్లఁ దన్మయమే యగు. నారదా! గణాధిపతిప్రముఖులు మహర్షులు త్రిమూర్తులు దిక్పాలకు లింద్రాదులు లక్ష్మీవాణీపార్వతులు భక్తిచే నే శ్రీకృష్ణుని పాదారవిందములను దలంతురో నీవును దానినే యాశ్రయింపుము. సంసారసముద్రము మిగుల గంభీరము. అతిభయంకరము. బడబాగ్నియు ఘోరభుజంగములు క్రిక్కిరిసి యుండ ఘోరమైనది దాని నెవ్వరు దాఁట నూహింతురో వారు శ్రీకృష్ణ పాదారవిందములదాస్యమును గోరి సేవింపవలయును. శ్రీకృష్ణమూర్తి గోవర్ధనపర్వతము నెత్తెనని వినుతించుట యంత మంచిది గాదు. దంష్ట్రాగ్రమునందు జలముల మునిఁగినభూచక్రమంతయు నిల్పిన మహాత్మున కిది యొక గొప్ప కార్యమా? సర్వప్రపంచము లా

---

మునీంద్రాః, వాణీ శివా త్రిపథగా కమలాదికాంశ్చ సంచింతయేద్భగవతశ్చరణారవిందమ్. ౧. సంసారసాగరమతీవ గభీరఘోరం దావాగ్నిసర్పపరివేష్టితచేష్టితాంగం, సంలంఘ్య గంతుమభివాంఛతి యోహి దాస్యం సంచితయేద్భగవతశ్చరణారవిందమ్. ౨. గోవర్ధనోద్ధరణకీర్తిరతీవ ఖిన్నా భూర్ధారితా చ దశనాగ్రత ఏవ చార్ద్రా), విశ్వాని లోమవివరేషు బిభర్తి రాదేస్సంచితయేద్భగవతశ్చరణారవిందమ్. 3. వేదాంగవేదముఖనిస్సృతకీర్తిరంశైర్వేదాంగవేదజనకస్య హరేర్విధాతుః, జన్మాంతకాదిభయశోకవిదీర్ణదేహాస్సంచింతయేద్భగవతశ్చరణారవిందమ్. ౪. గోపాంగనావదనపంకజషట్పదస్య రాసేశ్వరస్య రసికారమణస్య పుంసః, బృందావనే విహరతో వ్రజవేషవిష్టోస్సంచింతయేద్భగవతశ్చరణారవిందమ్. ౫. చతుర్భిర్మేషపతిర్నో జగతాం విధాతా తత్కర్మవక్తుం కథితుం భువి కస్సమర్థః, త్వం చాపి నారదమునే పరమాదరేణ సంచింతనం కురు హరేశ్చరణారవిందమ్. ౬. యూయం వయం తస్య కలాకలాంశాః

కృష్ణమూర్తి లోమములుగదా. కావున నీ వాభగవత్పదార విందములను భజింపుమా. ఉపనిషత్తులనుండియు వేదముల నుండియు నెవనికీర్తి యెఱుంగఁదగునో బ్రహ్మకుంగూడ సృష్టికర్త యెవ్వఁడో యెవనిభక్తిచే జన్మమరణాదిభయములుండవో యట్టి పరమాత్మపదాంబుజములను ధ్యానింపుము. గోపికాకాంతల ముఖారవిందములకు షట్పదప్రాయుఁడై రాసేశ్వరుండై రసికారమణుఁడై (రాధాప్రాణనాథుఁడై) పరమపూరుషుఁడై బృందావనమునందు గోపవేషమున విహరించుచున్న గోపాలకృష్ణుని పాదపద్మముల నారాధింపుము. లోకములఁ బుట్టించినబ్రహ్మ యేభగవంతుని నిమేషమాత్రమున మృతినొందునో అట్టి హరిచరిత్రముల వర్ణింప నెవ్వఁడు శక్తుఁడు? నారదా! యామహానుభావుని చరణసరసిజములను గొలు

---

కలాకలాంశా మనవో మునీంద్రాః, కలావిశేషా భవపారముఖ్యా మహాన్విరాడ్యస్య కలావిశేషః. ౭. సహస్రశీర్షా శిరసః ప్రదేశే బిభర్తి సిద్ధార్థసమంచవిశ్వమ్, కూర్మే చ శేషో పశకో గజే యథా కూర్మశ్చ కృష్ణస్య కలాకలాంశః. ౮. గోలోకనాథస్య విభోర్యశోఽమలం శ్రుతౌ పురాణే న హి కించన స్ఫుటం, న పాద్మముఖ్యాః కథితుం సమర్థాస్సర్వేశ్వరం తం భజ పాద్మముఖ్యమ్. ౯. విశ్వేషు సర్వేషు చ విశ్వధామ్నస్సంత్యేవ శశ్వద్విధిౘష్ణురుద్రాః, తేషాం చ సంఖ్యాశ్శ్రుతయశ్చ వేదాః పరం న జానంతి తమీశ్వరం భజ. ౧౦. కరోతి సృష్టిం సవిధేర్విధాతా విధాయ నిత్యాం ప్రకృతిం జగత్ప్రసూమ్, బ్రహ్మాదయః ప్రాకృతికాశ్చ సర్వే భక్తిప్రదాం ౦ం ప్రకృతిం భజంతి. ౧౧. బ్రహ్మస్వరూపా ప్రకృతిర్నభిన్నా యథా చ సృష్టిం కురుతే సనాతనః, శ్రియశ్చ సర్వాః కలయా జగత్సుమామాయా చ సర్వే చ తయా విమోహితాః. ౧౨. నారాయణీ సాపరమాసనాతనీశక్తిశ్చ.

వుము. నీవు మేము నేకృష్ణుని కలాకళాంశభూతులమో మునీం ద్రులు త్రిమూర్తులు నట్టివారే యగుదురో యట్టి పరమాత్మ యంఘ్రినలినముల భక్తిమెయిఁ బ్రార్థింపుము. సహస్రశీర్షములు గల యాపరమేశుఁడు శిరఃప్రదేశమునందు సకలమేదిని మోయుచున్న కూర్మమునందు ననంతుఁ డనఁబడు షుఁడు. గజముకడ దోమవంటివాఁ డగును. అట్టి యాదికూర్మ మా శ్రీ కృష్ణుని కళాకళాంశమగును. అట్టి యనంతమహిముఁడగు శ్రీ కృష్ణపదపంకజములఁ దలంపుము. గోలోకనాయకుఁడగు నాపర మేశ్వరుని నిర్మలయశస్సును వేదవేదాంతములు స్పష్టముగాఁ

---

పుంసః పరమాత్మనశ్చః, ఆత్మేశ్వరశ్చాపి యథా చ శక్తిమాంస్తయా వినా స్రష్టుమశక్త ఏవ. ౧౩. గత్వా వివాహం కురువత్స సాంప్రతం కర్తుం ప్రయుక్తశ్చ పితుర్నిదేశః, గురోర్నిదేశప్రతిపాలకో భవేస్సర్వత్ర పూజ్యో విజయీ చ సంతతమ్. ౧౪. స్వపత్నీం పూజయేద్యో హి వస్త్రాలంకారచందనైః, ప్రకృతిస్తస్య సంతుష్టా యథాకృష్ణోద్విజార్చనే. ౧౫. సా చ యోషిత్స్వరూపా చ ప్రతి విశ్వేషు మాయయా, యోషితామపమానేన పరాభూతా చ సా భవేత్. ౧౬. దివ్యా స్త్రీ పూజితా యేన పతిపుత్రవతీ సతీ ప్రకృతిః పూజితా తేన సర్వమంగళదాయినీ. ౧౭. మూలప్రకృతిరేకా సా పూర్ణా బ్రహ్మస్వరూపిణీ, సృష్టౌ పంచవిధా సా చ విష్ణుమాయా సనాతనీ. ౧౮. ప్రాణాధిష్ఠాతృదేవీ యా కృష్ణస్య పరమాత్మనః, సర్వాసాం ప్రేయసీ కాంతా సా రాధా పరికీర్తితా. ౧౯. నారాయణప్రియా లక్ష్మీస్సర్వసంపత్స్వరూపిణీ, రాగాధిష్ఠాతృదేవీ యా సా చ పూజ్యా సరస్వతీ. ౨౦. సావిత్రీ వేదమాతా చ పూజ్యరూపా విధేః ప్రియా, శంకరస్య ప్రియా దుర్గాయాస్యాః పుత్రో గణేశ్వరః. ౨౧.

ఇతి నారాయణకృత భగవత్స్తుతి స్సమాప్తా.

తెలుపఁజాలకయున్నవి. ఇఁకఁ బురాణములు పలుకఁగలవా?
అట్టి పరమాత్మ పాదతామరసములను భజింపుము. ఎన్నియో
బ్రహ్మాండములు కలవు. ఒక్కొక్క బ్రహ్మాండమునకుఁ త్రిమూ
ర్తులు గలరు. ఎన్నిబ్రహ్మాండములుగలవో, ఎందఱు త్రిమూర్తు
లుగలరో, వారిసంఖ్య నిర్ణయించిపలుకఁదరముగాకయుండును.
అట్టి పరంధాముని పదకమలముల నాశ్రయింపుము. ఏరమా
నాథునిసాన్నిధ్యమున బ్రహ్మ సృష్టిచేయునో యామహనీయుని
మాయయే మూలప్రకృతి యనంబడు ఆప్రకృతిని బ్రహ్మాదులు
భజింతురు. నీవు నాప్రకృతిని భజింపుము. ప్రకృతి పరబ్రహ్మ
స్వరూపిణియే యగును ఆమెసాయముననే సనాతనుఁడు సృష్టి
చేయఁగలుగును. సకలభాగ్యములు తత్కలాంశములు. ఎల్లరు
మాయావిమోహితులే యగుదురు. పరమపూరుషుఁడగు విష్ణు
మూర్తికి నారాయణి యనుపేర శక్తి యలరారును. అది సనా
తనియగు. ఆమెతోఁ గూడుటచేతనే శక్తిమంతుఁ డగును.
తాఁజేయఁదలఁచినకార్యమును సాగింపఁగలఁడు. ఆమె సాయ
ములేకున్న నేపనియుఁ జేయఁజాలఁడు. కావున నోనారదా!
ఇపుడు నీవరిగి పెండ్లిచేసికొనుము. ఇదియే మీతండ్రియాజ్ఞ.
గురునిదేశమును బాలించితివేని సర్వలోకపూజ్యుఁడవగుదువు.
ఎల్లలోకములను జయింపఁగలవు.

నారదా! మఱియొక్కవిషయము గలదు. దానిం దెల్పె
దను. లోకమున నెవ్వాఁడు వస్త్రాలంకారచందనాదులచేతఁ
దనభార్య నలంకరించునో దానిచే నాప్రకృతి సంతృప్తినొందు
ను. ద్విజవరేణ్యులఁ బూజింపఁగా శ్రీహరియు నానందించును
గదా. సకలలోకములను దనమాయాబలమునఁ బ్రకృతి స్త్రీ

రూపముల నలరారుచుండును. అట్టి స్త్రీలను దిరస్కరించిన నాప్రకృతిని దిరస్కరించిన ట్లగును. కాన నది చేయరానిపని. పతియుఁ బుత్త్రులుగల నారీమణి నెవ్వఁడు పూజించునో సకల మంగళదాయిని యగు నాప్రకృతి పూజింపఁబడినట్లు సంతోషించును. మూలప్రకృతి యొకర్తుకయే పరబ్రహ్మస్వరూపిణి యగును. సృష్టియందామె పంచవిధములుగా నుండెను. అదియే విష్ణుమాయ. ఆమెయే సనాతని యనంబడును. శ్రీకృష్ణపరమాత్మ కాప్రకృతి ప్రాణాధిక ప్రియ యగు. ఆమెయే శ్రీకృష్ణ పత్నులలో నుత్తమురాలు. ఆమెయే రాధిక యనంబడును. నారాయణ ప్రియ యనియు సర్వసంపత్స్వరూపిణి యనియు, రాగాధిష్ఠాతృదేవి యనియుఁ జెప్పఁబడును. త్రిజగత్పూజ్యురాలగు. సరస్వతి యనియు నామెకే పేరుకలదు. సావిత్రియన్నను, వేదమాతయన్నను, విధిప్రియయన్నను, బ్రకృతియగు నారాధికయే. శంకరప్రియయగు దుర్గయన్నను బ్రకృతియే. ఆ మహాదేవి యిన్నిరూపముల నలరారును. ఆదుర్గాదేవి పుత్త్రుఁడే గణపతి. ఆదిపూజ్యుఁడగును. నారదా! నీవడిగినప్రశ్నమున కీస్తుతియే యుత్తరమగును. అని తెలిపెను.

మహాశయులారా! ఈవిషయము చాలముఖ్యమైనది. ఇంచుక యాలకింపుఁడు. బదరికాశ్రమము పురాతనమగుమహా క్షేత్రము. అందుఁ బెక్కండ్రు తపం బొనరించి సిద్ధులైరి. నర నారాయణు లందే చిరకాలతప మొనరించిరి నారాయణముని యాదిమముని యని యెఱుంగుఁడు. అనఁగా వైకుంఠవాసి యగు శ్రీమన్నారాయణమూర్తియే యీముని యగునా? అని కొందఱు ప్రశ్నింతురు. జ్ఞానోపదేశముచేయుచు జగమున

కపకారముచేయువారల శిక్షించుటకై భగవంతుఁడే మునివేష
మును దాల్చును. విశేషించి శత్రువధ చేయునవసరము గల్గినఁ
దదుచితవేషమున నవతరించును. సద్విషయములన్నియు నా
పరాత్పరునుండియే నేర్చుకొనవలయునుగదా. జ్ఞానోపదేశము
నకై నారాయణముని యనుపేర నాపరమాత్మయే ధరణి
నుండును. శత్రుమారణకర్మమున నరుని నియమించి తాను
సాయముగనుండును. ఇదియే యిందుఁగల పరమార్థము ఆనర
నారాయణులే యాదిమమును లనఁబడుదురు. నారాయణ
మునియే కృష్ణుఁడైన గోలోకమునుండి యవతరించు టెట్లని
యడుగుదురేమో. నారాయణమునియందుఁ గలతేజస్సుకార్య
మును దీర్పఁజాలదేని దానికిసాయముగాభగవంతునితేజస్సందుఁ
జేరును. తేజస్సులన్నియుఁ గలిసియేకరూపతంగాంచును గదా!
ఆదివ్యతేజస్సే శ్రీకృష్ణమూర్తి యని మనమర్థముచేసికొన్నచో
సత్యమగుభావమును గనుఁగొన్నవార మగుదుము. పురాణము
లన్నియు సమన్వయములగును. ఏశంకలులేక భగవత్తత్త్వము
నారాధింపఁజాలుదుము. కుత్సితములగు ప్రశ్నములుచేయ
నారంభించినఁ దనమేలు తాఁజెడఁగొట్టుకొన్న ట్లగును. కావున
నిందు నితరులజయించితిమికదా యని ప్రశ్నించువారు సంతో
షింప నవకాశములేదు. అంతియకాక స్వక్షేమమును జెడఁ
గొట్టుకొంటిమని దుఃఖింపవలసినవారే యగుదురు. కాఁబట్టి
కుప్రశ్నములుచేయక భగవంతు నారాధింపవలయును.

ఇందు స్త్రీల నెట్లు చూడవలయునో తెల్పఁబడినది. ఆది
ప్రధానముగా మనప్రాచీనకాలపు నాగరకతను బోధించును.

"స్వపత్నీం పూజయేద్యోహి వస్త్రాలంకారచందనైః,
ప్రకృతిస్తస్య సంతుష్టా యథా కృష్ణో ద్విజార్చనే."

అనికదా నారాయణోక్తి పొడకట్టెడిని. పూజ యనఁగా సంతోషింపఁజేయుట యనియర్థము. వస్త్రములచే భూషణములచేఁ బరిమళవస్తువులచేఁ దనభార్యను సంతోషింపఁజేయువాని మంచికార్యము నెఱిఁగి యాప్రకృతి (రాధిక) సంతోషించును. ద్విజులఁ బూజించిన శ్రీహరి యానందించును. ఏల? ప్రకృతి సహాయము లేక పరమేశ్వరుఁడు సృష్టిచేయఁజాలఁడు. భార్యతోడ్పాటులేక భర్త యేకార్యమునుదృప్తిగాఁ జేయఁజాలఁడు.

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చేదేవం దేవో న ఖలు కుశలస్స్పందితుమపి."

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు నొక్కిచెప్పిరి. పై నారాయణమునియు నీయభిప్రాయమునే

"ఆత్మేశ్వరశ్చాపి యథా చ శక్తిమాం
స్తయా వినా స్రష్టు మశక్త ఏవ"

అని వక్కాణించిరి. గృహస్థువు గృహిణీసహాయుఁ డయియే కార్యకరణక్షముఁ డగును; లేనిచో నక్షముఁడగును. ఈవిషమై

"న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్య పరిరక్షితుం,
ఏతైరుపాయయోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుమ్. ౧౦
అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్,
శౌచే ధర్మేఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య రక్షణే. ౧౧
అరక్షితా గృహేరుద్ధాః పురుషైరాప్తకారిభిః,
ఆత్మానమాత్మనా యాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః ౧౨
(ఆప్తాశ్చ ఆజ్ఞాకారిణశ్చ.) అనివ్యాఖ్య.

ఏవం స్వభావం జ్ఞాత్వాసాం ప్రజాపతినిసర్గజమ్,
పరమం యత్నమాతిష్ఠే త్పురుషో రక్షణం ప్రతి. ౧౬
ఏషోదితా లోకయాత్రా నిత్యం స్త్రీపుంసయోశ్శుభా,
ప్రేత్యేహ చ సుఖోదర్కాన్ ప్రజాధర్మాన్నిబోధ మే. ౨౫
ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః,
స్త్రియశ్శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన. ౨౬
ఉత్పాదనమపత్యస్య జాతస్య పరిపాలనం,
ప్రత్యహం లోకయాత్రాయాః ప్రత్యక్షం స్త్రీనిబంధనమ్.
అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషారతిరుత్తమా,
దారాధీనాస్తథాస్వర్గః పితౄణామాత్మనశ్చహ. ౨౮
(మనుస్మృతి ౯ అధ్యాయము.)

స్మృతులుకూడ భార్యను రక్షింపనిభర్తకు నిహాపరసుఖములు లేవని బోధించెడిని ఇంటి పెత్తనమంతయు భార్యాధీనమనియే మనువు శాసించెను. కావున నారదోపదేశమునందలి యీవిషయమును నవనాగరికులు గ్రహించి మిట్టిపడకయుందురుగాక. ప్రాచీనులకు స్త్రీలతత్త్వముచక్కఁగాఁ దెలిసియేయుండెననియు వారికింగలలోకజ్ఞాన మనన్యాదృశమనియు గ్రహింతురుగాక.

ఈయుపదేశమునందుఁగల మఱొక్కరహస్యమును బరికింతము. భగవంతుఁడు సర్వసాక్షి, జగత్కారణము. కావునఁ దత్సాన్నిధ్యబలమున మహామాయ యనఁబడు మూలప్రకృతియే యాసర్వేశ్వరుని సగుణుం గావించి లోకప్రవృత్తి యందుఁ బ్రవర్తింపఁజేయును. భగవదిచ్ఛయేకదా మూలప్రకృతి. శక్తియనఁగా నాప్రకృతియే. తద్విరహితుఁ డశక్తుఁ డగును. ఇట్లుమహానుభావులు నిర్ణయించి స్వానుభవము నెఱిం

గించియుండ శాక్తు లన్నంతనే కొంద ఱులికిపడుదురు. ఏల నఁగాఁ బాపము! వా రుపాసకులు గారు. శ్రమముల కోర్వక మాటలచేఁ గాలముఁ బుచ్చువారు. వారికి భగవత్తత్త్వము చక్కఁగాఁ దెలియదేమో యనవలసినయవకాశము కలుగు చున్నది. శాక్తమతమును గుఱించినాలుగుమాటలు వ్రాసెదను.

శాక్తము సర్వమతసాధారణము. అది చేరనిది మతమే కాదు. శక్తి యనఁగా శివపత్నియగు పార్వతి కాదు. విష్ణుపత్ని యగు మహాలక్ష్మి కాదు. బ్రహ్మపత్నియగు వాగ్దేవియుఁగాదు. ఈముప్వురును వీరిభర్తలును, ఇంద్రాదిలోకపాలకులును, వారు వీ రననేల ఆబ్రహ్మస్తంబపర్యంతముగల వస్తువ్రాతమం తయు శక్తివికారమే. త్రిమూర్తులు తదాజ్ఞాపరిపాలకులే. నిర్గు ణుఁడని, నిరంజనుఁడని, అద్వితీయుఁడని, సర్వవ్యాపియని, సర్వ కారణుఁడని, సర్వజ్ఞుఁడని యింక నెన్నియోనామములఁ బిలు వంబడుచు నెవ్వారికే నెఱుంగఁదరంబుగాక యనిర్వచనీయ మహిమాంచితుఁడగు పరమేశ్వరుని సంకల్పశక్తియే ప్రకృతి యనంబడును. ఆప్రకృతి నుపాసించు టనఁగా సగుణబ్రహ్మము నుపాసించుట యని యర్థము. పరతత్త్వము పున్నపుంసకస్త్రీ లింగములను భేదములుగలదిగాదు. సాధకుని యిచ్ఛానురూప లింగముగ నది యుండును. అర్చారూపమదియే సర్వశబ్దము లద్దానికిం జెల్లును. స్త్రీవ్యక్తిగా నుపాసించుట దోషముకాదు. శాక్తమునందు సురాపానము మాంసభక్షణము గలవుకదా యనవచ్చును. నిజమే వానియర్థము వేఱు. తంత్రములన్నియుఁ వానిం దెలుపును. వానిరహస్యార్థ మేమనఁగా నేజాతికి మాంసభక్షణము విధివిహితమో వారు

"యదన్నం పురుషో భుంక్తే తదన్నం తస్య దేవతాః"

అన్న న్యాయము ననుసరించి భగవతికి సమర్పించి భుజింపవలెను.

"నాత్మార్థం పాచయేదన్నం నాత్మార్థం పాచయేత్పశూన్,
దేవార్థే బ్రాహ్మణార్థేవా హన్యాన్మేధ్యపశూన్ ద్విజః."

అన్న యభియుక్తోక్తి సుప్రసిద్ధమే కదా. మాంసభక్షణము చేయుజాతివారుకూడ భగవతికి సమర్పించికాని భుజింపరా దనుటచే మాంసభక్షణము తగ్గించుటకే విధి ప్రవర్తించినదని గ్రహింపవలయును. మద్యము మాంసమునకంటె నిషేధము. అది యెట్లు సమర్పింపవచ్చునని యడుగుదురేమో. తంత్రము లట్లు నిర్ణయింపలేదు. మద్యమును దెచ్చి తదధిష్ఠానదేవత నం దావహించి పూజించి శుక్రశాపవిమోచనము చేసి యమృతముగా దానిని భావించి సమర్పింపవలయునని విధి తెల్పుచున్నది. అదియు బ్రాహ్మణులకుం గాదు. శుభాగమపంచకమునందు విప్రజాతి కది నిషేధింపఁబడినది.

"బ్రాహ్మణో మదిరాం దత్వా బ్రాహ్మణ్యాద్దేవహీయతే"

అని కాళికాపురాణమే తెల్పుచున్నది. కావున నేజాతి కేయాహారము, పానము స్మృతి యనువదించునో ఆయాహారపానములను దేవత కర్పించి పిదప గ్రహింపందగునని తాత్పర్యము. భగవతికి నివేదింపక భుజించువాఁడు పాపాత్ముఁడగునని తంత్రములు ఘోషించెడిని. వానిభావమేమి? భగవతీపూజేతరకాలములలో నవిరెండును నిషేధము లనుటచే సార్వకాలికమాంసభక్షణమద్యపానములకు నిరోధముకల్గించుటకే విధి ప్రవర్తించెనని గ్రహింపందగునేకాని దిట్టముగాఁ ద్రాగుమని యది

విధింపలేదు. ఇట్లు గ్రహించినచో నేదోషము శాస్త్రమున నుండఁబోదు. విపరీతముగా నర్థమును గ్రహించినచోఁ జెడుదు రనుట నిర్వివాదము.

కొందఱు కుమారీపూజచేయుదురు గావున శాక్తధర్మములు దుష్ప్రవృత్తిని బోధించుననియే పలుకుదురు పాపము! వారికిఁ జక్కనియర్థము తోఁపలేదు. కుమారీపూజ విధికాదు. అది కామ్యము. కామ్యమైన నర్థదాయకము కాదా యనరాదు. దానితత్త్వము నాలకింపుఁడు. కుమారీపూజ జితేంద్రియత్వపరీక్షార్థ మేర్పడినది. అతిరూపసంపన్నయగు కుమారిం దెచ్చి సర్వాలంకారభూషితం జేసి పీఠమునఁ గూరుచుండఁజేసి భగవతిగా భావించి తదేకాగ్రహృదయమున నర్చింపవలయును. ఆపూజయం దించుకంతయు మనస్సు కామత్వము నందరాదు. ఆపూజ కొనసాగిన భగవతి యనుగ్రహామునకుఁ బాత్రుఁ డగును. లేక యించుకంతయేఁ గామాకులచిత్తుఁ డయ్యెనేని వంశము నశించు. ఆపూజ యసిధారావ్రతమువంటిది. అట్టి యింద్రియనిగ్రహముకలవాఁడెవ్వఁడో వాఁడే యాపూజచేయ నర్హుఁడు. ఇతరుఁడు కాఁడు. ఇట్టి వేల నిర్ణయింపవలయునో యనరాదు. ఆశ్రమములలో సన్న్యాస మెట్టిది? మనోవాక్కాయకర్మములలో నీషత్తేని వికారమునొందిన నాతఁ డధఃపతితుఁ డగునని స్మృతి బోధింపలేదా. అట్టిమనోనిశ్చయముకలవాఁడే యద్దానిని గ్రహింపవలయును. లేనివాఁడు మానవలయును. అంతియకాని స్మృతిని నిందింపరాదు. సన్న్యాసాశ్రమ మెట్టిదో మారీపూజ యట్టిదని గ్రహింపవలయును. ఇట్టి వెన్నియో-
తు లందుఁ గలవు. వానినెల్లఁ నిటఁ జర్చింప నవకాశము

చాలదు. దిఙ్మాత్రముగఁ బ్రదర్శించితిని. ఇఁకఁ దరువాతికథను వ్రాసెదను.

### యదువులవిలయమునకు హేతువు ముసల పుట్టుట.

*భగవంతుఁడు తనయవతారఫలమును సాగించి గోలోకమున కిరుగం దలంచెను. కాని యుద్ధవునితోఁ జెప్పినప్రకారము స్వేచ్ఛాప్రవర్తకులగు యాదవులను బొలియింపకయున్న లోకమున కెంతయో పీడకలుగును. దాని నాపఁ బ్రయత్నించినవాఁడయ్యెను. ఆమహానుభావుని సంకల్పమాత్రమున యాదవులదుష్కర్మము ఫలమునీయఁబూనెను. ధర్మరాజు రాజ్యమునందును విశేషించి ద్వారకానగరమునందును మహోత్పాతములు పొడసూపెను. వానింగాంచి శ్రీహరి యెఱుంగనియట్లే యదువృద్ధులం బిలిచి యీమహోత్పాతములు మనవారి కశుభమును దెలియఁజేయుచున్నవి. కావునఁ బ్రభాసతీర్థమున కరుగుట లెస్సయని తెలిపెను వారెల్ల నట్లే చేయ సమ్మతించిరి.

ఈతరుణమునందే భగవత్సంకల్పానుసారము కర్మమెల్ల యాదవులనుబురికొల్పుచుండెను. కర్మప్రోత్సాహితమై మృత్యువు వారిమ్రింగ వివృతాస్యయై యుండెను. యాదవులెల్లనందుఁ

*ఈవిషయము విష్ణుపురాణము పంచమాంశమునఁగల ముప్పదియేడవ యధ్యాయమునుండియు, శ్రీభాగవతము పదునొకండవస్కంధము మొదటి యధ్యాయమునుండియు, బ్రహ్మపురాణము నూటయొకండవయధ్యాయము నుండియు వ్రాయఁబడినది. శ్రీమహాభారతాదులఁ గలవిషయము లిందుఁ గలిపియేయుండునని యెఱుంగవలయును. భారతభాగవతములయం దీవిషయమున నించుకభేదము కనఁబడియెడిని. కాని యది ప్రధానవిషయమునకు బాధకముకాదని యెఱుంగందగు.

జొరవలసినవార లయ్యు దాని నెఱుంగఁ జాలక యుండిరి. శ్రీహరి త్వరగ గోలోకమున కరుగఁబూనెను. తాఁ జేయఁ దగుకార్యములు కొన్ని యవశిష్టములై యున్నవని తలంచెను. ఆసంకల్ప మమోఘముకదా. ఫలింపఁ బ్రయత్నించుచుండెను. విప్రశాపముకూడ ఫలమునీయ సిద్ధముగా నుండెను. వీని యన్నింటి ఫలముగా యాదవులలోఁ గొందఱబుద్ధులు మార్పు చెందెను. వెంటనే యదుకుమారులు కృత్రిమబుద్ధులైరి. శ్రీకృష్ణునిసందర్శింప విశ్వామిత్రుఁడు,అసితుఁడు,కణ్వుఁడు, దుర్వాసుఁడు, భృగువు, అంగిరస్సు, కాశ్యపుఁడు, వామదేవుఁడు, వసిష్ఠువు,నారదుఁడు లోనగుమహర్షులు చనుదెంచిరి. వారితో సంభాషించి విశేషవిషయము లెఱిఁగించి స్వాభిప్రాయమును దెలిపి వారిని సాగనంపెను. పిమ్మట వారు శ్రీహరిసంకల్పప్రేరితులై పిండారకక్షేత్రమునకుంబోయిరి. అచోట విహరించుచుండిన యదుకుమారు లవినీతులై సాంబునకు స్త్రీవేష మలవరించి యుందును గర్భిణీచిహ్నములు గలిగించి వానిని మెల్లనఁ బిలుచుకొనిపోయి మహర్షులం గాంచి వినీతులవలె నమస్కరించి యిట్లనిరి. మహర్షులారా! మాయీకాంత గర్భవతిగనున్నది. ఏశిశువు జనించునో యని యడుగఁదలఁచియు సిగ్గుపెంపున నడుగఁజాలకున్నది. అవిషయమును మేమడుగవచ్చినారము. అతీంద్రియజ్ఞులరగు మీరు మాశంకం దీర్పవలయును. ప్రసన్నులరై సెలవిండు. అని ప్రార్థించిరి.

ఆకుమారుల కుటిలవ్యాపారము నెఱింగి భావికర్మఫలములఁ బ్రోత్సాహితులై కడు నలిగి యోమందమతులారా! మాకాంత వంశనిర్మూలనక్షమం బగుముసలమును గాంచును.

ఇఁకఁబొండు. అని గట్టిగాఁ బలికిరి. ఆమహర్షులపలుకులు శ్రుతి
వివరములఁ జొరఁబడినంతనే దారుణంబగుభయంబు గదుర
నటనుండక యాయవినీతు లప్పుడ కదలి కొంతదూర మరిగి
సాంబునికడుపున నమరించినకృత్రిమగర్భచిహ్నముల వదలించి
చూడ నందొకముసలము కనఁబడియెను. అది యయోమయ
ముగ నుండెను. దానింగాంచి మునులశాపఫలంబే యిది
యనియు, వంశనాశనముచేయుననియు నెఱింగి చేతులు పిసికి
కొనుచు నయ్యో! అదృష్టము విపరీతమయినకతన మన మిట్టి
ప్రయత్న మొనరించితిమి. ఈకార్యము నెఱింగినంతన పెద్ద
లేమందురొకదా అని యొక్కుమ్మగి నెల్లరు తల్లడిల్లుచు దానిం
గైకొనిగృహములకుంబోయి ముఖకాంతులు వెలవెలఁబాఱఁగా
రాజసభకుంబోయి యెల్లరు వినుచుండ సాగినవార్తను
వదలకయుండ నుగ్రసేనునకుం దెలిపిరి. ఆహుకుఁడను నామాం
తరముగల యాయుగ్రసేనుఁడును దక్కుంగలపెద్దలును బ్రా
హ్మణశాప మమోఘమని యెఱింగి కడుంగడుం జింతిల్లిరి. రాజు
ముసలమును దానిని బొడిచేయించి సాగరజలములఁ గలుపఁ
బంచెను. వారట్లే పొడిచేసిరి. ఎంతశ్రమంపడినను ముసలమది
శేష ముండెను. ఆపొడిని ముసలశేషమును సాగరమునఁ బాఱ
వైచిరి. ముసలశకలమునొకచేప మ్రింగెను. ఆచూర్ణమంతయు
తరంగములచే నొడ్డునకుఁ జిమ్మంబడియెను. * ఆచూర్ణము
మూఁడు మొనలుగల తుంగలై మొలిచెను. ఆముసలశిష్టభాగ
మును మ్రింగినచేపను జాలరులు వలలు వైచి పట్టుకొనిరి.
వారియం దొక్కఁడా చేపకడుపులోనున్న లోహశలాకమును

* ఊహ్యమానాని వేలాయాం లగ్నాన్యాసన్ కిలైరకాః.

దీసికొని తనబాణము నగ్రమున నమర్చుకొనియెను. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు త్రికాలజ్ఞుఁడగుట నావిషయము నెఱింగియు దానికిం బ్రతివిధానముచేయ సమర్థుండయ్యును భావికాలగతుల నాలోచించి యట్లు చేయమానెను. అంతియ కాక తాను సమ్మతించియు నాకార్య మట్లే సాగవలయునని తలంచుచు నుండెను.

మహాశయులారా ! ఈ విషయము విచిత్రముగాఁ దోఁచును. ముసలముకడుపులోనుండుట దానిని జేఁపమ్రింగుట అది యొకయాయుధ మగుట. యను నీమూఁడుసంభవము లేనా యనియుఁ దోఁచును. సాంబునకు స్త్రీవేషముకూర్చి మునుల కడకుం గొనిపోయి యీపిల్ల యేశిశువును ప్రసవించును? అని యడుగుటయుంగూడ సాధారణబుద్ధి నాలోచింప నుచిత మనియుం దోఁపదు. ఇన్ని శంకల కీకథ యవకాశమిచ్చుచున్నది. కాని సూక్ష్మముగా నాలోచింప నిందేదియు విచిత్రముకాదు.

"అవివేకః పరమాపదాం పదమ్" అనియు,

'ప్రాయస్సమాపన్నవిపత్తికాలేధియోఽపిపుంసాంమలినాభవంతి' అనియుఁ బ్రాచీనోక్తులు కలవుకదా. శునకజాతియం దొకప్పుడు మేకపిల్ల కలుగుటయు, మేకకడుపునఁ గుక్కపిల్ల కలుగుటయుఁ గనఁబడుచున్నవి. మానవులకు నాలుగు కాళ్లజంతువులు కలుగుచున్నవి. మఱియు ననేకవికారరూపములుగా శిశువులు కలుగుచున్నవారు. వీనికింగల కారణ మొక్కటియే. ప్రాక్కర్మమే. వేఱొక్కటికాదు. భగవత్సంకల్ప మన్నింటికిం బ్రధానహేతువు. భగవత్సంకల్పమే లేదన్నవారి మాధానములు పనికిరావు. వారికొఱ కివి వ్రాయఁబడను

లేదు. ధూమశకటమునఁ బ్రయాణము చేయుచున్న వారెల్ల నదిపడుటచే మృతినొందక యందొక్కరో యిరువురో జీవించుటకు హేతు వేదనవచ్చును? వారి కాసాంఘాతమరణము కలుగు దుష్కర్మము లేదనవలయునే కాని వేఱొక కారణము చెప్ప వలనుపడదుకదా. సముద్రమున వైచినపదార్థములఁ జేఁపలు మ్రింగుటయు సహజము. ఇనుపముక్కను మ్రింగునా యనరాదు. నిప్పులుభక్షించుజంతువులు కలవుకదా. లోకమున ననేకవిచిత్రములు కలవు. వానినిగూర్చి మన మాలోచింపము. కాని భగవద్విషయముననే యిట్టిశంకలఁ దెచ్చిపెట్టుకొందుము. మతేమియుఁ దోఁచకపోయిన స్వభావమందుము. అంతియకాని భగవచ్ఛక్తి యమేయ మనము. తత్సంకల్ప మప్రతిహత మనియు నూహింపము. ఇదొకవిధమగు దుష్కర్మము

మహర్షులకు యోగదృష్టి కలదని యెల్ల రెఱుంగువిషయమే. దుర్వృత్తులుసాధువులఁ బరీక్షింపఁ బ్రయత్నించుటయు సర్వజనవిదితమే. దుష్కాల మాసన్నమగుతఱి నిట్లుచేయుట యుక్తమే యనవలయును. ఇట్టిఘట్టమున మహాత్మును లవ్వారికిం దగినట్లు శాపమిచ్చుట యసంగతము కాదు. భగవంతుని సంకల్పమే మునులవాక్కుల నట్లు వెడలినది. అంతియకాని వేఱేదియు నందులకుం గారణము కాదు లోకసామాన్యవిషయములంబోల్చి భగవచ్ఛక్తి నూహింపరాదు దానికిసాటియదియే కాని వేఱొక్కటి కాదు. కావున సర్వాతిశయశక్తి పరాత్పరునకుం గలదనియే నమ్మి యామహాత్ముని వినీతి ననవరతము సేవింపవలయును. అహంకరణమునుమాని సర్వశక్తిసంపన్నుని గాల రూపు నాపరమేశ్వరు నభ్యర్థింపవలయును. అదియే సంసార

సాగరతరణోపాయము. ఇంతసులభోపాయ మింకొక్కటి కానరాదు. ఇఁకఁ దరువాతికథల నాలకింపుఁడు. ఇఁకమీఁద వ్రాయఁబూనుకథయం డించుకచిక్కుగలదు. శ్రీకృష్ణజన్మఖండమునకుం దక్కుంగలవానికిని భేదముకలదు. గోలోకగమనము, అందు రాధామాధవులకుఁ బట్టాభిషేకము మంగళముగా వ్రాయ నెంచినవాఁడను కాన దాని ననుసరించి కొంత వ్రాసి నిలిపి యాదవనిధనమును దెలిపి మరల నాకథ నందుకొనుదును. దీనిని మన్నింపుఁడు.

## ఖాండీరవనమున హరి నందునకు బోధించుట.

*భగవంతుఁడు మర్త్యలోకమునందుండ మాని గోలోకమునకు నరుగఁబూనెను. దానికిం దగినవిధమునఁ బ్రవర్తించెను. మహోత్పాతములు దేశమునఁ గలుగుటం దలంచి యెల్లరు శంకింపసాగిరి. శ్రీహరియు వానికి శంకించుజాడఁ దెలిపెను. ఒక్కనాఁడు ఖాండీరవనమునకుం బోయి వటవిటపిమూలమునఁ గూరుచుండి గోపకులనెల్ల నావాహ్వానించెను. ఆచోటనే మున్ను విప్రపత్ను లన్నము పెట్టియుండిరి. ఆపవిత్రస్థానమునఁగూరుచున్న హరిప్రక్కన శ్రీరాధాదేవియుఁ గూరుచుండియుండెను. దక్షిణపార్శ్వమున నందుఁ డుండెను. యశోదయు నందు నంతికమున నుండెను. ఆయిరువురకు దక్షిణభాగమునందు వృషభానుఁడు వానియెడమభాగమునఁ గలావతియు నుండిరి. తన్నుంగల గోపగోపికలును బంధువులును మిత్రులు నుండిరి. వారిం గాంచి కాంచనాంబరుఁడు

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము నూటయిరువదెనిమిదవయధ్యాయమునుండి గ్రహించితిని.

కా లోచితముగ నిట్లు పలికెను. నందా! జనకా! ఒక్కవిషయ
మును దెలిపెదను. అది యీకాలమునకుం దగినది. సత్యము,
పరమార్గము, పరలోకసుఖావహమునగు. ఆబ్రహ్మ స్తంబపర్యం
తము సర్వము భ్రమమేగాని సత్యముకాదని యెఱుంగుము;
విద్యుద్దీప్తిజలముల నెంతసేపుండునో జలబుద్బుద మెట్టిదో
ప్రపంచమంతయు నంతమాత్రము స్థిరమని నమ్ముము. పూర్వము
మథురాపురమున నీకుం దెలిపియుంటిని. తచ్ఛేషము నించుక
కలదు. దానిం దెల్పెదను. కదళీవనమున యశోదకు రాధిక తెలి
పెను. అదియే సత్యము. భ్రమధ్వాంతప్రదీపకము. మిథ్యయగు
మాయను వదలి పరమపదమును స్మరింపుము. జన్మమృత్యు
జరావ్యాధిహరము, హర్షకరము, నిరుపమానము, శోకసంతా
పహరణచణము. సర్వకర్మమూలనికృంతనము నందా! నన్నే
పరబ్రహ్మముగను భగవంతునిగను సనాతనుగను నిరంతరము
ధ్యానింపుము నాయందుఁ బుత్త్రబుద్ధి నునుపుము. అట్లు తలంచి
ధ్యానించిన ముక్తినొందుదువు. త్వరగా గోలోకమునకుం
బొమ్ము. నిన్నాశ్రయించియుండు గోలోకవాసులం బిలుచు
కొని యరుగుము. కలియుగము త్వరగ వచ్చుచున్నది. అది
పుణ్యకార్యములం బాడవడంచును. *అందు స్త్రీపురుషులకు
నియమము లుండవు. జాతినియమము లుండవు. విప్రులు

---

*స్త్రీ పుంసోర్నియమో నాస్తి జాతీనాం చ తథైవ చ విప్రే సంధ్యా
దికం నాస్తి చిహ్నం యజ్ఞోపవీతకమ్.౧౨. యజ్ఞసూత్రం చ తిలకం శేషం
లుప్తం సునిశ్చితం, దివావ్యవాయనిరతం విరతం ధర్మకర్మణి.౧౩. యజ్ఞానాం
చ వ్రతానాంచ తపసాం లుప్తమేవ చ, కేదారకన్యాశాపేన ధర్మో నా
స్త్యేవ కేవలం. ౧౪. స్వచ్ఛందగామినీ స్త్రీణాం పతిశ్చ సతతం వశే, తాడ

సంధ్యావందనాదులు చేయకుందురు. జన్నిదముమాత్రము ధరింతురు. యజ్ఞోపవీతము తిలకము నను నీ రెండుగుఱుతులు తప్పఁ దక్షిణకర్మము లన్నియు వారిచే వదలఁబడును. ఇది సత్యము. పగటిపూట సుఖింపఁగోరుదురు,ధర్మకర్మములకు విముఖులగుదురు. యజ్ఞములు, వ్రతములు, తపస్సులు లోపించును. కేదారకన్యాశాపమున ధర్మము కలికాలమున నశించును.స్త్రీలు

---

యేత్సతతం తం చ భర్తుస్సమేచ్ఛ దివానిశం. ౧౫. ప్రాధాన్యం స్త్రీ కుటుంబానాం స్త్రీణాం చ సతతం వ్రజ, స్వామీ చ భక్తస్తాసాం చ పరాభూతో నిరంతరం. ౧౬. కలౌ చ యోషితస్సర్వా జారసేవాసు తత్పరాః, శతపుత్ర సమస్నేహస్తాసాం జారే భవిష్యతి. ౧౭. దదాతి తస్మై భక్ష్యం చ యథా భృత్యాయ కోపతః, సస్మితా సకటాక్షా సామృతదృష్ట్యా నిరంతరం. ౧౮. జారం పశ్యతి కామేన విషదృష్ట్యా పతిం సదా, సతతం గౌరవం తాసాం స్నేహం చ జారబాంధవే. ౧౯. కుత్స్యా కరప్రహారం చ నిత్యం నిత్యం కరోతి చ, మిష్టాన్నం శ్రద్ధయా భక్త్యా జారాయ ప్రదదాతి చ. ౨౦. వేషయుక్తాం చ సతతం జారసేవనతత్పరా, ప్రాణాబంధుర్గతిశ్చాత్తా కలౌ జారశ్చ యోషితాం. ౨౧. లుప్తా చాతిథిసేవా చ ప్రలుప్తం విష్ణుసేవనం, పితౄణామర్చనం చైవ దేవానాం చ తథైవ చ. ౨౨. విష్ణువైష్ణవయోర్ద్వేషీ సతతం చ నరో భవేత్ నామమంత్రోపాసకాశ్చ చతుర్వర్ణాశ్చ తత్పరాః. ౨౩. సాలగ్రామం చ తులసీం కుశం గంగోదకం తథా, నస్పృశేన్మానవో ధూర్తో మ్లేచ్ఛాచారరతస్సదా. ౨౪. కారణం కారణానాం చ సర్వేషాం సర్వబీజకం, సుఖదం మోక్షదం శశ్వద్దాతారం సర్వసంపదాం. ౨౫. త్యక్త్వా మాం పరయా భక్త్యా క్షుద్రసంపత్ప్రదాయకం, వేదనిఘ్నం వామమంత్రం జపేద్విప్రశ్చ మాయయా. ౨౬. సనాతనీ విష్ణుమాయా వంచితం తం కరిష్యతి, మమాజ్ఞయా భగవతీ జగతాం చ దురత్యయా. ౨౭. [illegible]దశసహస్రాణి మదర్చా భువి తిష్ఠతి,తదర్ధాని చ వర్షాణాం గంగా భువన

స్వేచ్ఛాప్రవర్తనమున నుండఁగా వారిభర్తలు లోఁబడియుం దురు. పెనిమిటిని దిట్టుచుఁ గొట్టుచు స్త్రీ తిరుగును. కుటుంబ మున స్త్రీలకే ప్రాధాన్యముండును. సర్వదా స్త్రీలే యధికార మును వహింతురు. వారిభర్తలు పరాభూతులై యెల్లవేళలఁ జింతించుచుందురు.

కలియుగమునఁ దఱచుగా వనితలు జారసేవాసక్తలగు దురు. నూఱుగురు కొడుకులయం దెంతస్నేహ ముండునో జారునిపై నంతస్నేహము వారికుండును. జారునకు భక్ష్యముల నందిత్తురు, భృత్యునకుఁ గోపమున నిత్తురు. చిఱునవ్వులయఁ గటాక్షవీక్షణముల నమృతమును వర్షించుదృష్టుల జారునిం జూ తురు. విషమదృష్టిం బతిం గాంతురు. మర్యాదయు స్నేహము స్త్రీలకు జారునియందే యుండును. మఱియు జారునిబంధువుల పై నుండును, కరప్రహారముల భర్త నాదరింతురు. సాద్వ

పావని. ౨౮. తులసీ విష్ణుభక్తాశ్చ యావద్గంగాచ కీర్తనమ్, పురాణాని చ స్వ ల్పాని తావదేవ మహీతలే. ౨౯. మమ చోత్కీర్తనం నాస్తి ఏతదంతే కలౌవ్రజ, ఏకవర్ణా భవిష్యంతి కిరాతా బలినశ్శఠాః. ౩౦. పిత్రోస్సేవా గురో స్సేవా సేవా చ దేవవిప్రయోః, వివర్జితా నరాస్సర్వే చాతిథీనాం తథైవ చ. ౩౧. సస్యహీనా భవేత్పృథ్వీ సా చావృష్ట్యా నిరంతరం, ఫలహీనోఽపి వృక్షాశ్చ జలహీనా సరిత్తథా. ౩౨. వేదహీనో బ్రాహ్మణశ్చ బలహీనశ్చ భూపతిః, జాతిహీనా జనాస్సర్వే మ్లేచ్ఛో భూపో భవిష్యతి. ౩౩. భృత్యవత్తాడయే త్తాతం పుత్త్రశ్శిష్యస్తథా గురుం, కాంతం చ తాడయేత్కాంతా లుబ్ధ కుక్కుటవద్గృహీ. ౩౪. నశ్యంతి సకలా లోకాః కలౌ శేషే చ పాపినః, సూర్యాణామాతపాత్కేచిజ్జలౌఘేనాపి కేచన. ౩౫. శ్రీకృష్ణజన్మఖండము. ౧౨౮ అధ్యాయము.

న్నమును భక్తిశ్రద్ధలతో జారుల కిడుదురు. స్త్రీలు సర్వదా దేహముల నలంకరించుకొనుట జారులసేవించుట యను కార్యముల నాసక్తికలిగియుందురు. ప్రాణములు బంధువు, గతియు, నాత్మయు స్త్రీలకుఁ గలికాలమున జారుఁడే యగును. అతిథుల సేవించుటయు విష్ణువు నారాధించుటయు వారు మానుదురు.

మానవులు పితృదేవార్చనము వదలుదురు. విష్ణువును దద్భక్తులను ద్వేషింతురు. వామాచారనిరతి మంత్రముల నుపాసింతురు. నాల్గువర్ణముల వార లిట్లేయగుదురు. సాలగ్రామమును, దులసిని, దర్భను, గంగాజలమును ధూర్తుఁడగుమానవుఁడు స్పృశింపక మ్లేచ్ఛాచారనిరతుఁడై యుండును. కారణములకుఁ గారణమై సర్వజంతువులకు బీజభూతుఁడై సుఖప్రదాతయై ముక్తి నిచ్చుచు సర్వసంపత్ప్రదాతయై యలరారు భగవంతుని నన్ను మాని యల్పసంపదల నొసఁగూర్చుదేవు నారాధింతురు. వామ మంత్రమును వేదాచారవిరహితమును బ్రాహ్మణుఁడు మోసపోయి జపించును సనాతనియగు నామాయ యాకలికాలమానవుల వంచించును అట్లు చేయుట నాయాజ్ఞ నూనియే దానిని జయింప నేరికిం దరము కాదు.

కలియుగమునఁ బదివేలసంవత్సరములు గడచుదనుక లోకమున నాపూజ యుండును. అయిదువేలవర్షములు భువనపావనియగు గంగయుండును. తులసియు విష్ణుభక్తులు గంగయుఁ గొలఁదిపురాణములు నంతదనుకనే యుండును. ఆవల వానిపై భక్తితగ్గునని గ్రహింపవలయును. ప్రజనాథా! నాసంకీర్తన మెప్పుడు నశించునో యది కలియుగాంతమని యెఱుంగుము. మానవు లేకజాతివారే యై యుందురు. కిరా

తులు బలముగలిగి దుర్వృత్తులగుదురు. పితృసేవయు గురు సేవయు దేవబ్రాహ్మణసేవయు మాని మానవు లతిథిపూజయం దాసక్తిలేకయుందురు భూమి సస్యహీన యగును. అనావృష్టిచే భూమి బెండుపడును. వృక్షములు ఫలహీనములు నదులు జలవిహీనములు నగును. బ్రాహ్మణులు వేదహీనులు, రాజులు బలహీనులగుదురు. జాతిహీనులుగ జనులుందురు, మ్లేచ్ఛుఁడు రాజగును కొడుకు తండ్రిని సేవకునివలెఁ గొట్టును శిష్యుఁడు గురువుఁ దన్నును. భార్య భర్తను బ్రహరించును. లుబ్ధకుక్కుటములవలె గృహస్థువుండును. కలికాలముతుద నెండవేఁడిమిచేతను జలపూరముచేతను జనపదములు నశించును. భూమిమాత్రము నశింపక యుండును కలిధర్మములన నిట్టివని నమ్ముము. కలియుగము నశింపఁగా మరల సత్య ప్రధానులగు మానవులు పొడసూపుదురు. దానిపేరు సత్యయుగమని కృతయుగ మనియు నగును. అని యనేకవిధముల బోధించి గోలోక గమనమున బద్ధాదరుండాయెను.

ఆసమయమున నొకదివ్యస్యందన మరుదెంచెను. చతుర్యోజనవిస్తీర్ణము. పంచయోజనోన్నతముగలది. పరిశుద్ధస్ఫటికసంకాశము. రత్నసారవిభూషితము. వాడిపోవనిపారిజాతప్రసూనములమాలిక లద్దాని నలంకరించియుండెను. కౌస్తుభరత్నము లందుఁ జెక్కఁబడి యుండెను. అమూల్యరత్నకలశము లమర్పఁబడియుండెను. హీరమణిహారములు వ్రేలాడుచుండెను. అందెన్నియోయంతర్గృహములు కలవు. రెండువేలచక్రము లద్దానికింగలవు. అన్నిఘోటకవర్యములుగలవు. అమూల్య సూక్ష్మతర వస్త్రము దానికిం జుట్టఁబడియుండెను. గోపిక లసంఖ్యలుండిరి.

ఆదివ్యరథము గోలోకమునుండియే వచ్చినదని యెల్లరెఱింగి యచ్చెరువుగా దానింగాంచిరి. శ్రీకృష్ణునాజ్ఞానుసారము దాని నెక్కి యెల్లరుగోలోకమున కరుగనుండిరి. రాధికయుఁ గలావతి యు గోలోకమునుండి వచ్చినగోపికలును బయలువెడలనుండిరి. వారెల్ల శ్రుతిపత్నులు. శ్రుతులు శరీరములఁ దాల్చి యట్లుండిరి. వారెల్లఁ దమరు ధరించినమానవశరీరములను నశ్వరములగు వాని వదలిరి. దివ్యశరీరములను గోలోకవాసార్హములను ధరించిరి.

అంత రాధాదేవి వారింగూడి గోలోకమునకుఁ బయనము చేసెను. యథాపూర్వరూపమున నారథమెక్కి వెడలెను. నానారత్నవిభూషితమగు విరజాతీరమును గాంచెను. దానిం దాఁటి శతశృంగపర్వతమున కేగెను. దానియం దనేకరత్నమండపములు గలవు. దానిచెంతనే పరమపావన మగుబృందావనము కలదు. అందుఁగల యక్షయవటమును గాంచెను దాని యుచ్ఛ్రాయమును వైశాల్యమును వర్ణింపఁదరముకాదు. కోటిశాఖలద్దానికిం గలవు. ఫలములు రత్నవర్ణములుగలిగి పెద్దవియై యుండెను. అందు గోపికలసంఖ్య పరిగణింపఁదగక యుండెను. అట్టి మనోహరమగుబృందావనము కనఁబడెను. చిఱునవ్వుపొలయ నారాధాంబిక యందుఁ జొచ్చెను. బృందావనదేవియు నాదేవి నెదుర్కొని నమస్కరించెను. రాసేశ్వరి నారాధించెను. సరసాలాపములఁ బ్రొద్దుగడపెను. రత్నసింహాసనమున నారాధిక నాసీనంగావించి వినుతించెను. శ్వేతచామరములఁగొందఱు సేవించిరి. ఆపరమేశ్వరిం గాంచుటకు గోపికలెల్ల నరుదెంచిరి. ఎల్లరకు సుఖావాసములు కల్పించి రాధిక శ్రీహరిరాక కెదురు

చూచుచుండెను. నిరుపమానసుందరమందిరమున నివసించి యుండెను.

## యాదవులు మృతులగుట.

* శ్రీకృష్ణమూర్తి పరిపూర్ణతముఁడు కావున నాభాండీర వనముననే యుండి గోకులవాసులకు ముక్తి నొసంగఁ దలంచెను. పంచసంఖ్యాకులు గోపకులే యప్పుడట నుండిరి. వటమూలముననే శ్రీహరి యుండెను. అత్తఱి గోకులమెల్ల వ్యాకులతం గాంచుచుండెను. బృందావనము పరిపాలకవిహీనమై తీరుతప్పి యుండెను. ఆత్మయోగమున నాభగవంతుఁ డంతయుఁ గాంచుచుండెను. వీరినెల్ల గోలోకమునకుం జేర్తుంగాక యని యూహించుచుండెను. అప్పుడు బృందావనవాసులను గోకులవాసులను రావించి విశేషించి యూఱడించెను. వారల కిట్లు బోధించెను. గోపకులారా! బంధువులారా! సుఖము గనుఁడు. స్థిరపద మెఱుంగుఁడు. ప్రియాసమన్వితుఁడనై రాసవిహారము సల్పిన రాసమండలముగల బృందావనము చంద్రసూర్యు లుండు దాఁక నుండఁగలదు మీ రిందు నన్నారాధించుచుండుఁడు. అని పలికి వారిని సాగనంపి యందే తానుండెను.

అంతలో సధర్మప్రభృతులు హారపరమేష్ఠులంగూడి గ్రహములెల్ల వెంటనడువ శ్రీహరి దర్శింప నేతెంచిరి. దిక్పాలకు

* ఈవిషయము భారతభాగవతాదులనుండియు శ్రీకృష్ణజన్మఖండము నూటయిరువదితొమ్మిదవయధ్యాయమునుండియు గ్రహింపఁబడినది. సందర్భము ననుసరించి నడుమనడుమ కథ గ్రంథాంతరములనుండి కైకొనఁబడుచుండును. బ్రహ్మపురాణము గర్గభాగవతమునఁ గలవిషయము లిం దిమిడి యుండుననియు గ్రహింపందగును.

లరు దెంచిరి. మనువులు మునులును వచ్చిరి. త్వరపడుచుఁ జను దెంచి వటమూలవాసి యగుపరమేశ్వరు దర్శించిరి. బ్రహ్మ యి ట్లని విన్నవించెను.

పరమేశ్వరా! పరిపూర్ణా! నిత్యానందా! నీవు జ్యోతి స్స్వరూపుఁడవు. ప్రకృత్యతీతుఁడవు. నిర్లిప్తుఁడవు. నిర్వికారుఁ డవు. నిరాకారుఁడవు. సాకారుఁడవు. సాకారత్వము ధ్యాన హేతుకము. స్వేచ్ఛామయుఁడవు. నీకు నమస్కారము లర్పిం తుము. కారణకారణుండవు. సర్వదేవతాస్వరూపుఁడవు. జ్యోతీరు లానరింతుము సర్వమునకు నీవే యాదివి. సర్వేశ్వరుఁ డవు. సర్వహర్తవు. సృష్టిరూపుఁడవు. ఇట్టి నిన్ను సేవింతుము. నీపాదారవిందరజస్సంస్పర్శమున నీభూదేవి పవిత్రురాలయ్యెను. సఫలమనోరథయు నయ్యెను. నీ విందుండక యరిగిన శూన్య రూప యగును. నూటయిరువదైదువత్సరము లిందుఁ బుచ్చి తివి. ఈవసుధ నిన్నింక నెడఁబాయఁజాలదు. ఐన దీనిశోకము నాప నిందుండక నీవిరహమున నాతురయగు నట్టులానర్పుము. అనుచుండ మహాదేవుం డిట్లుపలికెను.

పరమేశా! ఈబ్రహ్మ ప్రార్థించుటంజేసి వసుంధర నివ సింప నరుదెంచితివి. భూభారమును హరించితివి. ఇఁక స్వకీయ పరమపదమునకు వేంచేయవలయును. త్రిలోకములయందుఁ బృథివి ధన్యురాలు. పదారవిందచిహ్నితమగుట పరమపవిత్రు రాలయ్యెను. నీపదపద్మములఁ బ్రత్యక్షముగఁ గాంచితిమి గావున మేమెల్ల ధన్యులము. నీవు ధ్యానసాధ్యుఁడవు. దురా రాధ్యుఁడవు. ఊర్ధ్వరేతస్కులగు మునులకుంగూడ దర్శింప నలవిగానివాఁడవు. మాయం దెల్లఁ బరముఁడవగు నీవు ప్రత్య

క్షముగఁ గనఁబడుచున్నాఁడవు. సర్వనివాసుఁడు వాసు వనం బడును అతనిలోమములే సకలజగంబులవు. అతనికంటె నధి కుఁడు విష్ణువు. ఆ రెండుమూర్తులు నీమూర్తులు; కావుననే వాసుదేవుఁడ వనఁబడుదువు. అట్టి నీవీభూ మినున్నాఁడవు. ఎంతకాలము తపస్సుచేసినను లభింపని నీపాదారవింద మింత కాల మిందు నిలిచినదే. ఈభూభాగ మెంతధన్యమో యని రెను. అంత ననంతుఁ డిట్లు పలికెను భగవంతా! నీ వనంతుఁ డవు. నేను నీకలాంశమను. క్షుద్రమగుకూర్మమునం దొకయం శము నేనగుదును. శేషు లనంతులు. కూర్మము లనంతములు. బ్రహ్మ విష్ణు శివాత్మకు లసంఖ్యాకులు. విశ్వము లనంతములు. వారికెల్ల నీశ్వరుఁడవు నీవు. మాకెల్ల నింతకంటె సుదినము వేఱొకటిలేదు. స్వప్నమునందు నగపడనినీవు ప్రత్యక్షమైతివి. సర్వభూతాధారుఁడవు. నాథా! గోలోకమునకు వెళ్లుదువు గాక. భూలోకమును బవిత్రముచేసితివి. శోకసాగరనిమగ్న యగు భూమి నుద్ధరించితివి. అని వినుతింప దేవత లిట్లనిరి. వారిచిత్తములు భక్తిరసపూరితము లై యుండెను. ఓమహాను భావా! నిన్ను స్తోత్రముచేయుటకు వేదములు శక్తములు గా వనఁగా బ్రహ్మేశానాదులు శక్తులుగా రనఁగా నట్టి నిన్ను నుతింప మేమెంతవారము? అట్టి నీకు నమస్కారములు. అని పలికి దేవతలందఱు వెడలిపోయిరి. గోపాలకులందఱు హరిం గూడి గోకులమునకుం బోయి ద్వారకానగరమున కేగిరి. ఆనగ రము నిశ్శ్రీక మైయుండెను. బ్రహ్మశాపమున నపగతతేజమై యుండెను.

ఈవిషయము నిట్లునిచి శ్రీకృష్ణభగవంతుని ప్రయత్న

మెట్టెదని యించుక పరికింతము. మహోత్పాతములు చూచి సంతన యాదవులను ప్రభాసతీర్థమునకుఁ బోవుట మంచిదని హరి ప్రోత్సహించియుండెను. వారును సమ్మతించియుండిరి హస్తి నగరమునఁ బాండవులును మహోత్పాతములం గాంచి భీతిల్లు చుండిరి. ధృతరాష్ట్రుఁడు గాంధారియుఁ గుంతియు విదురుం డును నగరమును వదలి తపోవనముల కరిగిరి. వారికుశలముల ధర్మజు జరయుచుండెను. కొలఁదిదినములకుఁ బాండునందను లేవురును ద్రౌపదియు వ్యాసుం బురస్కరించుకొని ధృతరాష్ట్రా దులం జూడ నడవుల కరిగిరి. వారి దర్శించిరి. మరలునపుడు విదురుఁడు కాంతారధూళిధూసరితగాత్రుండై జడలుదాల్చి దిగంబరుఁడై కనఁబడి యాయాశ్రమంబున నున్న జనంబులం గాంచి మగిడిపోయెను. ధర్మరాజు తనయనుచరుల నెల్ల నిలిపి తా నొక్కరుండ యాతనివెనుకనె పోయెను. విదురుఁడు పొదలందూఱుచుఁ బోవుచుండెను. ధర్మరాజెలుంగెత్తి యో విదురా! నేను యుధిష్ఠిరుఁడను. నిన్నుం జూడ వచ్చితిని. అని పలుకుచు సమీపమున కరిగెను. ఆమహాత్ముఁ డాతనిశబ్దము విని పోవక నిలువంబడి తిరిగి చూచి వివిక్తప్రదేశమున నొక వృక్షమును జేరి నిలుచుండెను. ధర్మరాజు సమీపమునకుంబోయి యాయోగి యెదుట నిలిచెను. విదురుఁడు ధర్మజు నర్ధనిమీ లితలోచనంబులం జూచుచు నేమియుంబలుకక యూరకుం డెను. ఆర్యా! నేను ధర్మజుఁడను. నిన్నుం జూడ వచ్చితిని. నన్నుం గన్నులువిప్పి చూడుమా యని ప్రార్థించెను. ఆమాట ఁబడినంతనే తెప్ప లెగయించి యప్పాండవాగ్రజుం జక్క విని ్మలయోగము నంగీకరించి యింద్రియములను

ఘ్రాణముల నింద్రియప్రాణంబులం గలిపి నిజశరీరంబు వదలి యాతని యత్యద్భుతంబుగ ధర్మజుం బ్రవేశించెను. అత్తఱి ధర్మజునిశరీరము మిగులఁ దేజస్సుగలిగి బల మలరఁ గన్పడియెను. బుద్ధిబల మధికమయ్యెను. అందుల కతఁడు చోద్యమందెను. మహీరుహాముపజ్ఞ విదురునితనువుం గాంచి సమీపమునకుం బోవఁగా నది చెట్టుమూలము నాశ్రయించి విగతప్రాణమై యుండం దెలిసికొని యగ్నిసంస్కారము జేయింప నెంచెను. అంతలో నాకాశమునుండి యో ధర్మరాజా! యీతనువు యతిత్వగౌరవోజ్జ్వలము. కావున నగ్నిసంస్కారముచేయుట పాడిగాదు మానుము. అని వినంబడఁగా నతఁ డప్పని మాని యాశ్రమంబునకుంబోయి యావార్తను దల్లిదండ్రులకు సోదరులకుం దెల్పెను. వారెల్ల నచ్చెరువందిరి. అంత ధర్మరాజాదులు కరిపురంబును జేరిరి. కొలఁదిదినములకు వ్యాసమహాముని యరుదెంచి ధృతరాష్ట్రాదులమరణము నెఱిఁగించెను పాండునందనుఁడు విలపించి యుచితరీతిఁ దిలోదకంబుల నిచ్చెను. తనరాజ్యమున మహోత్పాతంబులు తోఁచుట కెంతయు దురపిల్లుచుండెను. ఆవృత్తాంతమంతయు నెఱింగి శ్రీకృష్ణుఁడు తనకృత్య మిఁక సుంతయే కలదని యాలోచించుచుండెను.

ద్వారకానగరమున నొకనాఁటిరాత్రి దంష్ట్రాయుతంబై నీలచ్ఛాయ తనువున వెలయ నొకవనిత. గృహములం బ్రవేశించి స్త్రీల నందఱ నీడ్చుకొనిపోయినట్లు తోఁచెను. ఆమఱుదినమే యెల్లరుఁ జూచుచుండ శ్రీహరి చక్ర మంబరమున కెగసిపోయెను. గరుడకేతనము దానివెంటనే యరిగెను. హలాయు

ధునితాళధ్వజము వానివెంటం దవిలెను. శ్రీకృష్ణునశ్వములు కనఁబడకపోయెను ఇట్లగుటకుం గతమేమని యెల్లరు గుసగుసలు పోవసాగిరి. మహాప్రళయము సంభవించునని కొందఱూ హింపసాగిరి. శ్రీకృష్ణు సనాదరణముం గాంచి యొక్కకొందఱు సంశయింపసాగిరి. ఇట్లు గోపకులెల్ల నిరాశులై జీవచ్ఛవములం బోలియుండిరి.

అంత వృద్ధులందఱు ప్రభాసతీర్థమున కరుగం దలంప నెల్లరు కృష్ణానుమతిం బయనము సాగింప నెంచిరి. శ్రీహరియు నాస్థానమండపమునఁ గూరుచుండి యెల్లరు విన నుత్పాతములం దెలిపి వానివలనఁ గలుగుదుష్ఫలములం బ్రశంసించి యిఁక ముహూర్తమాత్రంబేని యిందు నిలువరాదని యుద్ఘాటించెను. మఱియుఁ బశ్చిమవాహినియగు సరస్వతీతీరంబునంగల ప్రభాసతీర్థంబునకుఁ బోవలయుననియు స్పష్టపఱచెను మఱియు నిట్లు బోధించెను గోపవృద్ధులారా! మనమెల్ల నా ప్రభాసతీర్థంబున స్నానముచేసి పరిశుద్ధులమై యుపవసించి సమాహితస్వాంతులమై దేవతలం బూజింతము. పరమపావనులగు బ్రాహ్మణులకు యథోచితదానము లొసంగుదము. వారలు శాంతికర్మము లొనరింతురు. దాన మనకు మేలు కలుగును. పిదప గోవుల నారాధింతము. దేవద్విజులకు గోవులకు నర్హరీతిఁ బూజగావించిన సర్వారిష్టములు తొలంగును. ఉత్తమమంగళము లొనఁగూడును. అభీష్టపరమపదంబుఁ బ్రాపింతుము. అని హితము తెలుప విని వారెల్ల సకలసంభారములం గైకొని యోడలపైఁ గూరుచుండి సాగరము నుత్తరించి త్వరగాఁ బ్రభాసక్షేత్రమునకుం బోయిరి. అందు శ్రీహరి పంచినరీతిఁ గృత్యంబులు నిర్వర్తించిరి.

భగవంతునిచ్ఛ యప్రతిహతముగా సాగునుగదా. శ్రీహరియుఁ దాఁజేయఁదలంచినపని త్వరగా సాగుతరుణము వచ్చెనని యూహించెను. గంగకు జాతరచేయుచుండినయాదవులు భగవన్మాయావిమోహితులైరి. దాన విశేషించి సురాపానముచేసిరి. శ్రీహరి వారిం జూచుచుండెను. వారామదమున నొడలెఱుంగక పెచ్చుపెరిఁగినక్రోధంబున నన్యోన్యకలహప్రయత్నముచేయ నాదరణముం గాంచిరి. రెండుతెగలుగా నిల్చిరి. శరాశరాసనాదిసాధనముల ధరించిరి. ఒండొరులం దలంపడిరి చతురంగబలముల రూపుమాపిరి. అంత ద్వంద్వయుద్ధము చేయ నుపక్రమించిరి. ఇదియేమికార్యమని యాలోచించువా రొక్కరు నందు లేకుండిరి. ప్రద్యుమ్నసాంబులు, అక్రూరభోజులు, అనిరుద్ధసాత్యకులు, సుభద్రసంగ్రామజిత్తులు, సుచారుగదులు సుమిత్రసురథులు తలంపడిరి. ఆపోరు మిగుల ఘోరాకారముం దాల్చెను. తక్కుంగల వీరులెల్ల నిట్లే తలపడిరి. బాంధవమునుగాని మైత్రింగాని సేవ్యసేవకభావమునుగాని తలపోయక పోరుచుండిరి. ఆయుధములవ్రేటులచే క్షణమాత్రమున మృతినందుచుండిరి. శరములు నశించెను. కోదండములు ఖండములయ్యెను. సాధనములు లేకపోయెను. కాని యాగ్రహావేశము తగ్గదయ్యెను. తొల్లి సాంబునిగర్భమునఁ గనఁబడినముసలమును జూర్ణముచేసి సాగరజలంబులం గలిపియుండ నాచూర్ణము నలలు గట్టునకుం ద్రోయఁగా నందు మొలిచినతుంగలు కనఁబడెను. వానిని లాగుకొని పరస్పరవధప్రయత్నము చేయంబూనిన వారిజాక్షుఁడాపని మానిపించెను. ఇట్లు నివారించిన నా శ్రీహరి వైరిగా గ్రహించి బలభద్రుని

హారిని మార్కొనిరి. తుంగల నాయుధములుగాఁ గొన్నవా రలం గాంచి సర్వవేత్తలగుట నాపరమేశ్వరు లిరువురును దుంగలనే సాధనములుగాఁ బరిగ్రహించి యొక్కముహూర్త కాలమున వధించిరి. యదుకులమెల్ల నిశ్శేషమయ్యెను.

శ్రీహరి యంతట దారుకుం బిలిచి దారుకా! నీ వతిత్వ రితగతింబోయి కరినగరంబున నర్జునుంగాంచి నామాటలుగా యాదవనిధనముం దెల్పి యాతనిం దోడితెచ్చి ద్వారకానగర మునఁగల స్త్రీబాలవృద్ధులనెల్లం దోడ్కొనిపొమ్మని తెల్పుము. తక్కిన యిక్కడివార్తలెల్ల నతని కెఱిఁగింపకుము. ఆవల వెల్లడి యయ్యెడు. అని సాగనంపెను. బభ్రువను యాదవుఁ డొకండు మిగిలియుండఁగా నాతనితో నీ విపుడే యిచ్చటఁగలపరికర ములతోడ స్త్రీలను గొనిపోయి ద్వారకానగరమును జేర్పు ము. అన వాఁడట్లే పోవుచుండెను. శ్రీహరికిఁ జెంతనే యొక బోయ యాబభ్రునిఁ దుంగతోఁగొట్ట నవనింబడి యాతండు మృతినొందెను. శ్రీహరి యతనిపాటు గాంచి మునిశాపము మహత్త్వమునకు వెఱఁగందుచు గాంధారిశాపమును స్మరించి యత్తెఱంగుననే కార్యముసాగెనని యెంచి బలరామునిం గాంచి యన్నా! మనమిరువురము తప్ప నిందుఁ బురుషులు లేరు. సామజాదులతో నిందుఁ గలకాంతల నగరమునకుం జేర్చి వచ్చెదను. అంతదనుక నీ వీభూరుహముకడనే యుండుము. అని సమ్మతింపఁజేసి స్త్రీబాలురను వృద్ధులం దోడుకొనిపోయి ద్వారకానగరమును జేర్చెను. అందు వసుదేవుని దర్శించి మహాత్మా! మున్ను కౌరవకులక్షయమును జూచితిని. సకల యాదవక్షయమును జూచితిని. మహాత్మా!

ఈనగరముననుండ నిపుడు మనసొప్పకున్నది. అన్న వనముల కరిగెను. అన్నంగూడి తపముచేయుదును. ఇచ్చటి సర్వవిషయములను మీరే చూచుకొనవలయును. త్వరగ నర్జునుఁడు వచ్చును. ఎల్లకార్యముల నాతఁడు చూచుకొనును. మీయానతిమెయి నతఁడు వర్తించును. నేఁడో రేపో రాఁగలఁడు. అనిపలికి వసుదేవుని పాదములు తనఫాలభాగముసోఁక నమస్కరించి యడఁకువను గనఁబఱచెను. అంతకుమున్నే వసుదేవుఁడా యాదవనిధనవృత్తాంతమును వినియుండెను. కావున శ్రీహరి పల్కిన యామాటలకు మ్రాన్పడియెను మఱియు నన్నంగూడి తపముజేయుదు నన్నమాటకు దుఃఖము పొరలిరాఁగా శవాకృతి నుండెను. హరిమాటలు వసుదేవునవస్థయుం జూచి యందుఁగలస్త్రీ లొక్కపెట్టున విలపించిరి మురహరుఁడు దయపొలయ వారినందఱ నూఱడించి యర్జునుం డింతలోనన యరుగుదెంచును. మీవంతలనెల్లం దీర్చును. అని యనేకోపశమవాక్కులు పలికి తండ్రికడఁ గూరుచుండి యాతనిపాదములను దనచ్చుదుకరపద్మముల నొత్తుచు ననేకనీతివాక్యముల మన స్సూఱడిల్లఁజేసి నరుని యాగమనమును బెక్కుమాఱులు తెలిపి నీతిరహస్యముల నెఱింగినవాఁడు కావునఁ దండ్రీ! సేవకులను గరితురంగాదులను మీరు చూచుచుండుఁడు. కర్తవ్యమిట్టిదయ్యెను. వేయుపలుకులేల? మీరెఱుంగనివిషయ మేమియున్నది? అని కార్యరహస్యములను స్పష్టముగాఁ దెలిపి యెట్టకే యాతనిభ్రాంతిం బాపి వీడ్కొని రాముని కడ కరిగెను. రాముఁ గాంచి నమస్కరించి జనకు ననుమతి నొంది వచ్చితి నని విన్నవించెను.

* శ్రీహరి యిట్లు పలుకఁగా నాలకించి భగవంతుఁడగు నారాముఁడు నిశ్చలుండై యుండెను. క్షణమాత్రమున రాముని ముఖమునుండి భూరిభుజంగ మొక్కండు వెలువడఁగా శ్రీకృష్ణుఁడు కనుఁగొనియెను. అది యరుణచ్ఛాయగలిగి వేయి ఫణములు కనంబడఁగా మణులకాంతుల వెలుఁగుచు మహాపర్వతానుకారమగు నాకారంబు వెలయనుండెను. యోగబలమున నారాముఁడు తనశరీరమునువదలి యాకాశమార్గమునం జని సాగరమును బ్రవేశించెను. వరుణుఁడు సకలాతిథ్యసత్కారములం గైకొని యెదుర్కొనియెను. నాగకులమెల్ల నాతని సేవించెను. వాసుకి కర్కోటకతక్షకులు వారుణకుంజరకుముదాదు లాతని గౌరవించి సేవించిరి. ఆమూర్తి శ్రీహరిమూర్త్యంతరమే కాన నొండొంటిం గలిసికొనియెను.

బలభద్రుఁ డిట్లు శరీరమువదలి నిజధామమును జేరఁగాఁ బరమపురుషుఁడు శ్రీకృష్ణపరమాత్మయుఁ దనమనంబున సన్నికార్యము లూహించెను ఇఁక నీయవతారమునఁ జేయఁదగిన పను లేవియు లేవని తలపోసెను. శాపకారణమును స్మరించెను.

* రాముని నిర్యాణమున బ్రహ్మభాగవతభారతముల కించుక భేదాభిప్రాయము కనఁబడియెడిని. "రామస్సముద్రవేలాయాం యోగమాస్థాయ పౌరుషం, తత్యాజ మానుషం లోకం సంయోజ్యాత్మాన మాత్మని." అని భాగవతమునఁ గలదు. "దదృశాతే ముఖాచ్చాస్య నిష్క్రామంతం మహోరగం, నిష్క్రమ్య సముఖాత్తస్య మహాభోగో భుజంగమః, ప్రయాత శ్చార్ణవం సిద్ధైః పూజ్యమాన స్తథోరగైః. తమర్ఘ్యమాదాయ తదా జలధిస్సమ్ముఖం యయౌ." అని బ్రహ్మపురాణమునఁ గలదు. ఈభావమే శ్రీమహాభారతమునఁ గలదు. విష్ణుపురాణమునందు బ్రహ్మపురాణశ్లోకములే కలవు.

బ్రహ్మాశంకరాదులప్రార్థనము నూహించెను. ఇఁక నీశరీరము భూమినుండుట పాడిగాదని నిశ్చయించెను. భావికాలగతులం దలంచెను. అంత నామహానుభావుఁడు సకలశృంగారసంభృతం బగు నిజరూపంబు నుపసంహరింపం దలంచెను. పావనవృక్షమూలమును జేరి కుడితొడపై వామపాదము నమరించి కూరుచుండెను. ఆతరుణమున నాతనిమాయ యొకవేఁటకాఁడందుఁ దిరుగుచుండ నాతనిం బ్రోత్సహించి యాభగవత్పాదము మృగముఖ మనుభ్రాంతిని గల్గించెను జర యనువేరుగల యాబోయవాఁ డది నిజముగా మృగముఖమనియే నమ్మెను. పరమేశ్వరుని మాయ బ్రహ్మాదులను భ్రాంతులనుగాఁ జేయునన నిఁక నొక వ్యాధుని మోసపుచ్చుటొకవిశేషము కాదు. మహాశయు లీవిషయము నచ్చెరువుగా భావింపరు. ఆమాయ యసామాన్యప్రజ్ఞావతి. దానిమీఁఱఁజాలువాఁ డొక్కఁపరమేశ్వరుఁడే.

* ఆవ్యాధుఁడు మున్ను ముసలమును యాదవులు చూర్ణము చేసివైచునెడ మిగిలినదానిని బాణాగ్రమున కమర్చెనని ముందే వ్రాయఁబడియెఁగదా. దానిని జాపమునం గూర్చి లక్ష్యశుద్ధి మెఱయఁ బ్రయోగించెను. ఆయది యాపాదమును స్పృశించిన ట్లాతఁడు కనుఁగొనియెను. భగవన్మాయ యాతని వదలెను. వాఁడు వెంటనే యచటికింబోయి యది మృగముఖము కాదనియు శ్రీకృష్ణునిపాదమనియు నెఱింగి యయ్యో! ఎంతటిపాపకార్య మొనరించితిని. మోసపోయి మృగముఖము.

* సతత్పాదం మృగాకారం సమవేక్ష్య వ్యవస్థితః, తతో వివ్యాధ తే నైవతోమరేణ ద్విజోత్తమాః. అని బ్రహ్మపురాణము. ముసలావశేషాయఃఖండకృతేషుర్లుబ్ధకో జరాః, మృగాస్యాకారచరణం వివ్యాధ మృగశంకయా. అని.

శదా యని యేసితిని. అని చింతించుచుఁ జెంత కరిగి యాపర మేశ్వరుని యడుగుఁదమ్ములపయింబడి మహానుభావా! ఎఱుంగక తప్పుజేసితిని. మహాపాపాత్ముఁడను. నాయీపాపకార్యమును క్షమింపుము. * నాపాపముచేతనే కాల్పఁబడిన నన్నుమరలఁ గాల్పకుము దేవా! నీస్మరణము మానవులకుం గల యజ్ఞానమనునంధకారమును బాఱఁదోలునది. అట్టి నీకే మహాపకార మొనరించితిని. ఇఁక నేమనుకొనిన నేమిలాభము? ఇంకను మహాపాపముల నిట్టివానిం జేయకయుండ నుద్ధరింపుము. వేద తత్త్వము నెఱింగినబ్రహ్మరుద్రాదులును సనకసనందనాదులును నీమాయాకృత్యములను మాయామోహితదృష్టులై చూడఁజాలరు. పాపజన్మముగల నావంటివాఁడు తెలియఁగలఁడా. †అని బహుభంగుల వినుతించుటయు శ్రీకృష్ణుఁడో వ్యాధుఁడా. లెమ్ములెమ్ము. భయంపడకుము. మాసంకల్పమునే నీవు నెఱవేర్చితివి. దాన నీకుఁ బాపము కలుగదు. నాయనుగ్రహమునకుఁ బాత్రుఁడవైతివి. కావున బహువిధపుణ్యకార్యముల నొనరించినవారికిఁ బొందఁదగినస్వర్గమునకుఁ బొమ్ము. అని యాజ్ఞాపించెను. అబోయవాఁడు శ్రీహరి యనుజ్ఞ కాఁగానే దివ్యజ్ఞాన సంపన్నుం డయ్యెను. భగవంతునకు మరల మరల నమస్కరించెను. అంతలో నీశ్వరసంకల్పమున నొకవిమానము వచ్చెను.

---

భాగవతము. * క్షమ్యతామాత్మపాపేన దగ్ధమాదగ్ధు మర్హసి. అని బ్రహ్మ.
† మాభైషీర్జర ఉత్తిష్ఠ కామఏష కృతోహి మే, యాహి త్వం మదనుజ్ఞాత
స్వర్గం సుకృతినాంపదం. అని భాగవతము. గచ్ఛ త్వం మత్ప్రసాదేన లబ్ధ
సుఖాస్పదం. అని విష్ణుపురాణము.

దాని నధిష్ఠించి యావ్యాధుఁడు దివ్యశరీర మలరార సురపురమునకుం బోయెను.

అత్తరి శ్రీహరి శాపనిమిత్తమునఁ దనశరీరమును వదలినట్టు లభినయింపఁదలంచెను. *అతఁడా కదంబవృక్షమూలమున నాసీనుండై యున్న యాపరాత్పరుని బ్రహ్మాదిదేవతలు దర్శించి నమస్కరించిరి. వేదప్రతిపాదితవాక్యములం బొగడిరి. శ్యామసుందరమూర్తి సకలరత్నభూషణభూషితుఁడై నవవయస్స్ఫురితుఁడై పీతాంబరధారియై వనమాలాధారియై వ్యాధాస్త్రసంయుతపాదారవిందుఁడై కనఁబడియెను. విస్మయమునొంది వారు నేత్రఫలముగా దర్శింపఁజాలిరి. అంతలోఁ బృథ్వీదేవియు నేడ్చుచువచ్చి హరిమ్రోల నిలిచెను. భగవంతుఁడు భూలోకమును వదలిపోవునని యెఱింగెను. కావుననే ప్రేమవిహ్వల యయ్యెను. శ్రీహరియు నాజగజ్జనని నూఱడించెను. †రుక్మిణియు శ్రీహరిసంకల్పానుసారము వైకుంఠమున కరిగెను. సత్యభామయుఁ బృథ్విని బ్రవేశించెను. జాంబవతీదేవి పార్వతియందుఁ గలిసిపోయెను. ‡శ్రీహరిపత్ను లెవ్వరెవ్వరేయే దేవతాంశము గలవారలో వారెల్ల నాయా దేవతాతనువులం గలసిపోయిరి. అంతకుముందే సాంబునిదేహము స్కందునియందు నైక్యమ

*ఈయభిప్రాయము శ్రీకృష్ణజన్మఖండమునుండి వ్రాయఁబడినదని యెఱుంగనగు. † అయోనిసంభవా దేవీ మహాలక్ష్మీశ్చ రుక్మిణీ, వైకుంఠం ప్రయయౌ సాక్షాత్స్వశరీరేణ నారద. సత్యభామా పృథివ్యాం చ వివేశకమలాలయా. అని మూలము. ఈవిషయమున భాగవతాదులు విసంవాదములుగనున్నవి. ‡ యాయా దేవ్యశ్చ యాసాంచాప్యంశరూపాశ్చ భూతలే,తస్యాం తస్యాం ప్రవివిశుస్తా ఏవ చ పృథక్పృథక్. అని మూలము.

య్యెను. తక్కినవారును దమతమపూర్వదేహములం గలిసిపో యిరి గంగాదేవియు,యమునాసరస్వతులు ఇంకనుగలనదులెల్లఁ దమసత్యరూపముల నరుదెంచిరి జాహ్నవి కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింప నిట్లుపలికెను.నాథా!గోలోకమునకు వేంచేయుచున్న వాఁడవు. మాకింక గతియేమి? కలియుగము వచ్చుచున్నయది కదా. అని ప్రార్థింప శ్రీహరి యిట్లుపలికెను. కలియుగమున నైదు వేలసంవత్సరములు గడచునంతదనుక నుండుము. నీయందు స్నానముచేసిన పాపాత్ములపాపములను బరిహరింపుము. నీలోఁ గలిసిన పాపములన్నియు నామంత్రోపాసకులస్పర్శమున నశించును.భయంపడకుము. శ్రీహరినామములమహిమములను దెలుపు పురాణములెచ్చటఁబఠింపఁబడుచుండునో నీవచ్చటికేగి వినుచుండుము.ఈనదులెల్ల నిన్ననుసరించు గాక.పురాణశ్రవణమువలనను హరినామసంకీర్తనమువలనను గలియుగమున మహాపాపములు భస్మభూతములగును. విష్ణుభక్తుల నాలింగనముచేసికొనినను బాపములు తొలఁగును. అగ్ని శుష్కతృణములను దారువులను గాల్చినట్లు హరినామకీర్తనము పాపములం దొలఁగించును.విష్ణుభక్తులును బాపములఁ బాఱఁదోలఁగలరు. భూతలమున నెన్ని తీర్థములుగలవో పుణ్యస్థానములుగలవో అవియన్నియు నాభక్తుల శరీరములయందుఁ గలవనినమ్ముము. నాభక్తులపాదరజోలేశమునభూమి పావనమగును.తీర్థములు పరమపావనము లగును. జగంబంతయుఁ బావనమగును.నామంత్రోపాసకులగువిప్రులును, నాకు నివేదించినయన్నమును భుజించువారును, నన్నే నిరంతరము ధ్యానించువారును నా కత్యంత ప్రియులగుదురు. వారిని స్పృశించినంతన వాయువు అగ్నియుఁ బవిత్రు లగుదురు.

*కలియుగమునఁ బదివేలసంవత్సరములు గడచువఱకు నాభక్తులు భూతలమున నుండఁగలరు. నాభక్తులు భూతలమును వదలగనే జాతిభేదములు నశించియొక్కజాతివారుగనే యెల్లరుందురు. నాభక్తులు లేమిఁ గలిచే భూమియావరింపఁబడియుండును. అని పలికి నదులనెల్ల సాగనంపెను.

## శ్రీకృష్ణుఁడు గోలోకమునకు విజయంచేయుట.

†అత్తఱి శ్రీకృష్ణుఁడు తనకృత్యములు నిరవశేషములు కాఁగా నిజధామము నలంకరింపఁగోరెను. బ్రహ్మాదు లామహాత్ముఁడు తనువువదలువేళఁ గాచియుండిరి. పుష్పవృష్టిని గురిపించిరి. వేదవాక్కుల వినుతించిరి. వారినెల్ల శ్రీకృష్ణుఁడు కనుంగొనియెను. అంతలో శ్రీకృష్ణునిప్రాకృతదేహమునుండి చతుర్భుజుండగుమహాపురుషుఁడు వెడలెను. శంఖచక్రగదాపద్మము లాతనికరముల నలరారెను శతచంద్రసమమై తన్ముఖ నమొప్పారెను. శ్రీవత్సలాంఛనము వెలసెను దివ్యసుందరమగు స్యందన మటఁదోఁచెను. దానినెక్కి యామహాపురుషుఁడు ‹ రసముద్రమున కరిగెను. సింధుకన్యయు మూర్తిందాల్చి వెనుకొనియెను. శ్రీకృష్ణమనోజాతయగు మర్త్యలక్ష్మియు నాతనివెనుకం బోయెను. శ్రీవిష్ణువు శ్వేతద్వీపమునకుంబోయెను.జగత్పాలనకర్తయామూర్తియే యని నమ్మవలయు. ఆశరీరమునుండి విష్ణువువదలి పోవఁగా శుద్ధసత్త్వస్వరూపము రెండుభాగము లయ్యెను. అందు దక్షిణభాగము ద్విభుజవిరాజితము. గోపబాలకరూపము నవీన

* కల్లేర్దశసహస్రాణి మద్భక్తాస్సంతి భూతలే,ఏకవర్ణా భవిష్యంతి మద్భక్తేషు గతేషు చ. ౫౯. మద్భక్తశూన్యా పృథివీ కలిగ్రస్తా భవిష్యతి. అని మూలము. †ఇట పురాణములు విసంవాదములుగనే యున్నవని యెఱుంగునది.

జలదశ్యామము. పీతవస్త్రపరిశోభితము. శ్రీవంశధదనము. పద్మలోచనము. సుస్మితాలంకారము.శతకోటీందుసౌందర్యము, శతకోటిస్మరప్రభమునగు పరమానందరూపము.పరిపూర్ణతమమునై యారూప మొప్పారెను.సర్వలోకప్రభువై పరంధాముఁడై పరబ్రహ్మమై నిర్గుణుఁడై పరమాత్మ యనంబరఁగుచు భక్తానుగ్రహార్థము శరీరములం దాల్చుచు నిత్యదేహుఁడై భగవంతుఁడై ప్రకృత్యతీతుఁడై యలరారు నాపరమేశ్వరుఁడు గోలోకమున కరిగెను.

యోగులు సనాతనమగుజ్యోతిస్స్వరూపముగా నాకృష్ణదేహమును బ్రార్థింతురు. జ్యోతిస్సునకును నిత్యరూపమును భక్తులు ధ్యానింతురు. నియమము నిశ్చయార్థ మిది యని యోగీంద్రుఁ డగుశంకరుఁ డనువదించెను. అతనుపునే వేదములు సత్యమని వర్ణించును. విచక్షణులగు వారు నిత్యమని ఆద్యమని దానినే నిర్ణయింతురు. ఆదేహమునే దేవతలు స్వేచ్ఛామయమని ప్రభువనియు స్తుతింతురు. ఆపరమాత్మనే సిద్ధేంద్రులు మహర్షులు సర్వరూపునిగా ధ్యానింతురు బ్రహ్మయు నాభగవద్రూపమునే కారణకారణమని తలంచును. శేషుఁ డనంతమని వినుతించును.అవి నవవిధములుగా నయ్యెనని శేషాభిప్రాయము. తర్కముచేయువారు షడ్విధములుగా నారూప ముండు నందురు. విష్ణుభక్తు లేక రూపమనియే యుపాసింతురు. వేదములక్లే రాద్ధాంత మొనర్చును. పురాణము లేకరూపమని తెలుపును. కావున ననంతుఁడు నవవిధములుగా నది యుండుననిరెను. శంకరుఁ డారూప మనిర్వచనీయమని యెఱింగించెను. ...షతులు నిత మందురు. సాంఖ్యులు జ్యోతీరూపునిగా

సనాతనునిగా నెంతురు. మీమాంసకులును సర్వరూపుఁ డందురు. వేదాంతులు సర్వకారణుఁ డందురు. పాతంజలుఁడు అనంతుఁ డనియెను వేదములు సత్యరూపుఁడనియెను. భక్తులు నిత్యవిగ్రహుఁడని పురాణపూరుషుండని ధ్యానింతురు.

ఇంద ఱెన్నిరీతులఁ దలపోయు నాపరాత్పరుఁడు గోలోక నాథుఁడు రాధేశుఁడు నందనందనుఁడు గోకులమున గోపవేష మూని బృందావనమున విహరించెను. వైకుంఠమునఁ జతుర్భుజుఁడై మహాలక్ష్మీపతి యనంబరఁగెను. ఏనామము మోక్షకారణమో యానామము నారాయణాత్మకము. ఒక్కసారి నారాయణనామ ముచ్చరించినంతనే పూరుషుఁడనంతకాలము గంగాది సర్వమహానదీస్నానపుణ్యము నొందును. అట్టినారాయణమూర్తి సునందనందకుముదాది పార్షదపరివారితుఁడై శంఖచక్రగదా పంకజములు కరములం గ్రాలుచుండ శ్రీవత్సలాంఛితుఁడై కౌస్తుభమణిభ్రాజితుఁడై వనమాల యురమున సురుచిరముగఁ గ్రాల వేదవినుతుఁడై వైకుంఠ మనఁబరఁగు స్వీయధామమునకుం బోయెను.

వైకుంఠధామమును శ్రీమన్నారాయణమూర్తి చేరఁగానే రాధానాథుఁడు వేణునాద మొనరించెను. అది త్రిలోకముల మోహింపఁ జేసెను. ఆమనోహరనాదము నాలకించి దేవగణములు మునీంద్రులు మైమఱచిరి. ఎల్లరు తన్మాయామోహితులై పార్వతితక్క నచేతను లైరి. ఆతరుణమున సనాతనియు భగవతియు సర్వస్వరూపయుఁ బరబ్రహ్మస్వరూపయుఁ బరమాత్మస్వరూపిణియు సగుణయునిర్గుణయు స్వేచ్ఛామయియు నగు నాపార్వతి యిట్లు పలికెను. సర్వలోకప్రభూ! గోలోకమున

రాసమండలమున రాధాంబ యొకతుకయే యున్నది. రాసమండలమును బూర్ణముగా నలంకరింపుము. గోలోకము రాసశూన్యముగనుండ రాదు స్యందనవర్యము నధిష్ఠించి వేంచేయుము. నాయంశమే నీవక్షస్స్థలమున రాధానామమున నుండును. నీయాజ్ఞనూనియే వైకుంఠమున మహాలక్ష్మియన నాయంశమే యుండును. శ్రీహరి వామపార్శ్వమున సరస్వతి యన నదియే యుండును. నీమానసేచ్ఛమై సింధుకన్యక జనించెను. సావిత్రి యనుపేర వేదమాత బ్రహ్మసమీపమున నుండును. మున్ను నీయానతిమెయి సర్వదేవతలయందును దేజస్సు నావహింపఁజేసితినిగదా. శుంభాదిదానవులు హతులైరి. దుర్గాహ్వయమున దుర్గనామకదానవేంద్రుఁ బొలియించి త్రిపురముల నుంటిని. రక్తబీజుని వధించి రక్తబీజవినాశని యనుపేరు గాంచితిని. నీయాజ్ఞానుసారమే దక్షకన్యకయగు సతీనామమున వెలసితిని. యోగత్యక్తకళేబరనై శైలకన్యక నైతిని. రాసమండలమున నీవే నన్ను శంకరునకుఁ బత్నిగా నొసంగితివి. అక్కారణమున విష్ణుభక్తియని విష్ణుమాయ యని వైష్ణవి యని పేరులం గాంచితిని. నారాయణునిమాయ నైతినిగాన నారాయణి యనియుఁ బేరు నాకుంగల్గెను. శ్రీకృష్ణుఁడవగునీకుఁ బ్రాణాధికురాలను. కావునఁ బ్రాణాధిష్ఠాతృదేవి యనియుఁ బేరొందితిని. మహావిష్ణువునకు వాసునకు జనని రాధికయగు. నీయానతింజేసి యైదువిధములుగా మార్పునొందితిని. కలాకలాంశములచేత నెల్లదేవతలగృహమున నుండుప్రకృతిని నేనే. మహాభాగా! రాధిక భవద్విరహాతురయై యున్నది. త్వరగా గోలోకమునకు వేంచేయుము. లంగూడి. రాసమండలమున నిన్ను సేవింపఁగోరుచున్నది.

అని యిట్లు పార్వతి ప్రార్థింపఁగా నాలకించి రసికేశ్వరుఁడగు శ్రీకృష్ణపరమాత్మ చిరునవ్వు మోమున కొకవింత చెలువు గలిగింప రత్నమయయానము నధిష్ఠించి గోలోకమునకు వేంచేసెను. దేవతలు వేణునాదమున మేనులు మఱచి యుండఁగాఁ బార్వతి వారల మేలుకొలిపెను. హరి వేంచేసెనన్న శబ్దము నాలకించి విస్మితస్వాంతులైరి. శంకరుంగూడి పార్వతి కైలాసమున కరిగెను. శ్రీకృష్ణుఁడు వేంచేయుచుండు టెఱింగి రాధాదేవి గోపగణపరివృతయై యెదురేగి ప్రాణవల్లభుని రాకకుఁ బరమానందము వెల్లివిరియనొం దెను. రాధికం గాంచి విమానమునుండి దిగి హరి చెంతకుంబోవ నాజగదేకమాత సాష్టాంగప్రణామ మాచరించెను. గోపికలు గోపకులునభివాదనప్రియ నడపిరి దుందుభులు వాయింపఁబడియెను విరజానదిం దాఁటి రాధికాకరమును గరమునఁ గీలించి శతశృంగపర్వతమున శృంగారరసాధినాథుఁడై విహరించెను. అందుఁగల రాసమండలమును బ్రవేశించెను. అందే యక్షయవటము పావనబృందావనము తులసీకాననము కనఁబడియెను. మాలతీవనమును గాంచెను. కుందవనము మాధవీకాననము వామభాగముననను, చంపకారణ్యము దక్షిణభాగముననను గనఁబడియెను. వానివెనుక మనోహరచందనవనము దృగ్గోచరమయ్యెను. ముందు రాధికాభవనోత్తమము సంతోషమును బెంపొందించెను. అందుఁ బ్రవేశించి శ్రీకృష్ణమూర్తి రాధాద్వితీయుండై రత్నసింహాసనమున నధిష్ఠించెను. పరిమళోదకమును ద్రాగి సకర్పూరతాంబూలమును గైకొనియెను. ఎల్లరు నానందాంబుధి నోలలాడుచుండఁ ద్రిమూర్తులు హర్షమున నారాధింప నా శ్రీకృష్ణపరమాత్మ మూలప్రకృతియగు రాధాం

చికంగూడి సర్వలోకపరిపాలనాదృతిం గాంచి ధర్మస్థాపనమే ప్రధానకృత్యముగా భావించుచు మహానందాంబురాశినోలలాడుచున్నప్రకృతిచెంతనుండి సర్వకార్యములు తీర్పనిరంజనుఁడై యద్వితీయుఁడై నిర్వికల్పుఁడై నిర్గుణుఁడై భక్తాభీష్టప్రదాయకుఁడై సర్వవేదసంస్తూయమానమహిముఁడై కరుణాసాగరుఁడై గోలోకనాయకుఁడని తరింపఁజాలు భక్తులు తన్నునారాధింప రాసమండలవిహారమున రాధికను గోపీగోపవర్యులను దృప్తిపఱచుచు మునీంద్రులు తనపాదారవిందములు సేవింప నిరుపమానవిభవుఁడై సుఖంబుండెను.

మహాశయులారా! ఈవిషయమునఁ దెలుపఁదగినవిశేషములు పెక్కులుగలవు. కానివానినెల్ల వ్రాయునవసరమిది కాదు. కొన్నిదత్తోరములు ఐన నొక్క విషయముంగూర్చి వ్రాసెదను. భాగవతాదులయందు శ్రీహరి వైకుంఠమున కరిగెననియు బ్రహ్మవైవర్తాదులయందు గోలోకమున కరిగెననియు నుండుట యొకలోపము కాదు. దానిని సమన్వయము చేసికొనజాలనిబుద్ధి కొందఱకుండుటయే గొప్పలోపము శ్రీకృష్ణుఁడు తనయవతారసమాప్తికిం గారణమగువ్యాధునకు స్వర్గలోకము నను గ్రహించెను. తనప్రధానశిష్యుఁడగు నర్జునునకు మీఁది కృత్యమును దెలియఁజేసెను. ఉద్ధవాదులకు జ్ఞానము నుపదేశించెను. తనయవతారఫల మిదియని యాయాయికృత్యములచే నెల్లరకుం దెలియఁజేసెను. ధర్మము నాశ్రయించువారికి భగవహాయముకలదని భారతయుద్ధరూపమున నెఱిఁగించెను కర్మపరులు ప్రకృతిబద్ధులగుదురని నీతియర్జుననకుగీతోపదేశము చెను. ఇంక నెన్నియోధర్మముల నెఱిఁగించెను.

## రహస్యవిషయములు.

మహాశయులారా! శ్రీకృష్ణభజన మేరూపమో యించుక తెలిపెదను. రాసక్రీడారూపమున నయ్యది విలసిల్లు. అందున్న భగవంతుని ధ్యానించుటయే యుత్తమోత్తమమార్గము. అందే భగవన్మహాత్త్వము వెల్లడియగును. అనేకరూపముల విలసిల్లు ప్రకృతింగూడి యెల్లతావులం దనరూప మొక్కవిధమున నే యలర నందుండును. అదియే సర్వవ్యాపకత్వ మనంజను. అ· ··గవంతుని సగుణబ్రహ్మ మనవలయు. ఆరూపమును ధ్యానించుట సామాన్యమా. పూర్వపుణ్యము విశేషించి యుండవలయును. అ- వారికే యది లభించును. లీలాశుకులు జయదేవుఁడు నారాయణతీర్థు లారాధామాధవరూపమును సంకీర్తించియే ముక్తికాంతావల్లభు లైరి. కావున మనమెల్ల నాపరాత్పరుని గోలోకవాసుని శతశృంగపర్వతవిలసద్రాసమండల విహారనిరతుని సర్వేశ్వరుని సర్వగతుని సర్వ ని సర్వ ముని సర్వవేదసన్నుతుని భజించి కృతార్థులము కావలయు. ఇది కలికాలము. భ నశించు కాలము. నాస్తికులకు నుత్సాహము కలిగించు కాలము. పాపకార్యములు మంచివని తోఁపఁజేయు కాలము. వేదములు నవీనములను నాశయము నాపాదించు కాలము. ధర్మకార్యములు నిష్ఫలములనునూహ నుత్పాదించు కాలము. జాతిమతధర్మములు వృథాకల్పితములనుభావ ముదయించు కాలము. తపస్సత్యదయాశౌచములు మానవుల నిర్బంధించునవి కాన వానిని మాన మేలనుతాత్పర్య ముదయించు కాలము. వేషధారులకు మర్యాదాధనములనిచ్చు కాలము. నిరక్షరకుక్షులను బండితులనుగాఁ జేయు కాలము. స్వేచ్ఛాప్రవర్తకులు వేదాం

తులను ప్రఖ్యాతిం గాంచుకాలము. మతస్థాపనవ్యాజమున ద్రవ్యము సంపాదింప నెంచువారలకు నుత్తమమగుకాలము. దుష్టులకు మంచికాలము శిష్టులకుఁ జెడుకాలము నగు నీకలి కాలమున హింసారూపములగు యజ్ఞములను జేయక పంచ మహాయజ్ఞములను జేయుచు జపయజ్ఞనిరతులగుచు భగవ న్నామము స్మరించుచు నొకరిని హింసింప నాలోచింపక దేవతా దూషణమను మహాపాపకార్యమునకుఁ బాలుపడక తోఁచినచో నుపకారముచేయుచు లేకున్న నూరకుండుచుఁ గాలము త్రోయుచు నున్నంతతోఁ దృప్తినొంది పరమపురుషుని సేవించు టయే మనము చేయఁదగుసత్కార్యమను నీయొక్కమాట పలుసారులు విన్నవించుచు నీగ్రంథమును ముగించుచు శ్రీ రామావతారతత్త్వమును వ్రాయ నీలేఖినిం ద్రిప్పుచున్నవాఁ డను. శ్రీకృష్ణపరమాత్మ యెల్లరను భక్తులనుగాఁ జేసి కృత కృత్యులనుజేయుగాతమని పలుసారులు ప్రార్థించుచున్నాఁడను. కృత ంతమంగళముగా శ్రీకృష్ణపరమేశ్వరస్తుతిని వ్రాసెదను.

శ్లో. జననాంతరేఽపి జగదేకమండనే
కమనీయధామ్ని కమలాయతేక్షణే,
వ్రజసుందరీజనవిలోచనామృతే
చపలాని సంతు సకలేంద్రియాణి మే. ౩౯

మునిౕఁ వంద్యం మదభరలసద్వల్లవవధూ
స్తనశ్రోణీబింబస్తిమితనయనాంభోజసుభగమ్,
పునశ్శ్యామాభూమిం పులకితగిరాం నైగమగిరాం
౦ వం కిమపి కమనీయాకృతిమహః. ౪౦

శరణమశరణానాం శారదాంభోజ...
నిరవధిమధురిమ్ణా నీలవేషేణ రమ్యమ్,
స్మరశరపరతంత్రస్మేరనేత్రాంబుజాభి
ర్వ్రజయువతిభిరవ్యాద్బ్రహ్మసంవే...  ౮౯

సువ్యక్తకాంతిగగశోరభదివ్యగా...
మవ...క్తయూ...  తకిశోరభావమ్,
గవానుపాలనవిధావ... మవా
దేవ్యాజ మద్యమఖి ...వం నః.  ౯౦

(శ్రీకృష్ణ కర్ణామృతము 3 ఆశ్వా.)

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమునందు ... రహణమను
పంద్రెండవప్రకరణము సంపూర్ణము.

గ్రంథము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1930.

## కావ్యస్మృతితీర్థ

## శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి

## గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము, 1 మొదలు 12 భాగములు ఒక్కొకభాగము ధర | ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, నిర్వచనము, వ్యాఖ్యానముల లోని భావములవదలక తెనిగింపఁబడినది. ఏశ్లోకమున కేపద్యమో తెలియుటకై శ్లోకసంఖ్యగూడఁ దెలుపఁబడినది. | | | |
| 3-సంపుటముల ప్రతి | ... | 12 | 0 |
| 7-సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము, భండాసురుని లలితాదేవి చంపుట మొదలగు గాథ లనేకము లిందున్నవి. | | 1 | 8 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకనాటకము | ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | ... | 0 | 12 |
| రామవనవాసనాటకము | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, వచనము, సులభశైలి | | 0 | 10 |
| సం మహాభారతము | ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము | ... | 1 | 0 |
| స్వప్నయాత్ర, నవల | ... | 0 | 10 |
| హనుమద్విజయము | ... | 0 | 8 |
| బ్రహ్మపురాణము | | అచ్చగుచున్నది. | |
| ప లు, వచనము, గీతావ్యాదయ మను టీకతోసహా | | | |
| వు, నవల | ... | | 10 |
| రము, నవల | ... | | 8 |